# ప్రతిభామూర్తులు

## A Portrait Gallery of Eminent Telugu Personalities)

★★★★

డా. అక్కిరాజు రమాపతిరావు




ప్రచురణ:

విజ్ఞానదీపిక

హైదరాబాద్.

1991

**Pratibhamoortulu by Dr. Akkiraju Ramapati Rao**

(Pen portraits of 130 eminent Telugu Personalities with photos)

ప్రథమ ముద్రణ: **1991**

ప్రతులు: వెయ్యి

మూల్యం: నూరు రూపాయలు (రు. 100/-)

ప్రతులకు:

1. శ్రీమతి అక్కిరాజు రోహిణీరావు
   140 బి, సంతోష్‌నగర్ కాలనీ,
   సైదాబాద్, హైదరాబాద్ - 500 659.

2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ,
   4-1-435, బ్యాంక్ స్ట్రీట్,
   హైదరాబాద్ - 500 001.

3. నవోదయా బుక్‌హౌస్,
   3-3-865, ఆర్యసమాజ్ మందిర్ ఎదురువీధి,
   కాచిగూడ, హైదరాబాద్ - 500 027.

4. ఆంధ్ర సారస్వత పరిషత్తు,
   బొగ్గులకుంట, హైదరాబాద్ - 500 001.

ముద్రణ : చార్‌మినార్ ఆర్ట్ ప్రింటర్స్, సికింద్రాబాద్-3.

# విషయ సూచిక


కృతజ్ఞతలు - I

సంఘం - సాహిత్యం - III

కానుక - VII

1. యేనుగుల వీరాస్వామయ్య (1780-1835) 1
2. గాజుల లక్ష్మీనరసు చెట్టి (1806-1968) 3
3. మండపాక పార్వతీశ్వర శాస్త్రి (1833-1897) 5
4. జయంతి కామేశం (1846-1886) 7
5. కస్తూరి శివశంకర శాస్త్రి 11
6. పనప్పాకం అనంతాచార్యులు (1843-1908) 13
7. కందుకూరి వీరేశలింగం (1848-1919) 15
8. వేదం వేంకటరాయ శాస్త్రి (1851-1929) 17
9. కొవ్వూరి బసివిరెడ్డి (1852-1915) 18
10. ధర్మవరం కృష్ణమాచార్యులు (1853-1912) 20
11. బసవరాజు గవర్రాజు (1856-1888) 22
12. న్యాపతి సుబ్బారావు (1857-1941) 24
13. జయంతి రామయ్య (1862-1941) 26
14. గుత్తి కేశవ పిళ్ళై (1862-1933) 28
15. రెంటాల వెంకట సుబ్బారావు (1860-1918) 30
16. మోక్షగుండం విశ్వేశ్వరయ్య (1861-1962) 32
17. గురజాడ అప్పారావు (1862-1915) 34
18. రఘుపతి వెంకటరత్నం (1862-1939) 36
19. గిడుగు రామమూర్తి (1863-1940) 38
20. వావిలికొలను సుబ్బారావు (1863-1936) 40
21. ఆదిభట్ల నారాయణదాసు (1864-1945) 42
22. ఆచంట వెంకట సాంఖ్యాయన శర్మ (1864-1933) 44
23. పానుగంటి లక్ష్మీనరసింహారావు (1865-1940) 46

| | | |
|---|---|---|
| 24. | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి (1866-1960) | 48 |
| 25. | మానవల్లి రామకృష్ణ కవి (1866-1957) | 50 |
| 26. | కొండ వెంకటప్పయ్య (1866-1948) | 52 |
| 27. | వల్లూరి సూర్యనారాయణ రావు(1866-1937) | 54 |
| 28. | కాశీనాథుని నాగేశ్వరరావు (1867-1938) | 56 |
| 29. | చిలకమర్తి లక్ష్మీనరసింహం (1867-1946) | 58 |
| 30. | మాస్టర్ సి.వి.వి (1868-1922) | 60 |
| 31. | తిరుపతి వెంకటకవులు, చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి (1870-1950),<br>దివాకర్ల తిరుపతి శాస్త్రి (1872-1915) | 62 |
| 32. | కాళ్ళకూరి నారాయణరావు (1871-1927) | 64 |
| 33 | తంజనగరము తేవప్పెరుమాళయ్య (1872-1921) | 66 |
| 34. | చిలుకూరి వీరభద్రరావు (1872-1939) | 68 |
| 35. | టంగుటూరి ప్రకాశం పంతులు (1872-1957) | 70 |
| 36. | దివి గోపాలాచార్యులు (1872-1920) | 72 |
| 37. | మారేపల్లి రామచంద్ర శాస్త్రి (1874-1951) | 74 |
| 38. | బెల్లంకొండ రామారావు (1875-1914) | 76 |
| 39. | తేకుమళ్ళ రాజగోపాలరావు (1876-1938) | 78 |
| 40. | బంకుపల్లి మల్లయ్య శాస్త్రి (1876-1946) | 80 |
| 41. | వేమూరి రామకృష్ణారావు (1876-1939) | 82 |
| 42. | కొమర్రాజు లక్ష్మణరావు (1877-1923) | 84 |
| 43. | ఉన్నవ లక్ష్మీనారాయణ (1877-1959) | 86 |
| 44. | పింగళి వెంకయ్య (1878-1963) | 88 |
| 45. | వాసిష్ఠ గణపతి ముని (1878-1936) | 90 |
| 46. | ముట్నూరి కృష్ణారావు (1879-1945) | 92 |
| 47. | వెంకట పార్వతీశ్వర కవులు :<br>బాలాంత్రపు వేంకటరావు (1880-1972)<br>ఓలేటి పార్వతీశం (1882-1955) | 94 |
| 48. | చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణి (1880-1941) | 96 |
| 49. | దుర్భాక రాజశేఖర శతావధాని (1880-1957) | 98 |
| 50. | కట్టమంచి రామలింగారెడ్డి (1880-1951) | 100 |
| 51. | బళ్ళారి రాఘవ (1880-1940) | 102 |
| 52. | భోగరాజు పట్టాభి సీతారామయ్య (1880-1959) | 104 |
| 53. | ఆచంట లక్ష్మీపతి (1880-1966) | 107 |

| | | |
|---|---|---|
| 54. | చాగంటి శేషయ్య (1881-1956) | 109 |
| 55. | అయ్యదేవర కాళేశ్వరరావు (1881-1962) | 111 |
| 56. | జనమంచి శేషాద్రి శర్మ (1882-1950) | 113 |
| 57. | టేకుమళ్ళ అచ్యుతరావు (1882-1947) | 115 |
| 58. | గాడిచెర్ల హరి సర్వోత్తమరావు (1883-1960) | 117 |
| 59. | ఇప్పగుంట సుబ్బు కృష్ణయ్య (1883-1955) | 119 |
| 60. | రావు వేంకట సూర్యారావు (1885-1964) | 121 |
| 61. | కోడి రామమూర్తి (1885-1912) | 123 |
| 62. | మాడపాటి హనుమంతరావు (1885-1970) | 125 |
| 63. | గిడుగు వేంకట సీతాపతి (1885-1968) | 127 |
| 64. | కొప్పరపు సోదర కవులు : | 129 |
| | వేంకట సుబ్బారాయ శర్మ (1885-1932) | |
| | వేంకట రమణ శర్మ (1887-1942) | |
| 65. | యెల్లాప్రగడ సుబ్బారావు (1886-1948) | 132 |
| 66. | బారు రాజారావు (1886-1938) | 134 |
| 67. | వేటూరి ప్రభాకర శాస్త్రి (1888-1950) | 136 |
| 68. | సర్వేపల్లి రాధాకృష్ణ (1888-1975) | 138 |
| 69. | దుగ్గిరాల గోపాలకృష్ణయ్య (1889-1928) | 140 |
| 70. | అక్కిరాజు ఉమాకాంతం (1889-1942) | 142 |
| 71. | ఈద్పుగంటి రాఘవేంద్రరావు (1889-1942) | 144 |
| 72. | మామిడిపూడి వెంకట రంగయ్య (1889-1981) | 146 |
| 73. | ఆదిరాజు వీరభద్రరావు (1890-1978) | 148 |
| 74. | చిలుకూరి నారాయణరావు (1890-1951) | 150 |
| 75. | బండారు తమ్మయ్య (1891-1970) | 153 |
| 76. | శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి (1891-1961) | 155 |
| 77. | మల్లంపల్లి సోమశేఖర శర్మ (1891-1963) | 157 |
| 78. | మాడభూషి అనంత శయనం అయ్యంగారు (1891-1978) | 159 |
| 79. | గొబ్బూరి వేంకటానంద రాఘవరావు (1892-1958) | 161 |
| 80. | రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ (1892-1978) | 163 |
| 81. | వేలూరి శివరామ శాస్త్రి (1892-1967) | 165 |
| 82. | రాయప్రోలు సుబ్బారావు (1892-1984) | 167 |
| 83. | పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి (1893-1951) | 169 |
| 84. | ఓంకార స్వామి (1893-1983) | 171 |
| 85. | గడియారం వేంకట శేష శాస్త్రి (1894-1982) | 173 |

| | | |
|---|---|---|
| 118. | శ్రీరంగం శ్రీనివాసరావు (1910-1983) | 240 |
| 119. | తిరుమల రామచంద్ర (1913 జననం) | 243 |
| 120. | పుట్టపర్తి నారాయణాచార్యులు (1914-1990) | 246 |
| 121. | విద్వాన్ విశ్వం (1915-1986) | 248 |
| 122. | పాలగుమ్మి పద్మరాజు (1915-1983) | 250 |
| 123. | బుచ్చిబాబు (1916-1967) | 252 |
| 124. | కుందుర్తి ఆంజనేయులు (1922-1982) | 254 |
| 125. | ఎక్కిరాల కృష్ణమాచార్యులు (1926-1984) | 256 |
| 126. | దాశరథి కృష్ణమాచార్యులు (1926-1987) | 258 |
| 127. | భద్రిరాజు కృష్ణమూర్తి (1928 జననం) | 263 |
| 128. | నారాయణ రెడ్డి (1931 జననం) | 256 |
| | ఇతర రచనలు | 267 |

# కృతజ్ఞతలు

ఏ దేశంలోనైనా ఏకాలంలోనైనా సాంఘిక వ్యవస్థ ఆ సంఘంలో జన్మించిన మహాపురుషులను బట్టే నిర్ణీతమవుతుంది. ఆ దేశపు జవసత్త్వాలు వాళ్ళ వల్లనే నిర్ధారితమవుతాయి. ఆదిశంకరుడు రామానుజులు, మధ్వాచార్యులు, వల్లభాచార్యులు, బసవేశ్వరులను బట్టే భారతదేశపు సాంఘిక విలువలు తత్వచింతనం ఆధ్యాత్మిక దృక్పథం రూపుదిద్దుకున్నాయి. ఆధునిక కాలాన శ్రీ రామకృష్ణ పరమహంస, దయానంద సరస్వతి, స్వామి వివేకానంద, స్వామి రామతీర్థ, శ్రీ రమణ మహర్షి, అరవిందుడు, రవీంద్రుడు, గాంధీ, రాజారామమోహనరాయలు, ఈశ్వర చంద్ర విద్యాసాగరుల వంటి మహనీయుల వల్లనే భారతీయ సంస్కృతి పునరుజ్జీవం పొంది ప్రపంచానికి శిరోధార్యమైంది.

ఆయా కాలాలలో మహనీయులు జన్మించి జాతికి పథ నిర్దేశం చేస్తారు. మానవత్వపు విలువలను జాగృతం చేస్తారు. తరతరాలుగా గౌరవం పొందుతున్న జాతిచరిత్రను, సంస్కృతిని, దేశభక్తిని పునరుద్దీపితం చేస్తారు. వాళ్ళ జీవిత చరిత్రల వల్ల అటు తరువాత తరాలవాళ్ళు స్ఫూర్తి పొందుతారు. తమ దేశపు సంస్కృతి పట్ల ఆరాధనా తాదాత్మ్య భావమూ పెంపొందించుకుంటారు.

పురా చారిత్రకయుగం నుంచే తెలుగు వాళ్ళ ఉనికికి సాక్ష్యాధారాలున్నాయి. విష్ణుసహస్రనామంలో ఆంధ్రులప్రసక్తి ఉంది. ఐతరేయంలో పీళ్ళక జాతి వాళ్ళుగా ప్రసక్తమైనారు. చారిత్రక యుగాలలో గొప్ప సామ్రాజ్యాలు నిర్మించారు. సంస్కృతిని ఆరాధించారు. ఆలయాలు నిర్మించారు. వర్తక వ్యాపారాలలో దేశ దేశాలను ఆకర్షించారు. మధ్యకాలపు చరిత్రలో కూడా భాషాసాహిత్యాలను, మత సంస్కృతులను, శిల్పవాస్తువులను ఉజ్జ్వలం చేశారు.

ఆధునిక కాలాన ఎన్నో రంగాలలో విశిష్ట వ్యక్తిత్వ శోభితులైన తెలుగు వారున్నారు. తాము పుట్టిన జాతికి భాషకు ప్రాంతానికి గొప్ప పేరు తెచ్చిన వారున్నారు. అటువంటి మహనీయులను జాతిరత్నాలను సంగ్రహంగా జాగృతి పాఠకులకు పరిచయం చేయాలని కోరారు అప్పటి సంపాదకులు శ్రీ వేణుగోపాలరెడ్డిగారు. వారిచ్చిన

స్ఫూర్తితోనే అటుతర్వాత సుమారు రెండున్నర సంవత్సరాలు ప్రతిభామూర్తులు అనే ఈ శీర్షికను నేను నిర్వహించటం జరిగింది. శ్రీ వేణుగోపాలరెడ్డిగారు జాగృతి సంపాదకత్వం నుంచి వేరే కర్తవ్య నిర్వాహణ బాధ్యత స్వీకరించటానికి వెళ్ళిన తర్వాత ఇప్పటి సంపాదకులు శ్రీ వి.రామమోహనరావుగారు కూడా ఈ శీర్షికపట్ల ఆదరాభిమానాలు చూపి కొనసాగించారు. వీరిద్దరి పట్లా నా కృతజ్ఞతలు వెల్లడించుకుంటున్నాను. ఈ శీర్షికను చదువుతూ వచ్చిన మిత్రులెందరో తమ ఆమోదాన్ని సంతోషాన్ని వ్యక్తపరచారు. వీరందరికీ కృతజ్ఞుణ్ణి. ముఖ్యంగా శ్రీ తుమ్మలపల్లి హరిహర శర్మగారు నా యీ రచనపట్ల చాలా ఉత్సుకత కనపరచారు. వీరికెంతో కృతజ్ఞుణ్ణి. జాగృతిలో ధారావాహికంగా నూరువారాల పైన వెలువడిన ఈ విశేష శీర్షిక రచనను పుస్తకరూపాన తీసుకొని రావడానికి కారకులైన కృష్ణా పత్రిక సంపాదకులు శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు గారికి కృతజ్ఞతలు. జయంతి కామేశంపంతులు, కస్తూరి శివశంకరశాస్త్రి, పాలగుమ్మి పద్మరాజుగారలను గురించి 'అసలునిజం' అనే పక్ష పత్రికలో శ్రీ పి.వి.ఎస్:మూర్తి ప్రచురించారు. మిత్రుడు శ్రీ మూర్తికి కృతజ్ఞతాభినందనలు, మిత్రులందరికీ అభినందనలు.

ఏమైనా సూచనలు, సలహాలు, మెరుగు పెట్టటాని కుపకరించే విశేషాలు తెలియజేసే మిత్రుల అభిప్రాయాలు సాదరంగా ఆహ్వానిస్తూ కృతజ్ఞతా పూర్వకంగా మలిముద్రణలో ఉపయోగించుకోగలనని మనవి చేస్తున్నాను.

అక్కిరాజు రమాపతిరావు

హైదరాబాదు
10-8-1991



# సంఘం - సాహిత్యం

తాను జీవించే సంఘం దృఢంగా, బలంగా, పటిష్టంగా రూపొందితే తప్ప మానవుడు కూడా అట్లా జీవించలేడు. చెట్టుకు మట్టికి నదికి కొండకు ఒక చరిత్ర ఉన్నట్లే, ఒక ప్రాదేశిక ఆవరణం ఉన్నట్లే ఒక దేశంలోని ఒక జాతి జనులకు కూడా ఒక జీవన విధానం అలవాటవుతుంది. వాళ్ళ సాంఘిక వ్యవస్థలో, ఆదర్శాలలో కొన్ని విలువలు వాళ్ళు అభిమానిస్తారు. వాళ్ళ మత సాంస్కృతిక ప్రత్యేక విశ్వాసాలు వాళ్ళకుంటాయి. కొండ, చెట్టు, మట్టి, నది భారతీయులకు ప్రీతిపాత్రాలు, మమతాభివ్యంజకాలు. సమస్త సృష్టిని భగవత్స్వరూపంగా భావించటం దీనికి ప్రేరణ. ప్రకృతిని పరమేశ్వర మూర్తిమంతంగా అర్చించడమన్నమాట ఇది. కొన్ని దేశాలలో, కొన్ని జాతులలో, కొన్ని మతాలలో ఈ దృక్పథం లేకపోవచ్చు. అందువల్ల ఆ దృక్పథమూ, ఆ జీవన విధానమూ ఆధునికమూ నాగరికమూ అనుకొని, భారతీయ మూల్యాలను నిరసించకూడదు. అది తప్పు. ఉదాత్తమైన ఒక జాతి బలీయమైన విశ్వాసాలను, సంస్కారాన్ని, జీవన మూల్యాలను ఎవరూ ఎన్నటికీ ఎంత ప్రయత్నించీ నాశనం చేయలేరు.

19, 20 శతాబ్దాల భారతదేశ చరిత్ర అత్యంతాద్భుతమైనది. భారతీయులలో ఈ రెండు శతాబ్దాలలో ఎంతో మార్పు వచ్చింది. ఈ కాలం ఒక దివ్యోజ్జ్వలమైన చారిత్రక పరిణామకాలం. ఎందరో మహనీయులు మానవజీవన సంబంధమైన అన్ని రంగాలలోను జన్మించి మాతృభూమి మనుగడను సార్థకం చేయటానికి ఎంతో కృషిచేశారు. స్వార్థం వల్ల, అజ్ఞానం వల్ల, అవివేకం వల్ల, విదేశాల దాడుల వల్ల, విదేశీయుల మోసాలు, కుతంత్రాలు, క్రౌర్యం వల్ల భారతీయ సాంఘిక వ్యవస్థలో కొన్ని అవాంఛనీయ పరిణామాలు సంభవించాయి కాలక్రమాన. ఒక సహస్రాబ్దం అనైకమత్యం, విశ్రృంఖలత్వం, సాంఘిక అసమానతలు, ద్వేషాలు, కష్టాలు పాలు కావలిసి వచ్చింది భారతదేశం.

కాని 19వ శతాబ్దిలో మహనీయులు కొందరు జన్మించి సాంఘికమైన దోషాలు సరిదిద్దటానికి ఎంతో ప్రయత్నించారు. పారతంత్ర్య భారతదేశంలో విద్యా విజ్ఞాన వికాసాలను బోధించారు. సమతా, మమతలను నేర్పారు. చిరకాలంగా ప్రవహిస్తున్న సాంస్కృతిక భావధారలను ఇంకిపోకుండా చేశారు. మానవ నాగరికతలో, మేధా సంపదలో ఉన్నత శిఖరాలు దర్శించారు.

ఈ నూరు నూట యాభై సంవత్సరాల కాలంలో పుట్టినంత మంది మహనీయులు, మహా పురుషులు భారతదేశ చరిత్రలో ఇంతటి సమాన కాల వ్యవధిలో ఇది వరలో పుట్టారో లేదోననిపిస్తుంది.

ఇందుకు కారణం ఆధునిక కాలిక పరిస్థితులు, ప్రపంచంలోని ఇతర దేశాల భావ

విప్లవ పరిణామాలు, సిద్ధాంతాలు, రాజకీయాలు, ఆర్థిక పారిశ్రామిక ఉద్యమాలు కూడా కావచ్చు. పూర్వ కాలం లాగా కాకుండా ఎన్నో కొత్త కొత్త దేశాలు అక్కడి సాంఘిక వ్యవస్థలు భారతీయులకు పరిచయం కావటం జరిగింది. మతేతరులతో భావ ఘర్షణ ద్వారా భారతీయులలో ఆత్మ విమర్శ కూడా అవసరమైంది. లోపాలు తెలుసుకొని పరిదిద్దుకోవలసిన అగత్యం తటస్థించింది. పందొమ్మిదో శతాబ్ది పూర్వార్థం గడచి ఉత్తరార్థం మొదలైనప్పటి నుంచీ ఈ శతాబ్ది ఉత్తరార్థ ప్రారంభానికి అంటే స్వాతంత్ర్య సముపార్జన కాలం దాకా ఏయే మహనీయులు ఏయే రంగాలలో కృషిచేశారు, వాళ్ళ కృషి విశిష్టత ఏమిటి అనేదే ఈ పుస్తకంలోని విషయం. అయితే ఈ పరిశీలన కేవలం తెలుగు ప్రాంతానికి పరిమితం చేయటం జరిగింది.

తెలుగువాళ్ళుగా పుట్టి ఆధునిక కాలంలో తమ విశిష్టతను, తమ ప్రత్యేకతను ఏ విధంగా వాళ్ళు వెల్లడించిందీ చూపటం ఈ గ్రంథం ధ్యేయం. చరిత్ర, భాష, సంస్కృతి, మతం, ఆధ్యాత్మిక పునరుజ్జీవనంతో పాటుగా స్వాతంత్ర్యోద్యమం, సంఘ సంస్కరణోద్యమం, సంస్థా నిర్మాణం, వ్యాపార వాణిజ్యాలు మొదలైన రంగాలలో కూడా ప్రతిభావంతులైన వ్యక్తుల కృషి రేఖామాత్రంగా విశ్లేషించటం జరిగింది. నూరుగురికి పైగా విశిష్ట వ్యక్తుల రేఖా జీవిత చిత్రణ సంపుటి ఈ పుస్తకం. వారు ఇతర ప్రాంతాలలో జన్మించి తెలుగుదేశాన్ని తమ జీవన కృషి రంగస్థలంగా చేసుకున్నా, తెలుగుదేశంలో తెలుగువారిగా జన్మించి ఇతర ప్రాంతాలలో సాంఘిక పునర్నిర్మాణ కృషి చేసినా అటువంటి మహనీయులు కృషిని ఈ పరిమిత గ్రంథంలో చేర్చడం జరిగింది.

అపూర్వమైన దేహ బల మనో సంపదలు, మేధావిత, సాంఘిక కృషి, దీన మానవ సేవ మొదలైన వాటిలో పేర్కొనవలసిన వ్యక్తుల జీవితాలు కొన్ని ఇందులో చేర్చడం జరిగింది. ఇందులో చేరవలసిన పేర్లు ఇంకా కొందరివి ఉండవచ్చు. సాధారణ జీవితం కన్నా కొంత సార్థక జీవితం సాగించిన ప్రతివారూ వంద్యులే. వారి కృషిని ఆదర్శంగా చేసుకొని సంస్కార ప్రీతిగల వ్యక్తి స్ఫూర్తిని పొంది తన జీవితాన్ని గడుపుకోవాల్సి ఉంటుంది. వారిలోని మంచి గుణాలను మహిత చైతన్యాన్ని తన శక్తి మేరకు అనుకరించవలసి ఉంటుంది. కనీసం ఆసక్తి నైనా చూపి అట్లా నడుచుకోవటానికి ప్రయత్నించవలసి ఉంటుంది. కోడి రామమూర్తి వంటి అసాధారణ దేహ బల సంపదా, జగజ్జెట్టీతనమూ సంపాదించాలనే ప్రయత్నం చేయకపోయినా, చేయలేకపోయినా ఆయన దేశభక్తి వదాన్యత, శీల సంపదలను ప్రేమించవచ్చును కదా! అట్లానే ఎల్లాప్రగడ సుబ్బారావు గారి జీవితం నుంచి ఆయన వంటి మహా విజ్ఞాన మేధాశక్తిని సముపార్జించలేకపోయినా కర్తవ్యనిష్ఠ, నిస్వార్థ విజ్ఞానసేవ, ఆరాధించవచ్చును కదా. లక్షలాది మంది రుజాగ్రస్త దీన మానవాళిని ఆయన కాపాడగలిగాడు తన వైద్య విజ్ఞాన పరిశోధనల ద్వారా. భౌతిక ఆధ్యాత్మిక గవేషణల పరమార్థం ఒక్కటేనని నిరూపించారు స్వామీ జ్ఞానానంద. ఒకవైపున నిరుపమానమైన

అవధూత స్థితిని ప్రాపించిన్నీ అణు విజ్ఞాన రహస్యాలను ఆవిష్కరించారు శాస్త్రీయ పరిశోధనల ద్వారా. ఇటువంటి మహాత్ములను గూర్చి, మహనీయులను గూర్చి సంఘం ఎంతగా ఆకృష్టమైతే, ఆ సంఘంలో ఆ జాతిలో అంతగా శాంతి భద్రతలు, సుఖ సంరక్షణలు, నాగరక క్రమశిక్షణలు నెలకొంటాయి. వాతావరణ కాలుష్య దుష్ఫలితాలు తొలగించుకోవటానికి ఎంత జాగ్రత్తలు వహించాలో సాంఘిక వాతావరణ దుష్పరిణామాలు వికృత స్వరూపం తాల్చకుండా నియంత్రించటానికి అంతకన్నా ఎక్కువగా సంసిద్ధం కావాలి. జాగ్రత్త పడాలి. ఈ దశలో మహనీయుల జీవిత ఇతివృత్తాలు సంఘానికి మనోబలాన్ని పథ నిర్దేశాన్నీ చేకూర్చగలవు. మానసిక వికాసాన్ని కలిగించగలవు.

సంఘంలో కవులకు, కళాకారులకు, విద్యావేత్తలకు, సామాజిక కృషికులకు ఉదాత్తమైన స్థానం ఉంటుంది ఎప్పుడూ. ఒక జాతి, ఒక దేశం, ఒక సంప్రదాయం, ఒక సంస్కృతి, ఒక జీవన వికాసం వాళ్ళ వల్లనే సంరక్షితమవుతూ ఉంటుంది. అందువల్ల సాహిత్య పరులను జాతి జనులు గౌరవించాలి. ఆనువంశికమైన సాంస్కృతిక భవిష్యత్తునూ వారు వృద్ధి చేయడమే కాకుండా కాపాడుకుంటూ వస్తున్న వారు కూడాను.

ప్రముఖ వ్యక్తుల జీవిత చరిత్రయే ఆ దేశ చరిత్ర అవుతుంది. గతాన్నీ భవిష్యత్తునూ సంధించే ప్రయత్నమే చరిత్ర. అటువంటి చరిత్రను రూపొందించగల వాళ్ళే చరితార్థులు. సాహిత్య ప్రయోజనం ఆనందమూ ఉపదేశమూ కూడాను. ఉల్లాసమూ ఉత్తేజమూ కూడాను. ఒక నాణానికి ఇవి రెండు వైపులు వంటివి. ఒక వైపు స్ఫుటంగా అధికారికమైన ముద్రాంకనం కనపడుతూ రెండో వైపున అరగిపోయి, అసలు కనపడకుండా పోతే ఆ నాణెం చెల్లుబాటు కాదు కదా సాధారణంగా, వినిమయ దారుడి అవసరాలు తీర్చేటంత సంతృప్తికరంగా. మోసం చేసో, కన్నుగప్పో, అప్రమత్తత నాసరా చేసుకొనో అటువంటి నాణేన్ని కూడా చెల్లుబాటు చేయించుకోగలిగితే చేయించుకోవచ్చుగాక. అది తర్వాతనైనా ఎక్కడో ఒక చోట ఆగిపోతుంది. చెలామణీలోంచి తప్పుకోక తప్పదు. అలానే నిజమైన చరిత్ర, నిజమైన సాహిత్యమూ కానప్పుడు అవి చెలామణీలోంచి భంగపడక తప్పదు. రెండువైపులా చక్కగా ఉంటే ఆ నాణేనికి కాలం పెరిగిన కొద్దీ చారిత్రక విలువా, ప్రాముఖ్యమూ పెరిగి అది మరింత ఆదరపాత్రమవుతుంది. చరిత్రకు, సంస్కృతికి గుర్తుగా మాననీయమవుతుంది.

ఒక మహావ్యక్తి జీవితం కూడా ఇంతేను. కాలంగడిచిన కొద్దీ కాంతులను మరింత స్ఫుటంగా ప్రసారింప చేస్తుంది ఆ జీవితం. సమకాలపు పరిమితులకు అతీతంగా వెలుగొందుతుంది. అసలైన విలువ అప్పుడే తేలుతుంది. సమకాలపు వారలను సమకాలపు వారలు మెచ్చకపోయినా వారి చారితార్థ్యం కాలాంతరాన అయినా ఆవిష్కృత మవుతుంది. అయితే వాళ్ళు సంఘానికి మేలు చేసిన వారూ ఆత్మోద్దీపనం చేసిన వారూ అయివుండాలి. అప్పుడే వాళ్ళు తరతరాల స్వీయ జాతి జనులకు స్ఫూర్తి దాయకులవుతారు. హృదయమో, మేధావిశిష్టతో, నేర్పో, శిల్పమో, ప్రాబోధికతో, సంవేదనో, జ్ఞానదీప్తో,

త్యాగమో, వీరమో, దేశభక్తో, వాగ్వైశారద్యమో, ఉద్యమితో, స్వయంకృషో, ఆత్మ విశ్వాసమో, స్తుతి పాత్రమైన శీలమో ఏదో ఒక పరమార్థ మానవాదర్శం వెలుగుచిమ్మిన వారి జీవిత రేఖాచిత్ర సంచయనిక ఇది.

అక్కిరాజు రమాపతిరావు.



# కానుక

సాహిత్య ప్రియంభావుకులు ఉత్తమ సంస్కారి తన వారిపట్ల, తన సంస్కృతి పట్ల సౌజన్యం, అభిమానం, సాంఘిక సౌశీల్యం మిక్కుటంగా వర్షించి ఆకర్షించే శ్రీ అక్కిరాజు వాసుదేవరావు గారికి ప్రేమాభిమానాలతో

అక్కిరాజు రమాపతిరావు

హైదరాబాదు
10.8.1991

ప్రమోదూత
విజయదశమి
29-9-1990.

# యేనుగుల వీరాస్వామయ్య



ఇంగ్లీషు కుంఫిణీ పరిపాలన భారతదేశంలో స్థిరపడిన తర్వాత, భారతదేశంలోని మేధావులకు కనువిప్పు కలిగింది. తమ సంస్కృతి, సాహిత్యం, సాంఘిక విలువలు, ప్రజాహిత జీవనం, వీటిని గురించి ఆనాటి పెద్దలలో తీవ్రమైనఆలోచనరేకెత్తింది. ఏ విధంగానైనా సాంఘిక జీవనాన్ని సంస్కరించుకోకపోతే మొదటికే మోసం వచ్చే ప్రమాదాన్ని వారు గుర్తించారు. కిందటి శతాబ్ది పూర్వార్ధంలోనే ఇంగ్లీషు భాషను బాగా స్వాధీనం చేసుకొని ప్రపంచ మతాలను, సామాజిక సిద్ధాంతాలను భారతదేశంలోని మేధావులు బాగా పరిశీలించారు. భారతదేశపు సాంఘిక వ్యవస్థను, శ్రుతిస్మృతులు , ఆచార వ్యవహారాలను కాలానుగుణమైన దృష్టితో సమన్వయించారు. రాజారామ్మోహన రాయల తర్వాత సంస్కర్తలంతా అవలంబించిన పద్ధతి ఇదే. సాంఘిక జీవన విధానంలోని లోపాలన్నీ సవరించటానికి అన్ని రంగాలలో కృషిచేశారు.

పద్దెనిమిదో శతాబ్దం ఉత్తరార్థంలో జన్మించి పంధొమ్మిదో శతాబ్ది పూర్వార్ధంలో తెలుగు వారి సాంఘిక శారస్వత రంగాలలో గొప్ప ప్రతిభ కనపరచిన ప్రముఖులలో యేనుగుల వీరాస్వామయ్య/గారొకరు. దక్షిణ దేశంలో స్థిరపడ్డ తెలుగు కుటుంబానికి చెందినవారు వీరాస్వామయ్య. చెన్నపట్టణం వీరి నివాస స్థలం. తొమ్మిదోయేటనే తండ్రి చనిపోగా స్వయంకృషితో అనేక భాషలలో మంచి పాండిత్యం సంపాదించిన స్వదేశీయుడు. 'ఆనాటి కంపెనీ ప్రభుత్వంలో పొందగల అత్యున్నతమైన పదవి పొంది దొరలకు చాలా ప్రీతిపాత్రులైనారు. వీరాస్వామయ్య పన్నెండో యేటనే ఇంగ్లీషు భాషలో ధారాళమైన ప్రజ్ఞ సంపాదించారు. పదమూడోయేట తిరునల్వేలి కలెక్టర్ కచేరి లో ఇంటర్‌ప్రిటర్ గామా ట్రాన్స్‌లేటర్‌గాను తన విధులు ప్రతిభావంతంగా నిర్వహించారు. పదిహేనో యేట చెన్నపట్నంమళ్ళీ చేరుకొని కుంఫణీ వారి వర్తకశాఖకు సంబంధించిన కార్యాలయంలో పెద్ద ఉద్యోగం చేశారు. అటు తర్వాత ఆయనను సుప్రీంకోర్టులో హెడ్ ఇంటర్ ప్రిటర్ అయినారు. ఆ రోజుల్లో ప్రతి రాజధానిలో ఒక సుప్రీం కోర్టు ఒక సదర్ అదాలత్ కోర్టు ఉండేవి. ఇంగ్లీషు రాజు అధికారం

క్రింద ఇంగ్లీషు వారి న్యాయశాస్త్రం ప్రకారం పనిచేసే న్యాయసభ సుప్రీంకోర్టు- రెండోది కంపెనీ వారి అధికారం క్రింద దేశీయ న్యాయశాస్త్ర విధుల ప్రకారం పనిచేసే న్యాయసభ. సుమారు పదిహేను సంవత్సరాలు వీరాస్వామయ్యగారు సుప్రీంకోర్టులో ప్రధాన ద్విభాషిగా పనిచేశారు. ఆయన పదవీవిరమణ చేసేటప్పుడు ఆయనకు దొరలు బంగారంతో చేసిన ముక్కుపొడి డబ్బీని బహూకరించారంటే ఆయన ప్రజ్ఞ ఎటువంటిదో తెలుసుకోవచ్చు.

నూటయాభై సంవత్సరాల క్రితం ఆయన చెన్నపట్నం నుంచి బయలుదేరి కాశీయాత్ర చేసి, ఆనాటి సామాజిక పరిస్థితులన్నీ దినచర్యగా వ్రాసిపెట్టారు.దీన్ని కాశీ యాత్రా చరిత్రగా అచ్చువేశారు. వీరాస్వామయ్య గొప్ప పండితుడు. చెన్నపట్నంలో జరిగిన జ్యోతిష విద్వాంసుల మహాసభలో ఆయన క్షయమాస నిర్ణయం చేశారు. చెన్నపట్నంలో హిందూలిటరరీ సొసయిటీని స్థాపించి ప్రజలలో చైతన్యం కలిగించే కార్యక్రమాలు నిర్వహించారు.

ఆనాటి రాజకీయ వ్యవస్థ, హిందూ సంఘంలోని లోపాలు, క్రైస్తవమత వ్యాప్తి, దాని కారణాలు, హిందూ మతానికి క్రైస్తవ మహమ్మదీయ మతాలకు ఉండే అంతరాలు, ఉత్తర దక్షిణ భారత దేశంలోని సాంఘిక జీవనంలోని వ్యత్యాసాలు, సాంస్కృతిక విశేషాలు, భక్తి జ్ఞానకర్మ మార్గాల విశిష్టత, విగ్రహారాధన సామంజస్యం మొదలైన ఎన్నో విషయాలు సమన్వయ పూర్వకంగా తన యాత్రా చరిత్రలో వీరస్వామయ్యగారు వివరించారు. తండ్రి సామయమంత్రి. పుట్టుక **1780**, మరణం **1835**.

****

# గాజుల లక్ష్మీనరసు చెట్టి



తూర్పిండియా వర్తక కంపెనీ వారి అక్రమ, అన్యాయ, అస్తవ్యస్త పరిపాలన గూర్చి సీమలోని ఇంగ్లీషు ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపించ వచ్చునన్న విషయం, అమాయకులు, అవిద్యావంతులు అయిన ఆనాటి ప్రజలకు తెలియదు. దక్షిణ భారతదేశంలో ప్రజాందోళనకు మొట్టమొదటిసారిగా సూత్రధారిత్వం వహించినవాడు లక్ష్మీనరసు సెట్టి. రాజకీయ చైతన్యాన్ని ఆయన రగిల్చాడు. ప్రభుత్వం వారికి విజ్ఞప్తులు, మహజరులు, అసమ్మతి విన్నపాలు పంపుకోవచ్చుననీ, అధికారులతో సంప్రదించి అన్యాయాలు తొలగించే హక్కు పౌరులకుంటుందనీ తెలిపి, లక్ష్మీ నరుసు సెట్టి ఆ రోజుల్లో పత్రిక కూడా నడిపి సమాజ సేవా కార్యకలాపాలలో పాల్గొన్నాడు. లక్ష్మీనరసు చాల తెలివైన వారు. **1806**వ సంవత్సరంలో ఈయన జన్మించారు. తండ్రితో కలసి సిద్దులు సెట్టి అండ్ కంపెనీ అనే పేరుతో విరివిగా బట్టల ఎగుమతి వ్యాపారం చేసి విశేషధనం ఆర్జించాడు. మద్రాసు నగరంలో ప్రముఖవ్యక్తి అయినాడు. మిషనరీలు, అధికారులూ కలసి చేస్తూ వున్న అన్యాయాలను అరికట్టి నోరులేని ప్రజలను రక్షించాలనే దీక్ష యీయనకు కలిగింది. తన సర్వస్వాన్ని ఈ కార్యసాధన కోసం ధారపోయడం ప్రారంభించాడు. ప్రజాహితం కోసం పని చేయటానికి ఒక ప్రజా సంఘం ఉండటం అవసరమని గ్రహించి **1944** నాటికే 'మద్రాసు నేటివ్ అసోసియేషన్' ను స్థాపించి లక్ష్మీనరసు అధ్యక్షులైనారు. ఆ సంఘం వారు ప్రజల కష్టాలను గురించి చర్చించుకోవడానికి అప్పుడప్పుడు సభలు చేసి తీర్మానాలు చేసేవాళ్ళు. పై అధికారులకు, ఇంగ్లండుకూ మహజరులు పంపేవారు.

**1844** అక్టోబరులో లక్ష్మీనరసు 'క్రిసెంట్' అనే ఇంగ్లీషు పత్రిక ప్రారంభించి భారతీయ ప్రజల హక్కుల కోసం ప్రచారం చేయసాగాడు. దీనికి ఒక ఇంగ్లీషు వ్యక్తినే ఆయన

సంపాదకుడిగా నియమించారు. **1846** అక్టోబరు 7వ తేదీన చెన్న రాష్ట్రంలో మొదటి రాజకీయ సభను నిర్వహించింది లక్ష్మీనరసు గారే. అప్పుడొక మహజరును తయారుచేసి అందులో పన్నెండు వేల మంది చేత సంతకాలు చేయించాడు లక్ష్మీనరసు సెట్టి. ఆ సభ కాయనే అధ్యక్షులు కూడాను. దీనిని ఇంగ్లండులో కంపెనీ పరిపాలన వ్యవహారాలు చూసే డైరెక్టర్ల సంఘానికి పంపించారు. ఆనాటి అన్యాయపు పన్నుల గురించీ, వాటిని వసూలు చేయటంలో ప్రభుత్వాధికారుల జులుం గురించీ లక్ష్మీనరసు ఇంగ్లండులోని పార్లమెంటుకు మహజర్లు సమర్పించగా ప్రభుత్వానికి ఒక విచారణ సంఘం నియమించటం తప్పనిసరి అయింది. మోతర్పా, దిట్టం, అనే అన్యాయపు పన్నులు విధించి వృత్తిపని వారిని, రైతులను ఆనాటి కంపెనీ ప్రభుత్వం ఎంతగానో వేధించింది. వీటన్నిటిని సరి అయిన వివరాలతో 'మద్రాసు నేటివ్ పిటిషన్'గా ఇంగ్లండులోని పార్లమెంటు సభ్యులైన తన మిత్రులకు పంపగా ఎలెన్‌బరో, ఆల్బీమెరల్ అనే ఎగువసభ సభ్యులు పార్లమెంటులో ఆ మహజరును సమర్పించి పెద్దచర్చ లేవదీశారు. డేన్బీ సేమర్ అనే పార్లమెంటు సభ్యుడు **1852**లో హిందూదేశం పర్యటించటానికి వచ్చి చెన్నపట్నంలో లక్ష్మీనరసుకు అతిథిగా వుండి తమిళ జిల్లాలు లక్ష్మీనరసుగారితో పర్యటించి పన్నులు వసూలు చేయడంలోని అక్రమ పద్ధతులు, హింసించే ఉపకరణాలు తీసుకొని వెళ్ళి ఇంగ్లండు పార్లమెంటులో ఈ చిత్రహింసలపై పెద్దగొడవచే శాడు. గాజుల లక్ష్మీనరసుసెట్టి **1868**లో స్వర్గస్థుడైన దాకా ప్రజా సేవ చేస్తూనే ఉన్నారు. ఆయనకు తెలుగు సాహిత్యమంటే గొప్ప అభిమానం. వీరింట్లో చాలా విలువైన గ్రంథాలయం వుండేది. పరవస్తు చిన్నయసూరి, బహుజనపల్లి సీతారామాచార్యులు ఈ గ్రంథాలయం ద్వారా ఎంతో మేలుపొందారు. ప్రజాసేవ తత్పరుడైన మహనీయుడు లక్ష్మీనరసుసెట్టి.



# జయంతి కామేశం పంతులు



జయంతి కామేశం పంతులు ఒక అద్భుతమైన వ్యక్తి. తరతరాల మానవ జీవితాన్ని తరచిచూసినా ఎప్పుడోకాని కనిపించని అరుదైన మూర్తిమంతం ఆయనది. ఈయన ఎంతో పూర్వుడు కాదు. నూరేళ్ళ కిందటి వ్యక్తి అసమాన ప్రజ్ఞా విభవుడు. నిరుపమాన మేధాశాలి. ఆ రోజుల్లో బి ఏ., బి.ఎల్., అయినాడు. తన కేసులు వాదించటానికి ప్రీవీ కౌన్సిల్‌లో తన ప్రతిభ కనపరచటానికి ఆ రోజుల్లో ఈయిన ఇంగ్లండు వెళ్ళారు చేతికి ఎముకలేదనిపించుకున్న నెరదాత అని ప్రఖ్యాతుడైనాడు. ఈ చేతిద్వారా సంపాదించింది ఆ చేతికి తెలియకుండా దానం చేశాడు

జయింతి కామేశం పంతులుగారి గురించి చిత్రమైన అత్యంత కుతూహలకరమైన అత్యద్భుత ఉదంతాలెన్నో ఉన్నాయి కోడి రామమూర్తి అంత బలశాలి. భీముడి అంత ఆహార పుష్టికల్గవారు. ఒక అరటిపండ్ల గెలను అలవోకగా ఫలహారం పుచ్చుకోగల జఠరదీప్తి ఈయిన కుండేది అని చెపుతారు. రోజుకు ఐదారుసార్లు భోజనం చేయగల శక్తి వీరికి ఉండేదని వీరి గురించి కథలు గాథలు ప్రచారంలో ఉన్నాయి.

గొప్ప విద్వాంసుడు కామేశం పంతులుగారు. నారాయణ శతకం, జానకీ వరశతం అనే రెండు శతకాలు వీరు రచించారు. కళింగాంధ్రలో అవి ఆ రోజుల్లో ప్రచారంలో ఉండేవి. అజ్జాడాదిభట్ల నారాయణ దాసు ప్రజ్ఞా ప్రజ్వలనం చేసినవారు కామేశం పంతులు గారే. మొట్టమొదటి సారిగా నారాయణదాసు గారిచేత హరికథ చెప్పించింది పంతులుగారే

ఈ పుణ్యపురుషుడి ఈ మహనీయుడి నివాస స్థాన భాగ్యానికి నోచుకొన్నది గంజాం మండలం లోని బరంపురం. జయింతి వారి వల్ల ఒకప్పుడు బరంపురానికెంతో ఖ్యాతి వచ్చింది. మద్రాసు విశ్వవిద్యాలయం వారు న్యాయవాది పరీక్షలు

నిర్వహించినప్పుడు మొదటి జట్టులో కృతార్థులైనవారు కామేశం పంతులు గారు వీరితో పనప్పాకం అనంతాచార్యులు గారూ, సింగరాజు సుబ్బారావు గారూ కూడా బి.ఎల్ పరీక్ష ఇచ్చిన వారు తెలుగువారే కావడం తెలుగువాళ్ళకు గర్వకారణం

మహాభోగి, మహాత్యాగి కామేశం పంతులు. ఆయునకు తమాషా అయిన సరదాలుండేవి సంతర్పణలకు, వ్రతాలకు శుభకార్యాలకు ఆయునింట షడ్రసోపేతంగా పంక్తులు దీరి వేలమంది భుజించేవారు ఎవరైనా ఎంత భోజన పరాక్రమం చూపిస్తే ఆయిన అంత సంతోషించేవారు. మజ్జిగ వడ్డన జరుగుతుండగానో లేదా భోజనం అయిపోయి పంక్తి వారు లేవబోతూ ఉండగానో కామేశం పంతులు గారు అక్కడకు వచ్చి ఇంకో లడ్డు, భక్ష్యం తింటే ఐదు రూపాయిల బహుమానం అని మురిపించే వారట. ఆయున భోజన ప్రియ తకంత కన్నా నిదర్శనం ఏం కావాలి. ఆయిన రెండు చేతులా ఆర్జించేవారు. పన్నెండు చేతుల దానధర్మాలు చేసేవారు ఇంగ్లాండు వెళ్ళినా ఆయిన వెంట వంట బ్రాహ్మణుడు ఉండాల్సిందే.

ఓసారి ఒక కథ జరిగింది. పంతులు గారింట్లో ఒక శుభకార్యం తిన్నవారు తినిపోతున్నారు ఆకొన్న వారు వస్తూనే ఉన్నారు వంట బ్రాహ్మణుడు పెద్ద భక్ష్యాలదొంతి (బొబ్బట్లు) ఇంత ఎత్తున పెట్టుకొని విస్తరాకులు కప్పి ఇంటికి తీసుకొని పోయినాడు కామేశం పంతులుగారి తల్లి ఈ సంగతి చూసింది. అయ్యో ఇలా వృథా అయిపోతొందే కొడుకు సంపాదన అని ఆమెకు దుగ్ధ కలిగి ఉంటుంది. ఉండబట్టలేక కొడుకు దగ్గరకు వెళ్ళి ఫిర్యాదు చేసింది నాయినా దానం, ధర్మం ఒకరికింత పెట్టడం మంచిదేకాని మరీ ఇంత దుబారా పనికిరాదు అని హితవు పలికింది. అట్లానా అమ్మా ఆ వంటాయినను రానీ నీ ముందే చీవాట్లు పెడతా గదా అని తల్లిని సముదాయించాడాయిన మర్రోజు పొద్దున్నే ఆ వంటాయిన వంటపనికై తమ ఇంటికి రాగానే తన తల్లిగారు చూస్తున్న విషయిం గ్రహించి ఇంత ఎత్తున ఆ వంటాయినపై ఎగిరి పడ్డారు కామేశం పంతులుగారు ఏమయ్యా నీకు బుద్ధి ఉండక్కర్లే అని కోప్పడగా పాపం ఆ వ్యక్తి వెలవెలాబోయాడు లవాక్కయి పోయినాడు. నిన్న బొబ్బట్లదొంతర పెద్దది పట్టుకొని పోయింది నిజమేనా అని అడిగారు పంతులుగారు నిజమేనని నీళ్ళు నమిలాడు వంటాయిన అందుకే జ్ఞానం లేదంటున్నాను. ఒట్టి బొబ్బట్లు తీసుకుపోతావుటయ్యా, వెంట నేతి ఘుూకీ తీసుకొని పోవాలని ఇంగితం లేకుండా అవి ఎందుకు తీసుకొని పోయినావు. నెయ్యి లేకుండా తింటే పిల్లలకు కడుపునొప్పి చెయ్యదా. ఈ మాత్రం తెలివిలేని వాడివి నీవెందుకు పనికి వస్తావని ధాంధూం లాడారు పంతులుగారు నవ్వారు ఆ వంట బ్రాహ్మడి పంచప్రాణాలు కుదుటపడ్డాయి. ఈసారి ఎప్పుడూ అలా చెయ్యకు పో ఇప్పుడే నేతి చెంబు ఇంటికి పట్టుకొనిపో అని అతణ్ణి పంపించి తల్లి దగ్గరకు వెళ్ళి అమ్మా ఇటువంటి విషయాలను పట్టించుకోకమ్మా తనువులూ ధనమూ స్థిరమూ కాదు, శాశ్వతమూ కావు. ఒకరు తిన్నదే మనం మిగుల్చుకొనేది అని వినయంగా చెప్పి ఆమెను మాట్లాడకుండా

చేశారుట. ఇటువంటి కథలెన్నో ఉన్నాయి. ఆ మహానుభావుణ్ణి గురించి, ఆయన మేనా మోసే వాళ్ళు ఎప్పుడూ ఐదారు జట్లు సిద్ధంగా ఉండేవాళ్ళు. మద్రాసులో, విశాఖపట్నంలో ఆయినకు కోర్టు కేసులలో తీరికే ఉండేది కాదు.

ఒకసారి విశాఖ నుండి విజయనగరం దారిలో ఆయనకు బాగా దప్పిక అయింది. ఆయిన మేనా ముందు (ఆ రోజుల్లో కార్లులేవుగా, . పల్లకీనో, మేనానో ధనవంతులు నిర్వహించుకొనేవారు) ఒక వ్యక్తి కనిపించాడు. అతడు ఏదో ఆర్తితో అలసటగా నడుస్తున్నాడు. ఆ వ్యక్తిని ఆపి ఇక్కడ మంచినీళ్ళ బావిగాని, కుంటగాని దగ్గర్లో ఉందా అని అడిగాడు కామేశం పంతులు. ఉందని చెప్పి ఆ యాయివారపు బ్రహ్మడు వెళ్లి తన పెద్ద చెంబు నిండా తెచ్చిపెట్టాడు మంచినీళ్ళు. ఆ మంచినీరు చల్లగా తియ్యగా కామేశం పంతులికి సంతోషాన్నిచ్చాయి. ఎక్కడకు వెళుతున్నారు అని అడిగాడాయన ఆ బ్రాహ్మణ్ణి, అయ్యా నా కొడుక్కు ఉపనయనం తలపెట్టాను. బరంపురంలో కామేశం పంతులుగారనే ధర్మాత్ముడిని కలుసుకోవడానికి పోతున్నాను అని చెప్పాడట ఆ వ్యక్తి అయ్యో కామేశం పంతులు ఇప్పుడు బరంపురంలో లేదు గదా. ఆయిన నాకు తెలిసిన వాడేను. ఇంకా నెలరోజులకు గాని ఆయన అక్కడకు చేరడు. మీరేమో అంత దూరం వృధాగా నడిచిపోవద్దు. రెన్నాళ్ళ తర్వాత వెళుదురుగాని. అని ఆ పెద్ద చెంబు నిండా వెండి రూపాయలు నింపి మీరు నా దప్పిక తీర్చారు ఇవి స్వీకరించండి అని సాదరంగా ఇచ్చాడట పంతులు. ఆ బ్రాహ్మడు నివ్వెరపోయి అయ్యా మీరు కామేశం పంతులుగారని తోస్తున్నది. లేకపోతే ఎవరిస్తారు ఇన్ని రూపాయిలు అని నిలువెల్లా కరిగిపోతూ కృతజ్ఞత చెప్పుకొన్నాడట ఆ అవతలి వ్యక్తి

అజ్జాడాది భట్ల నారాయణదాసు కామేశం పంతులుగారి గురించి ఏమి రాశాడో చూడండి ''కామేశము పంతులు దానకర్ణుడు. చేతికెముక లేదు మూరబార యొకటియే. సింగపునజరు. ఏడడుగుల వాడాజానుబాహువు మన్మథ సుందరుడు. ప్రాఫిషియంటు వకీలు, వేల కొలది, లక్షల కొలది మృష్టాన్నములు పెట్టించుట దోసిళ్ళతో రూమాలు సంభావన లిచ్చుటయు. ఒకప్పుడొకడు పంతులుదయమున కూర్చుండనిచ్చి పెండ్లి చేసుకుందుననెను. వైష్ణవుడు. ఘనమున (అంటే వేదములో) గొప్ప విద్వాంసుడు అప్పుడు నలుపది వేలుగల గోనె సంచిలో దోసిలిపట్టి (పంతులు వేళ్ళు మిక్కిలి పొడవైనవి. దోసిలి రెండు వందలకు తక్కువ బట్టదు) అయిదారు దోసిళ్ళిచ్చి, తుదకు గోనెసంచి పళ్ళెము నుంచి యెత్తెను. బ్రాహ్మణునకు రెండు మూడు వేలు ముట్టెను''.

అంటే లెక్క పెట్టకుండా దోసిళ్ళ కొద్దీ ఇచ్చేవాడన్న మాట కామేశం పంతులు.

ఇంకా ఇట్లా వర్ణించారు నారాయణ దాసుగారు కామేశం పంతులును గూర్చి కామేశం పంతులు సంస్కృతాంధ్రముల ప్రశస్తముగ కవిత చెప్పగలడు. అతడొనర్చిన నారాయణ శతకము రామశతకమును ముద్రింపబడినవి. ఇంగ్లీషున వోఢ్రమున మేటి పాండిత్యము కలదు. లా యందు మిక్కిలి నిపుణుడు. రామ రామయుని యహోరాత్రములు

నిదురనైన వ్రేళ్ళపై వ్రాయించుట యితని యసాధారణ ప్రజ్ఞ శ్రీరామ భక్తాగ్రేసురుడు మేటియింతర్ముఖుడు ఒకప్పుడొకరాజు కోపము వచ్చి పంతులును ఫైసలు చేయుటకై యుడవిదారిలో నలువది మందిని కాపుంచెను. చేత రివాల్వరు మొలను వాల్గత్తితో గుర్రమును బరుగెత్తించుచు వచ్చుచు దారికడ్డుపడిన రాజభటులతో ''మీ రాజును బౌరుషమున్న రమ్మనుడు మీరే యూరక చచ్చిపోయెదరు'' అనుచు బోవుచున్న నెద్దియుదోచక రాజభటులూరకొనిరి. అంత సాహస వంతుడీ ముచ్చట నాకతడు స్వయముగ జెప్పెను. అభీష్టభోగంబు లనుభవించి సంసారము నిస్సారమని యెంచిన యితని యంతస్సార మింతంతయని వాకొనదరము కాదు తణీకృతపురం దరుడగు జయంతి కామేశము పంతులును బోలిన పౌరుషజ్ఞాన కీర్తులు కలవాడెందైన లేడిది నిశ్చయము'' ఇంగ్లీషులో తెలుగులో సంస్కృతంలో కామేశం పంతులు లక్షల కొద్దీ ప్రస్తావనలు చెప్పేవాడని నారాయణదాసు శ్లాఘిస్తున్నారు ఆయిన వీధిలో దొమ్మరసాని తీగమీద నడుస్తూ యద్రాచ్యానిజ ఫాల పట్ట లిఖితం.. . అనే శ్లోకం అభినయించగా కళ్ళనీళ్ళు పెట్టుకొని పది రూపాయిలు ఆ ఆటగత్తెలకు బహుమానం చేసినట్లు అజ్జాడ వారే పేర్కొంటున్నారు. మహా మనస్వి వేటూరి ప్రభాకర శాస్త్రి గారు కామేశం పంతులు కథలు అంటూ ఆ దాన కర్ణుణ్ణి గురించి కమనీయమైన కథలు వ్రాశారు.

జీవిత కాలంలో మొత్తం నలభై లక్షల రూపాయిలు కామేశం పంతులు దానధర్మాలకై వెచ్చించాడని పెద్దలు ఆయిన గురించి వ్రాశారు ఈ సొమ్ము కామేశం పంతులు దానధర్మాలకై వెచ్చించాడని పెద్దలు ఆయిన గురించి వ్రాశారు. ఇంతకూ కామేశం పంతులు జీవించింది నలభై సంవత్సరాలే 1840వ సంవత్సరం జన్మించాడు. శ్రీ రామకృష్ణ పరమహంస నిర్యాణం చెందిన 1886వ సంవత్సరంలోనే కామేశం పంతులు కూడా పరమపదించారు.

ఆధునిక తెలుగు దేశపు చరిత్రలో ఇటువంటి మహాను భావుడి జననం తెలుగువారి కీర్తి ప్రతిష్ఠలకు అలంకారం.

కామేశం పంతులు గతించి నూరేళ్ళు దాటినా ఆయన కీర్తి మూర్తి చిరకాలం సంస్మరణీయ మవుతూనే ఉంటుంది. కామేశం పంతులను గూర్చి కథలన్నీ కావాలిప్పుడు.

# మండపాక



మండపాక పార్వతీశ్వర కవి మహాభక్తుడు. మహాజ్ఞాని. వశ్య వాక్కు, శతాధిక గ్రంథ రచయిత. చతుర్విధ కవితా విద్యా విశారదుడు. ఒకే ప్రాసతో వందల కొద్దీ పాదాలతో పద్యాలు చెప్పిన మహానుభావుడు. తమకు నూట ఎనిమిది ఉపనిషత్తులు బోధించిన శ్రీ త్రైపదేంద్ర గురువులను గూర్చి 544 పాదాల మాలికను రచించిన మహాకవి. ఎప్పుడో అల్లసాని పెద్దన నాడు పదుల పాదాలలో ఏక ప్రాసంగా మాలికా రచనను గూర్చి మనం విన్నాం. మళ్ళీ పందొమ్మిదో శతాబ్దంలో వందల కొద్దీ పాదాల ఏకప్రాస ఘటిత మాలికా రచన మండపాక వారు సంఘటించారు. పన్నెండోఏటనే వీరు కవిత్వం చెప్పనేర్చారు. పరమపదించేవరకూ కవితా సరస్వతిని స్తుతిస్తూనే ఉన్నారు. 'మృత్యుంజయునకు నమస్కరింతు దరింతున్' అనే మకుటంతో చివరి నాలుగురోజులు మృత్యుంజయ స్తవం పఠిస్తూ చివరి రోజున వీరు దేహయాత్ర చాలించారు. ఆశుకవిత్వంలో వీరికి అసదృశమైన ప్రతిభ ఉండేది. ఆశుకవిత్వమే అయినా పద్యధార లలిత మృదులంగా ప్రసన్నంగా ఉండేది. ఒకసారి విశాఖపట్నంలో మహా మహోపాధ్యాయ పరవస్తు వెంకటరంగాచార్యుల వారు హిందూ మతాన్ని గూర్చి ఉపన్యసించగా శ్రోతలలో ఉన్న వీరు ఆ రాత్రికి రాత్రి ఆ ప్రసంగాన్నంతా ఒక్కక్షరం, ఒక్క అంశం పొల్లుపోకుండా మూడువందల పద్యాలపైన మాలికగా కూర్చారు. పద్యంలో వేరేపద్యం చొప్పించటాన్ని గర్భ కవిత్వమంటారు, అటువంటి గర్భస్థ పద్యాలు వీరెన్నో చెప్పారు. ఒకసారి ఒక వృత్తంలో 50 పద్యాలు ఇమిడేట్టు వీరు నిర్వహించడం వీరి అమేయ ప్రతిభకు తార్కాణం. వీరు ప్రకటించిన 84 గ్రంథాలలో స్తుతులు, శతకాలు, దండకాలు, క్షేత్రమాహాత్మ్యాలు ఎన్నో ఉన్నాయి.

యాత్రా చరిత్ర పేరుతో భారతదేశంలోని సమస్త ప్రసిద్ధ తీర్థ క్షేత్రాలు గురించిన వీరి గ్రంథం పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధపు భారతీయ సాంఘిక జీవనానికి దర్పణం. అతివృష్టి, అనావృష్టులను ఇష్టదేవతాస్తుతి రూపకంగా పారించిన ఘట్టాలు వీరి స్వీయ చరిత్ర హరిహరేశ్వర శతకంలో పరమాశ్చర్య ఆనంద ప్రదంగా వర్ణితం. తాము పుట్టిననాటి నుంచి జీవించిన 64 సంవత్సరాల జీవిత చరిత్ర అంతా ఈ శతకంలో పార్వతీశ్వర శాస్త్రులవారు ప్రసక్తం చేశారు. 11సం.ల వయసున శ్రీరామచంద్ర పారక జోషి అనే ఉత్కళ బ్రాహ్మణుడు ప్రశ్నచెప్పటంలో ప్రసిద్ధుడని విని ఆయన్ను చూడబోగా ఈయన మనసులో తలచుకొన్న ప్రశ్నకు ఆయన నీవు మహాకవివి అవుతావని చెప్పి వాగ్వాదినీ మహామంత్రం ఉపదేశించినట్లు హరిహరేశ్వర శతకంలో వర్ణించారు శాస్త్రిగారు. ఒంటికాలున నిల్చి ఒక లక్ష గాయత్రి జపించానని చెప్పుకున్నారు. అమృత బీజాక్షర సంయుతంగా పద్యాలు చెప్పివానలు కురిపించారు. వంగభాష, నాగరి, ద్రవిడ భాషలలో పాండిత్యం ఉంది. పందొమ్మిదో శతాబ్దిలో ఈయనతో పోల్చగల విద్వత్‌కవి మరొకరులేరు. వీరి కృతులలో సుప్రసిద్ధం రాధాకృష్ణ సంవాదం. బొబ్బిలివారి ఆస్థాన కవిగా కీర్తి పొందారు. పార్వతీశ్వర శాస్త్రిగారి తల్లి దండ్రులు జోగమ్మ, కామకవిగారలు. జననం 1833 విజయనామ సంవత్సరం, పరమపదం 1897 హేవిళంబి నామవత్సరం.



# కస్తూరి శివశంకర శాస్త్రి



ఈ శతాబ్దంలో కూడా భారతీయ సంస్కృతికి ఆత్మస్వరూపులు జీవించి ఉండేవారని తెలుసుకోవడం చాలా ఆశ్చర్యం కలిగిస్తుంది. అయినా అది యథార్థం. భారతీయ పరమార్థ 'జీవన వ్యవస్థకు' ఏయే విషయాలు ఆదర్శంగా భావించేవారో వాటిని జీవితంలో సర్వాత్మనా ఆచరించిన మహనీయులు నిన్న మొన్నటి దాకా మన కళ్ళకు కనపడేవారు. నిత్యజీవితంలో సత్యసంధత, యదృచ్ఛాలాభ సంతుష్టి, ఎటువంటి పరిస్థితులలోను సడలని భక్తిజ్ఞాన కర్మకాండలపట్ల అచంచలమైన విశ్వాసం వారి వ్యక్తిత్వానికి శోభను చేకూర్చాయి. ఈనాటి తరంవారు నమ్మడానికి కూడా వెనుకాడే ఋజువర్తనంతో వారు జీవితాలు సాగించారు. అపూర్వ పాండిత్యం, మేధాప్రతిభ కనపరిచారు. గొప్ప ఆత్మ సంయమనం, ధర్మరక్ష, సమభావం, వారిలో కనపడతాయి.

కస్తూరి శివశంకర శాస్త్రిగారు అటువంటి సత్పురుషులు. వీరిది గోదావరి జిల్లా కోనసీమ, రాజమహేంద్రవరంలో 30 సంవత్సరాలు సంస్కృతోపాధ్యాయులుగా వీరు జీవిక సాగించారు. శ్రీ శివశంకర శాస్త్రిగారు తమ తల్లిదండ్రుల గురించి ఇట్లా వ్రాశారు.

"నా తల్లియు దండ్రియు నిద్దరును లోకులచే స్తుతింప తగినట్టి సుగుణములు గల వారును, **లోకపూజ్యులును** శ్రీ మదుభయ వంశ **పావనకరులును**

వ్రతానుష్ఠానకర్మానుష్ఠాన ముం చేత దేవతలకు మిక్కిలి ప్రియంకరులును శ్రీ పంచాక్షర మంత్ర పవిత్రీ భూత స్వాంతులును, 'శివ పూజాధురంధురులును, శక్తికొలది అన్నాది దానములచేత అధికసేవా తత్పరులునై ప్రకాశించిరి''

సుమారు 50, 60 సంవత్సరాల కిందట వరకూ గోదావరి జిల్లాలో పేరుమోసిన వేద వేదాంగ విదు లుఠడే వారు. యజనయాజన అధ్యయిన అధ్యాపనాదులకు సంబంధించి మంచి సంప్రదాయం ఉండేది జపతపాల పట్ల నమ్మకమూ, వాటి ప్రత్యక్ష ఫలితాలూ ఉండేవి.

కస్తూరి శివశంకర శాస్త్రిగారు తమ మాతా మహుల వంశం గురించి వ్రాస్తూ ఆ వంశంలో కూచిమంచి పేర్రాజుగారు గొప్ప తపస్వి అని వ్రాశారు లోకంలో ఆయునకు జపాల పేర్రాజుగారనే వాడుక ఉండేదట కౌశికా తీరంలో ఒక వేపచెట్టు కింద వేప ఆకులు మాత్రమే తింటూ ఆయిన తపస్సు చేశారు కౌశికీవైనతేయు అనే రెండు గోదావరి శాఖలు శ్రీ పేర్రాజుగారికి సుందర కన్యలుగా సాక్షాత్కరించాయిని శ్రీ శివ శంకర శాస్త్రిగారు వ్రాశారు. ఇది వారికి మూడు తరాల కిందటి మాట.

శ్రీ శివశంకర శాస్త్రిగారి చరిత్రలో ఒక గొప్ప విశేషం ఉంది. శ్రీ గులాంఖాదర్ అనే పండితుడి దగ్గర సాంఖ్యం నేర్చుకున్నానని శాస్త్రిగారు స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నారు. ఆయిన సకల నిగమ రహస్యార్థము కలిగినట్టివారు అని వర్ణించారు. మరి ఆయునకు సంస్కృతం ఎవరు నేర్పారో ఆశ్చర్యం అప్పట్లో గోదావరి జిల్లాలో సూఫీ సంప్రదాయి ప్రచారం చేసే ఒక గురుపీఠం ఉండేది. ఆర్ష సంప్రదాయానికి చెందిన పండితులై ఉంటారు గులాంఖాదర్‌గారు.

కిందటి శతాబ్ది చివరి పాదంలో రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలలో సంస్కృతాధ్యాపకులుగా పనిచేశారు శ్రీ శివశంకర శాస్త్రిగారు శ్రీ శాస్త్రిగారు సంస్కృతంలో గొప్ప గ్రంథాలెన్నో రచించారు. సర్వశాస్త్ర సామరస్యం తెలిపే కౌస్తుభమనే గ్రంథం రచించారు. వజ్ర ప్రభ అనే గ్రంథంలో వేద విహిత కర్మాచరణాన్ని సమర్థించారు. భక్తి ముక్తి సుధానిధి అనే గ్రంథంలో భక్తి ప్రాశస్త్యాన్ని ప్రవచించడం జరిగింది. వీరి వేదాంత డిండిమం అనే గ్రంథంలో భారతీయ సర్వవిజ్ఞాన ఔత్కృష్ట్యం ప్రతిపాదితమైంది.

**1924**వ సంవత్సరంలో ఆంధ్ర సర్వస్వం అనే పత్రికలో శ్రీ శాస్త్రిగారు స్వచరిత్రము ప్రకటించారు. తల్లిదండ్రులు పళ్ళమాంబ, సోమరాజుగారలు.

★★★★

# పనప్పాకం అనంతాచార్యులు



భారతదేశం పరాయివారి పరిపాలనలో ఎన్నో వంచనలకు గురిఅవుతున్న తరుణంలో ఆ కాలంలో ముఖ్యంగా కిందటి శతాబ్ది ఉత్తరార్ధంలో భారతదేశం అన్ని ప్రాంతాలలోను ఎందరోమహానుభావులు జన్మించారు. అది ఒక చారిత్రక మహోజ్జ్వల అధ్యాయం. ఒళ్ళు పులకరింపచేసేఘట్టం. అన్ని రంగాలలోను, అన్నివర్గాలలోను మహోన్నతులు జన్మించారు. మాతృదేశ దాస్యవిమోచనార్థం పరిక్రమించిన ఆ మహాశయులంతా సుపర్ణ విక్రములు. దురాచార దుష్టస్వార్థ సర్పభంజనులు

1857వ సంవత్సరం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం భగ్నం కావటంతో, అప్పట్లో బుద్ధిమంతులు, మేధావులు ఆసేతుశీతాచలం జాతీయ సమైక్యాన్ని ప్రబోధించాల్సిన అవసరం గుర్తించారు. 'నమోహిందుమాతా'' అనే భావం వ్యాపింపచేయటం అన్నిటికన్నా ప్రధాన కర్తవ్యమని గ్రహించారు. 'విపుల హిమాద్రులు వేణీభరముగ గంగాయమునలు కంఠహారముగ గోదావరియే కటిసూత్రముగ, కనులకు చెలువముఘటించుమాత'ను పరదాస్యం నుంచి విముక్తం చేయాలని కృతనిశ్చయులైనారు. దేశం నాలుగుమూలల నుంచీ ఒక జాతీయ వేదికపై కూడుకుని దేశ సమస్యలను చర్చించి పరిష్కారాలు కనుక్కోవాలనుకున్నారు. అటువంటి దేశీయ మహాసభావేదికలలో తొలినాళ్ళలో జాతీయ లక్ష్యాలను ప్రతిపాదించినవారిలో అనంతచార్యులుగారు ముఖ్యులు. ఈయన మద్రాసులో న్యాయవాదిగా ఉండేవారు. ఇరవైఏళ్ళ వయస్సున మెట్రిక్యులేషన్ ప్యాసై, ప్రైవేట్‌గా బి.ఎల్. పట్టా సముపార్జించి, ఆరోజుల్లో దేశహిత కార్యతత్పరులుగా ప్రసిద్ధికెక్కారు. 1885వ సంవత్సరం బొంబాయిలో జరిగిన తొలిజాతీయ మహాసభకు ఈయన మద్రాసు నుంచి ప్రతినిధిగా వెళ్ళారు. సురేంద్రనాథ బెనర్జీ, ఇ.డి.వాచా, దాధాభాయి నౌరోజీ వంటి పెద్దలన్ను ఆకర్షించారు. 1891లో నాగపు రంలో జాతీయ మహాసభ కూడినప్పుడు ఆ మహాసభకు అధ్యక్షత వహించారు అనంతాచార్య

లవారు. ఆయన అధ్యక్షోపన్యాసాన్ని దేశంలోని విజ్ఞులు, మేధావులు భారతీయ పత్రికాధిప తులు ఎంతో మెచ్చుకున్నారు. 1895వ సంవత్సరం నుంచి 8 సం.లు ఆనాటి గవర్నర్ జనరల్ పరిపాలన సలహామండలి (ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్)లో అనంతాచార్యులుగారు సభ్యులుగా వుండి ప్రభుత్వం చేసేపనులను ఒక కంటకనిపెడుతూ ఉండేవారు. భారతదేశ ప్రభుత్వ వ్యవహారాలను పర్యవేక్షించే లండన్‌లోని ఇండియా కౌన్సిలు వొర్థిదండగ మారి సంస్థ అని విమర్శించారు అనంతాచార్యులవారు. భారతదేశాన్ని పీక్కుని తినటంకన్నా అది చేసేపని లేదన్నారు. పనికిరాని పెద్ద ఉద్యోగులకు అది ఆశ్రయ స్థలమని నిరసించారు.

ఉన్నత న్యాయసభలో వృత్తిగౌరవాన్ని ఆత్మవిశ్వాసాన్ని ఆయన ఏనాడూ కించపరచుకో లేదు. ఆయన గొప్ప విద్వాంసుడు. మహాభారతాన్ని గూర్చి ఇంగ్లీషులో ఒక గ్రంథం వ్రాశారు. వంగదేశంలోని నవద్వీపపండిత పరిషత్తు అనంతాచార్యుల వారిని మెచ్చి 'విద్యావి నోది' అనే బిరుదం ఆయన కిచ్చింది. బహుజనపల్లి సీతారామాచార్యులు, ఆదిభట్ల నారాయణదాసు, కొక్కొండ వేంకటరత్నం, వావిలికొలను సుబ్బారావు, వేటూరి ప్రభాకర శాస్త్రి వంటి కవి పండితులను ఆయన ఎంతో ఆదరించారు. తెలుగులో వైజయంతి అనే పత్రికను కొన్నాళ్ళు నడిపారు ఆచార్యులవారు. తెలుగులో గ్రంథరచన చేశారు. తొలి సంవత్సరాల జాతీయ మహాసభకు కార్యదర్శిగా, కార్యనిర్వాహక సభ్యులుగా పనిచేశారు. జాతీయ మహాసభకు అధ్యక్షత వహించిన మొట్టమొదటి దాక్షిణాత్యుడు, తెలుగువాడూ ఆచార్యులవారు సంగీత సాహిత్య విద్వద్గోష్ఠులంటే ఈయనకు ప్రాణం. తండ్రి తన 12 సం. లప్పుడే మరణించినా స్వయం కృషితో గొప్పవాడై నాడు ఆచార్యులవారు. తండ్రి శ్రీనివాసాచార్యులు. స్వస్థలం చిత్తూరు సమీపంలో కట్టమంచి. జననం 1843–1908 పరమపదం.

# వీరేశలింగం



తాను ఏ సంఘానికి ప్రాతినిధ్యం వహించి ఉన్నాడో ఆ సంఘంలో సంస్కారం, సమానత్వం, సౌహార్దం పెంపొందాలని కృషిచేశాడు వీరేశలింగం. ఈ మహత్కార్యంలో ఎన్ని ఆటంకాలు ఎదురైనా జంకలేదు. ఉద్యోగుల్లో లంచగొండి తనం, సంఘంలో వేశ్యల ప్రాబల్యం, నిర్బంధ వైధవ్యం అతిబాల్య వివాహాలు, వృద్ధ వివాహాలు అతి మామూలు విషయాలు ఆరోజుల్లో. సంఘంలో సగభాగమైన మహిళకు ఎటువంటి విద్యా సంస్కారం ఉండేదికాదు. శైశవంలోనే వైధవ్యం సంభవించినా జీవితాంతం అగ్రవర్ణాల అతివ ఎటువంటి మనోవికాసానికి నోచుకోకుండా బానిసజీవితం గడపాల్సి వచ్చేది. వీధి వీధికి భూత వైద్యులు, మంత్రతంత్రాలపట్ల నమ్మకం. సాంఘిక జీవనాన్ని కలుషితం చేస్తున్న రోజులవి.

వీరేశలింగం 1848 ఏప్రిల్ 16వ తేదీన జన్మించాడు. అప్పటికి తెలుగు సాహిత్యంలో వైవిధ్యంలేదు. నూతన ప్రక్రియలు ఏవీలేవు. లౌకిక సాహిత్యం లేనేలేదు. ఎనిమిది తొమ్మిది వందల సంవత్సరాలుగా వస్తున్న సాహిత్య ధోరణులే ప్రచురంగా ఉన్నాయి. చెలామణి అవుతున్నాయి.

ఒకవైపున సాహిత్యంలో కొత్తకొత్తదారులు నిర్మించాడు. మరొక వైపున సంఘంలోని దురాచారాలన్నిటితో పోరాడాడు. బాల్యవివాహం, వృద్ధవివాహాల నిర్మూలనానికి సాహిత్య ప్రబోధ రూపంగాను ఆచరణాత్మకంగాను కృషిచేశాడు. స్వయంగా పూనుకొని వితంతు వివాహాలు జరిపించాడు. కంఠాభరణాలు కూడా.

తెలుగులో ఆయన పూనుకున్న దాకా నవలా రచనలేదు. రాజశేఖర చరిత్రం, సత్యరాజా పూర్వ దేశయాత్రలు, సత్యవతీ చరిత్రం వంటి మంచి నవలలు రచించి అటుతర్వాత నవలా రచనలో మార్గదర్శకుడైనాడు. మొత్తం చిన్నవీ పెద్దవీ కలిపి నూటముప్పై పైగా గ్రంథాలు రచించాడు. అధిక్షేపక రచనలుచేసి, ప్రహసనాలు రచించీ తెలుగువారి కళ్ళు తెరిపించాడు. పుక్కిటి పురాణాలతో, చారిత్రకాధార సమన్వయం లేకుండా పారంపర్యంగా లోకంలో

నిలిచివున్న కవుల చరిత్రలను సేకరించి విమర్శించి సమన్వయించి శాసనాలు కావ్యాలు స్థానిక చరిత్రలు అధ్యయనం చేసి కవుల చరిత్ర రచించాడు వీరేశలింగం

కవి, నవలా రచయిత, నాటక రచయిత, చరిత్ర పరిశోధకుడు, సాహిత్య విమర్శకుడు, అముద్రిత గ్రంథ ప్రకాశకుడు, పత్రికా నిర్వాహకుడు, సంస్థా నిర్మాతగా తెలుగుదేశానికి ఎన్నోరంగాలలో సేవ చేసిన మహనీయుడు వీరేశలింగం

''తన గేహము తన దేహము తన కాలము తన ధనమ్ము తన విద్య జగజ్జనులకు వినియోగించిన ఘనుడీ వీరేశలింగం'' అని తెలుగువారు ఆయన సమాధిపై భక్తిప్రపత్తులతో లిఖించిన మాట అక్షరసత్యం **1919** మే **27**న ఆయన కాలధర్మం చెందారు. తల్లిదండ్రులు పున్నమ్మ, సుబ్బారాయుడు

అర్ధశతాబ్ది కాలం తన బోధనలతో ఆంధ్రదేశాన్ని ప్రభావితం చేశాడు వీరేశలింగం.

★★★★

# వేదం వెంకటరాయశాస్త్రి



విమతులకుపులి, విశ్వాస భాజనులకు చెలి, అన్నారొక పండితులు వేదం వారి సాహితీ మూర్తి మత్వాన్ని ఆవిష్కరిస్తూ.

వేదంవారు వ్యక్తిమాత్రులు కారు. ఒక ఆచార్యపీఠం. సంస్కృతం, ఇంగ్లీషు, తెలుగుభాషల్లో వారిపాండిత్యం అపారమైనది. బహుముఖమైనది. సంస్కృతభాషలోని మహాకావ్యాలకు నిస్తులమైన వ్యాఖ్యానాలు రచించి అజరామరమైన కీర్తినార్జించిన మహా విద్వాంసులొకరున్నారు. ఆయన పేరు కోలాచలమల్లి నాథసూరి. సంస్కృతానికి మల్లినాథసూరి ఎటువంటి వారో తెలుగు సాహిత్యానికి వేదం వెంకట్రాయ శాస్త్రి అటువంటివారు. వేదంవారు శ్రీ కృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యద మహాకావ్యానికీ శ్రీనాథకవి సార్వభౌముని శృంగార నైషధానికి అవితర సాధ్యమైన గొప్ప వ్యాఖ్యానాలు రచించారు. తెలుగువారికవి పెన్నిధులు.

శాస్త్రిగారు ప్రతాపరుద్రీయం నాటకరచన తెలుగుసాహిత్యంలో ఒక నూతనాధ్యాయానికి శ్రీకారం. అటువంటి నాటకం నభూతో నభవిష్యతి అనిచెప్పాలి. ప్రపంచ నాటక సాహిత్యంలోని ఉత్తమ ప్రమాణాల చేరువకు చేరగలిగిన నాటకం ప్రతాపరుద్రీయం. మూడందాల ఇది అపూర్వ సృష్టి, భాషా విషయికంగా, ఇతివృత్త స్వీకరణ విషయికంగా, నిర్వహణ విషయికంగా నావ్యతో దర్శనీయమైన ప్రతిభను కనపరిచారు శాస్త్రులవారు. పాత్రోచితభాష అనే నవ్యసాహిత్యశిల్పానికి మార్గదర్శకులు వేదంవారే. ఇందువల్ల నాట్యరచనలో గొప్పసజీవ వాస్తవిక శిల్పాన్ని సాధించారు. ప్రతాప రుద్రీయంలోని పాత్రలు పేరిగాడు, యుగంధరుడు, చెకుముకి శాస్త్రి వంటివి తెలుగు వారికి నుడికారాలైనాయి. శాస్త్రిగారి రచనలు తెలుగువాణికి అనర్ఘ భూషలైనాయి.

సంస్కృతం నేర్చుకోవాలను కొన్నవారు స్వయంగా సాధించడానికి అనువుగా వేదంవారు కుమారసంభవం, రఘువంశం, మేఘసందేశాలకు టీకా తాత్పర్యాలు కూర్చారు.

శాస్త్రిగారి తల్లిదండ్రులు లక్ష్మమ్మ, వేంకటరమణశాస్త్రి. వేదంవారి జననం 1851, పరమపదం 1929.

# కొవ్వూరి బసివిరెడ్డి



''దేశ దేశాల్ క్రమ్మవలెనోయ్, దేశిసరుకుల నమ్మవలెనోయ్'' అన్నాడు గురజాడ అప్పారావు. దేశం సుభిక్షంగా ఉండి త్వరితంగా అభివృద్ధి చెందాలంటే దేశంలో వస్తూత్పత్తి పెరగాలి. ఇతర దేశాలకు ఎగుమతులు విస్తరించాలి. దేశీయ పరిశ్రమలు వృత్తులు మూడుపూవులు ఆరుకాయిలుగా వర్ధిల్లాలి. ఉత్పాదకత పెరగకపోతే దేశం సుసంపన్నం కాదు. స్వదేశి, స్వభాష, స్వజాతి, స్వతంత్రం ఆధునిక భారతదేశానికి నాలుగు వేదాలని ఆనాటి మేధావులు భావించారు. భారత స్వాతంత్రోద్యమంలో స్వదేశీ ఉత్పత్తులనే వినియోగించుకోవాలి అనే ప్రబోధం చాలా ప్రధానస్థానం పొందింది. తద్వారాగాని విదేశీయులను శక్తిహీనులుగా చేసి వెళ్ళగొట్టలేమని ఆనాటి నాయకులు భావించి ప్రబోధించారు. బాలగంగాధర్ తిలక్, గోఖలే, వీరసావర్కార్, అటుతర్వాత గాంధీజీ స్వదేశీ వ్రతానికి చాలా ప్రాముఖ్యం కలిగించారు స్వాతంత్రోద్యమంలో. ప్రథమ స్వాతంత్ర్య సమరం విఫలమైన నాటి నుంచి భారతదేశ సంపదను ఆంగ్లేయులు మరింత కొల్లగొట్టడం సాగించారు. మహారాష్ట్రలోను, వంగభూమిలోనూ స్వదేశీ ఉద్యమం కిందటి శతాబ్ది చివరిపాదంలోనే మొదలైంది. అరవిందఘోష్ మాతామహుడు రాజనారాయణబోస్ వంగదేశంలో ''మిత్రమేళ''ను స్థాపించి ప్రతి సంవత్సరమూ స్వదేశీ వస్తుప్రదర్శనను నిర్వహించేవారు. 1875 నాటికే వీరేశలింగం నడుపుతున్న వివేకవర్ధని పత్రికలో మహారాష్ట్రంలో స్వదేశీ ఉత్పత్తులను మాత్రమే నిత్యజీవితావసరాలకు వాడుకోవాలన్న ఉద్యమం బలం పుంజుకున్న వైనం వార్తావ్యాఖ్యగా ప్రచురితం.

కొవ్వూరి బసివిరెడ్డి పేదరైతుగా జీవితం ప్రారంభించి వర్తక ప్రభువుగా మహదైశ్వర్యం సంపాదించాడు. భోగభాగ్యాలతో విలాస జీవనంతో ఆ ఐశ్వర్యాన్ని వృథా చెయ్యకుండా అన్నదానంలో తనంతవాడు లేడని కీర్తిగాంచాడు. సత్రాలు కట్టాకలు తాను పెట్టుబడి పెట్టి, వ్యాపారం చెయ్యవలసిందని ఎందరినో ప్రోత్సహించాడు. దేశ దేశాలలో కొవ్వూరి బసివిరెడ్డి అన్నదానఖ్యాతికి మెచ్చి ఆనాటి విక్టోరియా మహారాణి 1897వ సంవత్సరంలో

ఆయనకొక ప్రశంసా పత్రం ప్రసాదించింది. మారిషస్, కొలంబో, బర్మాలతో ఈయన ధాన్యమూ, బెల్లమూ వ్యాపారం చేశారు. భారతదేశంలో ప్రధాన నగరాలలో కమిషన్ వర్తకులను నియమించి భారీవ్యాపారం నిర్వహించారు. నిప్పచ్చరపు పేదకుటుంబంలో పుట్టిన బసివిరెడ్డి అక్కగారి వద్ద ఎనభై రూపాయిలు అప్పుపుచ్చుకొని ధాన్యం వ్యాపారం ఆరంభించి, ఆ తర్వాత ఉప్పు వ్యాపారం చేసి కోట్లకు పడగలెత్తాడు.

ఒకసారి అమెరికా వర్తకుడొకడు బసివిరెడ్డి తాలూకు సరియైన చిరునామా తెలియక, కొవ్వూరి బసివిరెడ్డి, మర్చెంట్, ఇండియా అని జాబు వ్రాస్తే ఆ ఉత్తరం కాకినాడ వెతుక్కుంటూ వచ్చి బసివిరెడ్డికి చేరింది. వర్తక సార్వభౌముడు బసివిరెడ్డి. నిడదవోలులో ఈయన బియ్యపుమిల్లు స్థాపించాడు ఈ మిల్లుకు ధాన్యం తెచ్చి పడవలు నిడదవోలు కాలువలో ఒక మైలు పొడవున ఎప్పుడూ వేచివుండేవి పేదలపట్ల కరుణ, వికలాంగులపట్ల దయ బసివిరెడ్డి వ్యక్తిత్వాన్ని దైవీయం చేశాయి. ఆయన దానధర్మాలు నిరాడంబరంగా జరిగిపోయేవి. ఎన్.జి.రంగా మహాశయుడు కొవ్వూరి బసివిరెడ్డిని అమెరికాలోని **వణిక్** ప్రముఖుడైన ఫోర్డ్‌తో పోల్చారు. ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల సంస్థాపకుడైన చంద్రారెడ్డికి ఈ కీర్తి కొవ్వూరి బసివిరెడ్డి వల్లనే లభించింది. బసివిరెడ్డి 1852లో జన్మించి 1915లో కీర్తిశేషుడైనాడు. తల్లిఅచ్చమ్మ, తండ్రి రామిరెడ్డి సముద్రాన్ని పండించిన సాహసి బసివిరెడ్డి



# ధర్మవరం కృష్ణమాచార్యులు



'ఆంధ్రనాటక పితామహుడు' అనే యశస్సు పొందిన విద్వత్కవులు, ప్రఖ్యాత నాటక రచయిత శ్రీ ఆచార్యులవారు, ఆంధ్రనాటక చరిత్రలోనే ఒక వినూత్న పరిణామాన్ని సాధించారు. విషాదాంత నాటకాన్ని తెలుగులో మొదట కూర్చినవారు ఆచార్యులవారే

చిన్నప్పటి నుంచీ ఆయన కుశాగ్ర బుద్ధి. మూడు నెలల్లోనే రఘువంశం సాధించారు. ఏడాది చదివి చంపూ రామాయణం, ప్రతాప రుద్రీయం వంటి ప్రౌఢ గ్రంథాలు పూర్తిచేశారు. ఇరవై ఏళ్ళ వయసుకల్లా ఎఫ్.ఏ. పరీక్ష పూర్తిచేశారు. ఆ తర్వాత సెకండ్ గ్రేడ్ ప్లీడర్ పరీక్షలో ఉత్తీర్ణులైనారు. బళ్ళారిలో న్యాయవాద వృత్తి ప్రారంభించారు.

కృష్ణమాచార్యుల వారికి ఆబాల్యం సాహిత్యాభిలాష ఉండేది. ముప్పై సంవత్సరాల వయస్సుననే చిత్రనలీయం వంటి ప్రశస్త నాటకం రచించారు. **1886**వ సంవత్సరంలో బళ్ళారిలో 'సరసవినోదిని' అనే నాటక సంస్థను నెలకొల్పి నాటక రచనను, ప్రదర్శనలను ఎంతగానో ప్రోత్సహించారు. కృష్ణమాచార్యులవారు కన్నడంలో కూడా నాటకాలు రచించడం, ప్రదర్శింప చేయడం విశేషం. ఆంధ్రదేశ మంతటా గొప్ప నటుడిగా ప్రఖ్యాతి పొందిన బళ్ళారి రాఘవాచార్యులుగారు వీరి మేనల్లుడే

ఆచార్యులవారు నాటక రచయితలే కాదు. గొప్ప నటులు కూడాను. అంతేకాదు తమ నాటక ప్రదర్శనలకు వారే దర్శకత్వం వహించేవారు. నటులందరికీ సరియైన తర్ఫీదు నిచ్చేవారు. ధర్మవరంవారి పాదుకా పట్టాభిషేక నాటకం చాలా ప్రసిద్ధికెక్కింది. ఈ నాటకం ప్రదర్శించే ముందు పంచి పెట్టే కరపత్రాలలో ఈనాటకం చూసి కంటతడి పెట్టని ప్రేక్షకుడు ఉండటానికి వీల్లేదు అనే భావం ఒక సవాలుగా

ప్రకటించేవారుట. ఒకసారి మద్రాసులో కొందరు పెద్దలు ఈ ప్రకటన యాథార్థ్యం పరీక్షించే పట్టుదలతో నాటకం చూడగా రామలక్ష్మణులు అడవికి వెళ్ళే ఘట్టంలో అతి ప్రయత్నం మీద తమ మనస్సు నిగ్రహించుకోగలిగినా దశరథుడి మరణ సన్నివేశంలో ఆ పాత్రధారి అయిన ఆచార్యులవారి అభినయంతో కన్నీరాపుకోలేక పోయారని ఆచార్యులవారి చరిత్ర వ్రాసినవారు ప్రసక్తం చేశారు.

పాదుకాపట్టాభిషేక నాటకంలో శ్రీ ఆచార్యులవారే స్వయంగా దశరథపాత్ర ధరించేవారు. తెలుగులో వీరు రచించిన నాటకాలు **28**. ఇవికాక కన్నడం లో **2**, ఇంగ్లీషులో ఒకటి మొత్తం **31** నాటకాలు రచించారు ఆచార్యులవారు. అయితే వీరు రచించిన తెలుగునాటకాలలో సగం మాత్రమే ముద్రితమైనాయి ఆనాడు మద్రాసు రాజధాని కళాశాలలో సుప్రసిద్ధ సంస్కృత పండితులు **గస్టవ్** ఆపర్ట్ దొర వీరి నాటక ప్రదర్శనకు ఎంతో సంతోషించి రత్నాలుంచిన బంగారు పతకం బహూకరించారు ఆచార్యులవారికి నాటకాలలో పాటలు, పద్యాలు ఎక్కువగా ప్రవేశపెట్టే సంప్రదాయం ధర్మవరంవారితోనే మొదలైంది సంస్కృత, ఇంగ్లీషు, పార్శీ నాటకాల పద్ధతులను సమన్వయం చేశారు శ్రీ ఆచార్యులవారు **చిత్రనళీయం** నాటకంలో తమ ప్రజాస్వామిక భావాలకు ఆలంబనం కలిగించారు ఆచార్యులవారు. నల చక్రవర్తిని మాయజూదంలో అన్యాయం చేసిన పుష్కరుణ్ణి **ప్రజలు** తిరుగుబాటు చేసి అధికార **పదచ్యుతుణ్ణిచేసి** నలుడికి మళ్ళీ రాజ్యం కట్టబెట్టినట్లు కల్పన చేశారు ఆచార్యులవారు

విషాద సారంగధర నాటకంలో వీరి న్యాయవాద పాండిత్యం ప్రతిఫలింప జేశారు కర్నూలు జిల్లా ఆలూరులో కోర్టుపని ముగించుకొని తిరిగివస్తూ ఆకోర్టు భవనపు మెట్లపై కాలు జారిపడి 'రామచంద్రా' అంటూ ప్రాణాలు వదిలారు ఆచార్యులవారు.

జననం 1853, నిర్యాణం 1912. తల్లిదండ్రులు శ్రీమతి లక్ష్మీదేవమ్మ, కృష్ణమాచార్యులు స్వస్థలం అనంతపురం జిల్లా ధర్మవరం.



# బసవరాజు గవర్రాజు



ఇంగ్లీషు వాళ్ళు భారతదేశానికి వ్యాపారస్థులుగా వచ్చి దోచుకోవడం, అటు తర్వాత పరిపాలకులుగా స్థిర పడటం ఆధునిక శతాబ్దాల చరిత్ర. ఇంగ్లీషువారి రాక వల్ల చాలా అపకారాలే జరిగినా దేశానికి కొన్ని మేళ్ళుకూడా జరగక పోలేదు. ఇంగ్లీషు విద్య విస్తరించి దేశదేశాల సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ పరిణామాల్ని భారతీయులు తెలుసుకో గలగటం తమ సాంఘిక లోపాలను చక్కబరచుకోవాలన్న ఆర్తివారికి కలగటం జరిగింది. అదేవిధంగా పారిశ్రామికంగా కొంత అభ్యుదయం సాధించింది.

దేశంలో విశ్వవిద్యాలయాల స్థాపనం జరిగి మధ్య తరగతి కుటుంబాల వారికి ఇంగ్లీషు ఉపాధి కల్పిస్తుందన్న విశ్వాసం క్రమంగా బలపడింది. అదివరకులాగా కాకుండా వ్యవస్థీకృతమైన పరిపాలన, ఉన్నత విద్యా సంస్థలు, ప్రయాణ సౌకర్యాలు, రక్షణ యంత్రాంగం, ప్రయాణ సౌకర్యాలు వారు చవిచూచారు.

పందొమ్మిదో శతాబ్దం ఉత్తరార్థం వచ్చేసరికి దేశ భాషల్లో కూడా పత్రికా ప్రచారం ప్రారంభమైంది. ఇందువల్ల దేశీయులలో సామాజిక సమస్యలు చర్చించుకోవాలన్న అభిలాష కలిగింది. చక్కదిద్దుకోవాలన్న బాధ్యతా దృష్టి కలిగింది. చర్చాసంఘాలు, పుర మందిరాలు, బహిరంగసభలు, సంస్థాగతమైన కృషి పట్ల, విద్యాధికులలో ఆసక్తి జనించింది. సంఘంలో వేళ్ళు పాతుకొని ఉన్న అసమానతలు, అన్యాయాలు, అక్రమ ప్రవర్తనలు ఏ విధంగా తొలగించుకోవాలి అన్న ఆర్తి కలిగింది.

ఆంధ్రదేశంలో ఈ సామాజిక పరిణామ మార్గదర్శకుడు శ్రీ బసవరాజు గవర్రాజు. ఈయన జీవించింది 32 సంవత్సరాలే అయినా రాజమహేంద్రవరం కేంద్రంగా ఆనాడు బయలుదేరిన నవీన భావ సంచలనానికి బీజావాపం చేసిన వారు శ్రీ గవర్రాజు గారు. స్వయంకృషి, స్వావలంబనం, సాంఘిక బాధ్యత, కఠోర నైతిక జీవన పరత, చిత్తశుద్ధి, నిస్స్వార్థ సమాజసేవ, ఋజు ప్రవర్తనలు ఆయన వ్యక్తిత్వాన్ని దిద్ది తీర్చాయి.

రాజమండ్రి కళాశాలలో చదువుకుంటున్న రోజులలో విద్యార్థులలో ఒక సమాజం స్థాపించి సాంఘిక వికాస కార్యకలాపాలు ఈయన నిర్వహించారు. కందుకూరి వీరేశలింగం పంతులుగారికి ఈయన బాసటగా ఉండి కొన్ని విషయాలలో ఆయినకు మార్గ దర్శకుడు కూడా అయినాడు. వీరేశలింగం చేసిన మంచి పనులకు గవర్రాజుగారు ప్రేరకుడూ, కారకుడూ కూడా అయినాడు. ఆ రోజుల్లోనే బి.ఎ. తర్వాత ఫస్ట్‌గ్రేడ్ ప్లీడరీ ముందు ఉపాధ్యాయవృత్తి తర్వాత న్యాయవాద వృత్తి నిర్వహించి సమాజ వికాసానికి తన వంతు కర్తవ్యం నిర్వర్తించారు. న్యాయవాద వృత్తిలో ఉండి కూడా ఏనాడూ అసత్యానికి లోను కాలేదు. తమ తోడల్లుడికీ, వీరేశలింగంగారికి న్యాయస్థానాలలో ఘోరమైన వివాదం సంభవించినా న్యాయమని నమ్మి వీరేశలింగం తోనే ఉండి పోయినారు గవర్రాజు గారు. ఎన్ని కష్టాలు వచ్చినా సత్యం తప్పనివాడనీ, గర్వశూన్యుడనీ, రత్నం వంటి వాడనీ, దేవతుల్యుడనీ సమకాలీకులుచే కీర్తించ బడ్డాడు. ఈయన ఋజు మార్గం తప్పి ప్రవర్తించిన సన్నివేశం ఒకటి కూడా తన దృష్టికి రాలేదని ఆ రోజుల్లో రాజమండ్రి కాలేజి ప్రిన్సిపాల్ ఇ.పి. మెట్కాఫ్ గవర్రాజు గారిని శ్లాఘించారు. బసవరాజు గవర్రాజు గారి జననం 1855. ఆయిన స్వర్గతి 1888. జన్మించిన గ్రామం కలవర్రు. తండ్రి వీరన్న గారు.





# న్యాపతి సుబ్బారావు

ఒక జీవిత కాలంలో గొప్ప పేరు, ప్రఖ్యాతులు సంపాదించవచ్చు. సంపన్నమైన జీవితం గడపవచ్చు. సుఖంగా గౌరవంగా కాలం వెళ్ళబుచ్చ వచ్చు, కాని తన చుట్టూవున్న సంఘానికి, దేశానికి మేలుచేయాలన్న కోర్కె ఏ కొద్ది మంది సత్పురుషులకో మాత్రమే కలుగుతుంది. ఈ దేశం నాది, ఈ సంఘాన్ని చక్కదిద్దుకోవాల్సిన బాధ్యత నాకున్నది. నా సంప్రదాయం, నా సంస్కృతి, నా సాంఘిక జీవనంలోని మంచి చెడ్డలను నాదేశీయులకు బోధించాల్సిన అగత్యం ఎంతైనా ఉన్నది అనే ఆర్తిని ప్రకటించి అందుకోసం కృషిచేసినవారు మహనీయులనిపించుకొంటారు.

తెలుగుదేశంలో ప్రజాసేవ పరాయణతను వ్యవస్థీకృతంగా ప్రారంభించినతొలి తరంలో న్యాపతి సుబ్బారావు పంతులు ప్రముఖులు. రాజమహేంద్ర వరంలో ప్రముఖ న్యాయవాదిగా ఉంటూనే తెలుగుదేశపు సామాజిక జీవనంలో వికాసకృషికై సంస్థలు నిర్మించారు. అఖిల భారతీయ రాజకీయ కృషిలో భాగస్వామ్యం వహించారు.

అఖిల భారత దేశీయ మహాసభకు తెలుగుదేశం నుంచి ప్రాతినిధ్యం వహించిన తొలితరం వారిలో సుబ్బారావు పంతులుగారు అగ్రగణ్యులు. అటు తర్వాత అఖిల భారత జాతీయ కాంగ్రెస్‌కు సుబ్బారావు పంతులు నాలుగు సంవత్సరాలు కార్యదర్శిగా పనిచేసి భారతదేశ మంతా పర్యటించారు. మితవాదులకు అతివాదులకు పొత్తుకలపాలని సుబ్బారావు పంతులు ఎంతగానో ప్రయత్నించారు.

మద్రాసులో 'లా' కళాశాలలో చదువుకుంటున్న రోజులలోనే ఇతర మిత్రులతో కలిసి సుబ్బారావు పంతులు హిందూ పత్రిక స్థాపకులలో ఒకరైనారు. భారతదేశ జాతీయోద్య మంలో తదాదిగా హిందూ పత్రిక తనపాత్రను చక్కగా నిర్వహించింది.

భారత జాతీయ కాంగ్రెస్ గౌరవనీయులైన వృద్ధతరం నాయకులలో ఆయన ఒకరు. ఒకసారి రాజమహేంద్ర వరంలో గాంధీజీ తెలుగుదేశంపర్యటన సందర్భంగా ఒక గొప్పసభ జరిగింది. ఆ సభలో గాంధీజీ తనకు తెలుగువాళ్ళు బహూకరించిన విలువైన వస్తువులను వేలంవేశారు. ఉద్యమానికి కావలసిన ద్రవం సేకరించడానికి ఆయన ఈ విధంగా తనకు

బహూకరించిన వస్తువులను పాటపెట్టి సొమ్ముచేసుకొనేవారు. ఈ సభలో సుబ్బారావు పంతులు ఒక ఖద్దరు శాలువను కొనగా ఆయనపట్ల తన గౌరవానికి చిహ్నంగా గాంధీజీ సుబ్బారావు పంతులికి ఆశాలువ స్వయంగా తానే కప్పి సత్కరించారు. **1895**వ సంవత్సరం మద్రాసులో జరిగిన అఖిల భారత జాతీయ సభకు స్వాగతసన్నాహ కాధ్యక్షుడు సుబ్బారావు పంతులు. ప్రపంచమత మహాసభలో హిందూ మత ప్రాశస్త్యాన్ని ఉగ్గడించి వచ్చిన పరివ్రాజక చక్రవర్తి వివేకానందస్వామికి మద్రాసులో తొలి పుష్పమాల సమర్పించిన ప్రముఖుడు సుబ్బారావు పంతులు.

తెలుగుసాహిత్య వికాసానికి న్యాపతి వారి సేవమరుపు రానిది. చింతామణి అనే సాహిత్య మాసపత్రిక స్థాపించి తెలుగులో నవల పోటీలు ప్రారంభించింది వారే. ఆధునిక భారత స్వాతంత్రోద్యమంలో అత్యంత ప్రాముఖ్యమున్న **1857**వ సం. పంతులుగారి జననం, **1941** పరమ పదం



# జయంతి రామయ్య పంతులు



ఈ శతాబ్ది ప్రథమ శకం ముగిసిపోతున్నవేళ అంటే 1910వ సంవత్సరం ప్రాంతంలో ఆధునిక తెలుగుసాహిత్య చరిత్రలో గొప్ప ఉద్యమం ఒకటి బయలుదేరింది. అదే గ్రాంథిక - వ్యావహారికశైలీ వివాదం. తెలుగుదేశంలోని సాహిత్య వేత్తలు, పండితులు, భాషా విజ్ఞానులు రెండు వర్గాలుగా, శిబిరాలుగా మోహరించారు. ఒకదానికి జయంతి రామయ్యపంతులు సంధానకర్త, నాయకుడు. రెండోదానికి గిడుగు రామ్మూర్తి పంతులు నాయకుడు.

ఈ గ్రాంథిక వ్యావహారిక భాషాస్పర్థామూలకమైన ఉద్యమం ఆధునిక తెలుగుసాహిత్యానికి ఎంతో మేలుచేసిందనే చెప్పాలి. బహుశః ఆ పది పదిహేనేళ్ళలో జరిగినంత తెలుగు భాషాతత్త్వ విషయిక చర్చ ఈ శతాబ్దిలో ఇంతవరకు మరెప్పుడూ జరగలేదు. నాటి సుప్రసిద్ధ ఆంధ్రభాషా వేత్తలందరూ ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. ఆంధ్రసాహిత్య పరిషత్తు వంటి మహా సంస్థ ఉద్భవానికి కారకులైనారు జయంతి రామయ్య పంతులుగారు. తెలుగుదేశంలోని ప్రాచీన సాహిత్యమంతా సేకరించడానికి ప్రేరకులైనారు. శాసనాలన్నిటినీ సంగ్రహించి అర్థవివరణ తాత్పర్యాలతో ప్రకటించటానికి పూనుకోవడానికి దోహదం చేసినవారైనారు. యుద్ధమల్లుడి విజయశిలా శాసనం తొలిసారి చదివి విడమరచి చెప్పిన ఘనకీర్తి రామయ్య పంతులుగారిదే. రామయ్య పంతులుగారు గొప్ప సంస్థానిర్మాత. సూర్యరాయాంధ్ర నిఘంటువు ఆయన బహుముఖ ప్రజ్ఞకు తార్కాణం. ఆ మహా నిఘంటువుకూ ఆయనకూ అవినాభావ సంబంధం తెలుగు సాహిత్యంతోపాటు కలకాలం నిలుస్తుంది. ఆరోజుల్లో పిఠాపురం, వెంకటగిరి, ఉయ్యూరు, బొబ్బిలి, మునగాల, కాళహస్తి వంటి సంస్థానధిపతులందరి తోడ్పాటుతో, ఆంధ్రసాహిత్య పరిషత్తును స్థాపించి గ్రాంథికాంధ్ర సంరక్షణకు, కావ్యభాష సమర్థనకు, సంప్రదాయ సాహిత్య వికాసానికి రామయ్య పంతులుగారు అది తమ జీవితాశయంగా గట్టిదీక్షతో కృషిచేశారు

''గ్రాంథికాంధ్రీ భవనమునకు నాలుగే యాధార స్తంభములు, ఆంధ్రసాహిత్య పరిషత్తు, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు. పీఠికాపురాధీశ్వరులు, జయంతి రామయ్యపంతులు'' అన్నారు శ్రీ మధునా పంతులవారు తన ఆంధ్రరచయితలు అనే గ్రంథంలో. ఇది ముమ్మాటికి

యథార్థం. అయితే తక్కిన మూడుస్తంభాలకూ కూడా ఆధారమైన స్తంభం జయంతి రామయ్య.

సుమారు 1200 వరకు ప్రాచీనాంధ్రశాసనాలు పరిష్కరించి వ్యాఖ్యానించి ప్రకటించిన యశస్సు రామయ్య పంతులుగారిది. ఆయిన తెలుగువారి చరిత్రకు, శాసనవిజ్ఞాన కృషికి చేసిన సేవ చిరస్మరణీయం, నిరుపమానం. గిడుగువారి వ్యావహారిక భాషోద్యమ సిద్ధాంతానికి సమాధానంగా 'ఆధునికాంధ్ర వాఙ్మయవికాసమైఖరి' అనే గ్రంథం రచించారు రామయ్యపంతులుగారు. గిడుగువారి 'ఆధునికాంధ్ర స్వరూప స్వభావ ఆవిష్కరణం' (మెమొరాండం ఆన్ మాడరన్ తెలుగు) అనే విజ్ఞప్తిపూర్వకతత్త్వ నిరూపక గ్రంథానికి 'కావ్యభాషా సమర్థనం' (ఎ డిఫెన్స్ ఆఫ్ లిటరరీ తెలుగు) ప్రకటించారు జయింతివారు. భవభూతి విరచిత ఉత్తర రామచరిత్రను ఆంధ్రీకరించారు. ముక్తీశ్వర శతకం రచించారు. అమరుక శతకాన్ని సరసంగా తెలుగుచేశారు. చరిత్ర, వాఙ్మయం, భాషాతత్త్వం, శాసన పరిశోధనలను గూర్చి పదులకొద్దీ రచనలు ప్రచురించారు రామయ్య పంతులుగారు. ఆయన ఏకసంధాగ్రాహి. 1881వ సంవత్సరంలో బ్రహ్మసమాజతత్త్వ ప్రచారాగ్రగణ్యుడైన పండిత శివనాధశాస్త్రి రాజమండ్రి వచ్చి ఉపన్యసించగా ఆయిన ఇంగ్లీషు ఉపన్యాసాలను తు.చ. తప్పకుండా ఒక్కపొల్లు బోకుండా వ్రాసి పత్రికలకు పంపగలిగిన ధీశాలి రామయ్యపంతులు. శివనాధశాస్త్రి కూడా ఆశ్చర్యపోయే విధంగా 20 ఏళ్ళ రామయ్యపంతులు ఆ పనిని సాధించగలిగాడుట.

పీఠికాపుర మహారాజు రావుసూర్యారావు బహదూర్‌గారికి రామయ్యపంతులు గారంటే వల్లమాలిన గౌరవం. అది ఆధునిక తెలుగు వాఙ్మయానికెంతో మేలుచేకూర్చింది. ఆంధ్రసాహిత్య పరిషత్తు వంటి గొప్ప సంస్థ ఏర్పాటై అర్ధశతాబ్దం సాహిత్య పరిషత్ పత్రిక వెలువడింది. ఊరూరా వాడవాడా సాహిత్య పరిషత్తు వార్షికోత్సవాలు జరిగాయి. హేమాహేమీలైన సకలాంధ్ర విద్వత్ప్రభువులా సమావేశాలలో పాల్గొనేవారు. రామయ్యపంతులు, రామమూర్తి పంతులు తారసపడినప్పుడు గాఢంగా ఒకరినొకరు ఆశ్లేషించుకొనేవారుట.

జయంతి రామయ్యపంతులు గొప్పహోదాగల ప్రభుత్వోద్యోగాలు చేశారు. డిప్యూటీ కలెక్టరు, ఫస్ట్‌క్లాస్ ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ వంటి ఉద్యోగాలు అలంకరించడం సామాన్యమైన విషయం కాదు. ''ఏ యుద్యోగమున నున్నను వీరికి సాహిత్యోద్యోగము మాత్రము సన్నగిల్లలేదు'' అన్నారు మధునాపంతులవారు.

జననం 1860, పరమపదం 1941. తల్లిదండ్రులు సోమమ్మ, రామయ్యగారలు. ఆంధ్రవిశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ బిరుదంతో వీరిని సత్కరించి తనను తాను గౌరవించుకుంది.

# గుత్తికేశవపిళ్ళై



అది అనంతపురం జిల్లా గుత్తిస్టేషన్. రైలు వచ్చేస్తున్నది. ఊరికి బయట ఉన్న లెవెల్ క్రాసింగ్ గేటుమూసే హడావుడిలో వున్నాడు హంపన్న. ఇంతలో అతడికి ఒక అబల ఆర్తనాదం విన్పించింది. పరకాయించి చూశాడు. మదించిన తెల్లసిపాయి లిద్దరు ఒకమహిళను చెరపట్టే ప్రయత్నంలో ఉన్నారు. వాళ్ళ దగ్గర తుపాకులున్నాయి. వాళ్ళు పరమదుర్మార్గు లని తెలిసిపోతూనే వుంది. అయినా హంపన్న బెదరలేదు. దగ్గర్లో తనకందిన ఒకకట్టె తీసుకొని వెళ్ళి వాళ్ళను నిరోధించాడు. వాళ్ళు హంపన్నను కాల్చిచంపారు. హంపన్న అమరుడు. అమాయకురాలైన ఒక తల్లి మానాన్ని కాపాడడానికి ప్రాణాలిచ్చాడు. అయితే దుర్మార్గులకు శిక్ష ఉండదా?!

రాయలసీమలో గుత్తిదగ్గర ఈ దారుణసంఘటన జరిగింది. ఈ శతాబ్ది ప్రథమదశకాల లోనే. దేశంలో గొప్ప కలవరం సృష్టించింది ఈ దుర్మార్గపు వార్త. తెల్లసిపాయిలను అదుపులోకి తీసుకోక తప్పలేదు ఆనాటి ప్రభుత్వానికి. అయితేనేం కంటి తుడుపు విచారణ అయికూర్చుంది. తమ ప్రాణరక్షణకోసం కాల్చిచంపారుట. నేరం లేదుట. వదలివేయువ చ్చుట ఇదీ తీర్పు.

గుత్తిలో కేశవపిళ్ళై అనే ధర్మాత్ముడున్నాడు. ప్రజల కష్టసుఖాల పట్ల ఎంతో మనసుంచి పనిచేస్తున్న సెకండ్ గ్రేడ్ ప్లీడరాయన. ప్రజాసమస్యల పట్ల ఆయన ముందుకురుకుతారు. ఆయన గొప్ప అండ, ప్రజలకు దండ. గుత్తికేశవపిళ్ళై గొప్ప ఆందోళన లేవదీశారు పత్రికలకు వ్రాశారు. ప్రభుత్వానికి మహజర్లు సమర్పించారు. ఆ తెల్లసిపాయిలకు శిక్షపడిందాకా ఆయన విశ్రమించలేదు. ఊళ్ళోనీటికి కటకట పడుతున్నారు జనం. కలెక్టరా ఊరికి వచ్చి ఉన్నాడు. కొందరిని వెంటబెట్టుకొని వెళ్ళి కలెక్టరు దగ్గర ఊరి సమస్యలను విన్నవించారు కేశవపిళ్ళై

గారు. అప్పటి నుంచీ ఆయన నిరంతరం ప్రజాసేవ పరాయణులయ్యే ఉన్నారు. గుత్తి ప్రజాసేవా సంఘం అని ఒక చిన్న సంస్థ స్థాపించుకున్నారు. దాన్ని మద్రాసు మహాజన సంఘానికి అనుబంధం చేసుకున్నారు. గుత్తి కేశవపిళ్ళెగారి ప్రజాసేవను చూసి స్థానిక ప్రభుత్వం ఆయిన్ను జిల్లా బోర్డు సభ్యుణ్ణిచేసింది. మద్రాసు మహాజనసభ **1884**లో స్థాపిత మైంది. ఆ మహాసభ సమావేశాలకన్నిటికీ పిళ్ళెగాధు హాజరై ప్రజలబాధలు, కష్టాలు సమస్యలు చర్చించేవారు. **1885**వ సంవత్సరం బొంబాయిలో గోకుల్‌దాస్ తేజపాల్ సంస్కృత కళాశాలలో జరిగిన జాతీయ మహాసభకు కేశవపిళ్ళెగారు మద్రాసు రాష్ట్రం నుంచి ప్రతినిధిగా హాజరైనారు. అప్పటి నుంచీ ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సభ్యుడిగా ఆయన **1916 – 17** సంవత్సరాల దాకా చురుగ్గా పనిచేశారు. అనీబిసెంట్ అధ్యక్షత వహించిన సంవత్సరం ఆయన జాతీయ మహాసభకు సంయుక్త కార్యదర్శిగా కూడా పనిచేశారు మద్రాసు గవర్నరుగారి పరిపాలన సలహామండలిలో పిళ్ళెగారు చాల సంవత్సరాలు సభ్యుడుగా ఉన్నారు. భారతదేశపు కార్మికోద్యమ మూలపురుషులలో పిళ్ళె ఒకరు. అటవీశాఖ, విద్యాశాఖ, జైళ్ళ సంస్కరణం విషయమై ఉచితమైన శాసనాలు చేయించటానికి పిళ్ళెగారు ఎంతో కృషిచేశారు. **1920** ప్రాంతాలలో అప్పటి బ్రిటీష్‌వారి వలస ప్రాంతమైన గయానాకు వెళ్ళి (ఇప్పుడు దక్షిణ మెరికాలో సంలీనం) అక్కడి భారతీయ కార్మికులదుస్థితివివారణకు, వారి స్థితి గతులు మెరుగుపడేందుకు తగిన సూచనలతో నివేదిక సమర్పించేందుకు బ్రిటీష్ ప్రభుత్వం పిళ్ళెగారిని బ్రిటీష్ గయానాకు పంపింది. శ్రీలంకలోని భారతీయవర్తకులకోరికను పురస్కరించుకుని అక్కడికి వెళ్ళి అక్కడి పరిస్థితులు విమర్శించి ఒక నివేదిక సమర్పించారు కేశవపిళ్ళె. అడవిపుల్లరి చట్టాన్ని, జైళ్ళలో మానవత్వ వాతావరణం కల్పించే చట్టాన్ని రూపొందించేందుకు ఎంతో కృషిచేశారు వీరు. ఉత్తరార్కాడులో పట్టు స్వగ్రామం అయినా **20** ఏళ్ళ 'వయస్సు నుంచి గుత్తిలో స్థిరపడ్డారు కేశవపిళ్ళె'. తండ్రి వేంకటాచలం పిళ్ళె, తల్లి సుబ్బమ్మ. జననం **1860**. పరమపదం **1933**. ఉత్తమ దేశభక్తుడు. ప్రజా సేవాశీలి శ్రీ పిళ్ళె.

★★★★

# రెంటాల వేంకటసుబ్బారావు



వ్యాపార వాణిజ్య రంగాలలో ముందుకు చొచ్చుకొని పోవటంలోను, బాగా ప్రకటన చేసి తమ సరుకును విపణిలో ఆకర్షించటంలోను, ఉద్యమితలోను తెలుగువాళ్ళు బాగావెనక పడ్డవాళ్ళని ఒక అపప్రథ వుంది. ప్రజ్ఞ, ప్రతిభ, చొరవ, సాహసం, తెలివి తేటలు, నూత్న మార్గాన్వేషణంలో వీళ్ళు ఉపయోగించరు అనే వెరసుమాట కూడా వుంది. అయితే రెంటాల వేంకటసుబ్బారావుగారి జీవితం ఇందుకు పూర్తిగా మినహాయింపు. మహామేధావి ఆయన. నిరంతర సాహసి. ఉద్యమశీలి. ఆరోజుల్లో తెలుగువాళ్ళకు గొప్పకీర్తితెచ్చిన మహావ్యక్తి

'వార్తయందు జగము వర్ధిల్లుచున్నది' అని మహాభారత సూక్తి. వార్త అంటే కృషి, వాణిజ్యాలు. వాణిజ్యమంటే దేశదేశాల క్రమ్మ వలెనోయ్, దేశ సరుకులనమ్మ వలెనోయ్.

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా చెన్నూరు గ్రామకరణం రెంటాల శేషయ్యగారి కుమారుడు సుబ్బారావు. 1860 ఆగష్టు 3వ తేదీన దగ్గుమిల్లి గ్రామంలో మేన మామలింట జన్మించారు. మేనమామలు పింగళివారు. బందరు నోబుల్ కాలేజీలో ఎఫ్.ఏ. సర్వ ప్రథముడిగా ఉత్తీర్ణుడై స్కాలర్‌షిప్ పొంది మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో బి.ఏ.లో చేరారు. క్రిష్టియన్ కళాశాల ప్రిన్సిపాల్ డా.మిల్లర్‌కు సుబ్బారావంటే ఎంతో అభిమానం. సుబ్బారావు బి.ఏ. పూర్తిచేయగానే కాలికట్ మిషన్ స్కూలులో ఆయనకు ఉద్యోగం ఇప్పించారు మిల్లర్ దొర. అయితే బి.ఎల్. చదవాలన్న కోరికతో సుబ్బారావుగారు మద్రాసు వచ్చేశారు. మద్రాసులో, గుంటూరులో సుబ్బారావు మిషన్ స్కూళ్ళకు ప్రధానోపాధ్యాయుడిగా పనిచేశారు. ఇంగ్లీషు వారితో సమానంగా ఆరోజుల్లో ఆయన వేతనం తీసుకొనేవారు. తర్వాత బి.ఎల్. పూర్తిచేసి ఒక్క సంవత్సరం మాత్రమే న్యాయవాదిగా ప్రాక్టీస్ చేశారు. కాని న్యాయవాద వృత్తి ఆయనకు రుచించలేదు. జీవితాంతం న్యాయవాదిగా పనిచేసినా చెప్పుకోదగిన ధనార్జన చేయలేను, వాణిజ్య రంగంలో ప్రవేశిస్తాను అని నిశ్చయించుకున్నారు సుబ్బారావు. అప్పటి అడ్వకేట్ జనరల్ షెపర్డ్ దొర 'నీవు హైకోర్టు జడ్జివి అవుతావు

ఈ వృత్తి వదలి పెట్టవద్ద'న్నా వినలేదు.

ఉపాధ్యాయుడిగా బోధనానుభవంతో గణితం, ఫిజిక్స్, కెమిస్ట్రీ ఇంకా ఇతర పాఠ్య విషయాలకన్నిటికీ సారాంశ పుస్తకాలు ప్రచురించటం ప్రారంభించారు సుబ్బారావు లక్షలార్జించారు. అప్పటి కాయన వయస్సు ఇరవైఏళ్ళే. 1905లో కాశీలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సభలకు ప్రతినిధిగా వెళ్ళినప్పుడు సుబ్బారావు సార సంగ్రహాలను విద్యార్థులు చదవటం తాను చూశానని వల్లూరి సూర్యనారాయణ రావుస్వీయ చరిత్రలో వ్రాశారు. ఒక్కరాత్రిలో వంద పుటల ముద్రణ యోగ్యవ్రాత ప్రతి సిద్ధం చేయగల శక్తిసామర్థ్యాలుండేవట సుబ్బారావు పంతులుగారికి. 'లా' సంగ్రహం, హిందులా, శిక్షాస్మృతి మొదలైన గ్రంథాలు తెలుగులో రచించి లక్షలార్జించారు పంతులుగారు. వీటిని అరవం, మహారాష్ట్రం, కన్నడం, గుజరాతీ భాషలలోకి అనువదింపచేశారు. విక్టోరియా బుక్ డిపోను స్థాపించి తెలుగుపుస్తకాలు ఇంగ్లీషు పుస్తకాలు అచ్చువేశారు. మందులు తయారుచేసే సంస్థను ప్రారంభించారు. ఒక్క స్కాట్లాండ్ లోని వాలెంటైన్ కంపెనీ తప్ప ప్రపంచంలో ఎక్కడా తమ ఫోటో స్టూడియోకు మించని పెద్ద స్టూడియో స్థాపించి రెండేళ్ళు నడిపారు. ఇందులో 13 విభాగాలు పనిచేసేవి. మందుల తయారీ మొదలైన వాటిలో కాశీనాథుని నాగేశ్వరరావు గారికి సుబ్బారావు పంతులుగారే స్ఫూర్తినిచ్చారంటారు. ఒథెల్లో హేమ్లెట్ నాటకాలపై సుబ్బారావు పంతులు ఇంగ్లీషులో వ్రాసిన వ్యాఖ్యానాలు ఇంగ్లండులో, అమెరికాలో ఆయనకు చాలా కీర్తితెచ్చాయి. కమలాలేఖ అను తెలుగులోనే కాక ఇంగ్లీషులో కూడా ప్రచురించగా ఆయన ఇంగ్లీషుపాండిత్యానికి ఇంగ్లీషు పండితులే అబ్బురపడిపోయినారు. భారతీయ మధువు (ఇండియన్ వైన్) పేరిట తరవాణి తేట విదేశాలకు ఎగుమతి చేశారుట. ఇంతటి ప్రతిభాశాలి 1918లో షష్టిపూర్తి గూడా కాకుండా స్వర్గస్థుడు కావటం తెలుగువాళ్ళ దురదృష్టం. దాన ధర్మ దయాపరుడు సుబ్బారావు పంతులు.





# మోక్షగుండం విశ్వేశ్వరయ్య

ఆధునిక భారతదేశ పారిశ్రామిక ప్రగతి పథంలో హిమోత్తుంగగిరి శిఖరం మోక్షగుండం విశ్వేశ్వరయ్య. ఆధునిక భారతదేశ ప్రగతి పథానికి ఆయన రూప కల్పనం చేసినవాడు. ఆధునిక ఋషి, ప్రాక్ ప్రతీచీ విజ్ఞాన సమన్వయద్రష్ట. ఐహిక సుఖసంపత్తులను కూడా బాగా అభివృద్ధి చేసుకుంటేనే తప్ప ఏ దేశమైనా బలంగా మనజాలదని ఆయన దృఢవిశ్వాసం. సహజ వనరుల నన్నిటినీ సంపూర్ణంగా వినియోగించుకుని ఆర్థికంగా పారిశ్రామికంగా జాతీయంగా పురోభివృద్ధి సాధించాలనేది ఆయన విశ్వాసబలం.

జపాన్, స్వీడన్ అచిరకాలంలోనే ప్రగతి సాధించగా జనసంఖ్యలోగాని సహజ సంపదలో గానీ ఎంతో విశాల దేశమైన భారతదేశం ఎందుకు వెనకబడి వుండాలి? అని ఆయన ప్రశ్నించేవారు. పారిశ్రామికంగా, వ్యావసాయికంగా ముందంజవేయాల్సిన అగత్యాన్ని గురించి ఉత్తేజకరంగా ప్రబోధించారు. స్వాతంత్ర్యం రావటానికి మూడునాలుగు దశాబ్దాలకు పూర్వమే వార్షిక ప్రణాళిక బద్ధమైన ఆర్థిక పారిశ్రామిక విద్యాసంయోజన పథకాలను ఆయన ప్రవేశపెట్టాడు. బ్రిటీష్ అధికారుల మెప్పును, కృతజ్ఞతను కూడా ఆయన ఉద్యోగకాలంలో చూరగొన్నాడు. ఆనాటి బొంబాయి రాష్ట్రంలో 24 సం.లు ఆయన ఇంజనీరింగ్ శాఖలో ఉన్నతోద్యోగాలు నిర్వహించి నిజాయితీకి, మేధకు, నిరుపమానమైన ప్రతిభకు ఉన్నతాదర్శంగా ప్రశంసితుడైనాడు. ఇరవైరెండు సంవత్సరాల వయసుననే బొంబాయి రాష్ట్రమంతటికీ ప్రథమ గణ్యుడిగా ఆయన ఇంజనీరింగ్ పట్టభద్రుడైనాడు. ప్రభుత్వోద్యోగంలో 24 సం.లు గణనీయమైన ఎన్నో విజయాలు సాధించి 48 సం.లు వయసున ఆయన పదవీ విరమణ

చేశారు. తరువాత ఆయన మైసూరు దివానుగా ఆ రాష్ట్ర సమగ్ర సత్వర పురోభివృద్ధికి పాటుపడ్డారు. ఈ శతాబ్ది ప్రథమపాదంలో మైసూరు రాష్ట్రం అన్ని రంగాలలోను సాధించిన ప్రగతికి ఆయనే మూలపురుషుడు. మైసూరు విశ్వవిద్యాలయాన్ని, కృష్ణరాజసాగర్ నీటి పారుదల ప్రాజెక్టును, భద్రావతిలోని ఇనుము ఉక్కు పారిశ్రామిక కర్మాగారాన్ని విశ్వేశ్వ రయ్య రూపొందింపచేశారు.

1934వ సంవత్సరం నాటికే విశ్వేశ్వరయ్య 'భారతదేశమూ - ప్రణాళికా బద్ధమైన ఆర్థికాభివృద్ధి' అనే గ్రంథాన్ని రచించి ప్రపంచంలోని ఇతరదేశాల ఆర్థికాభివృద్ధికీ మనదేశపు ఆర్థికాభివృద్ధికి వ్యత్యాసం ఎందువల్ల ఏర్పడిందో అందుకు కారణాలేమిటో, వీటిని అధిగమిం చడానికి తీసుకోవలసిన చర్యలేమిటో వివరించారు. బ్రిటీష్ ప్రభుత్వం వారు భారతదేశం అన్నిరంగాలలోను ఆధునిక పురోభివృద్ధిని సాధించడానికి ఎటువంటి ఉత్సాహమూ చూపేవా రుకారు. విశ్వేశ్వరయ్య వంటి మహామేధావులు, రాజనీతిజ్ఞులు, సాంకేతిక విజ్ఞానులు ఎంతో శ్రమపడవలసి వచ్చేది. చదువుకోవటంలోనేమి, ఉద్యోగరీత్యా అయితేనేమి, విశ్వేశ్వరయ్య 15 సం.లు పూనా నగరంలో వున్నాడు. ఆ కాలంలో ఉజ్జ్వల త్యాగధనులు జాతిరత్నాలు అయిన బాలగంగాధర్ తిలక్, మహదేవ గోవిందరానడె, గోఖలేల ద్వారా విశ్వేశ్వరయ్య ఎంతో స్ఫూర్తిని పొందాడు. సేద్యపు నీటివనరుల గరిష్ఠ ప్రయోజన ప్రణాళికలు, మురుగునీటి పారుదల పథకాలు, మంచినీటి సరఫరా ప్రణాళికలు గురించి భారతదేశంలో ఏ పెద్ద నగరంలో ఏ ప్రాంతంలో అమలు జరపాలన్నా, ఏ నదిపైన ఆనకట్టకాని, రిజర్వాయర్‌లుకాని నిర్మించాలన్నా విశ్వేశ్వరయ్య సలహా సంప్రదింపులు తప్పక తీసుకోవడం జరిగేది. 1931వ సంవత్సరానికే ఆంధ్ర విశ్వవిద్యాలయం 5వ స్నాతకోత్సవసభలో దేశంలో సాంకేతిక విజ్ఞానం, కట్టుదిట్టమైన సాంకేతిక విద్యా ప్రణాళికా ప్రగతి, సామాన్య ప్రజలకు సాంకేతిక విజ్ఞాన ప్రయోజనాల లబ్ధి గురించి ఆయన ప్రబోధించాడు. ఎన్నో సార్లు ప్రపంచదేశాల పర్యటన జరిపి ఆయన అక్కడి సాంకేతిక విజ్ఞాన ప్రగతిని ఆకళింపుచేసుకున్నాడు. 1955వ సంవత్సరంలో స్వతంత్ర భారత ప్రభుత్వం దేశంలో అత్యున్నతమైన బిరుదు 'భారతర త్న'ను ఆయనకిచ్చింది. నూరేళ్ళు జీవించిన విశ్వేశ్వరయ్య ఒక్కక్షణాన్ని కూడా వృథా చేయకుండా దేశహితం కోసం, దేశ సౌభాగ్యం కోసం పాటుపడిన మహామనీషి.

విశ్వేశ్వరయ్య పూర్వీకులు కర్నూలు జిల్లా మోక్షగుండానికి చెందినవారు. కొన్ని తరాల కిందట వాళ్ళు కర్ణాటక దేశానికి తరలిపోయారు. విశ్వేశ్వరయ్య జన్మస్థలం ముదినేపల్లి. తల్లిదండ్రులు వెంకటలక్ష్మమ్మ, శ్రీనివాస శాస్త్రిగారలు, జననం 1861, పరమపదం 1962.



# గురజాడ అప్పారావు



దేశాభిమానం నాకుకద్దు అని వొట్టిగొప్పలు చెప్పుకోవద్దు అని ప్రబోధించాడు గురజాడ వెంకట అప్పారావు. అంతేకాదు; మాటలు వద్దు చేతలు కావాలి అని బుజంతట్టాడు. 'పూని ఏదైనాను ఒక మేలు చేసి' జనులకు చూపాలి అని హెచ్చరించాడు. లోకంలోని మంచి చెడ్డలు లోకులు తెలుసుకోలేరు. దేశమనేది ఒక దొడ్డవృక్షం. అది పచ్చని చెట్టు. ఆకుల్లో అణిగిమణిగి కవిత కోకిలలు పలకాలి. ఆ పలుకులు విని దేశంలో అభిమానం పెల్లుబుకాలి అని ఆయన కలకూజితం చేశాడు. ముత్యాల సరంతో తెలుగు కవితను అలంకరించాడు. మేధావి, సంఘ సంస్కర్త, మానవతోద్యమ ప్రవర్తకుడు.

కన్యాశుల్కం నాటకం ద్వారా సమాజ ప్రబోధానికి ప్రజల భాష ఎంత అనివార్యమో అది ఎంతబలమైన సాధనంగా పనికివస్తుందో నిరూపించాడు. సంఘంలో కరడు కట్టుకుని పోయిన దురాచారాలు, కీడుతెచ్చి పెడుతున్న కుహనాసంస్కారాలు, రచ్చకీడ్చి అవి తలఎత్తుకోలేకుండా చేశాడు. మనుషుల్లోని అజ్ఞానం అవివేకం అల్పత్వం, అలసత్వం, సంఘానికెంతటి చెరుపు చేస్తాయో కరుణ రసం ఉట్టిపడేట్లు కవితలల్లాడు. పుత్తడిబొమ్మ పూర్ణమ్మ, లవణరాజుకల, దేశభక్తి మనిషి వంటి గీతాల ద్వారా ఆధునిక కవితాప్రవక్త అయినాడు గురజాడ అప్పారావు. తెలుగు సాహిత్యంలో ఈ శతాబ్ది అత్యంత ఆకర్షణీయమైన ప్రక్రియను తీర్చిదిద్దిన మూలపురుషుడు అప్పారావే. అదిచిన్నకథ. ఒకచేతివ్రేళ్ళమీద మాత్రమే లెక్కపెట్టాల్సిన కథలేరాసినా అవి అన్నీ ఆణిముత్యాలు. సంఘం మొహాన్ని నిలువుటద్దంలో చూపుతాయి. తెలుగులో కొత్తనుడికారాలు సృష్టించాడు. కొత్తఅంట్లు తొక్కాడు. కొత్తపాతల మేలుకలయిక పండించాడు.

సంప్రదాయాన్ని నిరసించలేదు. నవీన సంప్రదాయిలు సంతరించాలన్నాడు. నాజూకుతనం, నాగరికత సాంఘికవర్తనంలో కావాలన్నాడు. వాడుకభాష సృజనశక్తికి సుషమ్నానాడి అని తనరచనల ద్వారా నిరూపించాడు. భావుకుడు, పండితుడు, కావ్యకళా ప్రతిభాశాలి.

చేసుకున్నవాడు అగ్రహంకన్నా ఆదరాన్ని, నిరసనకన్నా సానుభూతిని, చీదరింపుకన్నా బుజ్జగింపును లోకంపట్ల, తనుసృష్టించిన మానవలోకంపట్ల, కనపరచిన కరుణాళువు అచ్చమైన కవి. తరువాత తరంలో చింతాదీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి వంటి గొప్ప కథకులకు సాహిత్య సంస్కారపు వరవడిదిద్దిన పెద్ద మనిషి . తల్లిదండ్రులు కౌసల్యమ్మ, వెంకటరామదాసు: **1862** జననం; **1915** పరమ పదం.

★★★★

# రఘుపతి వెంకటరత్నం



రఘుపతి వెంకటరత్నం నాయుడి పేరు తలచుకోగానే సంస్కారవంతుల్లో ఒక వినమ్ర భావం కలుగుతుంది. ఒక ఆంతరికమైన చైతన్యరేఖ కదులుతుంది. ఒక సుందరమైన ప్రకృతి దృశ్యాన్నో, మనసులోతులోకి స్పృశించే పాటనో, దేవాలయగోపురాన్నో, నిశ్చలమైన సరోవరాన్నో ఆయన స్మృతి మనసుముందు నిలుపుతుంది. ఈ శతాబ్దితొలి దశకం లలో బందరు, కాకినాడ, సికింద్రాబాదులు, రఘుపతి దివ్యవచస్సుధకు నోచుకున్నాయి. బ్రహ్మసమాజ సిద్ధాంతాల్లోని పవిత్రత అంతా ఆయనలో మూర్తీభవించింది. ఉపనిషత్తుల. దివ్యబోధ లన్నీ ఆయన ఆచరణలో జీవింపచేశాడు.

భారతదేశంలో విద్యారంగంలో ఈ శతాబ్దిలో సుప్రసిద్ధులైన వారిలో ఆయన ఒకడు. మతాన్ని మానవజీవితానికి పునీతంగా సమన్వయింపచేసిన మహితాత్ముడు వెంకటరత్నం నాయుడు. ఈశ్వరుడి పితృత్వాన్ని, సకల మానవాళి సహోదరత్వాన్నిచాటి చెపుతుంది బ్రహ్మ సమాజం. బ్రహ్మసమాజ సిద్ధాంతాలలో కూడా ఆచరణలోకి వచ్చే సరికి ఎన్నో మాలిన్యాలు ప్రవేశించి మనుషులు మతం వల్ల మారలేరు, మమతవల్ల మనుషులు తమ వ్యక్తిత్వాలను ఉద్ధరించు కుంటారన్న విషయం నిరూపితమైంది. మతాన్ని సకల జనహితానికి సాధనంగా భావిస్తే ఏ మతమైనా ఒకటేనని రఘుపతి వెంకటరత్నంనాయుడు గారి వంటి ఉత్తముల జీవితం వల్ల తెలుసుకోవచ్చు.

కిందటి శతాబ్ది చివరి సంవత్సరాలలో రఘుపతి మచిలీపట్నం నోబుల్ కళాశాలలో అధ్యాపకుడిగా ఉండి ఉత్తమ దేశభక్తులను సంస్కారులను నీతివర్తనులను ఎందరినో తీర్చిదిద్దాడు. క్రైస్తవ మిషనరీలు తమ మత వ్యాపనం కోసం చేస్తున్న ప్రయత్నాలు రఘుపతి వెంకటరత్నం సంస్కారమహితమైన బోధల వల్ల విద్యాధికులలో విఫలం కావడం వల్ల, ఆ కళాశాల ఉద్యోగం ఆయన వదులుకోవలసి వచ్చింది. అటు తర్వాత ఆయన కాకినాడ కళాశాల ప్రిన్సిపాలైనారు. మద్రాసు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులూ అయినారు. ఆయన విశ్వకుటుంబి. పిఠాపురం రాజాగారి ఆర్థిక పర్యవేక్షణలో ఆరోజుల్లో కాకినాడలో నిర్వహించబడు

తున్న అనాథాశ్రమానికి రఘుపతి వెంకటరత్నం దివ్యజ్యోతి. అనాథులందరూ ఆయన బిడ్డలు. కులమత తారతమ్యాల కాయన అతీతుడు. బీద విద్యార్థుల కెందరికి ఎన్ని విధాలో ఆయన సాయం చేస్తూ ఉండేవారు. వాళ్ళకు తెలియకుండానే వాళ్ళ జీతాలు, పరీక్ష ఫీజులు ఆయన చూసుకుంటూ తన విద్యార్థులను కన్న తండ్రిలా ప్రేమించేవారు.

దేవదాసీ వ్యవస్థను నిర్మూలించటానికి ఆయిన ఎంతగానో కృషిచేసి ప్రబోధం చేసి కళావంతులకు ఎందరికో వివాహాలు జరిపించారు. ఇరవైఏడో ఏట ఇల్లాలు మరణించినా, అటు తర్వాత సుమారు 50 సం.లు జీవించినా ఆయిన ఏకపత్నీ వ్రతాన్ని కఠోరంగా పరిపాలించాడు. ఒకసారి మద్రాసుకు ప్రయాణం చేస్తూండగా పొన్నేరి రైల్వేస్టేషన్‌లో అనాథలైన నలుగురు పసిబాలికలును చూసి వాళ్ళను దత్తపుత్రికలుగా చేసుకున్నాడు. వాళ్ళకు చదువు సంధ్యలు చెప్పించి, కన్నతండ్రిలాగా వివాహాలు చేసి జీవిత సార్థకత చేకూర్చాడు. ముట్నూరి కృష్ణారావువంటి సుప్రసిద్ధ పాత్రికేయుణ్ణి, వేమూరి రామకృష్ణా రావు వంటి గొప్ప విద్యావేత్తను ఆయిన మూర్తిమంతము, జ్ఞానతేజస్సు ప్రభావితం చేసి వాళ్ళ వ్యక్తిత్వాలను తీర్చిదిద్దాయి. ఈశతాబ్ది తెలుగుదేశపు మహాపురుషులలో వెంకటరత్నం నాయుడుగారు మహర్షి అనిపించుకోవడానికి అన్ని విధాలా అర్హులు. జననం 1862, పరమపదం 1939.

★★★★

# గిడుగు రామమూర్తి



"ప్రాచీనాంధ్రము గుత్తగొని పండితులను ఏలుకోనియ్యండి. అందులో లాభనష్టాలు వారివే. లోకానికి నేటి లౌకికభాష రహదారీ — అగ్రహారములోలాగున అగ్రవర్ణాల వారికే కాదు. ఆబాల గోపాలము అందరికిన్నీ, పట్నాలలో ఉన్నట్టే" అన్నారు రామమూర్తి పంతులుగారు. ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని గిడుగు రామమూర్తిలా కంట్లో వత్తివేసుకుని చదివిన పండితులు నాడులేరు. నేడు లేరు. ప్రాచీన సాహిత్యంలో ఆయన చదవని గ్రంథం, చదివి మరిచి పోయిన అక్షరమూ ఉండవని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి లాంటి గొప్పపండితులు మహాకవులు గిడుగు పండితుణ్ణి మెచ్చుకుంటారు. మహామేధావి రామమూర్తి పంతులు. కవిత్రయ భారతంలో ఏపదం, ఏ అర్థంలో ఎక్కడ ప్రయోగించటం జరిగిందో పద్యం, పంక్తి సంఖ్యలతో సహా చెప్పగలిగిన ఆయన జ్ఞాపక దార్ఢ్యం స్తుతిపాత్రం కాదా?

అచ్చు కొత్తగావచ్చిన రోజుల్లో ఆనాటి గొప్ప గొప్ప పండితులు వెనకటి కవుల కావ్యాలు అచ్చువేయటానికి పూనుకున్నారు. అప్పుడువాళ్ళకొక పెద్దసమస్య ఎదురైంది. ఆయాకావ్యాలలో వ్యాకరణ విరుద్ధమైన తప్పులు కనపడ్డాయి. వీటి తస్సాగొయ్య అని తమకొచ్చిన వ్యాకరణం ప్రకారం వాటిని పండిత పరిష్కర్తలు దిద్ది మరీ అచ్చువేశారు. చాలా మందికి తెలిసిన వ్యాకరణం చిన్నయసూరి బాలవ్యాకరణం మాత్రమే. అప్పటికి ఒకేఒక తెలుగు నిఘంటువు బహుజనపల్లివారి శబ్దరత్నాకరం మాత్రమే. బ్రౌన్ దొరగారి నిఘంటువున్నా దాన్ని పండితులు మెచ్చలేదు. అందులో వివరణలు వాడుకభాషలో ఉండటంవల్ల.

గిడుగు రామమూర్తి పంతులు పర్లాకిమిడి పాఠశాలలో, తర్వాత కళాశాలలో చరిత్ర బోధించేవారు. ఆనాటి సువిస్తృత అవిభాజ్య మద్రాసు రాష్ట్రంలో గిడుగు పండితుడిలా చరిత్ర చెప్పే మరో అధ్యాపకుడులేడని పెద్దపేరు ఆయనకి. ప్రైవేటుగా చదువుకుని బి.ఏ. పరీక్షకు వెళ్ళి ప్రథమ తరగతిలో రాష్ట్రానికంతటికీ ద్వితీయుడిగా కృతార్థుడైన మహామేధావి గిడుగు

పంతులు.

**1910**వ సంవత్సరంలో ఇంటర్ విద్యార్థులు పరీక్షలో వ్యాసరచన వాడుక భాషలో చేయవచ్చునని మద్రాసు విశ్వవిద్యాలయం అనుమతి లభించింది. దానిమీద తెలుగునాడం తటా పెద్ద ఆందోళన జరిగి **1914**లో ఆ అనుమతిని ప్రభుత్వం ఉపసంహరించుకుంది. రామ్మూర్తి పంతులు తెలుగు సాహిత్యాన్ని అధ్యయనం చేయాల్సిన అవసరం, సందర్భం ఇట్లా ఏర్పడింది. పండితులు తప్పులని దిద్దిన వాటన్నిటినీ వొప్పులని ఆయన పూర్వకవుల ప్రయోగాలనుంచి నిరూపించారు. గొప్ప భాషా విప్లవం తెచ్చారు. ఈ శతాబ్ది తెలుగు భాషావేత్తలలో ఆయన మేరుపర్వతం. అంతర్జాతీయ ఖ్యాతిగల భాషావేత్త. సవరభాషకు కోశాలు నిర్మించిన ధీమంతుడు, సవరభాషా వాగనుశాసనుడు. **1863** జననం, **1940**లో కథావశేషులైనారు. **17**వ ఏట అధ్యాపక వృత్తిలో ప్రవేశించి **47**వ ఏట పదవీ విరమణం చేసి మూడు దశాబ్దాలు తెలుగుభాషను పరిశోధించిన, సంస్కృత వ్యాకరణానికి మునిత్రయం వంటి మహాపండితుడు తెలుగు భాషకు గిడుగు రామమూర్తి. వెంకమ్మ వీర్రాజుపంతుల కులదీపకుడు

★ ★ ★



# వావిలికొలను సుబ్బారావు

వాసుదాసుగారని వీరిని ఆరాధిస్తారు తెలుగువాళ్ళు. ఆయన పేరొక మంత్రాక్షర సంపుటి తెలుగుదేశానికి. ఆదికవి వాల్మీకి ఎట్లా ఉంటాడో ఎవరికీ తెలీదుకాని వాసుదాసుగారిని చూసినవాళ్ళు ఆ వాల్మీకి కూడా ఇట్లానే ఉండేవాడేమో అనుకుంటారు. 'వందే ఆంధ్ర వాల్మీకి సుబ్బరాయమ్' అని నతమస్తకులవుతారు, వావిల కొలను సుబ్బారావు పంతులుగారి శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణాన్ని, దానికాయన కూర్చిన 'మందర' వ్యాఖ్యానాన్ని తలచుకొని-నూటఎనిమిది సార్లు వాల్మీకాన్ని పూర్తిగా పారాయణంచేసి శ్రీరామ సామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవాలు నిర్వహించిన మహనీయులు వాసుదాసుగారు. శ్రీరామ పట్టాభిషేక ముద్రలతో నూట ఎనిమిది మొహిరీలు శ్రీరామప్రభువుకు కాన్క పెట్టాడా యన. నూట ఎనిమిది మంగళ సూత్రపు బంగారు తాళిబొట్లు సీతమ్మ తల్లికి సమర్పించాడా యన. మహాకవి, మహాయోగి, మహాభక్తుడు వాసుదాస.స్వామి. 16సం. లు మద్రాసులోని రాజధాని కళాశాలలో తెలుగు ఆచార్యులుగా పనిచేశారు. అంతకు పూర్వం సుమారు 20 సం.లు రెవిన్యూ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగం చేశారు. శ్రీమద్రామాయణాన్ని తెలుగు చేయాలని ఆయనకు సుమారుగా నలభై సంవత్సరాల వయస్సున సంకల్పం కలిగింది. సుమారు 4సం.ల కాలంలో శ్రీ మద్రామాయణం తెనిగించారు. అత్యద్భుతమైన విషయం ఏమంటే 8 వేల పుటలుగల మందరమనే రామాయణ వ్యాఖ్యానాన్ని వాసుదాసస్వామి సుమారు 2సం.లలో పూర్తిచేశారు. పది నెలల కాలంలోనే 4 కాండల వ్యాఖ్యానం పూర్తి చేశారు. శ్రీమద్రామాయణంలోని సర్వములైన వేదవేదాంత మహా విషయాలన్నీ ఈ వ్యాఖ్యానంలో స్వామివారు వివరించారు. 'మందరం' తెలుగు సర స్వతికి దివ్య సుందర మహావిభవ మందిరం . వాసుదాస స్వామివారి రామాయణాన్ని వాల్మీకి శ్రీమద్రామాయణంతో తుల్యంగా పారాయణం చేశారు తెలుగువాళ్ళు. 45 సం.ల వయసున రామాయణానువాదం పూర్తిచేసి 70 సం.ల వయసున మందర వ్యాఖ్యానం రచించారు వాసుదాసస్వామి. కౌపీనధారియై, సన్యాసియై ఊరూర పర్యటించి తమచేతితో ద్రవ్యాన్ని ముట్టకుండా టెంకాయ చిప్పలో విరాళాలను కానుకలను స్వీకరించి కొన్నివేల ద్రవ్యం వినియోగించి ఒంటిమిట్ట కోదండ రామస్వామి దేవాలయాన్ని జీర్ణోద్ధారణం చేశారు. స్వామివారికి రథం

నిర్మింప చేశారు.

పోతనగారివంటి సహజ పాండిత్య కవితా శోభితుడు వాసుదాసస్వామి. మద్రాసులోని వావిలికొలను వారి ఇల్లు శ్రీ రామ జయమందిరం. వాసుదాసస్వామి కోదండ రామసేవక సమాజాన్ని స్థాపించి తెలుగునాట భక్తి ఉద్యమాన్ని వాడవాడలకు తీసుకొని పోయినారు. కిందటి తరం వరకూ స్వామివారి కీర్తనలు తెలుగుతల్లుల జిహ్వాగ్రాల నర్తించేవి. అర్యకథానిధి పరంపరగా తేటతెల్లమైనసంకలితమైనవచన రచనగా విలసిల్లిన బాలసాహిత్యం నిన్నటి వరకు తెలుగుదేశంలో చాల ఆదరింపబడేది. సతిహితచర్య, పతిహితచర్య, గర్భిణిహిత చర్య, కుమారీహితచర్య వంటి సమాజహిత గ్రంథాలెన్నో వాసుదాసస్వామి తెలుగు వారికిచ్చారు. కౌసల్యా పరిణయం, కుమారాభ్యుదయం, శ్రీకృష్ణలీలామృతం, కృష్ణావతారతత్త్వం వంటి మహాకావ్యాలు రచించారు. శ్రీవారు ప్రవర్తింపజేసిన దాస సంప్రదాయం తెలుగు దేశాన్ని నేడుకూడా ప్రభావితం చేస్తూనే ఉన్నది.

వాసుదాసస్వామి వారి తల్లి దండ్రులు కనకమ్మ, రామచంద్రరావు గారలు.**1863** జనవరి **23** స్వామివారి జననం, జమ్మలమడక గ్రామంలో. **1936** ఆగష్టు 1వ తేదీన కైవల్యం. శ్రీ స్వామివారు మద్రాసులో పరమపదించారు.





# అజ్ఝాడాదిభట్ల నారాయణ దాసు

నారాయణదాసుగారనగానే 'సంగీతం సాహిత్యం సరితూచిన త్రాసు' అనో హరికథా పితామహుడనో తెలుగువాళ్ళు సంతోషపడతారు. కాని ఆయన జాతీయ భావాలు,సర్వతంత్ర స్వతంత్రత సాహసం, చాలా ఉత్తేజకరమైనవి. ''స్వరాజ్యమబ్బినగాని మనకు పౌరుష జ్ఞాన ర్తులు కలుగవేరవు. శిరస్సులేని మొండెము నభ్యంగన మొనర్చినట్లు స్వాతంత్ర్యములేని దేశమున సోషల్ కాన్ఫరెన్సేల?'' అని కాంగ్రెస్ పుట్టిన తొలినాళ్లలోనే అజ్ఝాడ వారు కాంగ్రెసు సభలకు అనుబంధంగా జరిగే సంఘసంస్కరణ సభలను విమర్శించటం ఆయిన దూరదృష్టిని తెలుపుతుంది. సుమారుగా ఒక శతాబ్దం కిందటనే ''వ్యవసాయి మభివృద్ధిచేసుకొని పంటలు పండించుకొనుచుండుటయు వర్తకమభివృద్ధిచేసుకొనుటయు నీరెండు మార్గములే మన దేశమునకు దగిన పనులు'' అన్నారు అజ్ఝాడవారు.

సంస్కృతం, తెలుగు, ఫార్సీ ఇంగ్లీషు భాషలలో అసమాన ప్రజ్ఞా వంతులు శ్రీ దాసుగారు. అచ్చ తెలుగులోను సంస్కృతంలోనూ, అనువాద గ్రంథాలుగాను స్వతంత్ర కృతులుగాను సుమారు **50** గ్రంథాలు రచించారు దాసుగారు. మేఘం గర్జించినట్లుగా శివతాండవవేళ ఢమరుకం మ్రోగించినట్లుగా ఉండేది ఆయన గాత్రం. గంటల తరబడి ఆయన చెప్పే హరికథలు ముగ్ధులై మెచ్చేవారు తెలుగుప్రజ. **1913**వ సంవత్సరం కలకత్తాలో శ్రీ కృష్ణజననం హరికథ చెప్పగా విశ్వకవి రవీంద్రుడు ఎంతో ప్రశంసించాడు. ఆంధ్రదేశంలో ఊరూరా ఎన్నో ఘనసన్మానాలు జరిగాయి దాసుగారికి. **1864** రక్తాక్షినామ సంవత్సరం దాసుగారి జననం. **1945**లో పరమపదం. ఎనభైసంవత్సరాల ఉజ్జ్వలమైన జీవితంలో తెలుగువారి నాలుగు తరాల సాంస్కృతిక వైభవాన్ని ఉద్దేపింపచేశారు దాసుగారు. ఆయన ఏకసంథాగ్రాహి, మహాపండితుడు. సంగీత సాహిత్యాలలో జగజెట్టి. కిందటి శతాబ్ది చివరి రెండు దశకాలు, ఈ శతాబ్ది మొదటి నాలుగు దశాబ్దులు ఆయన సంగీత, నాట్యాభినయ

సాంస్కృతిక రంగంలో కథానాయకుడు. విజయనగరం మహారాజావారి సంగీత కళాశాలలకు పలిమాచార్యులుగా వారెందరికో తర్ఫీదునిచ్చారు. శాస్త్రిగారి తల్లిదండ్రులు వెంకటచయ నులు నరసమాంబగారలు.

తెలుగు వారి ఆధునిక సంగీత నాట్య హరికథాగానాభినయ ప్రజ్ఞకు మేరుశిఖరం వంటివాడు నారాయణదాసు.





# ఆచంట వేంకట సాంఖ్యాయనశర్మ

ఒకవ్యక్తిలో బహుముఖప్రజ్ఞ కుదురు కోవటం అరుదు. కిందటి శతాబ్ది జన్మించి ఈ శతాబ్దిలో ఎన్నో రంగాలలో విశేష ప్రతిభావంతులుగా కీర్తిగాంచారు ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ. ఈయన్ను బాగా తెలిసినవాళ్ళు 'నడుస్తున్న విజ్ఞాన సర్వస్వం వీరు' అనేవాళ్ళు. ఇటు సంప్రదాయాన్ని అటు నవీనమార్గాలను చక్కగా సమన్వయింపచేశారు సాహిత్యంలో. కథానికవంటి నవ్యప్రక్రియకు, ఖండకావ్యం వంటి ఆధునిక కవితాశాఖకు కూడా ఆచంటవారు పాదులు తయారుచేశారు. కల్పలత, సుజనప్రమోదిని అనే రెండుపత్రికలు నడిపారు.

పధ్నాలుగు సంవత్సరాల వయస్సులోనే మిడిల్‌స్కూలు పరీక్షలో మద్రాసు రాష్ట్రానికంతకూ ప్రథముడిగా ఉత్తీర్ణులయినారు. స్వయంకృషితోనే సంస్కృతంలోనూ తెలుగులోనూ నిస్తులమైన పాండిత్యం సంపాదించారు. శర్మగారి విషయంలో అపూర్వమైన అంశం ఏమంటే సకల శాస్త్రాలు దర్శనాలు, వైజ్ఞానిక విషయాలు కళలు అన్నీ వీరినాకర్షించాయి. చిత్రలేఖనంలో కూడా వీరు పండితులు. భూ, వృక్ష, క్రిమికీటక ఖనిజశాస్త్రాలు, ప్రాచీన అధునాతన రాజ్యాంగ విషయాలు శర్మగారు పరిశోధన దృష్టితో సులభశైలిలో తమ పత్రికలో ప్రకటించేవారు.

సంస్కృతంలో నాటకం పది రకాలుగా ఉండవచ్చునని లక్షణగ్రంథం ఉంది. వీటిని దశరూపకాలు అంటారు. ఈ దశరూపకాలలో 'ఉత్సృష్టికాంకం' అనేది ఒకటి. తెలుగులో ఈ రూపక లక్షణాలతో ఎవరూ ఒక్క రూపకం కూడా రచించలేదు. కాని సాంఖ్యాయనశర్మగారు పార్థ పరాజయం పేరుతో తెలుగులో ఈ రూపకం నిర్మించారు. అంతేకాదు నాటకరచన గూర్చిన సమస్త విషయాలతో 'నాటక సర్వస్వం' అనే గ్రంథం రచించారు. కాని ముద్రితం కాలేదు.

సంస్కృతం నుంచి కొన్ని నాటకాలు తెలుగుచేశారు శర్మగారు. కాళిదాసు విక్రమోర్వశీయం, భవభూతి ఉత్తర రామచరిత్ర ఇందులో ముఖ్యమైనవి. ఆరోజుల్లో తెలుగు దేశంలో

ఎన్నో నాటక సమాజాలకు వీరు తర్ఫీదు ఇచ్చారు. నటసమాజాలకు శిక్షణ గరిపారు. ఆంధ్రనాటక కళాపరిషత్తు సంస్థాపక సభ్యులు సాంఖ్యాయనశర్మగారు. పదిహేడేళ్ళ వయస్సు ననే సుజనప్రమోదిని అనే పత్రిక నడిపారు. **1903**లో కల్పలత అనే పత్రిక ప్రారంభించారు. ఈ పత్రికలో అన్నీ వీరిరచనలే ఉండేవి. తెలుగు పత్రికలలో ప్రశ్నావళి శీర్షికను ప్రారంభించింది శర్మగారే అనిచెప్పాలి. **1904**లో కల్పలత పత్రికలో తెలుగు సాహిత్యాన్ని గూర్చి కొన్ని ప్రశ్నలు ప్రచురించి వాటికి సరిఅయిన సమాధానాలు వ్రాసి పంపించిన వారికి రూ.**116** లు బహుమానం ఇచ్చే ఏర్పాటుచేశారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమానాలు ఇచ్చేవారు శర్మగారు. ఈ కల్పలత సాహిత్యసంపద పోటీలో పాల్గొని బాలాంత్రపు వేంకటరావుగారు, ఓలేటి పార్వతీశంగారూ ఒకరి కొకరు పరిచితులై తర్వాత వేంకట పార్వతీశకవులుగా తెలుగునాట సుప్రసిద్ధులైనారు. సాంఖ్యాయనశర్మగారి 'రహస్యదర్పణం' అనే గ్రంథంలో భూగర్భ ఖనిజ విజ్ఞానం, క్రిమికీటక శాస్త్ర విజ్ఞానవిశేషాలు ఉన్నాయి. ఆరోజుల్లోనే ఆయన సౌరశక్తిని గురించి వ్రాసి సౌరశక్తిద్వారా ఇంధనం రూపొందించ వచ్చునని వివరించారు. శ్రీకాకుళం జిల్లాలోని పార్వతీపురానికి దగ్గరగా ఉన్న 'మేరంగి' అనే జమీందారీ సంస్థానానికి సాంఖ్యాయనశర్మగారు దివానుగా ఉండి ప్రజాహిత కార్యక్రమాలెన్నో చేపట్టారు. దివాన్గిరీ విరమించుకొన్న తర్వాత, దివానుగా కాకముందు న్యాయవాద వృత్తిని చేపట్టి శర్మగారు పుష్కలంగా ఆర్జించారు. గిడుగు వారి వ్యావహారిక భాషావాదం వీరికి సమ్మతమే. 'మహోపాధ్యాయ' బిరుదు పొందారు శర్మగారు. వీరి సరస సంభాషణ ఆనాడు చాలా ప్రచారం పొందింది.

తల్లిదండ్రులు నరసమాంబా, బాపిరాజులు. జననం **1864**, స్వర్గతి **1933**.



# పానుగంటి లక్ష్మీనరసింహారావు



ఆధునిక తెలుగు సాహిత్యంలో పానుగంటి లక్ష్మీనరసింహారావు సృష్టించిన పాత్రలు చిరస్మరణీయాలు. తన గొప్ప సృజనాత్మక ప్రతిభతో వాటికి ప్రాణప్రతిష్ట చేశాడాయన. తెలుగుభాష మృదువైందనీ తియ్యనైనదనీ అందరికీ తెలుసు. అయితేదానికి కదనకుతూహరాగంలోని ధాటి కూడా ఉందని పానుగంటి వచన రచన ప్రకటించింది. హొయలు, సొగసులు, వయ్యారాలు చూపే శబ్ద శక్తితో ఒక శైలి సృష్టించటం తెలుగు పలుకుబడిగల ఏకవి అయినా చెయ్యగలడేమో గాని, సెలయేటి వేగం ఎలదేటి ఝుంకారం, చదలేటి స్వచ్ఛత కదిలించేటి వైద్యుతాకర్షణం, పానుగంటి శైలిలో ప్రత్యేకత. ఆయిన వాక్య రచనలో ఒక వాదుపు వుంది. ఉయ్యాల తూగుఉంది. ఇది పానుగంటి వచనం అని వెంటనే పోల్చుకోగల గాంభీర్యం ఉంటుంది. కోలాటంపాటల్లోని లయ విన్యాస మాధుర్యం హస్తపాదచాలన ఖేల, ఒక హేల తెలుగు వచన రచనకాయన కూర్చాడు. ఆయిన పాత్రలు తెలుగు నుడికారాలైనాయి.

ఆయన హాస్యం మరీ చురుకుగాను ఒక్కొక్కప్పుడు కరుకుగానూ ఉండేమాట వాస్తవమే కావి, గుండెనిండా నవ్వుకోని తెలుగువాడు ఉండదు. ఆ కథా, కమామిషు రుచిచూశాడంటే మన పూర్వకవులలోకృష్ణ దేవరాయలవారితోను, తెనాలి రామకృష్ణుడితోను అతిశయభావ నాశక్తి విషయంలోనూ, హాస్యనిర్భరత ప్రీతిలోను పానుగంటిని పోల్చవచ్చు.

'పానుగంటి' అనగానే యీ చతురాక్షరి వెంటనే ఏమిటి స్ఫురింపచేస్తుందంటే 'సాక్షి' అనే రెండక్షరాలను. ఆ మంత్రానికిది కీలకం. జంఘాల శాస్త్రి, వాణీదాసు బొర్రయ్యశెట్టి, కాలాచార్యులు రంగం మీదికి వచ్చి హంగు చేస్తారు పానుగంటిని తలచుకోగానే. ఆరు సంపుటాలుగా యీ సాక్షీ వ్యాసాలు కనబడుతున్నాయి. సుమారు మూడు దశాబ్దాలు మాటికి పైగా యీ సాక్షి ఉపన్యాసాలు పత్రికలలో పానుగంటి వారు ప్రకటించారు. ఆవకాయ

నుంచి అద్వైతం వరకు, పరబ్రహ్మం నుంచి పచ్చ బొట్టు వరకు సాక్షి వ్యాసాలలో వ్యాఖ్యానం కాని విషయం ఏదీలేదు. ఆనాటి సమకాలీన సామాజిక రాజకీయ సాహిత్య సాంస్కృతిక విషయాలన్నిటినీ చమత్కార భరితంగా, వస్తుతత్వ నిరూపకంగా పానుగంటి లక్ష్మీ నరసింహారావు సుమారు శతాధికమైన వ్యాస పరంపరలో వ్యాఖ్యానించారు.

తెలుగునాటక రచయితలలో పానుగంటికి విశిష్టమైన స్థానమున్నది. సాంఘిక, పౌరాణిక, చారిత్రక ఇతివృత్తాలతో ఆయన సుమారు ముప్పై నాటకాలు రచించారు. పాదుకా పట్టాభిషేకం, కంఠాభరణం, రాధాకృష్ణ నాటకాలు చాలా ప్రసిద్ధమైనవి. నాటక రచనలో కూడా ఆయనకు ప్రత్యేకమైన వ్యక్తిత్వమున్నది. పద్యరచనలో పానుగంటి విలక్షణమైన సంప్రదాయం సృష్టించారు. ఆయన భావనాశక్తి లోకజ్ఞత, సాహిత్య శిల్పం, సృజనాత్మక ప్రతిభ అనితర సాధ్యమైనవి. పంతులుగారి జననం **1865**. కాలగతి **1940**. తల్లి రత్నమాంబ, తండ్రి వెంకటరమణయ్య, రాజమండ్రి దగ్గర సీతానగరంలో జన్మించారు. పిఠాపురంలో స్థిరంగా చాలా ఏళ్ళున్నారు. ఈయనకు నూట ఇరవై ఏళ్ళు ఈ రక్తాక్షి సంవత్సరానికి



# శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి



వచనం రాయడమే సులభం కాదు వచనం రాసినంత సులభంగా వేగంగా పద్యం రాయిడం ఎంత కష్టం. చిన్నవీ పొన్నవీ అన్నీ కలిపి రెండు వందల పైన గ్రంథాలు రచించారు కృష్ణమూర్తి శాస్త్రిగారు. శతావధాని, కవిరాజు, కవిసార్వభౌమ, అభినవ శ్రీనాథ మొదలైన బిరుదులు వహించటానికి ముచ్చట పడ్డారు. వారా బరుదులకు సర్వథా అర్హులు. ఆయన పాత కొత్తలకు భవ్యమైన కలయిక. ఎంత ఆవేశపరులో అంత కరుణా హృదయులు.

తెలుగులో సాహిత్య చరిత్రలోనే మహాభారతం, శ్రీమద్రామాయణం, భాగవతం మూడూ అనువదించిన మరొక కవి కనబడరు. మూలాన్ని తు.చ. తప్పకుండా అనుసరిస్తూనే తమ ఉపజ్ఞకూడా చూపారు శాస్త్రిగారు. గౌతమీమహాత్మ్యం, ఆంధ్రాభ్యుదయం, కలభాషిణి, బొబ్బిలి, తిలక్‌మహారాజు నాటకం, గాంధీ విజయం వంటి వైవిధ్యం గల కృతులు వెలయించారు.

చిన్నప్పుడు అష్టావధానాలు, శతావధానాలు అలవోకగా నిర్వహించి యశస్సు నార్జించారు శాస్త్రిగారు. తెలుగులోనే కాదు సంస్కృతంలో కూడా అవధానాలు చేశారు. వంగదేశంలోని మయూర్‌భంజ్ సంస్థానంలో సంస్కృతంలో అవధానం చేసి పండిత సత్కారం పొందారు. దర్భాంగ మొదలైన సంస్కృత విద్యా స్థానాలలో తమ ప్రతిభ చూపి అపూర్వ సన్మానాలు పొందారు. పుష్టుగా వేదం అభ్యసించారు. స్మార్తంలో మహామహులనిపించుకున్నారు. యజ్ఞయాగాదులు కూడా చేయించగల వేదవిదు లనిపించుకున్నారు.

ఇంత సంప్రదాయ ధిషణ ఉండి కూడా నవ్యత్వాన్ని ఆరాధించారు శాస్త్రిగారు. గౌతమి అనే పేరుతో రాజమండ్రి నుంచి దినపత్రికను నడిపారు వీరు. కళావతీ, వజ్రాయుధం, మానవసేవ, వందేమాతరం వంటి పత్రికలను నిర్వహించారు. చెళ్లపిళ్ళ

వెంకట శాస్త్రిగారికి కొంతకాలం వీరు గురుత్వం వహించినట్లు లోకం చెప్పుకుంటుంది. అయితే చెళ్లపిళ్ళ వారి తర్వాతే వీరికి ఆంధ్రాస్థానకవి గౌరవం దక్కింది. ఆవేశ పరులు కాబట్టి సమకాలీన సాహిత్య వాదవివాదాల్లో వీరు చాలావాటిల్లో ప్రముఖంగా పాల్గొన్నారు. సాహిత్య వివాదాలను కూడా వీరు కోర్టు వరకు లాగేవారు. పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి గారితో మహాభారత విమర్శనం గూర్చి వీరు కోర్టుకెక్కారు. 1933వ సంవత్సరంలో రాజమండ్రిలో వీరికి గండపెండేర సమర్పణోత్సవం జరిగింది. ఆ సభలో తిరుపతి వేంకటకవులలో సుప్రసిద్ధులైన చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు వీరి కాలికి గండపెండరం తొడిగారు. శ్రీపాద కృష్ణమూర్తి మహోదయులను గూర్చిన జీవిత చరిత్ర ఇంగ్లీషులో, తెలుగులోనేకాక సంస్కృతంలో కూడా వెలువడింది. శ్రీకృష్ణ స్వీయ చరిత్రం పేరుతో స్వయంగా ఆయనే స్వీయ చరిత్రం వ్రాసుకున్నారు. అద్భుతమైన విషయం ఏమంటే శ్రీ శాస్త్రిగారు 18 పర్వాల మహాభారతం, ఏడుకాండల రామాయణం, ద్వాదశ స్కంధాల మహాభాగవతం ఒక్క చేతి మీదుగా తెలుగులో రసవంతంగా అనువదించటం. ఈ సంగతి 'నభూతో నభవిష్యతి' అనటంలో సందేహం ఏమైనా ఉంటుందా? శాస్త్రి గారి తల్లిదండ్రులు వెంకట సుబ్బసోమిదమ్మ, వేంకట సోమయాజిగారలు. శాస్త్రిగారి జననం 1866. స్వర్గతి 1960.



# మానవల్లి రామకృష్ణకవి



ఈ శతాబ్ది పరిశోధకులలో మేరుశిఖరం రామకృష్ణ కవిగారు. ఆ రోజుల్లో నిఖిలాంధ్ర దేశంలోనూ కవిగారనగానే మానవల్లివారు, మారేపల్లివారూ ఇద్దరే స్ఫురించే వారు. వీళ్ళిద్దరు అభినవాంధ్ర సాహిత్య పరిశోధనకు గొప్ప ప్రమాణాలు నెలకొల్పారు.

అన్ని విధాలా రామకృష్ణకవిగారి మూర్తిమంతం స్తుతిపాత్రమైనది. వేదోక్త పరిపూర్ణమైన ఆయుర్దాయింతో తెలుగుతల్లిని ఏడు దశాబ్దాలుపైగా వారు ఆరాధించారు. అఖిల భారతీయ స్థాయిన పరమప్రామాణికులైన మహావిద్వాంసులుగా మానవల్లివారు ఖ్యాతిచెందారు. భారతీయ సాంస్కృతిక దివ్యదీధితులను వారు లోకానికి చాటిచెప్పారు. శ్రమపడి అందించారు. అపూర్వమైన సంస్కృత రూపకాలను, కావ్యాలను సంగీత నాట్యశాస్త్ర గ్రంధాలను కవిగారు సంపాదించి పరిష్కరించి అచ్చువేశారు. భాసుని నాటకాలను మొదటిసారి తెలుగువారికి పరిచయం చేసిందీ కవిగారే. దిఙ్నాగాచార్యుడి కుందమాల సంస్కృతంలో గొప్ప నాటకం. ఈ నాటకం ఉనికిని కవిగారు లోకానికి ఎరుక పరిచిందాకా ఎవరికీ తెలియదు. ఈ శతాబ్ది భారతదేశంలో మహాపండితుడిగా ప్రపంచ ప్రఖ్యాతి వహించిన రాహుల్ సాంకృత్యాయన్ ఒక్క కుందమాల చాలు కవిగారి మహాప్రతిభ లోక ంలో స్థిరంగా నెలకొనటానికి అని మెచ్చుకున్నట్లు సుప్రసిద్ధ భాషా సాహిత్య విద్వాంసులు శ్రీ తిరుమల రామచంద్ర వ్రాశారు. భరతుడి నాట్యశాస్త్రాన్ని ప్రప్రథమంగా సంపాదించి పరిష్కరించి ప్రచుర పరిచింది కవిగారే. దేశం నాలుగుమూలల నుంచీ కవిగారు నలభై ప్రతులుగా నాట్యశాస్త్రం సేకరించి పరిష్కృత ప్రతిని సిద్ధం చేశారు. చిదంబర నట రాజేశ్వర దేవాలయ కుడ్యాలపై ఉన్న నాట్యశాస్త్ర వ్యాఖ్యాన భంగిమలప్రతిమూర్తులను కూడా భరతనాట్యశాస్త్రంలో కవిగారు ప్రకటించడం గొప్ప విశేషం. భరతుడి నాట్యశాస్త్రానికి అభినవగుప్తుడు రచించిన అభినవ భారతిని కూడ

సంపాదించి కవిగారు ప్రకటించడం లలితకళా ప్రపంచలో ఆయనను అమరుణ్ణి చేసింది. దండి మహాకవి దశకుమార చరిత్రకు మూలగ్రంథమైన 'అవంతి సుందరి కథ'ను కూడ మానవల్లివారే సంపాదించి ప్రకటించారు. కవిగారు సిద్ధం చేసిన భరతముని నాట్యశాస్త్రాన్ని బరోడా మహారాజా గైక్వాడ్ సంస్కృత విశ్వవిద్యాలయ ప్రచురణగా స్వీకరించి వెలువరించారు. పాట్నా హైకోర్టు న్యాయమూర్తులు మహావిద్వాంసులు అయిన కె.సి.జయస్వాల్ మహాశయులు నాట్య శాస్త్రాన్ని పరిష్కరించి ప్రకటించడానికి రామకృష్ణ కవిగారికన్నా అర్హతములు లేరంటూ గట్టిగా అభిప్రాయపడి ఆ మహాగ్రంథాన్ని, వారి నిర్వహణలోనే ప్రచురింప చేశారుట. ఉత్తర భారతదేశ మహామహులైన సంస్కృత విద్వాంసులెందరో కవిగారి శేముషీ ప్రాభవానికి నివాళులర్పించారు.

చెన్నపట్నంలోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార పండితులుగా తమిళ మళయాళ కన్నడ ప్రాంతాలను కూడా పర్యటించి రామకృష్ణ కవిగారు కొన్ని వేల తాళపత్రగ్రంథాలను సేకరించారు. అందులో అపురూపమైన సంస్కృత గ్రంథాలు, కావ్యాలు, రూపకాలు, వ్యాఖ్యానాలు ఎన్నో లభించాయి. భరత కోశం పేరుతో సంగీత, నృత్య, నాట్య అభినయ పరిభాషను కవిగారు కూర్చి గొప్ప నిఘంటువుగా ప్రకటించడం వారి మహాప్రతిభకు నిదర్శనం.

అన్నిటికన్నా విశిష్టమైన విషయం ఒకటి ఉన్నది. తెలుగు సాహిత్య చరిత్రనే సంచలింప చేసిన పండిత కవి విమర్శకు అందరికి కనులు మిరుమిట్లు గొల్పిన నన్నెచోడ కవి రాజ కుమారసంభవాన్ని వెలికితీసి ప్రకటించిన ఘనకీర్తి కవిగారిది. అపురూపమైన భాషాప్ర యోగాలతో అతిలోక కవితా విహారంతో సాగిన కుమార సంభవకర్త నన్నెచోడుడు, నన్నయకన్నా కూడా పూర్వుడు అని రామకృష్ణ కవిగారు ప్రతిపాదించడంతో తెలుగు సాహిత్య లోకంలో కనీవినీ ఎరుగని సంచలనం కలిగింది. రామకృష్ణ కవిగారు 'మృగావతి' వంటి స్వతంత్ర కావ్యాలను రచించిన మహాకవులు కూడాను.

తిరుపతి శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యవిద్యా పరిశోధన సంస్థలో పండితులుగా కవిగారు పనిచేసి ఉత్తమ గ్రంథాలను వెలుగులోకి తెచ్చారు. ప్రబంధ మణిభూషణం అనే తెలుగు సంకలన కావ్యాన్ని ప్రకటించిన కీర్తికవిగారిదే. ఆయన జీవితం ఒక సాహిత్య నిరంతర యాత్ర. ఆయన వ్యక్తి మాత్రులు కారు. దివ్యసంస్థ. కవిగారి తండ్రిగారి పేరు రామస్వామిశాస్త్రి. కవిగారి జననం **1866** మద్రాసులోని నుంగంబాకం. పరమపదం **1957. 91** సం.ల పరిపూర్ణ జీవితం గడిపిన మహనీయులు మానవల్లివారు.



# కొండ వెంకటప్పయ్య



''సెలవు దినములలో పల్లె గ్రామములకు బోయి మనదేశపు బూర్వోన్నత్యమును, ఇప్పటి దుస్థితులను గూర్చి ప్రజలకు ప్రబోధించుట యుచితమనియెంచి. . మా యుపన్యాసములలో పూర్వమున మనదేశమున నుండెడి శాస్త్ర పరిజ్ఞానము, సత్యశీలము, ఔదార్యాది గుణసంపత్తి, గ్రామ కట్టుబాటులు, ఆర్థిక సంపత్తి, వృత్తులు, దూరదేశములతో వర్తక వ్యాపారములు, శిల్ప నైపుణ్యమును వర్ణించి ఇప్పటి దాస్యము, విద్యా విహీనత, అజ్ఞానము, దారిద్ర్యము మొదలగు విషయములను గూర్చి వివరించుచుండ స్త్రీ పురుషులు మిక్కిలి శ్రద్ధాళువులై వినుచుండిరి.''

ఇవి కొండ వెంకటప్పయ్య పంతులుగారి మాటలు. ఆనాటి ప్రజాసేవా పరాయణుల ఆదర్శాలు అట్లా ఉండేవి. వాళ్ళ కార్యక్రమాలట్లా ఉండేవి. ఏ సత్రంలోనో, ఏ చెట్టునీడనో తమవంట తాము చేసుకొనే వాళ్ళుట. ఎవరైనా భోజనానికి పిలిస్తే వెళ్ళేవార్టుట.

గాంధీగారు స్వాతంత్ర్యోద్యమంలోకి రాకముందే దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు దేశసేవకుగాను వృత్తిని విసర్జించి తమ పూర్తికాలాన్ని, శక్తియుక్తులను దేశసేవకే అంకితం చేశారు అప్పటికి వారికి ఏభై యేళ్లుకూడా నిండలేదు. ప్లీడరీ వృత్తిలో బాగా సంపాదిస్తున్న రోజులు. అయినా ఆయన చదువుకొనే రోజులనుంచీ మహాదేవ గోవింద రానడే, గోపాలకృష్ణ గోఖలేగార్లను ఆదర్శంగా పెట్టుకున్నారు. **1887**వ సంవత్సరం మద్రాసులో జరిగిన జాతీయ మహాసభలో విద్యార్థిగా, సేవాదళ కార్యకర్తగా పాల్గొన్నారు. బందరులో పదకొండు సంవత్సరాలు న్యాయవాదిగా ఉన్నారు. బందరులో ఆరోజుల్లో దేశహితైక కార్యక్రమాలలో అభిమానం, సాంఘిక రాజకీయ కార్యక్రమాలలో గౌరవ, నీతిబద్ధమైన జీవితాదర్శాలపట్ల ఆసక్తి ఎక్కువగా కనిపించేవని చెపుతూ ఈ పరిస్థితికి రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి జీవితం, నీతిబోధ ముఖ్యకారణాలై

ఉంటాయింటున్నారు వెంకటప్పయ్యగారు. ''సంఘములో నొక వ్యక్తియేనియు నీతి వర్తనుడైనచో దాని ప్రభావమూరక పోదనుట కిదియే తార్కాణము'' అనేవి వారి మాటలు. వెంకటప్పయ్య పంతులు నిష్కళంక నీతివర్తనుడు. మనస్వి, అఖిల భారత స్థాయి గాంధీజీ గౌరవానికి కూడా పాత్రుడైన మహనీయుడు

తెలుగుదేశంలో రాజకీయ చైతన్యం కలిగించిన మొట్టమొదటి పత్రికను స్థాపించినవారు పంతులుగారే. అది కృష్ణాపత్రిక అటు తర్వాత స్వాతంత్ర్యోద్యమంలో ప్రధాన ఘట్టాలైన సహాయ నిరాకరణోద్యమం, పన్నుల నిరాకరణం, ఉప్పు సత్యాగ్రహం, నిర్వహించిన తెలుగుదేశపు సేవా నాయకులు పంతులుగారు. ఆంధ్రరాష్ట్ర ఉద్యమానికి సారధ్యం వహించి కొండంత అండలా దాన్ని నిర్వహించినవారు పంతులుగారే

గాంధీజీ తెలుగుదేశంలో పర్యటించినప్పుడు వారి కార్యక్రమాన్ని రూపొందించి వారివెంట ఉండి నడిపించింది వెంకటప్పయ్యగారే గాంధీగారికన్నా వెంకటప్పయ్య వయసున మూడేళ్ళు పెద్ద **1866**లో ఆయన జన్మించారు. **1948**లో కీర్తిశేషులైనారు సామాన్య కుటుంబంలో జన్మించి స్వయంకృషితో, నీతివర్తనతో, దేశసేవా దురంధరుడిగా, కారాగారవాసం చేసి, సాంఘికోన్నతికోసం పాటుపడిన మహనీయుడు వెంకటప్పయ్య పంతులు. ఈ శతాబ్ది తెలుగు ప్రముఖులలో ఆయన మొదటి వరుసలో ఉంటారు.





# శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు

క్రిందటితరం తెలుగు మహాపురుషులలో వల్లూరి సూర్యనారాయణరావుగారు అగ్ర శ్రేణిలో నిలుస్తారు. పేద కుటుంబంలోపుట్టి స్వయంకృషితో సత్యసంధతతో ధర్మ తత్పరతతో సంపన్నులై తాను సంపాదించిన విశేష విత్తాన్ని సమాజహిత కార్యకలాపాలకు దానం చేసిన మహనీయులు సూర్యనారాయణరావు. పట్టుదల, మనోవాక్కాయకర్మలలో చిత్తశుద్ధి, భారతీయ విజ్ఞానంపట్ల అచంచల విశ్వాసం, హేతువాద దృక్పథంతో సంఘసంస్కరణం సూర్యనారాయణరావుగారి వ్యక్తిత్వంలోని మేలిగుణాలు. తొలిరోజుల్లో జరిగిన దేశీయ మహాసభలకు సూర్యనారాయణరావుగారు హాజరైనారు. ''కాశీ, కలకత్తా, సూరత్ కాంగ్రెసులకు డెలిగేటుగా పోయి మితవాదులతో చేరక, తిలక మహారాజు శిష్యుడనైయుంటిని'' అన్నారు స్వీయచరిత్రలో. 1905వ సంవత్సరంనుంచి విదేశీ వస్త్రాలు ధరించటం మానివేశారు. అభినవభారత సంఘంవారి 'తల్వార్' పత్రిక వీరికి వచ్చేది. ఈ పత్రికను వీరసావర్కార్, లాలాహరదయాళ్ ప్రభృతులు నిర్వహించేవారు ఆరోజుల్లో బెర్లిన్ నుంచి వెలువడుతుండేదని వల్లూరివారు వ్రాశారు. మూడు దశాబ్దాలపాటు బందరులో హైకోర్టువకీలుగా ప్రాక్టీసు చేశారు. గాంధీగారి త్రివిధబహిష్కరణోద్యమంలో ప్లీడరీవృత్తిని పరిత్యజించారు అయినా దేవాదాయధర్మాదాయ సంబంధమైన కేసులలో తనంత తానుగా ముందుకు వచ్చి ఉచితంగా వాదిస్తూ ఆ ధర్మాలు సక్రమంగా జరిగే వ్యవస్థను ఏర్పరచేవారు. దాతమరణానంతరం ఆ ధర్మాలు సక్రమం తప్పటం అనేక సందర్భాలలో చూస్తాం. కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఇటువంటి కేసులు ఎన్నిటినో స్వయంగా సూర్యనారాయణరావుగారు చేపట్టి ఆ ధర్మాదాయి, దేవాదాయాలను క్రమబద్ధంచేశారు. ఇవి కొన్ని లక్షలరూపాయల విలువగలవి.

తమ స్వార్జిత విత్తాన్ని సుమారు 60 వేలవిలువగల ఆస్తిని కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠానికి అనుబంధంగా ఒక పుస్తక ప్రచురణ సంస్థను స్థాపించి జనసామాన్యంలో భారతీయ విజ్ఞానాన్ని దేశదేశాల సాంఘిక పరిణామాలను, రాజ్యాంగ వ్యవస్థలను సరళమైన, సుబోధకమైన తెలుగులో ప్రచురించవలసిందిగా వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు వీలునామా వ్రాసి కట్టుదిట్టంగా ఏర్పాటు చేశారు. ఈ గ్రంథాలు ఏయే విషయాలకు సంబంధించి ఉండాలో అటువంటి 40 విషయాలనుకూడా స్వీయ చరిత్రలో ఉదాహరించారు. ఈ గ్రంథాల వెల చాలా స్వల్పంగా ఉంచాలని సూచించారు ఈ విషయాలన్నీ చూస్తే తెలుగు వారిని సమగ్ర విజ్ఞాన వంతులను చేయుటమే వల్లూరి వారి లక్షయం అని స్పష్టపడుతుంది

సూర్యనారాయణరావు పంతులుగారిది సంపూర్ణమైన మూర్తిమత్వం. వీరిని సంస్మరిస్తూ గ్రంథమాలలో ఇప్పటికి సుమారు 30 గ్రంథాలు వెలువడ్డాయి 1866 జననం, 1937 పరమపదం తల్లిదండ్రులు శాంతమ్మ, వెంకటకృష్ణయ్య వల్లూరి వారి వంటి ధర్మకర్తలున్నంత వరకూ ఆ సంఘానికి పరంపరాభ్యుదయం

★★★★

# కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు



'పరీక్ష ఫీజు చెల్లించాల్సిన గడువు దగ్గరదగ్గర పడుతోంది. నాకు వేరేదారీ తెన్నూలేదు. ఏంచెయ్యగలను ఈ సంవత్సరం నాచదువు వృధా అయిపోతుందా' అనే ఆందోళనతో ఒక పెద్ద నగరంలో ఒక కళాశాలలో విద్యార్థి బాధపడిపోతూ అయినా చూదామని కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి పేర తన దయనీయమైన స్థితి గతులు తెలియచేసుకుంటూ జాబు వ్రాశాడు. ఆ సంగతి మరి గుర్తుంచుకోలేదు. ఆ తర్వాత కొద్ది రోజులకు ఆశ్చర్యం, ప్రిన్సిపాల్ గారు తన గదిలోకి ఆ విద్యార్థిని పిలిపించారు. నీకు నాగేశ్వరరావుగారు డబ్బు పంపించారయ్యా, పరీక్ష ఫీజు వెంటనే కట్టేసెయ్, అని చెప్పారు.

కలకత్తా నగరంలో ప్రదర్శన ఏదో జరుగుతున్నది. ఆ ప్రదర్శన వాడలో 'అమృతాంజనం' విక్రయశాల కూడా ఉంది. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వచ్చారు 'అమృతాంజనం' అమ్మకాలు ఎలా ఉన్నాయో చూదామని, కలకత్తాలో ఆనాడు చదువుకుంటున్న తెలుగు విద్యార్థులు కొందరు పంతులు గారిని చూదామని అభిమానంతో వచ్చారు. ఆ విద్యార్థుల హృదయాలలో ఒక అప్యాయత. ఒక గౌరవం. ఒక ఆత్మీయత. 'అమృతాంజనం' అమ్మకాలవల్ల నికరలాభం 6 వేలు అని తెలిసింది. పంతులుగారు బుజంమీద ఉత్తరీయం వేసుకున్నంత తేలిగ్గా అతినిరాడంబరంగా ఏమీ ఆలోచించకుండా విద్యార్థులకు స్కాలర్ షిప్‌ల క్రింద ఆ 6 వేల రూపాయలూ ఆంధ్ర సంఘంవారికి ఇచ్చివేశారు. అక్కడక్కడ దానంచేశారు.

దానధర్మాలంటే, అక్కరలో ఉన్న వారిని ఆదుకోవటమంటే విశ్వదాత, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారి త్యాగశీలం అటువంటిది. ఆయన తలచుకొంటే లక్షలపై లక్షలార్జించి దాచుకుని కోటికి పడగలెత్తి ఉండేవారు. కాని ఈ చేతితో సంపాదిస్తూ ఆ చేతికే తెలియకుండా దానం చెయ్యటం కూడా ఆయనకుతెలుసు. అందుకే తెలుగు వాళ్ళకు

ఆయన అంత అభిమాన పాత్రులు కాగలిగారు. ఆయన దేశభక్తినీ, వితరణ-శీలాన్నీ గాంధీ మహాత్ముడు కూడా మెచ్చుకున్నాడు.

ఆయన పదవులను ఆశించలేదు. పలుకుబడిని స్వార్థ ప్రయోజనాల కెన్నడూ వినియోగించుకోలేదు. పెద్ద చదువులు చదవలేదు. ఆడంబర రాజకీయాల జోలికెన్నడూ పోలేదు. కాని జాతీయోద్యమానికి దక్షిణ దేశంలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు పట్టుగొమ్మగా ఉండేవారు. అంతగొప్ప ధనవంతుడు, పలుకుబడిగల వాడూ అయినా సత్యాగ్రహంచేసి, ప్రభుత్వం ఆగ్రహానికి కూడా గురిఅయినారు. తెలుగుదేశపు ఆధునిక సాహిత్య చరిత్ర వ్రాసేటప్పుడు నాగేశ్వరరావు పంతులుగారి పేరు సువర్ణాక్షరాలతో లిఖించ వలసి వుంటుంది. ఆంధ్రపత్రిక, భారతి, ఆంధ్ర గ్రంథాలయాల ద్వారా తెలుగు సాహిత్యానికి నాగేశ్వరరావు పంతులుగారు చేసిన సేవ నిరుపమానం. తెలుగువారికి రాజకీయ పాఠశాలలో వరవళ్ళు దిద్దింది పంతులుగారే. అక్షరాలు నేర్పింది పంతులుగారే. పంతులుగారు 1909వ సంవత్సరంలో ప్రారంభించి స్వయంగా కొన్ని దశాబ్దాలు నిర్వహించిన ఆంధ్రపత్రిక తెలుగువారి విజ్ఞాన వికాసాలను విస్తరింపచేసింది. వారు ప్రతి సంవత్సరం ప్రకటించిన ఆంధ్రపత్రిక ఉగాది సంపుటాలు విజ్ఞాన సర్వస్వాలుగా వినుతికెక్కాయి.

హరిజనోద్ధరణకు పంతులుగారు ఎంతో సేవచేశారు. కృష్ణాజిల్లాలో తన స్వగ్రామమైన ఎలకుర్రులో ఒక పాఠశాల స్థాపించి హరిజన విద్యార్థులకు ఉచితంగా విద్యాప్రదానం జరగడానికి కారకులైనారు.

నాగేశ్వరరావు పంతులుగారు స్వయంగా రచయిత, భగవద్గీతకు గొప్ప వ్యాఖ్యానం రచించారు. తెలుగు సాహిత్య చరిత్రను సంధానించారు. ఎన్నో గొప్ప గ్రంథాలకు విలువైన పీఠికలు వ్రాశారు. అపూర్వమైన పూర్వగ్రంథాలను మళ్ళీమళ్ళీ ముద్రించి తెలుగువారి కందించారు.

పంతులుగారి తండ్రిగారు బుచ్చయ్య, తల్లి శ్యామలాంబ. ఆరాధ్యశైవ సంప్రదాయానికి చెందిన కుటుంబం వీరిది. **1867** జననం, **1938** శివసాయుజ్యం. కిందటి శతాబ్ది జన్మించిన మహాపురుషులైన తెలుగువారిలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి వ్యక్తిత్వం విశిష్టమైనది.



# చిలకమర్తి లక్ష్మీనరసింహం



గాంధీజీకి భారతదేశంలో సాంఘిక స్థితిగతులు, రాజకీయ పరిస్థితులు మొదటిసారి తె``ంది 1915లో అంటే భారతదేశంలో అనాదున్న సాంఘిక వ్యవస్థ, రాజకీయ వాతావరణం తెలుసుకోవాలన్న ప్రయత్నం గాంధీ జీవితంలో అప్పుడే మొదలైంది అంతకు సుమారు పది సంవత్సరాలకు పూర్వమే చిలకమర్తిలక్ష్మీనరసింహం, రాజమహేంద్రవరంలో రాజారామ్మోహనరాయిల పేరిట హరిజనుల కోసం ఒక పాఠశాల స్థాపించి పదమూడేళ్ళు ఆ పాఠశాల నడిపారు ముందు పది మంది విద్యార్థులే చేరినా నూట యాభై మంది దాకా ఆ సంఖ్య పెరిగింది. పుస్తకాలు ఉచితం, స్కూలు జీతం లేదు

చిలకమర్తి లక్ష్మీనరసింహం పుట్టంధుడుకాకపోయినా చిన్నతనంలో రేచీకటి, మధ్య వయసు వచ్చేసరికి పూర్తిగా కంటిచూపు తగ్గిపోయింది. అయితేనేం ఆయునది దివ్యదృష్టి దేశమాత, మనోరమ, సరస్వతి వంటి గొప్ప పత్రికలు నిర్వహించారు. బిపిన్ చంద్రపాల్ రాజమహేంద్ర వరంలో చేసిన ఉపన్యాసాలకు చిలకమర్తి అధ్యక్షత వహించారు. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసం ముగియగానే 'భరత ఖండం చక్కటి పాడిఆవు, హిందువులు లేగదూడలు, తెల్లవాళ్ళు భారతీయుల మూతులు బిగియకట్టి' పాలన్నీ తామే తీసుకొంటున్నారని' చిలకమర్తి ఆశువుగా చెప్పిన పద్యం ఆరోజుల్లో తెలుగుదేశమంతా మోగిపోయింది

గొప్ప దేశభక్తుడు, నిష్కళంక నీతివర్తనుడు, నిరుపమాన సాహిత్యవ్రతుడు, మెచ్చవలసిన సంఘసంస్కారాభిమాని చిలకమర్తి లక్ష్మీనరసింహం. తియ్యనీరులాంటి మృదుమధురమైన వచనం ఆయునది. బంకించంద్రుడితో పోల్చదగిన తెలుగునవలా రచయిత చిలకమర్తి లక్ష్మీనరసింహం. ఆయన గయోపాఖ్యానమనే నాటకం రాశారు ఇరవై రెండేళ్ళ వయసే అప్పటికాయునకు ఈ నాటకం లక్ష ప్రతులు అమ్ముడు కావటమనేది తెలుగు సాహిత్య చరిత్రలో కనీవినీ ఎరుగని ఘట్టం. ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు చిలకమర్తికి

ప్రాణమిత్రులు. గయోపాఖ్యానంలో చిత్రలేఖ వేషమూ, అర్జునుడి వేషమూవేసి కన్నుల వైకుంఠంగా నటించేవారని చిలకమర్తి స్వీయ చరిత్రలో ప్రకాశాన్ని ఎంతగానో మెచ్చుకున్నారు

ఈ శతాబ్ది తెలుగు సాహిత్యానికి వెన్నెల చిలకమర్తి ఆయనవల్ల తెలుగువాళ్ళ సంస్కార దృష్టి వన్నెకెక్కింది జాతీయాభిమానం వాసికెక్కింది నవలా రచయితగా నాటక రచయితగా తెలుగు వాళ్ళని ఉత్తేజితుల్ని చేశాడు చిలకమర్తి స్వీయ చరిత్ర ఆధునిక మహాకావ్యం అది తెలుగువెలుగు — దాని దివ్వె చిలకమర్తి తల్లితండ్రులు వెంకటరత్నమ్మ, వెంకన్న. ఈయనది 1867 జననం, 1946 స్వర్గతి.

★★★★

# మాస్టర్ సి. వి. వి.



ఇరవయ్యో శతాబ్ది భారతదేశ ఆధ్యాత్మిక దివ్య వ్యక్తిత్వాలలో మాస్టర్ గారిది విశిష్టమైన వ్యక్తిత్వం యోగ ప్రజ్ఞపరమావధి మాస్టర్ గారు, శ్రీరామచంద్రుడి అష్టోత్తర నామాలలో మహాయోగీ, మహోదార: అనే నామాలున్నాయి. అంతటి మహా మహిమాన్వితులు శ్రీ మాస్టరుగారు. ఈ సృష్టి చిద్రహస్యమంతా వారికి తెలుసు పరబ్రహ్మాన్ని తెలుసుకున్నవారు తామూ బ్రహ్మస్వరూపం పొందుతారని పెద్దలు చెపుతారు. అటువంటి పరబ్రహ్మ స్వరూపం శ్రీ మాస్టరుగారు

విచిత్రం ఏమంటేవారిది పూర్ణయోగము, బ్రహ్మాండ స్వరూపమంతా శాస్త్రీయ విజ్ఞాన సమన్వయించేసిన మహాదార్శనికులు వారు. గ్రహాలు, గ్రహకక్ష్యలూ, సౌరకుటుంబంలోని ప్రాణశక్తి ప్రాణుల గమనాగమనాలు అన్నీ తెలిసిన పరిపూర్ణ ప్రజ్ఞావిభవులు శ్రీ మాస్టరుగారు.

వీరికి తమను తాము సమర్పించుకొన్న వారికి అభయము, సత్వసంశుద్ధి కలుగుతాయి. శరణాగతి బహుసులభము, తరువాత ఆనంద సముద్ర సంప్లవనము.

,బ్యాంకు అకౌంటులాంటిదే మనిషిబతుకు, వేస్తేగాని డబ్బుతీయుడానికి వీల్లేదు. అప్పులు పెరిగినకొద్దీ అనేక ఇబ్బందులు, ఋణదాతలు ఊర్కోరు. వారంటు తెచ్చి శిక్షింప చేస్తారుకూడా. అయితే ఎక్కడినుంచైనా డబ్బు కూడితే బాధలుండవు. అకౌంటు సెటిలవుతుంది. అలాంటిది మానవజన్మ కర్మవాసనలు అంటి పెట్టుకుని ప్రారబ్ధం అనుభవించక తీరదు. అయితే మాస్టర్ గారు అనుగ్రహిస్తే ఆ ప్రారబ్ధం మననేమీ చేయదు. శ్రీ మాస్టరు గారు అనుగ్రహించిన యోగం పేరు భృక్త రహిత తారకరాజయోగం. భృక్తం అంటే పేరుకొన్న బాకీ (బాంక్ పరిభాషలో 'బ్రాట్ వోవరు') దాన్ని మాస్టరుగారు బేబాకీ చేస్తారు కావలసింది అంటే చేయవలసింది వారిని శరణు పొందటమే. ఈ దివ్యయోగంలో మానవుడి ఇహపరాలు రెండూ పరమ సుఖసంయోగం సాధిస్తాయి. ప్రాణశక్తిమీద అధికారం ఏర్పడుతుంది చేయవలెసిందల్లా ఏమంటే ప్రతిరోజా ఉభయ సంధ్యల్లో 6 గం సమయాన శ్రీ మాస్టరుగారికి ఆత్మసమర్పణ చేసి ధ్యానించడం, అరగంటో పావుగంటో ఎవరి శక్తి సామర్థ్యాలను బట్టి వాళ్ళు ధ్యానం చేస్తేచాలు. తరువాత బాధ్యతలన్నీ ఆయనే చూసు కుంటారు మృత్యుతత్వం తెలుసుకొంటే మృత్యుంజయుత్వమే

గ్రహించేది అమృత యోగము. ఈ యోగంద్వారా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ మైనంపాటి నరసింహంగారు సాధించిన అద్భుతాద్భుతమైన ఫలితాలు అనేకం. ఇది నిజానికి అమృత స్వామ్యయోగం. ఒకవ్యక్తి పరిపూర్ణత కోసం ఉద్దేశించింది కాదు. సకల ప్రాణుల సంక్షేమపథకం. అత్యద్భుతము, అపరిమేయము అయిన యోగలీలా విభూతులను ప్రసరింప చేసిన శ్రీ మాస్టరుగారి దివ్యనామం కంచుపాటి వెంకాస్వామిరావు సి.వి.వి. అనే అక్షర త్రయం దివ్యమంత్రం. వారి అనుగ్రహతరంగదైర్ఘ్యం మనను తాకేమాటమీట అది. వారి రేడియోను 'ట్యూన్' చేయుడమన్నమాట. **1868** ఆగస్టు **4** శ్రీవారి ప్రభవం. పాంచభౌతికం వీడటం **1922**. తల్లిదండ్రులు కామమ్మ, కుప్పు స్వామయ్యగారలు, కుంభకోణం నివాసస్థలం. విజయనగర రాజుల సామంతులుగా తెలుగు నాయికులుదక్షిణాదిప్రాంతాలను పరిపాలించిన కాలంలో ఆ ప్రాంతాలకు వలసవెళ్ళిన తెలుగు కుటుంబం శ్రీవారిది. మాస్టర్ సి.వి.వి. యోగతత్త్వాన్ని, మహామహిమోపేతదివ్య లీలావతార విశేషాలను తెలుసుకోవాలనుకుంటే శ్రీ కొత్తరామకోటయ్యగారి భృక్తరహిత తారకరాజ యోగతత్త్వ ప్రతిపాదాత్మక గ్రంథాన్నీ, కులపతి ఎక్కిరాలకృష్ణమా చార్యులవారి మాస్టర్ సి వి వి లీలామార్గ జీవిత చరిత్రను చదవవచ్చు.



# తిరుపతి వేంకటకవులు



అద్వైత నాంధ్రకవి ప్రపంచ నిర్మాత శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి అని పింగళి-కాటూరి కవులు తమ సౌందర నందం కావ్యాన్ని చెళ్ళపిళ్ల వారికి అంకితం చేశారు. ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యంలో ఎటుచూసినా తిరుపతి వేంకటకవుల మహా ప్రతిభ ఆవరించుకొని కనపడుతుంది. ఈ శతాబ్దిలో గొప్ప పేరు ప్రతిష్టలు సంపాదించిన కవులంతా తిరుపతి వేంకట కవులకు శిష్యులలో, ప్రశిష్యులో అయివుంటారు. జంట కవులలో ఒకరైన దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు 1919 లోనే పరమపదించినా అటు తరువాత వేంకట శాస్త్రిగారు మూడు దశాబ్దాలు జీవించి రచనా వ్యాసంగం సాగించి తిరుపతి వేంకట కవులుగానే వినుతికెక్కారు.

తెలుగు పద్యాన్ని వీధిలోకి తెచ్చిన ఘనత వీరిది. పద్యానికి వచనమంత ప్రాచుర్యం కల్పించటం తిరుపతి వేంకటకవుల గొప్ప ప్రతిభకు తార్కాణం. 'కవనార్థం బుదయించితిన్' అనీ 'నాభవమద్దాన తరింతుననీ' చెప్ప గలిగిన ధీశాలులు చెళ్ళపిళ్ళవారు.

తిరుపతి వేంకటకవులు ఆంధ్రదేశం నలుమూలలా కవితా జైత్రయాత్ర చేశారు. ఆనాటి సంస్థానాధిపతు లందరిచేత సన్మానితులైనారు. సంస్కృతంలోగాని, తెలుగులోగాని తమకు ఎదురు నిలవగలిగిన వారెవరైనా ఉంటేరండని మీసం తిప్పి సవాలు చేశారు. 'అటు గద్వాలిటు చెన్నపట్టణము మధ్యం గల్గు దేశమ్మునం జటుల స్ఫూర్తి శతావధానములు' చేశామని ప్రకటించుకున్నారు. 'ఏనుగులెక్కినాము, ధరణీంద్రులు మ్రొక్కగనిక్కినాము, సన్మానము లొందినాము, బహుమానములన్ గ్రహియించినాము' అని ఢంకా మ్రోగించి ఆంధ్రదేశాన్నంతా తమకవితా వీరవిహారంతో, మహేంద్ర జాలంతో సమ్మోహితం చేశారు. తిరుపతి వేంకటకవులు రచించిన 'పాండవోద్యోగ విజయాలు' తెలుగునాట వేలసార్లు ప్రదర్శితమైనాయి 'బావా ఎప్పుడు వచ్చితీవు',

'జెండాపై కపిరాజు', 'అదుగో ద్వారక' వంటి పద్యాలు కాస్త అక్షరాస్యులైన వారి అందరి నాలుకలపై నర్తించాయి. ఇటు కొప్పరపు సోదరకవులతోనూ అటు వేంకటరామకృష్ణకవులతోనూ తిరుపతి వేంకటకవులు సలిపిన సాహిత్య వాదవివాదాలు తెలుగువారిని సంభ్రమాశ్చర్య చకితులను చేశాయి.

చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు ఆనాడు వివిధ పత్రికలలో రచించిన కథలు-గాథలు తర్వాత మూడు సంపుటాలుగా వెలువడ్డాయి. ఇవి ఈ రెండు శతాబ్దాల తెలుగుభాషా సాహిత్యాలకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వాలు. వ్యవహారిక భాషా సౌందర్యానికి అవి తరగని గనులు. చెళ్ళపిళ్ళ వారే రచించిన కాశీయాత్ర ఆధునిక సాంఘిక చరిత్రకు అత్యంతమూ విలువైన ఆధార గ్రంథం. ఆనాటి ఉత్తర హిందూస్థానం విశేషాలు తెలుగునాట సామాజిక పరిస్థితులు ఈవిలువైన గ్రంథం వల్ల తెలుస్తాయి. జాతక చర్య పేరుతో తిరుపతి వేంకటకవులు పద్యాలలో స్వీయ చరిత్ర సంధానించారు. శబ్దార్థల్లా, పూవుతావుల్లా సమసించిన ఈ కవులు తెలుగు సాహిత్యంలో ప్రాచీన సరణిని భరతవాక్యం నవీన సరణికి నాందీవాక్యం పలికిన వారన్న ప్రస్తుతికి పాత్రులైనారు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు (1879-1950), దివాకర్ల తిరుపతి శాస్త్రి 1872-1919).





# కాళ్ళకూరి నారాయణరావు

పందొమ్మిదివందల ఇరవై ప్రాంతాలలో ఒక విషాదవార్త భారతదేశాన్ని చాలా ప్రభావితం చేసింది. బెంగాల్‌లో ఒక ముద్దరాలు కట్నపిశాచానికి బలి అయిపోయిన విషాద సంఘటన అది ఆ అమ్మాయి పేరు స్నేహలతాదేవి. కన్నతండ్రి తన కన్నెచెర వదల్చుకోవటానికి కుటుంబానికంతా ఒకే ఒక్క ఆధారమైన ఇంటిని అమ్ముకోవటం స్నేహలత భరించలేక పోయింది. అమానుషమైన యీ ఆచారాన్ని నిరసిస్తూ కరుణా పూరితమైన లేఖ వ్రాసి ఆ ముద్దరాలు ఆత్మహత్య చేసుకుంది. అఖిల భారతంలోనూ ఆ త్యాగమయికి కవులు, రచయితలు అశ్రు నివాళి అర్పించారు

కాళ్ళకూరి నారాయణరావుగారిని ఈ వార్త ఎంతో కలచివేసింది అప్పుడు వెలువడిందే ''వరవిక్రయం'' అనే గొప్ప నాటకం ఆ రోజుల్లో ఊరూరా వాడవాడా వరవిక్రయం నాటకం చాలా ప్రసిద్ధిని పొందింది పుణ్యమూర్తుల పురుషోత్తమ రావుగారి అమ్మాయి చి ల.సౌ. కాళిందికి స్నేహలతాదేవికి సంఘటిల్లిన విషాదమే సంభవించింది. అయితే నారాయణరావు గారు ఆ పర్యవసానాన్ని అట్లా విషాదాంతం చేస్తూ విడిచి పెట్టలేదు. కట్నాలు తీసుకొనేవాళ్ళకు బుద్ధివచ్చేట్లు కరుణరస భరితమైన వరవిక్రయమనే గొప్ప నాటకాన్ని రచించారు. పురుషోత్తమ రావుగారి రెండో అమ్మాయి కమల తన అక్క చేసుకొని ఉండాల్సిన అవరుణ్ణే తాను పెళ్ళాడి ఆ కుటుంబానికి బుద్ధిచెప్పి, లోకానికి వివేకం బోధించింది ఈ శతాబ్ది తెలుగులో వచ్చిన గొప్ప సాంఘిక నాటకాలలో అగ్రగణ్యం వరవిక్రయం.

ఏభై ఏళ్ళ క్రిందట తెలుగు దేశాన్ని,పీల్చి పిప్పిచేస్తున్న సమస్యలు మూడు సంఘంలో వేశ్యాలంపటత్వం, మద్యపాన వ్యసనం, వరకట్నాలబాధ. ఇప్పుడివి సమస్యలు కావని కాదు, అప్పట్లో మొదటి రెండూ బాహాటంగా సంఘాన్ని బాధించేవి. ఈ మూడు సమస్యలను రచించారు కాళ్ళకూరి నారాయణరావుగారు ''చింతామణి'' నాటకంలో సంఘంలో వివిధ స్థాయిలవాళ్ళు వేశ్యావ్యామోహానికి ఎట్లా బలి అయిపోతున్నారో నిరూపించారు. ''మధుసేవ'' అనే నాటకంలో మానవుణ్ణే మద్యపానం ఎటువంటి

హీనస్థితికి దిగజారుస్తుందో చిత్రించారు.

కాళ్ళకూరి నారాయణరావు మేధావి స్వయంభువైన ప్రజ్ఞా విశేషాలలో మేటి. సంగీత సాహిత్యాలలో అసాధారణ ప్రతిభాశాలి హరికథలు చెబితే అటు నారాయణదాసుకు సాటి, ఇటు నారాయణరావు అన్న పేరు తెచ్చుకొని లజ్జాడవారితో సమస్కంధుడై నిలిచినవారు నాటకాలలో వేషాలువేసి షెబాసని మెప్పించుకొన్న ధీశాలి స్వయంకృషితో ఇంగ్లీషు సారస్వతాన్ని మథించిన ప్రజ్ఞావంతుడు. అసావేరి రాగాన్ని రెండు గంటలసేపు ఆలపించగల సంగీతవేత్త ఆ రోజుల్లో చింతామణి, వరవిక్రయం పద్యాలు ప్రజల నోళ్ళలో నర్తించాయి. సారళ్యం, లాలిత్యం, జిగి ఆయన పద్యాలకు వన్నె తెచ్చాయి. ఇంగ్లీషు నాటక రచయితలలో బెర్నార్డ్‌షా అంతటి ప్రతిభావంతుడు నారాయణరావుగారు. చిత్రాభ్యుదయం, పద్మవ్యూహం వంటి చారిత్రక, పౌరాణిక నాటకాలు కూడా వ్రాశారు నారాయణరావు గారు చిత్రాభ్యుదయం నాటకం సుప్రసిద్ధమైన చిత్రాంగ సారంగధరుల కథ. దీనికి ఇంచు మించు నాటకం ఎంత ఉందో అంత విపులమైన ఉపోద్ఘాతం రచించారు నారాయణరావుగారు ఆయన గొప్ప అభినయవేత్త. తమ నాటకాలలో నటించే నటులందరికీ తర్ఫీదు ఇచ్చేవారు సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనాలతోపాటు చతుర్విధాభినయాలలో తలస్పర్శి అయిన పాండిత్యం వీరిది కేవలం తన రచనలనే నమ్ముకొని జీవితం సాగించిన గొప్ప ఆత్మ విశ్వాసి, సాహసి, సాహిత్యం ద్వారా సంఘంలో ఒక పరివర్తనను, సంస్కారాన్ని ఆశించి సందేశాత్మకమైన రచనలు చేశారు ఆయన నాటకాన్ని దేన్నైనా మొట్టమొదటిసారి ప్రదర్శించేవారు ఆయనకు నూటపదహార్లు చెల్లించాల్సిందే. అది ఆయన ఏర్పరచిన కట్టడి. "ప్రతాపరుద్రమ దేవి" అనే చరిత్రాత్మక నవలను రచించారు నారాయణరావుగారు. కాకతీయుల కాలంనాటి చారిత్రక, సామాజిక, సాంస్కృతిక విశేషాలన్నీ ఈ నవలలో ప్రతిఫలింప జేశారు. ఆయన శతావధాని కూడాను.

ఆ రోజుల్లో గుర్రపు బండ్లవాళ్ళు, పడవల వాళ్ళు, కూలీలు, రైతులు, శ్రామికులు నారాయణరావు నాటకాల్లోని పద్యాలు పాడుకొనేవారు. సంఘంలోని లోపాలు ఎత్తిచూపుతూ ఆయన కొన్ని ప్రహసనాలుకూడా రచించారు. నారాయణరావుగారి తల్లిదండ్రులు పూర్ణమాంబ, బంగారురాజుగారలు జననం **1871,** పరమపదం **1927.**



# తంజనగరం తేవప్పెరు మాళ్ళయ్య

దేవరాజ సుధీమణి అవి తేవప్పెరు మాళ్ళయ్యగారికి సాహిత్యనామం. అంటే రచనలన్నీ ఈయన ఆ పేరుతో చేసేవారన్న మాట. భారత, భాగవత, రామాయణాలకు ఒక్కచేతి మీదుగా సులలితమైన సుందరమైన మృదు వచన రచన చేయటం ఎంతకష్టం ఆ పని ఈ సుధీమణి చేశారు. ఈ శతాబ్ది ప్రథమ పాదంలో దేవరాజ సుధీమణిగారి వచన గ్రంథాలు మంచి ప్రచారంలో ఉండేవి. ఆరోజుల్లో మద్రాసులో ఆనందముద్రణాలయ మని ప్రచురణసంస్థ ఉండేది. వావిళ్ళవారి లాగానే వీళ్ళు కూడా భారత భాగవతాలు సుపరిష్కృతంగా చక్కగా ముద్రించేవాళ్ళు.

తేవప్పెరు మాళ్ళయ్యగారి పూర్వీకులది తంజావూరు నివాస స్థానం. సంగీతసాహిత్యాలలో వారు అగ్రతాంబూలాలు అందుకున్నారు. తాతగారిపేరూ, తాతగారి తాతగారిపేరు కూడా తేవప్పెరుమాళ్ళయ్యే. అంటే దేవరాజ సుధీమణి తాతతాతలనాటి కీర్తి నిలిపారన్నమాట. తాతకాలంలో ఈ కుటుంబం మద్రాసు వచ్చింది. తాతగారు నగరంలో పురాణ ప్రవచనాలు చేసి కీర్తి సంపాదించారు. తండ్రి వ్యాపార రంగంలో జీవిక సాగించారు.

దేవరాజ సుధీమణి 16 సంవత్సరాలకే మెట్రిక్యులేషన్ పరీక్షలో కృతార్థులైనారు. అయితే కుటుంబ చిక్కుల వల్ల పై చదువులు సాగలేదు. పరవస్తు చిన్నయ సూరిగారి శిష్యుల దగ్గర దేవరాజ సుధీమణి సాహిత్యాధ్యయనం చేశారు. భగవద్గీతకు ఆయన వ్యాఖ్యానం వ్రాయటంవల్ల ఆనంద ముద్రణాలయం వారితో పరిచయం కలిగింది. ఈ వ్యాఖ్యానాన్ని వాళ్ళు అచ్చువేశారు. తెలుగు వాళ్ళకది ప్రీతి గొలిపింది.

ఇక తరువాత రామాయణం, భారతం, భాగవతం వచనంలో కూర్చారు తేవప్పెరు మాళ్ళయ్యగారు. మనుచరిత్ర, వసుచరిత్ర వంటి ప్రాచీన కావ్యాలకు చక్కని పీఠికలువ్రాసి

ఇచ్చారు. ఆనందావారు అచ్చువేశారు. ఆకాలపు పండితులందరికీ సర్వసాధారణంగా సాహిత్య వివాదాలుండేవి. కాని దేవరాజ సుధీమణితో ఎవరికీ వివాదము లేదు. ఆయన అందరికి గౌరవపాత్రుడుగానే ఉండేవారు. ఎన్నో శతకాలకు, కావ్యాలకు పరిచయ వాక్యాలు, కవిచరిత్రలు కూర్చారు.

1911వ సంవత్సరం ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపనం జరిగినప్పుడు, తెలుగుకు సమగ్ర నిఘంటువు నిర్మింపచేయాలని పండితులంతా తలపోశారు. పిఠాపురం ఈ నిఘంటు నిర్మాణ కార్యస్థానం, వేదం వేంకటరాయశాస్త్రి గారి వంటి గొప్పపండితులు కూడా ఈనిఘంటు రూపకల్పనకు తొలినాళ్ళలో తోడ్పడ్డారు. తేపప్పెరు మాళ్ళయ్యగారు నిఘంటు కార్యస్థానంలో పండిత పదవి నలంకరించారు. లీలాశుకుడి 'కృష్ణకర్ణామృతానికి' దేవరాజ సుధీమణి సరళ ప్రతిపదార్థ తాత్పర్యం కూర్చారు. ఉపనిషత్తుల నుంచి, మంత్ర తంత్రశాస్త్రాల నుంచి శ్రీ కృష్ణపరబ్రహ్మతత్త్వ ప్రతిపాదకమైన రహస్యాలను, మహావిషయాలను దేవరాజు సుధీమణి కృష్ణ కర్ణామృతంలోని ఆయా శ్లోకాల దగ్గర పొందుపరిచారు.

తల్లి శ్రీ రంగమ్మ. తండ్రి రంగ రామానుజయ్య (మన్నారయ్య). జననం 1872, పరమపదం 1921.

క్రిందటి శతాబ్దిలో జన్మించి ఈ శతాబ్దికి సాహిత్య సంప్రదాయాన్ని పరిరక్షించి అందజేసిన గొప్పపండితులు దేవరాజ సుధీమణి.





# చిలుకూరి వీరభద్రరావు

ఇవాల్టి వరకూ తెలుగువారికి చరిత్ర లేదు. సమగ్రమైన ప్రామాణికమైన ఆంధ్రుల చరిత్రను 20 సంపుటాలలో రచించటానికి చిలుకూరు వీరభద్రరావు పంతులుగారు తమ జీవితకాలంలో విశేషంగా శ్రమించారు. ఆయన శక్తియుక్తులన్నీ, ప్రభు మంత్రోత్సాహ శక్తులన్నీ ఇందుకోసమే వినియోగించారు. కాని తెలుగువాళ్ళకు స్వాభిమానం లేకపోయినందువల్ల వీరభద్రరావుగారి కోరిక అట్లానే మిగిలిపోయింది. అయితే ఆయినకు 'చరిత్ర చతురానన' బిరుదం మాత్రం దక్కింది.

చిన్నప్పటినుంచీ ఆయినకు చరిత్ర రచన పట్ల చాలా అభిమానం. ఈ శతాబ్ది మొదట **దశకంలో** వీరభద్రారావుపంతులుగారు ఏలూరు నుంచి దేశోపకారి, విబుధరంజని పేర్లతో పత్రికలు కొన్నాళ్ళు నడిపారు. అటు తరువాత రాజమహేంద్రవరం చేరి ఆనాడు ప్రసిద్ధి వహించిన సత్యవోలు గున్నేశ్వర్రావుగారి ముద్రణశాల నిర్వహించారు. అప్పట్లో 'అంధ్రకేసరి' అనే పత్రికతో కూడా వీరభద్రరావుగారికి సన్నిహిత సంబంధం వుండేది. అంధ్రుల చరిత్రకు కావాల్సిన సమాచారం సేకరించటానికి 1909వ సంవత్సరంలో వీరభద్రరావుగారు మద్రాసు వెళ్ళారు. అక్కడ వారికి కొమర్రాజు లక్ష్మణరావుగారితో పరిచయమైంది.

ఇరువురి హృదయాలు కలసినయ్. లక్ష్మణరావు పంతులుగారు నడుపుతూఉన్న విజ్ఞాన చంద్రికా గ్రంథమాల ద్వారా వీరభద్రరావు పంతులుగారి ఆంధ్రుల చరిత్ర 1, 2 భాగాలు అచ్చయినాయి. లోకమంతా కాదన్నా తాము నమ్మిన సత్యాన్ని నిర్భయంగా వెల్లడించే ఖండితవాది పంతులుగారు. అందువల్ల ఆయినకు చాలామందితో అభిప్రాయ భేదాలు కలిగాయి చరిత్ర విషయంలో వీరభద్రరావుగారి సత్యసంధత ఎంతో మెచ్చుకోదగిందని చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారు 'కథలు గాథలు'లో చెప్పారు. వీరభద్రరావురచించిన కల్లూరి వెంకట రామశాస్త్రి జీవిత చరిత్రద్వారా తెలుగుదేశపు ఈ శతాబ్ది ప్రథమ పాదంలోని

సాహిత్య సమాజ సాంస్కృతిక విషయాలను తెలుసుకోవచ్చు. శ్రీనాథకవి జీవితాన్ని రచించి పంతులుగారు అదివరలో పండిత విమర్శకులు నమ్మిన శ్రీనాథుడు భోగలాలసుడనే అభిప్రాయాన్ని పూర్తిగా ఖండించారు. విజ్ఞానచంద్రిక ద్వారా కాక ఇంకొక రెండు సంపుటాలు మాత్రమే వీరభద్రరావు గారి చరిత్ర సంపుటాలు వెలువడ్డాయి. జీర్ణకర్ణాట సామ్రాజ్య చరిత్ర పేరుతో విజయనగర సామ్రాజ్య చరిత్రను రచించారు వీరభద్రరావుగారు.

తెలుగువాళ్ళు సంస్థా నిర్మాతలు కారు. స్థిరంగా నిలిచే పనులకు ప్రోత్సాహకులు కారు. ఐకమత్యమూ, ఉదారదృష్టి వాళ్ళకు తక్కువ. అందువల్ల ఎందరో ప్రతిభావంతుల యోగ్యతనుంచి జాతి పొందవలసిన మేలు పొందలేకపోయింది.

వీరభద్రరావు పంతులుగారి జన్మస్థానం పశ్చిమ గోదావరి జిల్లా రేలంగి. పుట్టుక సంవత్సరం **1872**. తల్లి సీతమ్మ. తండ్రి వీరరాజు. పంతులుగారి పరమపదం **1939**.

★★★★



# ఆంధ్రకేసరి

''ఆ కాలంలో వాళ్ళ జీవితాలు మంచి హుందాగాను గంభీరంగానూ నిగ్రహంతోనూ గడిచిపోయేవి. కుటుంబాల్లో అన్యోన్య ప్రేమాతిశయాలు చాలా ఎక్కువగా ఉండేవి''.

''జీవితావసరాలు కలసి పంచుకొని అనుభవించే లక్షణం ఒక పవిత్రతగా భావింపబడేది. ఈనాడు మనకళ్ళ ఎదుట కనబడే స్వార్థం ఆరోజుల్లో అంతగా కనపడేదికాదు''

''మనుషుల్లో ఉండే ప్రేమాతిశయాలు గంభీరంగా కనపడేవి''

''మాయిళ్ళలో కదురుకవ్వాలు ఆడడం వల్ల లేమి అనేది లేకుండా ఉండింది''

ఈనాడు మట్టిపాత్రలంటే ఐశ్వర్యవంతులం అనుకునేవాళ్ళు చాలాన్యూనతగా చూస్తారు ఆ కాలంలో గౌరవ కుటుంబాల లెక్కలో ఉన్న మా ఇళ్ళలో కూడా మట్టిపాత్రలోనే వంటకాలు జరిగేవి.''

నూరేళ్ళనాటి సమాజాన్ని గూర్చి ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు స్వీయ చరిత్రలో వ్రాసిన అభిప్రాయాలివి. అరవిందయోగి జన్మించిన సంవత్సరమే ప్రకాశం కూడా జన్మించారు. ఒక మధ్య తరగతి కుటుంబంలో, అతిసాధారణ పరిస్థితులలో ఆయన జన్మించినా ఈ శతాబ్ది తెలుగు ప్రముఖులలో, తెలుగు ప్రజల హృదయాలలో చిరస్థాయి అయిన స్థానం సంపాదించుకొన్నారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో అనేక రంగాలను ప్రభావితం చేసిన తొలి తరం నాయకులయిన చిత్తరంజన్‌దాస్, లాలాలజపతిరాయ్, మోతీలాల్ నెహ్రూ, విటల్‌భాయిపటేల్, మదన్ మోహన మాలవ్యాకోవకు చెందిన జాతిరత్నం ప్రకాశంపంతులు, త్యాగానికి, నిర్భయితకు, సాహసానికి, ప్రజాహిత తత్పరతకు, గెలుపు ఓటముల విషయంలో స్థిత ప్రజ్ఞతకు ప్రకాశం పేరు పర్యాయ పదం, రూపాంతరంగాను కీర్తికెక్కింది. 1933వ సంవత్సరం సైమన్ కమీషన్ వచ్చినపుడు ఆయన వాళ్ళరాకకు అసమ్మతి ప్రదర్శించిన సందర్భంలో చూపిన సాహసం నిరుపమానం. ప్రజావాహినికి అగ్రస్థితుడై ఆయిన సైనిక పటాలాన్ని లెక్కచేయలేదు. ఆంధ్రకేసరి అనే

బిరుదు ఆయినకు అన్వర్థం.

తెలుగుదేశంలో ఒక మారుమూల గ్రామమైన కనపర్తిలో పుట్టి ఒంగోలు, రాజమహేంద్రవరాలలో చిన్ననాటి చదువులు సాగించి, ఇంగ్లండ్ వెళ్ళి బారిస్టరై వచ్చి రాజమండ్రి, మద్రాసులలో ప్లీడరీచేసి లక్షలార్జించి, కాంగ్రెసు ఉద్యమం కోసం స్వరాజ్య పత్రికను నడిపి, దక్షిణభారత దేశంలో కాంగ్రెసు నాయికులలో అగ్ర శ్రేణికి చెందికూడా తెలుగు ప్రజల కష్ట సుఖాలతో మమేకమై వారికోసమే జీవించాడు ప్రకాశం. ఏ పని చేపట్టినా, ఏ అపజయం ఎదుర్కొన్నా తెలుగు ప్రజల మేలునే కాంక్షించాడు.

50 సంవత్సరాల వయసు రాకుండానే లక్షలార్జిస్తూ ఉన్న న్యాయవాదివృత్తిని వదిలేసి దేశహితం కోసం నదుం కట్టి రాజకీయరంగం మొగలోకి ఉరికారు ప్రకాశంపంతులు. ఇంగ్లండులో చదువుకునే రోజుల్లోనే దాదాభాయినౌరోజీ, శ్యాంజీ కృష్ణవర్మ, రమేశచంద్రదత్తు, కాంగ్రెసు సంస్థ ప్రథమాధ్యక్షుడు డబ్ల్యు.సి.బెనర్జీలతో ఆయినకు దగ్గర పరిచయం ఉండేది. సుమారు అర్థశతాబ్ది భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రలోనూ అందునా ముఖ్యంగా తెలుగు దేశపు స్వాతంత్ర్యోద్యమ పరిణామాలతోనూ ప్రకాశంపంతులకి చరిత్రాత్మకమైన స్థానం ఉంది. ఈ శతాబ్ది తెలుగు తేజఃపుంజమాయిన వ్యక్తిత్వం, స్వామిశ్రద్ధానంద, భాలగంగాధరతిలక్, స్వామివివేకానందలతో ఆయిన హైందవ జాతీయితత్వాన్ని గూర్చి చర్చించి ఎన్నో సంగతులు తెలుసుకున్నానని స్వీయ చరిత్రలో వ్రాసుకున్నాడు. ఆయన జీవితం నవలకన్నా ఉత్కంఠ కలిగిస్తుంది. జాతీయ స్ఫూర్తి కలిగించగల ప్రజానాయకుడు ప్రకాశం. తండ్రి గోపాలకృష్ణయ్య, తల్లి సుబ్బమ్మ, స్వర్గతి 1957

★★★★

# పండిత దివి గోపాలాచార్యులు



"దేశ భక్తులంటేను, దేశ సేవకులంటేను కేవలం రాజకీయ ఉద్యమాలలోనే పాల్గొని కారాగారాలకు పోయి ప్రసిద్ధికెక్కిన వారేగాక, ప్రజలతో ఉండి వారి అభిమతాన్ననుసరించి స్వస్థాన వేషభాషాశాస్త్ర ప్రబుద్ధులై జాతీయ సంస్కృతిని శాస్త్రాలను, కళలను ఉద్ధరించడానికై కృషిచేసి, ప్రజల విజ్ఞానాభివృద్ధికి దేశ ప్రజల ఆరోగ్య ఐశ్వర్యాల అభివృద్ధికి పాటుపడిన మహితాత్ములు ఎందరో ఉన్నారు." అని గోపాలాచార్యులకి నివాళి ఘటించారు శ్రీ వేటూరి శంకర శాస్త్రిగారు. పండిత దివి గోపాలాచార్యులుగారు గొప్ప దేశభక్తులు. భారత దేశంలోని ప్రజలు విశేషధన వ్యయం లేకుండా ఆయురారోగ్యాలతో విలసిల్లాలని ఆయుర్వేద విజ్ఞానాభివృద్ధి కోసం యెంతగానో కృషి చేశారు. బ్రిటీషు ప్రభుత్వపు పరిపాలనా పద్ధతులను ఆచార్లుగారు ఎప్పుడూ విమర్శిస్తూ ఉండేవారనీ, అయినా ఆయనకు "వైద్యరత్న" అనే బిరుదం ప్రభుత్వమే ఇచ్చిందని ఆచంట లక్ష్మీపతిగారు వ్రాశారు. ఆయా రంగాలలో రాజారామ్మోహనరాయలు, రవీంద్రనాథ ఠాగూర్, వీరేశలింగం, కాశీనాథుని వారిలాగా గోపాలాచార్యులవారి సేవ అటువంటిది.

మచిలీపట్నంలో జన్మించి, మైసూరు ఆయుర్వేద కళాశాలలో మంచి విద్వాంసుడై భారతదేశంలో ఆధునిక కాలంలో మొట్టమొదటి ఆయుర్వేద కళాశాలను స్థాపించి ఆసేతు శీతాచలం అపర ధన్వంతరి, వైద్య మార్తాండ, అనే ప్రస్తుతిగాంచిన మహనీయుడు ఆచార్యులవారు. నిండా ఏభై సంవత్సరాలన్నా ఆయన జీవించక పోవటం తెలుగువాళ్ళ దురదృష్టం. శతాధికంగా ఉత్తమ ఆయుర్వేదపు గ్రంధాలు సేకరించి భద్రపరచి, వాటిలో ఎన్నిటికో సరళ సుందరమైన వ్యాఖ్యానువాదాలు వెలయించిన మనీషి పతంసుడాయన. ఆనాటి సివిల్ సర్జన్‌లతో సమానంగా ఇంటికి వెళ్ళిచూడాల్సినప్పుడు రోగనిదాన రుసుము ఆయన కూడా తీసుకొనేవారట. వాళ్ళు 5 రూపాయలు తీసుకొనే వారుట ఆ రోజుల్లో. రోజుకు **4, 5** వందల మంది రోగులను చూసి వైద్య నిర్ణయం చేసేవారు గోపాలాచార్యులు.

ఆయన నడిపే వైద్యశాలలోనే మందులు ఇచ్చేవారు. ఈవిధంగా రోజూ ధన్వంతరి వైద్యశాలలో అమ్మకమయ్యే మందుల తాలూకు వచ్చే రొక్కంలో నోట్లు, నాణేలు మాత్రం తాము తీసుకొని చిల్లరనంతా అక్కడపని చేసేవారికిచ్చేసే వారుట ఆచార్యులవారు. ఆవిధంగా అక్కడ మందులు రోగార్తులకమ్మే వ్యక్తి లక్షాధికారి అయినాడని గోపాలాచార్యుల జీవితోదంతం స్మరించినవారు వ్రాశారు. అఖిల భారతదేశంలో ఎక్కడ ఏ ఆయుర్వేద వైద్య మహాసమ్మేళనం జరిగినా ఆయుర్వేద విజ్ఞాన సదస్సు జరిగినా దానికి గోపాలాచార్యుల వారే అధ్యక్షులు. లక్నోలోని దయానంద ఆయుర్వేద కళాశాలకు శంకుస్థాపనం చేసింది ఆచార్యులవారే ఆచార్యులవారి గుప్త దానాలకు లెక్కలేదు. మైసూరు ఆయుర్వేద కళాశాలకు తన తదనంతరం చెందేట్లుగా నలభై వేల సొత్తు ఆయన వీలునామాలో కేటాయించారు కవిపండితాభిమాని సాంస్కృతికరసికుడు. భారతదేశమంతా ఈ శతాబ్ది ఆయుర్వేద విజ్ఞానం దోసపాదులా అల్లుకున్నదంటే అందుకు గోపాలాచార్యులే కారణం. ఆయన శిష్యసంపద అపారం 1917లో అఖిల భారతాయుర్వేద సమ్మేళనంలో బాలగంగాధర తిలక్ సరసన కూర్చున్నారు ఆచార్యులుగారు.

భారతదేశంలో ఆనాడు జరిగిన అన్ని ఆయుర్వేద మహాసభలకు ఆచార్యులవారే అధ్యక్షులు. వీరు ఎన్నో బంగారు పతకాలు పొందారు. జననం 1872; లోకాంతర గతి 1920. తల్లి దండ్రులు రాజ్యలక్ష్మి రామకృష్ణమాచార్యులు.



# మారేపల్లి రామచంద్రశాస్త్రి



ఈ శతాబ్ది తెలుగుదేశంలో దక్షిణ ప్రాంతంలో ఒక కవిగారూ, ఉత్తర ప్రాంతంలో ఒక కవిగారూ తెలుగుదేశ మంతటా చాలా ప్రఖ్యాతి పొందారు. రాజమహేంద్ర వరంనుంచి ఉత్తర జిల్లాలలో కవిగారు మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు. మరో కవిగారు మానవల్లి రామకృష్ణ కవి మద్రాసులో, తిరుపతిలో వారు తెలుగు వెలుగు.

మారేపల్లి రామచంద్ర శాస్త్రి బహుభాషావేత్త, నిష్కళంక, నిరుపమాన జాతీయోద్యమ ప్రచారకులు. విశాఖ జిల్లాలో సత్యాగ్రహోద్యమాన్ని ప్రజ్వలింప చేసినవారు. స్వదేశి స్వభాష, స్వతంత్రం మూర్తీభవించినవారు.

తెలుగు భాషకు గొప్ప నిఘంటువును నిర్మించాలని నాలుగు 'దశాబ్దాలు కృషి చేసిన మహా మేధానిధి శాస్త్రిగారు. తెలుగు పదాలను వ్యుత్పత్తులను విశ్లేషించి చూపటానికి సంస్కృతి, ప్రాకృతాలతో పాటుగా పోర్చుగీసు, ఫ్రెంచి, బర్మా, బ్రెజిల్, లాటిన్ భాషలను కూడా వీరు సంప్రదించినట్లు నుడికడలి ముద్రు పుటలను బట్టే తెలుస్తున్నది. భారతదేశమంతా పర్యటించి తెలుగు భాషకు ప్రామాణికమైన నిఘంటువును నిర్మించాలని శాస్త్రిగారు సంకల్పించారు. కలకత్తా వెళ్ళి పాలీ, మాగధి, అర్ధమాగధి నిఘంటువులు పరిశీలించారు. తెలుగుదేశంలోని కవి పండితుల సాయం అర్థించారు. వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. తెలుగుదేశంలో కావ్యనాటక శాస్త్ర చరిత్ర గ్రంథాలను ప్రకటించే ఉద్దేశ్యంతో **1904**లోనే ఒక గ్రంథమాలికను స్థాపించారు. ఆధునిక కాలంలో యీ ఉద్దేశ్యంతో స్థాపించిన గ్రంథమాలికా ప్రచురణ సంస్థలలో ఇదే మొదటిది. తెలుగు భాషను సర్వ విజ్ఞాన వాహికగా తీర్చిదిద్దాలన్నదే శాస్త్రిగారి ఆశయం. అందుకని ఆయన తెలుగు పదాలనే తప్ప సంస్కృతం ఎంతమాత్రం ఉపయోగించేవారు కాదు. 'క్షేమం' అని రాయటానికి 'మేల్' అనేవారు. కావ్యం అంటే నుడికూర్పు, వ్యాకరణం అంటే నుడితీర్పు, నిఘంటువు అంటే నుడిదండ – అని వ్యవహరించేవారు. ఇంత అభిమానం కొంత వింతగా ఉన్నా ఆయన అభినివేశం మెచ్చదగినది. తెలుగువారి దురదృష్టంవల్ల నుడికడలి ఏమై పోయిందో తెలియదు. **సుమారు 36** గ్రంథాలు వ్రాశారు శాస్త్రిగారు.

శాస్త్రిగారిని స్మరించుకోవటం జాతికి బలవర్ధకం, గుణవర్ధకం.... శాస్త్రిగారి జననం 1874, పరమపదం 1951; తల్లిదండ్రులు కనకదుర్గమ్మ, శ్రీరాములు గారలు. కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా కనకవల్లి అగ్రహారం జన్మస్థలం.

260

★★★★



# బెల్లంకొండ రామారావు

శ్రీ బెల్లంకొండ రామారావుగారు మహాపురుషులు. ఆయన్ను అదిశంకర భగవత్పాదుల అపరావతారం అని చెప్పవచ్చు. భగవత్పాదులవారు దివ్యమానుషవిభూతి నెరపినది 32 సంవత్సరములే. శ్రీరామరాయి మహామనీషులు కూడా కేవలం 38 సంవత్సరములే జీవించారు. ఆయన కారణజన్ముడు కాని సాధారణుడు కాదు.

రామరాయి కవీంద్రుల తర్కవాదరముందు సాహసించి ఎవరున్నా నిలువలేరు. ఆయన రచించిన శంకరాశంకరాభాష్యం అద్భుతమైన గ్రంథం. ఆదిశంకర.లైనవీ అశంకరములైనవీ అయిన వేదాంతతత్త్వ భూమికలను ఈ గ్రంథంలో ఆయిన 'తులనాత్మక పరిశీలనంచేసి నిగ్గుతేల్చారు అద్వైత పరమ శిఖరాధిష్ఠితమైన రామరాయిని మూర్తిమంతం ముచ్చట గొలుపుతుంది. రామరాయ కవీంద్రులవారు విశిష్టాద్వైత సంప్రదాయిం లెస్సగా తెలిసినవారు కాబట్టే మొదట వారు ఆ సంప్రదాయానికే చెందినవారు కాబట్టే అశాంకరీయమైన దర్శనాలను కాదనగల అధికారం వారికి హస్తామలకమైంది. శంకరాద్వైతాన్ని దృఢంగాప్రతిష్ఠించారు. సులలితమైన సంస్కృతవాణి రామరాయి కవీశ్వరులది. అది మధుకుల్య రుక్మిణీ పరిణయి చంపువు మొదలైన కావ్యాలు, వేదాంత, దర్శన, మీమాంస గ్రంథాలు రామరాయి కవీంద్రులు పిన్నవయసుననే ఎన్నో రచించారు.

జీవులు, భగవంతుడు వేదప్రమాణం, వీటిని గూర్చి ఆయన ధీలలిత చమత్కారోక్తులతో తమ వాదాన్ని స్థాపించారు. అన్య దర్శనాలను కాదన్నారు. ఆచార్య ఆదిశంకర భగవత్పాదులవారు భగవద్గీతకు చేసిన వ్యాఖ్యానానికి అత్యంత ప్రతిభావంతంగా మిక్కిలి విపులంగా రామరాయి కవీంద్రులు భగవద్గీతాభాషణార్థప్రకాశికను వెలయించారు. సంస్కృత వ్యాకరణ భాష్యాలలో పరమ శిఖరాధిష్టితమైన సిద్ధాంత కౌముదికి 'శరద్రాత్రి' అనే పేరుతో గొప్ప వ్యాఖ్యానం వ్రాసారు. సిద్ధాంతబిందు' అనే వేదాంత పారమ్య గ్రంథానికి సిద్ధాంత సింధు అనే గొప్ప వ్యాఖ్యానం రచించారు. రామరాయి కవీంద్రులవారు శతాధిక గ్రంథకర్త. హయగ్రీవోపాసకులు. వారి చంపూ భాగవతం బహుప్రశస్తమైన కావ్యం దానికి

వారు మంథర అనే గొప్ప వ్యాఖ్య రచించారు. 18 సంవత్సరముల వయస్సుననే 'రుక్మిణీ పరిణయం' 'రమా పరిణయం' అనే చంపూకావ్యాలు సంస్కృతంలో రచించారు. అరవైకిమించి అష్టకాలు, స్తోత్రాలు రచించారు. ఎందరి శిష్యులకో ఇంట్లో అన్నపానాదులు కల్పించి చదువు చెప్పారు మొత్తం 148 గ్రంథాలు వీరు రచించినట్లు చెబుతారు. కాని 30 మాత్రమే అచ్చైనవి. ఆయిన స్వయంభువు, మహాయోగి. జననం 1875, పరమపదం 1914



# తేకుమళ్ళ రాజగోపాలరావు



స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఆత్మ విస్మృతమైన జాతిని తట్టిలేపి, బానిసత్వపు బంధాలను త్రెంచుకోవటానికి ఎందరో మహనీయులు జాతికి జీవశక్తిని ప్రదానం చేశారు ప్రభోధించారు. ఆసేతు శీతాచలం కిందటి శతాబ్ది ఉత్తరార్ధంలో మహాపురుషులెందరో జన్మించి భారతీయ సాంస్కృతిక జీవితం లోని ఏకత్వంలోని బహుత్వాన్ని, బహుత్వం లోని ఏకతను సమన్వయిం చేశారు.

తేకుమళ్ళ రాజగోపాలరావు గొప్పచరిత్ర పరిశోధకులు, అంతకు మించి సృజనాత్మక ప్రతిభగల రచయిత. వీరికి ప్రాచీన చరిత్ర, జాతుల పుట్టు పూర్వోత్తరాలు, మానవ శాస్త్రం, జానపద సాహిత్యం, దేశదేశాల పురాణ గాధలు , సాదృశ్య భాషాశాస్త్రం ఛందోవిశేషాలు మొదలైన అనేక విషయాలపై సాధికారమైన పాండిత్యం వుండేది. చిల్లరిగె శ్రీనివాసరావు గారు రచించిన ఆంధ్రుల చరిత్రకు బహు విపులమైన పీరిక వ్రాస్తూ ప్రపంచ దేశాలలోని ఆదిమవాసుల పుట్టుపూర్వోత్తరాలు, ఆయా జాతులవలసలు, వారి పురాణగాథలు, భాషాపరిణామాలు వివరిస్తూ అత్యంతాశ్చర్యకర మైన సంగతులెన్నో వ్రాశారు. దక్షిణ భారతీయ జాతులలో తెలుగు వారే అత్యంత ప్రాచీనులని తెలుగునుంచే తక్కిన దాక్షిణాత్య భాషలన్నీ ప్రభవించాయిని రాజగోపాలరావుగారు గాఢంగా విశ్వసించటమే కాక గొప్ప సిద్ధాంతం లేవనెత్తారు. దక్షిణ భారత చరిత్ర పరిశోధన అనే పేరుతో ఒక పరిశోధన పత్రికను ప్రారంభించి ఇంగ్లీషులో ప్రకటిస్తూ ఆ పత్రికను ఆరేళ్ళు నడిపారు. దక్షిణాది భాషల ఛందశ్శాస్త్రాన్ని గూర్చి తుల నాత్మక మైన పరిశోధన వీరే ప్రారంభించారని చెప్పవచ్చు. క్రిందటి శతాబ్ది చివరి దశకంలో రాజమహేంద్రవరం నుంచి వెలువడుతూ చింతామణి పత్రిక మొట్టమొదటి సారి తెలుగులో నవలా పోటీలు నిర్వహించి నప్పుడు రాజగోపాలరావు గారు కూడా పాల్గొని తమ త్రివిక్రమవిలాస మనే నవలకు బహుమానం పొందారు. విజ్ఞాన శాస్త్రగవేషణకు సంబంధించి తెలుగులో మొట్టమొదటి నవలను రచించిన వారు రాజగోపాలరావు గారే. ఈ నవల పేరు విహంగయానము. అంటార్కిటికా ఖండంలోని విశేషాలను జలాంతర్గాముల ద్వారా వెళ్ళి

తెలుగు వాళ్ళు కనుక్కున్నట్లు వర్ణించి సంతోషించారు. తెలుగు భాష, తెలుగు చరిత్ర, తెలుగు వాళ్ళ విజ్ఞాన ప్రాభవాలను గూర్చి ఆసక్తికరమైన విషయాలను చెప్పటంలో రాజగోపాలరావు గారికి మక్కువ ఎక్కువ. తెలుగు వారి చరిత్రను ప్రశంసిస్తూ 'కనకవల్లి' అనే నవలను రచించారు రావుగారు. 1900సం.నాటికే హిందు సంఘ సంస్కారచరిత్రను రచించి మహదేవ గోవింద రానడే కు అంకితం ఇచ్చారు శ్రీరావు. పెద్దాపురం సంస్థానం చరిత్ర ఆధారంగా 'లలిత' అనే గొప్ప నవల రచించారు రాజగోపాలరావుగారు. విజ్ఞానతృష్ణతో ఇంగ్లండు వెళ్ళి అక్కడి భారతీయ భవన మందిరంలో ఆరు నెలలు పరిశోధన చేశారు. జననం 1876 పరమపదం 1938. జన్మస్థలం పెద్దాపురం. తండ్రి నారాయణరావు, విజయనగరంలో స్థిర పడ్డారు. ''భాషాతత్త్వ విశారద'' అనే బిరుదు పొందారు. మద్రాసులో కాలగతి నొందారు.

# బంకుపల్లి మల్లయ్య శాస్త్రి



తమ తండ్రిగారిని గురించి శ్రీమతి వేదుల కృష్ణవేణమ్మ గారు ఇట్లా వ్రాశారు.

"ఆయన గురువు ప్రసిద్ధ పండితులైన పరవస్తు రంగాచార్యుల వారలుంగారు. అందుచేతనే మా తండ్రి తన కొడుకికి గురువుగారి పేరుపెట్టుకున్నాడు. ఆయన గురుభక్తి ఎటువంటిదో మరి వేరే చెప్పడమెందుకు? శాస్త్రాలలోను పురాణాలలోను పాండిత్యమే కాదు. అన్ని విద్యలలోను పురాణాలలోను ఆయన ప్రవీణ్యుడు అనడమూ అసత్యమూ కాదు. ఆయన చక్కని సంగీతము పాడేవాడు. పంచాంగములు గుణించి రాసేవాడు. పర్లాకిమిడి రాజావారు స్థాపించిన నాటక సమాజంలో సంస్కృతాంధ్ర నాటకములలో రాజావేషము వేసేవారు. కుస్తీ పట్టేవారు. మద్దెల వాయించేవారు. వంట అద్భుతంగా చేసేవారు. కవిత్వం చెప్పేవారు. మంత్రశాస్త్రములో ఆయనకు తెలియని విషయము లేదు. పురాణము అద్భుతముగా చెప్పేవారు. చీకటికోట రాజా వారు ఈయన పురాణ హరికథకు మెచ్చి పురాణ వాచస్పతి అని బిరుదు ఇచ్చారు. సంస్కృతములో అనర్గళంగా ఉపన్యసించేవారు".

హిందూమతానికి జీవశక్తి అయిన. వేదాలను మల్లయ్యశాస్త్రిగారు విద్యారణ్యుల భాష్యానుసారంగా తెలుగుచేశారు. గుంటూరుకు దగ్గరలో కావూరు అనే గ్రామంలో స్వామీ సీతారాం స్థాపించిన వినయాశ్రమం తరపున తెలుగు అర్థ తాత్పర్యాలతో ఋగ్వేదం మాత్రం వెలువడింది. అంటే తక్కినవి వెలువడలేదన్న మాటే కదా! ఇట్లా వీరి గ్రంథాలు ఇంకా ఎన్నో వెలువడవలసి ఉన్నాయి. అరవింద యోగి పురుషోత్తమతత్త్వానికి వ్యాఖ్యానంగా గీతా రహస్యమనే గ్రంథం శాస్త్రిగారు రచించారు. సాహిత్యంలో ఆయన పాండిత్యం అగ్రగణ్యం. సంగీతంలో వీరి లయజ్ఞానాన్ని ఆదిభట్ల నారాయణదాసుగారు కూడా మెచ్చుకునే వారుట. రామకృష్ణ పరమహంస జీవితాన్ని యక్షగానంగా కీర్తించారు. ఇలాగే ఎన్నో యక్షగానాలు వీరివి అముద్రితంగానే ఉండి పోయినవి. ఉత్తరదేశంలోని ఆధునిక మత సంస్కార దీక్షాపరాయణుడైన దయానందుడితో ఈయనకు సామ్యం వుంది. ధర్మశాస్త్రాలన్నిటినీ కరతలా మలకంగా పరిశీలన చేసి అస్పృశ్యతకు హిందూ ధర్మశాస్త్రాలలో ప్రమాణాలు లేవు అని వీరు నిరూపించారు. శృతి ప్రమాణమేదైనా ఎవరైనా

చూపితే గొప్ప బహుమానం ఇప్పించగలమని ప్రకటించారు. ఇంత మహాపండితులై వుండి అపమాన సంప్రదాయ రహస్య తత్వజ్ఞులై ఉండి సంఘ సంస్కరణకు ఉద్యమించారు శాస్త్రిగారు. అనివార్యమైన స్థితిగతులలో స్త్రీ పునర్వివాహం తప్పుకాదన్నారు. ధర్మశాస్త్రాలన్నిటినీ అవలోడనం చేసి క్రోడీకరించి అస్పృశ్యత అనే గ్రంథం వ్రాసి దక్షిణ దేశంలో బహుసభల్లో ఉపన్యసించారు. భాషావిషయకమైన వాదవివాదాలలో గిడుగు రామమూర్తి పంతులుగారిని బలపరిచారు శాస్త్రిగారు. తమ సంతానానికి సంస్కరణ వివాహాలు చేశారు. పర్లాకిమిడి రాజావారి ఉన్నత పాఠశాలలో మొదలు ఆంధ్ర పండితులు గాను, తరువాత కళాశాలలో సంస్కృత పండితులుగాను చాలా సంవత్సరాలు వీరు పనిచేశారు. ప్వస్థలం ఉర్లాము. సాహిత్య వ్యాకరణాలలో నిరుపమాన పండితులు. తల్లిదండ్రులు సూరమ్మ, గంగన్న గారలు, జననం **1876**, పరమపదం **1946**.

★★★★

# వేమూరి రామకృష్ణారావు



గురుశిష్య సంప్రదాయానికి భారతీయ సంస్కృతిలో పరమోదాత్తమైన స్థానమున్నది. గురువు వల్ల శిష్యుడికి శిష్యుడివల్ల గురువుకూ, అటు తరవాత ఆ సంప్రదాయ పరంపరకు చిరకీర్తి లభిండమేకాక జాతీయచైతన్యోద్బోధకంగా వారి పేర్లు స్మరణీయ మవుతున్నాయి. దైవంకన్నా కూడా గురువును మిన్నగా చూసుకొనే సంప్రదాయం మనది. గురుస్సాక్షాత్ పరబ్రహ్మ అదీ అనుబంధం. ఆర్ద్రత గురుశిష్యుల మధ్య.

మన తెలుగు కవులంతా గురుస్తుతి చేసిన వాళ్ళే. అటువంటి గురుశిష్యులు రఘుపతి వెంకటరత్నం నాయుడు, వేమూరి రామకృష్ణారావు. వేమూరి వారి కుటుంబ మంతా సమాజ బాధ్యతా పరాయణమైనది. అన్నదమ్ములంతా సమాజ వికాసంకోసం పాటుపడిన వాళ్ళే.

బందరులో రఘుపతి వెంకటరత్నం గారి దగ్గర వేమూరి రామకృష్ణారావు చదువుకున్నారు. ఆస్తిక్యత, పరిశుద్ధనీతి వర్తనం, శిష్యవత్సలత, బోధన తాదాత్మ్యత, జీవిత సార్థకత, పరమోదారాశయాలు, త్యాగ జీవితం, ఆత్మసమర్పణ ప్రవృత్తి, రఘుపతి వారిద్వారా రామకృష్ణారావులో పరిపూర్ణమైనాయి.

తెలుగుదేశంలో ఆనాటి అధ్యాపకులలో అగ్రగణ్యులు వేమూరి రామకృష్ణరావు. ఆయన విద్యార్థులమని చెప్పుకోవడం 'అది గొప్ప తెలుంగునాడునన్' ఒక్క తెలుగు దేశంలోనే కాదు. ఆయన కలిగించిన సంస్కారం భారతదేశ మంతా పరిమళించింది. వంగదేశం నుంచి కలకత్తా నుంచి కాకినాడకు చదువుకోవడానికి వచ్చేవాళ్ళు విద్యార్థులు. ఒక కాలు చందనం పళ్ళెంలో ఇంకొక కాలు అగ్నిపాత్రలోనూ ఉంచి తీర్పుచెప్పే సంయమం రామకృష్ణరావు గారిది. కాకినాడ కళాశాల ప్రిన్సిపాల్‌గా ఎంతో ప్రసిద్ధులు వారు. కళాశాల యాజమాన్యం వారు తాను అనుచిత మనుకున్న వత్తిడులు తెస్తే పదవిని తృణప్రాయంగా త్యజించిన మహనీయుడు. ప్రతినెలా పేద విద్యార్థులకు క్రమం తప్పక ధనసహాయం చేసిన వదాన్యుడు, విద్యార్థి వసతి గృహాలకు, విద్యార్థుల ఇళ్ళకు వెళ్ళి వాళ్ళ చదువు సంధ్యలను

గూర్చి కనుక్కొనేవారు.

1906వ సంవత్సరం అఖిల భారత ఆస్తిక్య మహాసభలు కలకత్తాలో జరిగినప్పుడు దానికి రఘుపతి వెంకటరత్నం అధ్యక్షులు. ఆ సభల్లో పాల్గొని వేమూరి రామకృష్ణరావు తన నిరుపమాన వైదుష్యం చేత అనర్గళ వాగ్మిత చేత వంగీయులను కూడా ఆకట్టుకొన్న ఆచార్య వర్యుడాయన. తెలుగు దేశంలో అన్ని కళాశాలలకన్నా ఎక్కువ మంది కాకినాడకు పరువులెత్తేవారు.

వేమూరి వారి ఇల్లాలు కాపురానికి రాకుండానే చనిపోయినా ఆయన మళ్ళీ వివాహం చేసుకోకుండా దాంపత్య పావిత్ర్యానికి అంకితమైన మహాపురుషుడు. ఆయన తల్లిదండ్రులు హనుమాయమ్మ, పద్మనాభరావు పుణ్యదంపతులు. వేమూరి రామకృష్ణారావు జననం 1876. పరమపదం 1939. ఎమర్సన్ రచనలు విగ్గుతీసి ఆయన డాక్టరేట్ పట్టా తీసుకున్నారు. కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి ఎమ్.ఏ. డిగ్రీ తీసుకున్నారు. భక్తి జ్ఞాన కర్మల త్రివేణి సంగమం, పవిత్ర ప్రయాగ వేమూరి రామకృష్ణారావు.

★★★★

# కొమర్రాజు లక్ష్మణరావు



పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్థంలో భారతదేశంలో నాలుగు మూలలా మహామనీషులు జన్మించి భారతదేశ స్వాతంత్ర్యోద్యమ పూర్వరంగాన్ని చారిత్రకోజ్జ్వలంగా నిర్వహించారు. పద్దెనిమిది వందల యాభై నుంచి పందొమ్మిది వందల సంవత్సరం వరకూ చూస్తే సాంఘిక సాంస్కృతిక సారస్వత పునరుజ్జీవనం నిర్వహించిన మహోన్నతులు జన్మించిన విషయం చాలా అద్భుతంగా కనపడుతుంది. ఈ శతాబ్ది పూర్వార్థంలో భారతదేశంలోని సామాజిక చైతన్యానికంతకూ నారు పోసి, నీరుపోసి ఫలింపచేసిన మహానుభావులూ ఆయా రంగాలలో విశిష్టమైన సేవావ్రతులూ వారు.

తెలుగుదేశపు ఆధునిక చరిత్రలో కొమర్రాజు వేంకట లక్ష్మణరావు గొప్ప సంస్థా నిర్మాత. బహుముఖ ప్రజ్ఞాశీలి. సాంస్కృతిక పునరుజ్జీవన సంధాత. కృష్ణాజిల్లాలో ఒక చిన్న పల్లెటూరైన పెనుగంచిప్రోలులో పుట్టినా ప్రభావశీలమైన వయసులో ఆయన నాగపూర్‌లో ఉండి విద్యాభ్యాసం చేయటం తటస్థించింది. తిలక్, ఆగార్కర్, గోఖలేలు సామాజిక చైతన్యాన్ని పండిస్తున్న కాలమది. రానడే మహాశయుని ప్రబోధంతో భారతజాతి ఉత్తేజితమవుతున్న సమయమది.

లక్ష్మణరావు గొప్పమేధావి. అగ్రశ్రేణి చరిత్ర పరిశోధకుడు. ఉత్తమ దేశభక్తుడు. అగ్రేసరుడైన జాతీయవాది. ఆధునిక సంఘ సంస్కార పరాయణుడు. భారతీయ భాషలతో తొలిసారిగా విజ్ఞాన సర్వస్వ నిర్మితికి పూనుకొన్న మహామనీషి. స్వావలంబన వీరుడైన సాహసి. 1912 నాటికే తెలుగులో విజ్ఞాన సర్వస్వ ప్రకటనకు పూనుకున్నాడాయన. ముప్పై సంవత్సరాల నిండు యౌవ్వనంలోనే విజ్ఞాన చంద్రికామండలిని స్థాపించి నాలుగు వేలమంది చందాదారులను చేర్చి తెలుగువారి విజ్ఞాన వర్ధనం కోసం పాటుపడిన ధీశాలి. ఇరవై

సంవత్సరాల వయసుననే శివాజీ చరిత్రం రచించి తెలుగు వారిలో జాతీయ చైతన్యం ప్రోదిచేసిన గొప్పరచయిత. బహు భాషావేత్త. ఆయన పాతిక సంవత్సరాల వరకూ నాగపురంలోనే ఉండి ఆటుతరువాత తెలుగుదేశానికి వచ్చి మునగాల సంస్థానానికి దివానుగా పనిచేశారు. 1905వ సంవత్సరంలోనే విజ్ఞాన చంద్రికామండలిని స్థాపించి మహాపురుషుల జీవిత చరిత్రలు, చారిత్రక నవలలు తెలుగులో ప్రకటించారు. హిందూ మహాయుగం, మహమ్మదీయ యుగం, మహారాష్ట్రయుగం, చారిత్రక సంపుటాలుగా ప్రకటించారు. విజ్ఞాన సర్వస్వంలో శాస్త్రీయ విజ్ఞానం, లలితకళలు, సారస్వతం, శాసన పరిశోధన, చరిత్ర పరిశోధనలకు సంబంధించి వందల పుటల పరిమితిగల వ్యాసాలు వ్రాశారు. మునగాల రాజాగారిని ప్రోత్సహించి స్వదేశీ ఉద్యమానికి అండదండలు చేకూర్చారు. మహారాష్ట్ర భాషలో కూడా చెప్పదగిన పాండిత్యం సంపాదించి మోరోపంత్ విరచిత మహాభారతకర్ణ పర్వాన్ని పరిష్కరించి ప్రకటించారు. బెంగాలీ, గుజరాతీ, ప్రాకృత, సంస్కృతాలలో, దక్షిణాది భాషలలోనూ ప్రజ్ఞాశాలి లక్ష్మణ రావు.

నలభైఆరు సంవత్సరాల చిన్న వయస్సుననే ఆయన మరణించడం తెలుగువాళ్ళ ఆధునిక చారిత్రక విషాదఘట్టం. తండ్రి వెంకటప్పయ్య, తల్లి గంగమ్మ. జననం 1877, కాలగతి 1923. లక్ష్మణరావు తెలుగువారి విజ్ఞానజ్యోతి.

★★★★

# ఉన్నవ లక్ష్మీనారాయణ



భారతీయ ఆధునిక సాహిత్య నిర్మాతలలో ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి పేరు చిరస్మరణీయం. భాషలలో దేనిలోనూ ఆధునిక భారత సమాజంలోని అతిక్లిష్టసమస్య వస్తువుగా స్వీకృతం కాని రోజుల్లో అంటరానితనం సమస్యను గూర్చి గొప్ప సృజనాత్మక ప్రతిభతో లక్ష్మీనారాయణ పంతులుగారు! 'మాల పల్లి'ని రచించారు. కారాగార వాసంలో ఒరు లెరుగకుండా దీక్షగా రాసిన మహాకావ్యం మాలపల్లి- ఆనాటి బ్రిటీషు ప్రభుత్వం ఈ నవలను నిషేధించింది. దొరికిన ప్రతులన్నిటినీ జప్తు చేసింది. 1923వ సంవత్సరం కటకటాల వెనుక కిరోసిన్ దీప కాంతిలో పంతులుగారు మాలపల్లి రచించటం, రహస్యంగా అది బయటకు చేరటం బెల్లంకొండ రాఘవరావు పంతులు గారనే ఉత్తమ దేశభక్తులు, మనస్వి, సాహిత్యవ్రతులు దానివి అచ్చు వేయటం అధునిక తెలుగు సాహిత్య చరిత్రలో అపూర్వఘట్టాలు.

వంగ దేశపు ఈశ్వర చంద్ర విద్యాసాగరుల వంటి సంఘ సంస్కరణ పరాయణులు తెలుగుదేశానికి లక్ష్మీనారాయణ పంతులు గారు. గుంటూరులో శారదానికేతనం స్థాపించి మహిళల విశ్వవిద్యా వికాసాల కోసం ఎంతో కృషి చేశారు పంతులుగారు.

స్వాతంత్ర్యోద్యమ సమరంలో ఎన్నిమారులో కారాగార వాస శిక్ష ననుభవించారు. పల్నాటి పుల్లరి సత్యాగ్రహం, పెదనందిపాడు పన్నుల నిరాకరణోద్యమం, ఉప్పు సత్యాగ్రహం వంటి ఘట్టాలలో లక్ష్మీనారాయణ పంతులుగారు తెలుగు వారికి నాయకత్వం వహించారు. పూనా నగరం వెళ్ళి తిలక్ మహాశయుని సందర్శించి తత్వోపదేశం పొందారు. భక్తి జ్ఞాన, కర్మ మార్గాలను తమ సృజనాత్మక రచనలలో సమన్వయించారు లక్ష్మీనారాయణ పంతులుగారు. విశేషం ఏమంటే పంతులుగారి ఇల్లాలు లక్ష్మీబాయమ్మగారు కూడా భర్త అడుగు జాడలలో స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని చెరసాల శిక్షనను భవించారు.

గుంటూరులో క్రిష్టియన్ కళాశాలలో ఎఫ్.ఎ వరకు చదివి 1903లో పంతులుగారు రెండోతరగతి న్యాయవాదిగా ప్రాక్టీస్ ప్రారంభించారు. గుంటూరులో వితంతు

శరణాలయాన్ని స్థాపించి అగతికలైన బాల వితంతువులకు పునర్వివాహాలు చేశారు. రాజమండ్రి వచ్చి తమ సంస్థల కార్యనిర్వహణ యాజమాన్యం వహించ వలసిందిగా వీరేశలింగం పంతులుగారి కోరికపై అక్కడికి వెళ్ళి ఆ సంస్థలను కొన్నాళ్ళపాటు నిర్వహించారు. జాతీయోద్య మాభిమాని. ఉత్తమ దేశభక్తుడు, నిష్కళంక సేవావ్రతి ఉన్నవ లక్ష్మీనారాయణగారు.

**1913**లో బారిస్టర్ పట్టా సంపాదించడానికి పంతులుగారు ఐర్లండ్ వెళ్ళారు. అక్కడి ప్రజాతంత్ర పోరాటాలన్నీ బాగా ఆకళింపు చేసుకున్నారు. ఐరిష్ ప్రజాస్వామ్యం విప్లవ నాయకుడు డివెలరాతో పంతులుగారికి మంచి పరిచయం ఉండేది. ఐర్లండ్ వెళ్ళి బారిస్టర్ చదువు సాగిస్తున్నా పంతులుగారు జాతీయ సంప్రదాయాన్ని, గౌరవాన్ని విస్మరించలేదు. ఆత్మగౌరవాన్ని ఆయన ఏనాడూ వదలుకోలేదు. భారతీయ దుస్తులతో తలపాగ ధరించి ఆయన లా క్లాసులకు హాజరయ్యేవారు. **1926**లో ఆయన భారతదేశం తిరిగి వచ్చారు.

సహాయ నిరాకరణోద్యమంలోను, ఉప్పుసత్యాగ్రహంలోను, ఇంగ్లీషువాళ్ళూ భారతదేశాన్ని వదలి వెళ్ళండి అని గర్జించిన ఉద్యమంలోనూ పంతులుగారు ప్రముఖ పాత్ర వహించి ప్రజలను నడిపారు. మూడుసార్లూ ఆయన **1922, 1930-32, 1942** సంవత్సరాలలో కారాగార క్లేశం అనుభవించారు.

తిక్కన సోమయాజిని గూర్చి గొప్ప పరిశోధన జరిపి పంతులుగారొక నవల వ్రాశారు. కాని తెలుగు వాళ్ళ దురదృష్టంవల్ల అది ప్రకటితం కాలేదు. నాయకురాలిని గూర్చి, ఒక నాటకం వ్రాశారు ఉన్నవవారు. హిందూమతాన్ని గూర్చి ఆంధ్ర విజ్ఞానంలో ప్రశస్తమైన వ్యాసం ప్రకటించారు. తమ జీవితాన్ని ప్రజాసేవకే అంకితం చేసుకున్న మహామనీషి ఉన్నవ వారు.

గుంటూరు జిల్లా వేములూరి పాడులో **1877**లో జననం. వీరి తండ్రి శ్రీ రాములు గారు. లక్ష్మీనారాయణ పంతులుగారి స్వర్గతి **1959**.





# పింగళి వెంకయ్య

పందొమ్మిది సంవత్సరాల వయసున సైన్యంలో చేరి దక్షిణాఫ్రికా బోయరు యుద్ధంలో పాల్గొనటానికి వెళ్ళిన తెలుగువీరుడు శ్రీ వెంకయ్య. అప్పుడాయన షుమారు 1 1/2 సంవత్సరములు ఆఫ్రికాలో గడిపారు. అటుతర్వాత భారతదేశానికి తిరిగి వచ్చారు. 1906వ సంవత్సరము కలకత్తాలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో పాల్గొన్నారు. విషయ నిర్ణాయక సంఘంలో సభ్యుడైనాడు. దాదాభాయినౌరోజీ ఆ సభకు అధ్యక్షులు. రాజకీయాలలో బాలగంగాధర్ తిలక్ అనుయాయి శ్రీ వెంకయ్య. కాంగ్రెస్ సమావేశాలలో బ్రిటిషువారి 'యూనియన్ జాక్'తో పతాకావిష్కరణం జరపటం దుస్సహమైంది వెంకయ్యగారికి. భారతజాతికి ఒక పతాకం అక్కరలేదా అని ఆయన ఎంతగానో బాధపడ్డారు. జాతీయ పతాకంలేని జాతి తలఎత్తుకొని నిలవగలదా? ఆనాటినుంచి భారత జాతీయ పతాక రూప కల్పనలోనే ఆయన అహర్నిశం ప్రొద్దులు పుచ్చారు.

వెంకయ్యగారి జ్ఞానతృష్ణ అపారం. శ్రీలంకవెళ్ళి కొలంబోలోని సిటీకాలేజీలో చేరి కేంబ్రిడ్జి సీనియర్‌లో కృతార్థులైనారు. లాహోర్‌లోని దయానంద ఆంగ్లో వైదిక కళాశాలలో చేరి సంస్కృతం, ఉర్దూ, జపాన్ భాషలు అనర్గళంగా ప్రసంగించగల సామర్థ్యం సాధించారు. 1904లో జపాన్ రష్యాను చిత్తుచేయడంతో భారతీయులకు జపాన్‌దేశం ఆరాధ్యమైంది. అందువల్ల లాలాహంసరాజ్ మహాశయుడు జపాన్ నుంచి ఆచార్యగోటే మహాశయుణ్ణి తమ కళాశాలకాహ్వానించి అధ్యాపకులుగా నియమించారు. జపాన్‌భాష నేర్చుకోవటానికి వెంకయ్యగారు లాహోరువెళ్ళి ఆ భాషను గొప్పగా నేర్చుకున్నారు.

వ్యవసాయ శాస్త్రంలో ఎన్నో పరిశోధనలు సలిపారు వెంకయ్యగారు. కాంబోడియా ప్రత్తిరకాన్ని ఆయన కనిపెట్టారు. రాయల్ ఎగ్రికల్చరల్ సొసైటీ సభ్యులు వెంకయ్యగారు. బందరు జాతీయ కళాశాలలో షుమారు 10 సంవత్సరములు ఆచార్యత్వం వహించారు. భూగర్భ ఖనిజాల విషయంలో అఖిల భారతదేశంలో వెంకయ్యగారు పరమ ప్రామాణికులు. వజ్రం ఎట్లా ఏర్పడేది పరిశోధించి ప్రపంచానికే ఆశ్చర్యకరమైన ఖనిజ శాస్త్ర విషయాలు

వెల్లడించారు వెంకయ్యగారు.

స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వ భూగర్భ విజ్ఞాన ఖనిజ శాస్త్ర నివేదికలలో వెంకయ్యగారి పేరు పలుచోట్ల ఉటంకితమై ఉంది. ఆయన ఖనిజ విజ్ఞాన వేత్తలలో అగ్రగణ్యుడు.

**1916**వ సంవత్సరం వెంకయ్యగారు భారతదేశ జాతీయపతాకం అని **30** నమూనాలతో ఒక పుస్తకం ప్రకటించారు. దాదాభాయి నౌరోజీ, లాలాలజపతిరాయ్, బాలగంగాధర్ తిలక్, బిపిన్‌చంద్రపాల్, అశుతోష్‌ముఖర్జీ, జె.సి.బోస్, పి.సి.రే, రవీంద్రనాథఠాగూర్, మోతీలాల్ నెహ్రూ మొదలైన మహనీయులతో జాతీయ పతాకాన్ని గూర్చి సంప్రదించారు వెంకయ్యగారు. కాంగ్రెస్ సమావేశాలలో వెంకయ్య గారెప్పుడూ జాతీయ పతాకాన్ని గూర్చి మాత్రమే మాట్లాడేవారు. తీర్మానాలు ప్రవేశపెట్టేవారు. వెంకయ్యగారి జాతీయ పతాక గ్రంథాన్ని సర్ సి.పి.రామస్వామయ్యరు ప్రచురించారు. ఆ రోజుల్లో కృష్ణాపత్రిక ఈ గ్రంథాన్ని ఎంతగానో శ్లాఘించింది.

**1916**వ సంవత్సరం జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో హోంరూల్ లీగ్‌వారు వెంకయ్యగారు రూపొందించిన జాతీయ పతాకాన్ని తొలిసారి ఎగురవేశారు. ''న్యూ ఇండియా'' పత్రికలో అనీబిసెంట్ జాతీయ పతాకావిష్కరణం గురించి సంపాదకీయం వ్రాశారు. **1921**వ సంవత్సరం బెజవాడలో జరిగిన జాతీయ కాంగ్రెస్ కార్యనిర్వాహక సమావేశంలో గాంధీజీ వెంకయ్యగారిని జాతీయ పతాకం నమూనా రూపొందించి సమర్పించ వలసిందని కోరారు. కేవలం మూడుగంటల వ్యవధానంలో వెంకయ్యగారు రంగులు అద్దించి త్రివర్ణ పతాకాన్ని రూపొందించారు. గాంధీజీతో సంప్రదించి రాట్నం ఈ పతాకం మధ్యలో చిత్రించటం బాగుంటుందని సూచించారు. **1921** ఏప్రియల్ **13**వ తేది యంగ్ ఇండియా సంచికలో గాంధీజీ మన జాతీయ పతాకావిర్భావాన్ని గురించి పింగళి వెంకయ్యగారి కృషి గురించి ప్రస్తావిస్తూ సంపాదకీయం వ్రాశారు. **1947**లో భారత రాజ్యాంగ సభ వెంకయ్యగారి నమూనాను అంగీకరించింది. స్వతంత్ర భారతదేశ పతాకంలో రాట్నం బదులు అశోకచక్రానికి స్థానం లభించింది. **1906** నుంచి **22** వరకు జాతీయోద్యమంలో వెంకయ్య అగ్రేసరులుగా ఉన్నారు. తిలక్ మహారాజ్ నిర్యాణంతో వెంకయ్య చురుకైన రాజకీయ జీవితానికి స్వస్తి చెప్పారు. అయినా భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర ఉజ్జ్వలాకాశంలో ప్రకాశవంతమైన నక్షత్రం పింగళి వెంకయ్య.

**1878** ఆగష్టు **2** కృష్ణాజిల్లా భట్ల పెనుమర్రులో వెంకయ్య జననం. **1963**లో పరమపదం. ఝాన్సీలక్ష్మీభాయి, పింగళి మోరోపంత్‌ల వంశం వాడు. తెలుగుతల్లి ముద్దుబిడ్డడు పింగళి వెంకయ్య.



# వాసిష్ఠ గణపతిముని



సికిందరాబాదులోని బూరుగు మహాదేవు భవన నిలయంలో ఒక సాహిత్యసభ జరుగుతున్నది. ప్రేక్షకులంతా ఎంతో ఉత్సుకులై ఉన్నారు. ''చూడండీ. ఇవిగో మా మీసాలు. వీటిని ఇట్లా ఎందుకు పెంచామంటారా, చెపుతాం వినండి. తెలుగులోనూ సంస్కృతంలోనూ మమ్మల్ని మించిన పండితులు లేరు. ఉంటేరండి. ఈ మీసాలు తీసి మీ పాదాల దగ్గర పారేసి తలవంచుతాం'' అని పద్యం ఎత్తుకున్నాడు ఒకాయన. ప్రతి సభలో ఆ పద్యం చదవటం ఆయన రివాజు. మహాకవి ఆయన. ఇంతలో ఎవరో ఆయిన దగ్గరకు వచ్చి బాబ్బాబూ సభలో ఫలానా మహానుభావుడున్నాడు అని ఆయన చెవి దగ్గర చెప్పారు. అంతటితో ఆ పద్యం పూర్తి చేయకుండా ఆ వేదిక దిగివచ్చి అపరాధం అయింది అని క్షమాపణ చెప్పుకున్నాడా మహాకవి. సభలో మీరుంటారనుకోలేదు అని మిక్కిలి వినయంగా విన్నవించుకున్నాడాయన. ఆ కవి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి. ఆ మహానుభావుడు అయల సోమయాజుల గణపతిశాస్త్రి అని తల్లిదండ్రులు పెట్టిన పేరిట వాడైన వాసిష్ఠ గణపతిముని. పురాణాలలోను ఇతిహాసాల లోను కనపడే మహర్షుల వంటి మంత్రద్రష్ట. ఉమాసహస్రం రచించిన మహాకవి. మహనీయుడు. అరుణాచల దివ్యజ్యోతి మహిమను లోకానికి చాటిచెప్పినవాడు. భగవాన్ శ్రీ రమణమహర్షి దివ్యతత్వాన్ని రమణగీతల ద్వారా ఆవిష్కరించిన వాడు. మౌనస్వామి

అయిన రమణులు వాసిష్ఠ గణపతి కోపమే పెదవి విప్పారు. తరువాత దరిచేరిన వారందరికీ జ్ఞానమంటే ఏమిటో విప్పిచెప్పారు. భగవాన్ శ్రీ రమణులు వాసిష్ఠ గణపతిని 'నాయన' అని పిలిచేవారు. అందువల్ల వాశిష్టులకు నాయన అన్న పేరే స్థిరపడింది. భారతదేశంలోని అనేక పుణ్య క్షేత్రాలలో యీ ఆధునిక కాలంలో గొప్ప తపస్సు చేసి సిద్ధ సంకల్పులైన వారు నాయన. పదేళ్ళ వయస్సుననే ఆయన సంస్కృతంలో సుందరమైన కవిత్వం చెప్పారు. కాళిదాసు కుర్దీగా భృంగసందేశం రచించారు. పద్దెనిమిది సంవత్సరాల వయసున నవద్వీప పండిత పరిషత్తున నిలచి అక్కడి మహామహులైన కవి పండితులందరిని మెప్పించి 'కావ్య కంఠ' అనే బిరుదు పొందారు. నవద్వీపంలో గణపతిముని ప్రదర్శించిన కవితా విలాసం అక్కడి పండితులందరనూ దిగ్భ్రాంతులను చేసింది. మహాభారతం 18 పర్వాలు 18 శ్లోకాలలో నిషిద్ధాక్షరి పూర్వకంగా పూరించి జేజేలందుకున్నారు. నాయన రచించిన విశ్వ మీమాంస గ్రంథము యోగులకు వేదాంతులకు కూడా శిరోధార్యమైన మహాగ్రంథం. ఇంతటి మహానుభావుడు దేశరాజకీయాలపట్ల ఉపేక్ష వహించలేదు. అస్పృశ్యతను తీవ్రంగా ఖండించి భారతీయ దర్శనాలలో అస్పృస్యతకు ఆధారమే లేదని నాయన నిరూపించారు. వేదకాలం నాటి సర్వ సమగ్రమైన సుదృఢమైన సుసంపన్నమైన భారతీయ సామాజిక వ్యవస్థ ఆదర్శంగా ఉండాలని నాయన ఎంతగానో బోధించారు. 'పూర్ణ' అనే పేరుతో బృహదైతిహాసిక నవలను ప్రారంభించారుగాని ముగించలేదు. మహిళా స్వాతంత్ర్యం పట్ల నాయనకు మిక్కిలి అభిమానం. భారతదేశమంతా పర్యటించి నాయన భారతీయ సమాజ సంస్కార ప్రబోధం గావించారు. అత్యంత మహిమోపేతుడు, తపస్సంపన్నుడు నాయన. స్వస్థలం ఉత్తరాంధ్రంలోని బొబ్బిలికి దగ్గరగా నున్న కలువరాయి అగ్రహారం. ఇంటిపేరు అయల సోమయాజుల. తల్లిదండ్రులు నరసమాంబా, నరసింహశాస్త్రి. ప్రభవం 1878, నిర్యాణం 1936.



# ముట్నూరి కృష్ణారావు



తెలుగువాళ్ళకు రాజకీయాలతో పరిచయం చేసింది కృష్ణాపత్రిక. దేశంలో దొరతనం చేస్తున్న వాళ్ళ దొంగతనాన్ని గూర్చి దేశ ప్రజలకు తేటతెల్లంగా గంభీర ప్రౌఢిమతో తెలియచెప్పిన పత్రిక కృష్ణాపత్రిక. ఈ శతాబ్ది ప్రారంభంలో ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని ప్రోది చేయటానికీ, వ్యవస్థాబద్ధమైన అసమ్మతి వ్యక్తీకరణ విజ్ఞప్తులను పాలకవర్గం వారికి అందజేయటానికీ పెద్ద పట్టణాలలో ప్రజా ప్రాతినిధ్య సంస్థలు కొన్ని ప్రభవించాయి. ప్రతి పెద్ద పట్టణంలోను నగరంలోను పుర మందిరాలు నిర్మితమైనాయి. మండల సభలు నెలకొన్నాయి. పరిపాలన యంత్రాంగంలో జిల్లా ఒక ముఖ్య విభాగం కాబట్టి, ఆ జిల్లా సభలు ఏర్పాటు చేసుకొని స్థానికమైన సమస్యలను, కష్ట నిష్ఠురాలను మహాజర్ల ద్వారా, విన్నపాల ద్వారా ప్రభుత్వానికి తెలియజేసే వారు ప్రజాసేవా పరాయణులు. ఆ దృష్టితో బయలుదేరింది కృష్ణాపత్రిక. కృష్ణా మండలం ప్రజా సమస్యలను చర్చించే పత్రికగా ప్రభవించినా అచిరకాలంలోనే ఆంధ్రదేశంలోని, అఖిల భారతదేశంలోని జాతీయోద్యమానికి వాహికగా రూపొందింది కృష్ణాపత్రిక. దీన్ని స్థాపించినవారు కొండ వెంకటప్పయ్య, దాసు నారాయణరావు, శెడింబి హనుమంతరావు ప్రభృతులు. కాని స్థాపితమైన రెండు మూడు సంవత్సరాలకే ముట్నూరి కృష్ణారావుగారు దీని నిర్వహణ బాధ్యతను స్వీకరించారు. ఆనాటి నుంచి నాలుగు దశాబ్దాల కాలం కృష్ణాపత్రిక నామసార్థకాన్ని రుజువు చేసుకున్నది.

అలనాడు అఖిల భారతంలో బిపిన్ చంద్రపాల్ నిర్వహించిన ''న్యూఇండియా'' అరవిందుని ''వందేమాతరం'' భూపేంద్ర నాథదత్త ''యుగాంతర'' వంటి పత్రిక తెలుగువారికి కృష్ణాపత్రిక. భారత జాతీయ సర్వతోముఖ వికాసానికి తెలుగువారిని ప్రబోధించిన చైతన్య స్వరూపిణి కృష్ణాపత్రిక.

కిందటి శతాబ్దంలో భారతదేశ సామాజిక సాంస్కృతిక ఆధ్యాత్మిక రంగాలను ప్రభావితం చేసిన బ్రహ్మసమాజం, ఆర్య సమాజం, దివ్యజ్ఞాన సమాజాల మేలిమిని సమాహారంగా మేళవిస్తే ఆ మూర్తిమంతం ముట్నూరి కృష్ణారావుగా తెలుగునాట ఆవిర్భవించాడని

చెప్పవచ్చు. బందరు నోబుల్ కళాశాలలో బ్రహ్మర్షి రఘుపతి వేంకట రత్నం నాయుడు శిష్యత్వం, వందేమాతరోద్యమంలో బిపిన్ చంద్రపాల్ అనుయాయిత్వం, "రవీంద్రుని దివ్యజీవన ఆధ్యాత్మిక తత్త్వచింతనం కృష్ణారావు సమగ్ర వ్యక్తిత్వాన్ని మూర్తీభవింపచేశాయి. వందేమాతరోద్యమ కాలంలో ముట్నూరి కృష్ణారావు కలకత్తా వెళ్ళి బిపిన్ చంద్రపాల్‌తో విప్లవోద్యమ స్వరూప స్వభావాలను అధ్యయనం చేశాడు. అటు తరువాత బందరు వచ్చి కృష్ణాపత్రిక ద్వారా జాతీయోద్యమంలో తెలుగువారి భాగస్వామ్యాన్ని, భాగధేయాన్ని నిరూపించారు ముట్నూరి. సాంస్కృతిక కళా, సాహిత్య రంగాలలో రామానంద చటర్జీ నిర్వహించిన మోడరన్ రెవ్యూ పత్రికతో పోల్చదగినది కృష్ణాపత్రిక. కృష్ణారావు వ్రాసే సంపాదకీయాల కోసం తెలుగువాళ్ళు ఉత్సుకతతో ఎదురు చూసేవాళ్ళు. బందరులో జాతీయ కళాశాల, కృష్ణారావు కృష్ణాపత్రిక తెలుగుదేశపు రాజకీయ చైతన్యాన్ని ఆ రోజుల్లో ఎంతగానో ప్రభావితం చేశాయి. కృష్ణారావు ముని వంటివాడు అని చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి గారు ప్రశంసించారు. నాలుగు దశాబ్దాల పాటు ఒక సార్వత్రిక విశ్వవిద్యాలయంగా, ఒక మహా జాతీయ సంస్థగా తెలుగువాళ్ళను విద్యావంతులను చేసిన కీర్తి ముట్నూరి వారిది. కృష్ణారావుగారి జననం **1879**. పరమపదం **1945**. ఆయన లోవెలుగులు దర్శించిన మహామనీషి.



# వేంకట పార్వతీశ్వర కవులు



ఈ శతాబ్ది ప్రథమ పాదమంతా జంటకవులది. ఎక్కడ చూచినా జంటల జంట కవుల అవధాన విహారాలు. ఆశుకవిత్వ ప్రదర్శనలు కోలాహలంగా కొనసాగాయి.

జంట కవులలో అత్యంత విశిష్టమైన వ్యక్తిత్వం వేంకట పార్వతీశ్వర కవులది. నిజానికి ఆధునిక తెలుగు సాహిత్యంలో పాత కొత్తల మేలుకలయిక వీరితోనే ప్రారంభమైందనాలి. వచన రచనకొక వొడుపు. భావకవితకు ఒక స్ఫూర్తి, తెలుగు సాహిత్యానికొక ఆధునికతా వైవిధ్యాన్ని, వొనగూర్చిన వారీ జంటకవులు. తమ రచనల ద్వారా బహుళమైన తెలుగు పాఠకలోకాన్ని సృష్టించారు వేంకట పార్వతీశ్వరులు. **1911**లోనే కొవ్వూరులో స్థాపితమైన ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలను వేంకట పార్వతీశ్వరులు నిర్వహించి కవితలు, నవలలు వెలువరించి ఒకటి, రెండు దశాబ్దాలలో ఒక లక్ష ప్రతులు అమ్మకం చేయడం ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలోనే విశిష్టఘట్టం.

వేంకట పార్వతీశ్వర కవులు అనగానే సాహిత్య పరులందరికీ వెంటనే స్ఫురించేది వారి ఏకాంతసేవ అనే భక్తి తాత్త్విక సుందర భావ కవితా సంపుటి. వీరి ఏకాంత సేవ తనను ప్రభావితం చేసిందన్నారు దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి. అది ఆనాటి తెలుగు సాహిత్యాన్ని ఎంతో ప్రభావితం చేసింది. ఈ శతాబ్ది తొలి దశకాలలో విలసిల్లిన కవితారీతులన్నిటికీ నారు పోసిన వారు వేంకట పార్వతీశ్వరులే అని చెప్పవచ్చు. ప్రకృతి కవిత, దివ్య ప్రణయం, దేశభక్తి మధుర భక్తి ఖండకావ్యరచన, వెంకట పార్వతీశ్వరుల శ్రీకారంతోను, ఉపజ్ఞానము పేతంగానూ తర్వాత భావకవితా యుగ కవులందరికీ మార్గదర్శకమైనాయి. వంగ భాషలో రవీంద్రుడి గీతాంజలి వెలువడటానికి పూర్వమే తెలుగులో వెంకట పార్వతీశ్వర కవులు అటువంటి రచనలు చేశారు. **1922** నాటికి కావ్య కుసుమావళి పేరున ఖండ కావ్య రచనలను కూర్చి రెండు సంపుటాలుగా వెలువరించారు. వేంకట పార్వతీశ్వర కవులు.

వేంకట పార్వతీశ్వరుల నవలల్లో ప్రమదావనం, వసుమతీ వసంతం చాలా ప్రసిద్ధికెక్కాయి. అసంఖ్యాక పాఠక ప్రీతి పాత్రమైనాయి. ప్రమదావనం తెలుగునాట

జాతీయోద్యమ స్ఫూర్తికి, వ్యాప్తికి కూడా దోహదం చేసింది.

ఇరవై సంవత్సరాల కాలంలో ఆంధ్ర ప్రచారిణీ సంస్థ నిర్వహణలో 170 గ్రంథాలు వెలువడడం ఎంతో గొప్పగా చెప్పాలి. బాల వాఙ్మయానికి వేంకట పార్వతీశ్వరులు చేసిన సేవ విశిష్టమైనది. తెలుగులో తొలితరం బాలవాఙ్మయ నిర్మాతలుగా వీరిస్థానం నిరుపమానమైనది. సుప్రసిద్ధ వంగ నవలా రచయిత బంకించంద్రుడి నవలలను తెలుగు వాళ్ళకు ప్రీతిపాత్రం చేసింది వేంకట పార్వతీశ్వరులే. కృష్ణకాంతుని మరణశాసనం, వీరపూజ వంటి వీరి అనువాద నవలలను ఆ రోజుల్లో తెలుగు పాఠకులు ఎంతో తమకంతో చదివేవారు.

వాల్మీకి శ్రీమద్రామాయణాన్ని వేంకట పార్వతీశ్వరులు మృదుమధురంగా, లలిత లలితంగా మనోజ్ఞంగా తెలుగు వాల్మీకంగా అనువదించడానికి పూనుకున్నారు. నాలుగు కాండలు మాత్రమే పూర్తిచేయగలిగారు. పాడుకోవటానికి అనువుగా, దేశీయమైన ఛందాలనే ఎక్కువగా తీసుకొని ఆదికావ్య అనువాదానికి వేంకట పార్వతీశ్వరులు పూనుకొన్నారు. 'మేము కూడా కుశలవుల మాదిరిగా శ్రీమద్రామాయణాన్ని గానం చేస్తామ'ని భావుకసుందరంగా వీరు పల్కిన పలుకులు సార్థకమే అయినాయని వీరి రచనా విన్యాణాన్ని బట్టి స్పష్టపడుతుంది. వేంకట పార్వతీశ్వరులైన బాలాంత్రపు వేంకటరావు, జననం 1880, పరమపదం 1972, తల్లిదండ్రులు సూరమ్మ. వేంకట నరసింహంగారలు, జన్మస్థలం పిఠాపురం దగ్గర మల్లాం. ఓలేటి పార్వతీశం జననం 1882, పరమపదం 1955. తల్లిదండ్రులు వెంకమ్మ, అచ్యుత రామయ్యగారలు. జన్మస్థానం కొమరగిరి, పిఠాపుర సమీప గ్రామం.

★★★★



# సి.వై. చింతామణి

పేరెన్నికగన్న గొప్ప పత్రికా సంపాదకులైన తెలుగు వారిలో చుక్కల్లో చంద్రుడు వంటి వారు సి.వై.చింతామణి. అంటే చిర్రావూరి యజ్ఞేశ్వర చింతామణి. ఒకప్పుడు అఖిల భారత దేశంలో ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వాన్ని, జాతీయ నాయకులను తన పత్రికా సంపాదకీయాల ద్వారా ఎంతో ప్రభావితం చేసిన వారాయన. పరమ నిర్భీతికీ నిర్మొగమాటానికీ పేరుపడ్డ వారాయిన. విజయనగరం మహారాజుల కుల పురోహితులైన రామ సోమయాజుల గారి కుమారుడు. వేదం నేర్చుకోవడం తప్పిపోయి ఇంగ్లీషు నేర్చుకోవడం వల్ల లోకానికి మేలు చేసి ఎంతో ప్రసిద్ధికి వచ్చారు. ఈయన్ని ఇంగ్లీషు నేర్చుకోవడానికి ఆనంద గజపతి ప్రేరణా, ప్రోత్సాహము ముఖ్య కారణము. 18 సంవత్సరాల వయస్సులోనే 'వైజాగ్ స్పెక్టేటర్' అనే పత్రికకు సొంత పూచీమీద సంపాదకత్వం వహించి స్థానికమైన దుర్మార్గాలపై రాజీలేని పోరాటం సాగించిన ధీశాలి. విజయనగరంలో వేశ్యల నాటక సమాజాన్ని విమర్శించినందుకు సంఘ విద్రోహ శక్తులు ఈయన్ను దేహ తాడన చేసినా జంకలేదు. చిత్రమైన విషయం ఏమంటే చింతామణి ఎంత సంఘ సంస్కారాభిలాషి అయినా దయనీయమైన ఆనాటి సాంఘిక కట్టుబాట్లననుసరించి పదేళ్ళ వయస్సున్నే పెళ్ళి చేసుకోక తప్పలేదు. 19 సంవత్సరాల వయసున మొదటి భార్యను పోగొట్టుకున్నారీయన. ఇంత చిన్నతనంలోనే పుట్టిన వీరి కొడుకు కూడా గొప్ప పత్రికా సంపాదకుడిగా పేరు పొందారు. ఆయన పేరు సి.ఎల్.ఆర్.శాస్త్రి (బొంబాయిలో జర్నలిస్టుగా మంచి పేరు సంపాదించుకున్నారు.

చింతామణిగారికి వీరేశలింగం పంతులుగారు మంచి స్నేహితులు. మద్రాసు స్టాండర్డ్ పత్రికలో చింతామణిగారు పనిచేస్తుండగా అప్పట్లో మద్రాసులోనే ఉంటున్న వీరేశలింగం పంతులు గారితో చింతామణి గారికి బాగా సాన్నిహిత్యం పెరిగింది. చింతామణి గారి ప్రేరణవల్లే తాము స్వీయచరిత్ర రాయడం మొదలుపెట్టానని పంతులుగారు రాశారు.

పదేళ్ళప్పుడు పెళ్ళి కావడం, పందొమ్మిదేళ్ళప్పుడు ఇల్లాలు మరణించడం చింతామణి గారి మహత్తర జీవితానికి అవరోధాలు కాలేకపోయాయి. తన సంఘ సంస్కరణాభిలాషను నెరవేర్చుకోడానికి ఆయన పూనుకున్నారు. భాగవతుల వారింటి బాల వితంతువునాయన

పెళ్ళాడారు. ఇరవై తొమ్మిది సంవత్సరాల వయసున అలహాబాద్‌నుంచి ప్రముఖ నాయకులు ప్రారంభించిన లీడర్ పత్రికకు చింతామణి సంపాదకులైనారు. పత్రికా సంపాదకత్వంలో ఆయన చూపించిన, ఆత్మ గౌరవం, ఆత్మవిశ్వాసం చరిత్రాత్మకమైనవి. ఏదేశ పత్రికా ప్రవర్తక చరిత్ర కైనా వన్నె తెచ్చేవి. మోతీలాల్ నెహ్రూ 'లీడర్' పత్రిక నిర్వాహ యాజమాన్య సంఘానికి అధ్యక్షులుగా ఉండేవారు. ఆయన రాజకీయాభిప్రాయాలను చింతామణి నిర్భయంగా విమర్శిస్తూ నిశితంగా సంపాదకీయాలు రాసేవారు. మోతీలాల్ నెహ్రూకు చాలా కోపం వచ్చేది. చింతామణితో వివాదపడేవారు. అయినా చింతామణి తమ స్వాతంత్ర్యం వదులుకోవడానికి ఏనాడూ ఇష్టపడలేదు. మోతీలాలే తమ అధ్యక్ష పదవిని పరిత్యజించారు. అలాగే ఒకసారి 'లీడర్' పత్రికా యాజమాన్య నిర్వహణాధ్యక్షులైన పండిత మదనమోహన మాలవ్యాను చింతామణి విమర్శించారు. మాలవ్య మహాశయులు తమ దృక్పథాన్ని చింతామణితో అంగీకరింపలేకపోయారు. చింతామణి తమ రాజీనామా సమర్పించగా 'బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల ఛైర్మన్' ఎవరున్నా గడిచిపోతుంది. కాని చింతామణి లేకుండా 'లీడర్' ను ఊహించలేము అని మాలవ్యగారే తప్పుకున్నారు. ఇటువంటి ఉజ్వలమైన ఉదంతాలెన్నో చింతామణి జీవిత చరిత్రకారులు రాశారు. (శ్రీ) చింతామణి కుమారులు సి.బి.రావు ఐ.సి.యస్.లో ప్రథమ గణపతతో ఉత్తీర్ణులైనారు. ఆగ్రా విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలర్‌గానూ పనిచేశారు.

తెలుగువారి పత్రికా సంపాదకత్వ చరిత్రలో చింతామణి ఒక మణిదీపం. జననం **1880**, మరణం **1941**.





# దుర్భాక రాజశేఖర శతావధాని

రాజశేఖర శతావధాని గారి పేరు వినగానే రాణాప్రతాప చరిత్రం మనస్సున తటిల్లతలా మెరుస్తుంది. 20వ శతాబ్దపు తెలుగు సాహిత్యంలో రాణాప్రతాప చరిత్రకు విశిష్టమైన స్థానమున్నది. రాయలసీమలో ప్రభవించిన అనర్ఘరత్నం శ్రీ రాజశేఖర శతావధాని. పారతంత్ర్యంలో మగ్గుతున్న భారతీయులను ఉత్తేజితులను చేయడానికి రాజశేఖర శతావధాని గారు రాణాప్రతాపుడి చరిత్రను రమ్యోదాత్తంగా రచించారు. ఆనాటి సాహిత్య లోకంలో అవధాన ప్రదర్శనలకు సమధికమైన ఆదరము, ఆకర్షణ ఉండేవి. అందువల్ల రాజశేఖర శతావధాని గారికి గడియారం వేంకట శేషశాస్త్రి గారితో కలిగిన పరిచయం 'రాజశేఖర వేంకట కవుల' ఆవిర్భావానికి దారి తీసింది రాజశేఖర శతావధాని గారు ప్రొద్దుటూరులో చాలా కాలం ఉద్యోగం చేయడం వల్ల ఈ మహాకవుల మైత్రి దృఢంగా అల్లుకొన్నది. ఒకే ప్రాంతం నుండి ఈ శతాబ్ది మహోన్నత చారిత్రక కావ్యాలు రెండు వెలువడటం ఆనందదాయకమూ, అద్భుతావహమూ కూడా.

పరాధీన భారత దేశ దుస్థితికి వగచి ప్రజలను స్వాతంత్ర్య చైతన్య దీప్తులను చేయాలని ధర్మ సంరక్షణ తత్పరమతియైన రాణాప్రతాప మహారాజు కథను వీరు కావ్యవస్తువుగా స్వీకరించారు. భారతదేశంలో జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న కాలమది. రెండువేల పద్యాలతో 5 ఆశ్వాసాలుగా మహాకావ్యంగా తీర్చి దిద్దారు రాణాప్రతాప సింహ చరిత్రాన్ని. కదిరి మొదలుకొని గంజాం వరకు తెలుగు వారు రాణాప్రతాప చరిత్రను గౌరవించినట్లు తృప్తిగా రచయిత చెప్పుకున్నారు.

జాతీయోద్యమంలో స్వయంగా పాల్గొని ప్రభుత్వోద్యోగాన్ని వదులుకున్నారు రాజశేఖర శతావధాని గారు. భారతదేశ పూర్వ చరిత్రను శౌర్య ప్రతాపాన్ని ప్రకాశింప చేసే కావ్యాలే వ్రాశారు. ముఖ్యంగా రాజపుత్ర చరిత్రము వీరిని ఆకర్షించింది. ఘూర్జర దేశ చరిత్రకు చెందిన 'వీరమతీ దేవి చరిత్రము' మేవాడరాజ పుత్ర స్థానానికి చెందిన

'చండనృపాల చరిత్రము' వీరు కావ్యాలుగా తీర్చిదిద్దారు.

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, విశ్వనాథ సత్యనారాయణ గారి వంటి గొప్ప కవి పండితులు రాణాప్రతాప సింహ చరిత్రాన్ని ఎంతగానో శ్లాఘించారు ఈ కావ్యాన్ని గూర్చి విశ్వనాథవారి అభిప్రాయం పరమోదాత్తంగా ఉంది.

''భారతము పూర్వ కాలపు కథనే చెప్పును. అందులో ఉన్న ధర్మము మాత్రమే మన జాతిది ఆ విషయము ద్వాపరయుగము నాటిది మన పరిస్థితులతో సంబంధము లేనిది ప్రతాపసింహ చరిత్ర మన ధర్మమునే కాక మన పరిస్థితులను కూడా చెప్పును అక్బరు చక్రవర్తితో పాతిక యేండ్లు హోరాహోరీ పోరాడి స్వదేశము వదలి కొండలలో గుట్టలలో నివసించి తిండి లేక సద్దెరొట్టెలు తిని దైవవశమున మరల స్వాతంత్ర్యమును సంపాదించిన మహాపురుషుడు రాణాప్రతాపుడు ఆయన కన్న ధర్మరాజాదులేమియు నెక్కువ వారు కారు వస్తురమ్యతకు గాని కథాచమత్కారమునకు గాని ఇందలి భిన్న పాత్రల భిన్నతా విశిష్టతకు గాని భారతమునకీ గ్రంధము తీసి పోదు. వస్తువిటు వంటిది'' అన్నారు విశ్వనాథ.

కవిత్రయంలోని తిక్కనగారి మహా ప్రతిభకు దీటు వచ్చేట్లుగా రాజశేఖర శతావధాని గారు యుద్ధ వర్ణనలను, వీర రసస్ఫూర్తిని నిర్వహించారని అభిప్రాయ పడ్డారు విశ్వనాథ. ''అస్వతంత్ర జాతికొక స్మృతి గ్రంధము'' ఈ ప్రతాప చరిత్ర అని శ్లాఘించారు. మహాకావ్యానికి ప్రాణపదమైన సలలిత ప్రసన్నాధారా శోభితంగా వస్తునిష్ఠలంగా తెలుగు వారికి ప్రీతి పాత్రమైంది రాణా ప్రతాపసింహ చరిత్రం. ఈ గ్రంధం చదువుతుంటే ప్రాచీన కవుల భావ గాంభీర్యం, పురాణశయ్య అనుపదం సాక్షాత్కరిస్తాయి.

రాజశేఖర శతావధాని గారి అసలు పేరు కాళహస్తయ్య. కాగా వీరు ఆధునికాంధ్ర కవితా రాజశేఖరులైనారు జననం 1880, స్వర్గతి 1957. తల్లిదండ్రులు సుబ్బమ్మ, వెంకటరామయ్యగారలు జమ్మలమడుగు, పొద్దుటూర్లలో ప్రాథమిక విద్య పూర్తి చేశారు. మద్రాసు క్రైస్తవ కళాశాలలో ఎ.ఏ చదివారు 'హీరోయిన్స్ ఆఫ్ హిందూస్థాన్' అనే ఆంగ్ల గ్రంధంకూడా రచించారు తెలుగు సాహిత్యం ఉన్నంతకాలం ఉండే గొప్ప గ్రంధం రాణాప్రతాప సింహ చరిత్రం.



# కట్టమంచి రామలింగారెడ్డి



ఈ శతాబ్ది పూర్వార్ధాన్ని తనదైన సాహితీ వ్యక్తిత్వంతో, చతుర సంభాషణ ప్రాగల్భ్య మూర్తిమంతంతో, ప్రభావితంచేసి ఆధునిక సాహిత్యంలో కవిపండిత పరిశోధక విమర్శక వరేణ్యులను కొత్తదైన దృక్పథంతో ఆలోచింపచేసిన వాడు, ప్రేరేపించిన వాడు శ్రీ రామలింగారెడ్డి.

తాను కవి, పండితుడు, విమర్శకుదు అయిన విశిష్ట వ్యక్తిత్వం ఆయనిది. ఒకే వ్యక్తిలో వీటి సమాహారం అరుదు. ఆధునిక సాహిత్యంలో విమర్శకు ఒక కొత్త ప్రమాణాలను నెలకొల్పినవాడు. 'ప్రాత క్రొత్తల మేలికలయికను' చక్కగా సాధించినవాడు. సాహిత్యపు లోతులను, విమర్శలోని ఎత్తులను చక్కగా ఆకలింపు చేసుకున్నవాడు.

సద్యఃస్ఫురణంతో మాటకు మాట అనడంలో ఆయన కాయనే సాటి అంటారు. ఆయన గొప్ప వాగ్మి. రచనలోను, ఉపన్యాసంలోను తనదైన వ్యక్తిముద్రను ప్రస్ఫుటం చేసేవారు రామలింగారెడ్డి. ఈ శతాబ్ది పూర్వార్ధంలో భారతదేశ విద్యావేత్తలలో పరిగణింప దగినవాడు. భారతదేశ సాంఘికోన్నతివల్ల ఆర్థిక, రాజకీయ, విద్యావిషయక సమస్యలపట్ల మేధావితతో కూడిన ముందుచూపు కనపరచిన వాడాయన.

ఇంగ్లాండులోని కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో చదువుకున్నందువల్ల రామలింగారెడ్డి విజ్ఞానం ప్రాక్పశ్చిమ సంస్కృతుల మేలిమిని పండించుకున్నది. తూర్పు పడమరలు కలియవంటారు. కాని ఆచార్య శ్రీనివాసయ్యంగార్ చెప్పినట్లు కట్టమంచిలో అవి సమైక్యమైనవి.

విద్యా రంగంలోను, రాజకీయ రంగంలోను అత్యంత ప్రతిభావంతుడిగా శ్రీ రామలింగారెడ్డి ఎన్నికైనారు. తెలుగు సాహిత్యంలో ఆయన దొడ్డ కృషి చేశారు. కవిత్రయం వారి మహాభారతమంటే, అందునా ముఖ్యంగా తిక్కన రచన అంటే ఆయనకు పంచప్రాణాలూ. పింగళి సూరన మహాప్రతిభను తెలుగువారికి తొలుతగా

ఎరుకపరిచిన వారు కట్టమంచివారే. తెలుగులో శ్రీ రామలింగారెడ్డి వ్రాసిన 'ముసలమ్మ మరణం' అనే కావ్యం ఆధునిక కవితాయుగానికి శ్రీకారం చుట్టింది. ఆయన వెలువరించిన 'కవిత్వతత్త్వవిచారం' అనే విమర్శ గ్రంథం తెలుగు సాహిత్య విమర్శలో కొత్త అధ్యాయాన్ని ప్రారంభించింది.

''మహనీయ జీవితములును, దేశచరిత్రలును పరస్పరావలంబనములు. గొప్పవారి యుద్యోగములచే దేశము యొక్క చరిత్ర మార్పుగాంచును'' అని మల్లంపల్లి సోమశేఖర శర్మగారి ఆంధ్ర వీరులనే గ్రంథానికి పీఠిక వ్రాస్తూ శ్రీ రెడ్డిగారభిప్రాయ పడ్డారు. పన్నెండేళ్ల వయసుకే రామలింగారెడ్డి భారత, భాగవతాలు, అర్థజ్ఞానంతో చదవగలిగిన సంస్కారం సంపాదించారు. 'సర్వలక్షణ సారసంగ్రహమనే' తమ గురువుగారి గ్రంథానికి రామలింగారెడ్డి వ్రాసిన పీఠిక ఒక శతాబ్దినాటి తెలుగు వారి సాంఘిక జీవితాల్ని చక్కగా తెలుపుతోంది.

అందులో ఆయన అన్నారు ''పూర్వము గ్రామస్థుల విభక్త కుటుంబము లట్లుండెడివారు. ఇప్పటివలె మన హిందూ సంఘము విచ్ఛిన్నతదాల్చి యుండలేదు''. ఆనాటి ప్రముఖ కవుల, పండితుల, చరిత్రవేత్తల, నాటక రచయితల గ్రంథాలకు రామలింగారెడ్డి విలువైన పీఠికలు వ్రాశారు. ఏ కొంచెం ప్రతిభవున్నా ఆ ప్రతిభను గుర్తించి అయస్కాంతంలా ఆకర్షించగల ప్రతిభామూర్తి శ్రీ రామలింగారెడ్డి.

శ్రీ రామలింగారెడ్డి జననం **1880,** కథావశేషుడు కావటం **1951.**

★★★★

# బళ్ళారి రాఘవ



**1927**వ సంవత్సరం అది. మహాత్మగాంధీ బెంగుళూరు సమీపంలోని 'నందిహిల్స్'లో విశ్రాంతి తీసుకోవటానికి వచ్చారు. ఆ రోజుల్లో బెంగుళూరులో 'అమెచ్యూర్ డ్రమెటిక్ అసోసియేషన్' అనే సంస్థ వారు ఉత్సాహంతో నాటకాలు ప్రదర్శిస్తూ ఉండేవారు. వీరికి గాంధీజీని తమనాటక ప్రదర్శనకు ఆహ్వానించాలన్న కుతూహలంకలిగింది. పండితతారానాథ్ హిందీలో రచించిన దీన బంధుకబీర్ ప్రదర్శిస్తున్నామనీ ఆనాటకాన్ని తిలకించవలసిందనీ నాటక సంస్థ నిర్వాహకులు వెళ్ళి గాంధీజీని అర్థించారు. ఆయన వారి ఉత్సాహాన్ని కాదనలేక ఒక ఐదు పదినిముషాలు గడుపుతాను ఆనాటకానికి వచ్చి అన్నారు. అన్నట్లేనాటకం చూడటానికి వచ్చారు. నాటకం ప్రారంభమైంది. దాంట్లోమగ్నమైపోయారు గాంధీజీ. ఆయనతోపాటే ఉన్న రాజాజీ ప్రార్థన సమయమైందని గాంధీజీకి గుర్తు చేశారు. కాని గాంధీజీ ఈ నాటకం దర్శించడమే ప్రార్థన అన్నారు. నాటకాంతంలో తన ఆనందాన్ని దాచుకోలేక 'రాఘవ మహరాజుకు జై అని ఉప్పొంగిపోయినారు గాంధీజీ. అంతటమేటి నటుడు బళ్ళారి రాఘవాచార్య. అఖిల భారతంలోనే ఆయన్ను మించిన నటుడులేడనీ, అభినయంలో అగ్రేసరుడని రవీంద్రనాథ్ టాగోర్‌తో శ్లాఘన నందుకున్న మహానటుడు బళ్ళారిరాఘవ. ఆయన తన కాలంలో ముప్పై తెలుగు నాటకాలలోను పదిదాకా కన్నడ నాటకాలలోనూ పదిదాకా ఇంగ్లీషు నాటకాలలోనూ పాత్రధారణ చేసేవారు. ఆయన సాత్వికాభినయం అసదృశం, అనన్యం అని ఆబాల గోపాలంచేత కీర్తి పొందారు. మద్రాసులో ఆయన నాటక ప్రదర్శనలంటే మేధావులు సైతం గుమికూడేవారు. విజయ నగర సామ్రాజ్య పతనం, ప్రహ్లాద, పాదుకా పట్టాభిషేకం, రామదాసు, చిత్రనళయం మొదలైన నాటక ప్రదర్శనలలో ఆయన అభినయ చాతుర్యం ఎప్పుడు ప్రదర్శించినా ప్రేక్షకుల జేజేలు అందుకునేది.

ఒక్క భారత దేశంలోనే కాక రాఘవ నటనాచాతుర్యం విదేశాలలోని మహారచయితలు.

మేధావులు, ప్రజ్ఞానిధుల చేత గూడ ముక్కుమీద వేలేసుకొనేట్లు చేసింది. 1928వ సంవత్సరం ఆయన ఇంగ్లండు వెళ్ళి ప్రపంచ ప్రఖ్యాత నాటక రచయితలతో, ప్రయోక్తలతో చర్చలు జరిపారు. విశ్వవిఖ్యాత నాటకరచయిత జార్జ్ బెర్నార్డ్ షా మొదట పదినిముషాలే ఆయనకు సముఖ గోష్ఠి ఇస్తానని చెప్పి ఆయనతో ఇష్టాగోష్ఠిగా గంటన్నర గడిపినట్లు రాఘవ డైరీల వల్లనే తెలుస్తున్నది. షేక్స్పియర్ నాటకరచనా వైదుష్యం, ఆ పాత్రలు పోషించే వారి నటనావైదుష్యం, వారిలోపాలు, బెర్నార్డ్ షాతో విపులంగా చర్చించిన తర్వాత 'మర్చెంట్ ఆఫ్ వెనీస్ నాటకంలో ఒక సన్నివేశాన్ని 'షా' యెదుట రాఘవ ప్రదర్శించిచూపారుట. దాంతో ఆయన ముగ్ధుడై 'ఇంగ్లండులోనే కనుక మీరూ పుట్టి ఉంటే షేక్స్పియర్ అంత లోకవిఖ్యాతులై ఉండే వారని ప్రశంసించారుట. లండన్‌లోని గారిక్ క్లబ్‌లో రాఘవకు జరిగిన సన్మానానికి సర్ రాబర్ట్ సన్ దంపతులు, విన్‌స్టన్ చర్చిల్, సర్ ఆర్థర్ పినెరో వంటి మేధావులు ప్రముఖులు విచ్చేశారు. లండన్ డెయిలీన్యూస్ పత్రికలో సుప్రసిద్ధ నాటక విమర్శకుడు సి.జె. గ్రైన్ రాఘవ ప్రతిభను గూర్చి సుదీర్ఘమైన వ్యాసం ప్రకటించాడు. అసలు పేరు తాడిపత్రి రాఘవాచార్యులు. గొప్ప నటుడేకాక దేశభక్తులు కూడాను. జాతీయోద్యమ స్ఫూర్తి కోసం కృషి చేశారు. జననం 1880 ఆగస్టు 2. తల్లిదండ్రులు శేషమ్మ, వరసింహా చార్యులు గారలు. స్వర్గతి 1946.



# భోగరాజు పట్టాభి సీతారామయ్య

బనియా సూత్రకారుడికి బాపన భాష్యకారుడు దొరికాడని మహాత్మాగాంధీజీ చనువుగా, ప్రీతిగా, హాస్యంగా పలికేవాడుట. గాంధీజీ నిర్మాణాత్మక కార్యక్రమాల పరమార్థాన్ని చక్కగా ఆకళింపుకొని మెప్పుగా విడమరచి చెప్పగల మేధావిగా నిరూపించుకున్నారు సీతారామయ్య. కుటీర పరిశ్రమలు, ఖాదీ, గ్రామ పునర్నిర్మాణం, సత్యాగ్రహ తాత్త్విక పరమార్థం, జాతీయోత్పత్తి, ఆర్థిక సంస్కరణలు, భాషాప్రయుక్త రాష్ట్ర మౌలిక సూత్రవిశేషాలు ఒకటేమిటి, గాంధీజీకి తాను వ్యాఖ్యాతగా ఉండేవారు భోగరాజువారు. భారతదేశ సమస్యలను ఆయన సమగ్రంగా అధ్యయనం చేసారు. సమస్యా పరిష్కారాలను స్పష్టంగా నిర్దేశించగల మేధావి శ్రీ పట్టాభి. గాంధీజీకి అందుకే ఎంతో విశ్వాసపాత్రుడైనాడాయన. గాంధీజీ అభిప్రాయాలను ఆశయాలను, సిద్ధాంతాలను బలపరచడంలో ఆయన మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్, విఠల్ భాయిపటేల్, అనిబిసెంట్ వంటి అగ్రశ్రేణి దేశభక్తులతో, నాయకులతో తలపడటానికి కూడా ఏమాత్రం జంకే వాడు కాదు. 1939వ సంవత్సరం త్రిపురలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షులుగా శ్రీ పట్టాభి ఉండాలని మహాత్మాగాంధీ ప్రతిపాదించి అందుకు గాను తన పలుకుబడిని వినియోగించారు. కాని సుభాష్ చంద్రబోస్ పోటీచేసి ఆ పదవికి నెగ్గారు. పట్టాభి ఓటమి నా ఓటమి అని ప్రకటించారు గాంధీజీ. అయితే సుభాష్ చంద్రబోస్‌ను అభినందించారు పట్టాభి.

భోగరాజు పట్టాభి సీతారామయ్య అతి సామాన్య కుటుంబంలోని వాడు. పునాదినుంచి స్వయంకృషితో గొప్పమేధావి అయినాడు. అఖిల భారత స్థాయిన నిర్మాణాత్మక కార్యక్రమాలన్నిటా తన మేధా సంపదను నిరూపించుకున్నాడు. నిజానికి ఉప్పు సత్యాగ్రహం ఆలోచనను గాంధీజీలో ప్రేరేపించింది పట్టాభేనని అంటారు. జన్మభూమి అనే పత్రికలో ఇంగ్లీషువాళ్ళు 1826వ సంవత్సరంనుంచి ఉప్పు పన్ను విషయంలో

భారత దేశాన్ని ఎట్లా కొల్లగొట్టింది ఆయన ప్రకటించాడు.

ఆయన ఏనాడూ మంత్రి పదవులకుగాని గొప్ప హోదాలకు గాని ఆశించలేదు. తాను కార్యకర్తగా, మార్గదర్శకుడుగా మాత్రమే ఉంటూవచ్చాడు. గాంధీజీ కార్యక్రమాలన్నిటికీ వ్యాఖ్యాతగా ఉంటూ ఆయన రాజకీయ తాత్విక సిద్ధాంతాలకు జన బాహుళ్యంలోనూ, మేధావి వర్గంలోనూ బాగా ప్రచారం చేశాడు. వివిధ సందర్భాలలో సత్యాగ్రహోద్యమంలో పాల్గొని మొత్తం 7 1/2 సం.లు పట్టాభి కారాగారంలో ఉన్నాడు. ఆయన రాజకీయాలలో ఏ విధమైన ప్రలోభాలకు తలవొగ్గకుండా తమ ఆత్మ విశ్వాసాన్నీ, ధీవటిమనూ, కాపాడుకొన్నాడు. 1935వ సంవత్సరంలో అఖిల భారత కాంగ్రెస్ స్వర్ణోత్సవాలు జరిగినప్పుడు రెండు నెలల వ్యవధిలో కాంగ్రెస్ 50సం.ల చరిత్రను 1600 పుటల బృహద్గ్రంథంగా ఆయన రూపొందించి పెద్దలమెప్పుకు పాత్రులైనారు. దీని నాయన మాతృదేశ సేవాచరణంలో అసువులు బాసిన వీర యోధుల దివ్యస్మృతికి అంకితం చేసారు. ఈ గ్రంథ రచనకుగాను ఆయన ఎటువంటి ప్రతిఫలమూ ఆశించలేదు. త్యాగధనుల ధన్యజీవనం పదిమందీ తెలుసుకోవాలని కోరటంతప్ప.

చిన్న తనంలో బందరులో చదువు కుంటున్న రోజులలో ఆయన రఘుపతి వేంకటరత్నం నాయుడిగారి శిష్యుడు. అందువల్ల పట్టాభిలో విజాయతీ, శీల నైర్మల్యం ఎంతో ప్రోదిచేసుకొంది. ఆయన గొప్ప గ్రంథకర్తకూడాను. సరస సంభాషణా చతురుడున్నూ. ప్రపంచ రాజ్యాంగాన్ని గూర్చి, భారతదేశ ఆర్థిక సమస్యలు, గాంధీ సిద్ధాంతమూ–సోషలిజమూ, తులనాత్మక అధ్యయనం మొదలైన గ్రంథాలు రచించాడు. 'పక్షి ఈకలు – గులకరాళ్లు' అన్నపేరుతో నిత్య జీవితంలో మేధావి సంగ్రహించే జీవిత సత్యాలను ఆసక్తిదాయకంగా ఆయన రచించాడు. అహమ్మదాబాద్ జైలులో గడపినప్పుడు పొద్దుపోక ఆయన వ్రాసిన గ్రంథమది.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తొలినుండీ పట్టాభి గొప్ప కృషి చేసాడు. అగ్రనాయకులతో చర్చించి నొప్పించి ఆంధ్రరాష్ట్రానికి జాతీయ కాంగ్రెస్ ప్రత్యేక విభాగం ఏర్పాటుకాయన కారకుడైనాడు. అఖిల భారత జాతీయ కాంగ్రెస్‌కు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌కు కూడా ఆయన అధ్యక్షులైనారు. అఖిల భారత కాంగ్రెస్ కార్యవర్గంలో ఆయన ఎన్నోమార్లు సభ్యులుగా ఉన్నారు.

ఆనాటి గోదావరి జిల్లా గుండుగొలను గ్రామంలో నవంబరు 24, 1880వ సంవత్సరంలో జన్మించారు. తల్లి గంగమ్మగారు, తండ్రి సుబ్రహ్మణ్యం. తండ్రి ఆ

గ్రామ కరణం. సుప్రసిద్ధ న్యాయవాది, మహాప్రతిభాశాలి, కాకివాడ వాస్తవ్యులు గంజాం వెంకటరత్నంగారి అల్లుడు పట్టాభి. మధ్య ప్రదేశ్ గవర్నర్‌గా ఉన్నారు. పట్టాభి బందరు జాతీయ కళాశాల స్థాపకులలో ఆయన ఒకరు.

పట్టాభి పరమపదం 1959 డిసెంబర్ 17. ఆయన స్థాపించిన ఆంధ్రబ్యాంక్ ద్వారా పట్టాభి యశస్సు చిరకాలం నిలుస్తుంది.



# ఆచంట లక్ష్మీపతి



కిందటి శతాబ్దం ఉత్తరార్థంలో తెలుగువారి సామాజికాభ్యుదయం కోసం ఎందరో మహనీయులు జన్మించారు. ఎన్నో రంగాలలో వారు కృషిచేశారు. సంఘ సంస్కరణం, విద్యా వ్యాపనం, శాస్త్రీయ విజ్ఞానం, మొదలైన రంగాలలో ఎందరో ఘనులు ఎంతో కృషిచేశారు. ఈ శతాబ్ది ప్రారంభమయ్యేనాటికి రాజకీయ చైతన్యానికి పూర్వ రంగాన్ని అంతా వాళ్ళు సిద్ధం చేశారు. బ్రిటిషు వారి పరిపాలన వల్ల భారతదేశానికి కలిగిన మేలుకీళ్ళను ప్రజలకు తెలియజేసి కర్తవ్యాన్ని బోధించారు. స్వయం సంస్కృతిని పున రుద్ధరించుకోవల్సిన ఆవశ్యకతను నొక్కి చెప్పారు. అందుకోసం పాటు పడ్డారు. నిర్మాణాత్మకంగా ప్రజా సామాన్యంలో ప్రబోధం చేసి స్వాతంత్ర్యోద్యమానికి తెలుగు ప్రజలను సమాయత్తం చేశారు.

వేదాంగాలలో ఆయుర్వేదం ఒకటి. ఇంగ్లీషువారు ఈ దేశానికి రాకముందు ఆయుర్వేదానికి భారతదేశంలో ఎంతో ప్రాముఖ్యం ఉండేది. దేశీయమైన విజ్ఞానమూ, వృత్తూలూ నిరాదరణకు గురి అయినట్లుగా అటు తర్వాత ఆయుర్వేద విజ్ఞానం కూడా క్షీణించింది. ప్రజలలో ఆయుర్వేదం పట్ల శ్రద్ధాసక్తులు కూడా తగ్గిపోయినవి.

ఇటువంటి పరిస్థితులలో ఆయుర్వేద విజ్ఞానాన్ని పునరుద్ధరించిన వారు దివి గోపాలాచార్యులు గారు. అయితే ఆయన అకాల మృతితో యీ దేశీయ విజ్ఞాన పునరుజ్జీవనోద్యమం అర్థాంతంగా ఆగిపోయేదే కాని ఆచంట లక్ష్మీపతి గారటు తర్వాత ఆ ఉద్యమ సారథ్యం వహించారు. లక్ష్మీపతి గారు ఇంగ్లీషు వైద్య విద్య అభ్యసించి అల్లోపతీ డాక్టరుగానే పేరు ప్రఖ్యాతులు సంపాదించి ఉన్నప్పటికీ కూడా ఆయుర్వేద పునరుద్ధరణకు పూనుకోవటం గొప్ప విషయం. ఆయుర్వేద కళాశాల ప్రిన్సిపాల్ గాను, ధన్వంతరి

పత్రిక ప్రవర్తకులుగాను అర్థ శతాబ్ది కాలం ఆయుర్వేద సంస్థల నెన్నింటినో లక్ష్మీపతి గారు ప్రోత్సహించారు.

వైద్య శాస్త్రీయ విజ్ఞానాన్ని సరళమైన తెలుగుభాషలో అందించిన తొలితరం తెలుగు రచయితలలో ప్రతిభావంతులు లక్ష్మీపతి గారు. కలరాను గూర్చి వీరు వ్రాసిన గ్రంథం ఆ రోజుల్లో చాలా ప్రసిద్ధి చెందింది. పల్లె పల్లెకూ కలరా నివారణ విజ్ఞానాన్ని అందించింది.

కొమర్రాజు లక్ష్మణరావు గారు స్థాపించిన విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలికి లక్ష్మీపతి గారు కార్యదర్శిగా ఉండేవారు. ఆంధ్ర సాహిత్య పరిషత్తుకు కూడా వీరు కొన్నాళ్ళు కార్యదర్శిగా పనిచేశారు. పాశ్చాత్య వైద్య విజ్ఞానాన్ని భారతీయ వైద్య విజ్ఞానాన్ని సమన్వయ పరచి సుబోధకంగా ఉండేట్లు తెలుగులో ముప్పై గ్రంథాల దాకా వైద్య విజ్ఞానాన్ని అందించారు. ఇంగ్లీషులోను, తెలుగులోను మొత్తం 63 గ్రంథాలు భారతీయ వైద్య విజ్ఞాన ప్రాశస్త్యాన్ని గూర్చి లక్ష్మీపతి గారు రచించారు.

దృఢమైన ఆరోగ్యంతో సహస్ర మాసాలు జీవించి తెలుగువారి సాంఘిక, సాహిత్య, సాంస్కృతిక అభివృద్ధికి కృషిచేశారు లక్ష్మీపతిగారు. జననం 1880. తల్లి జానకమ్మ, తండ్రి రామయ్య వ్యగ్గతి 1966.

★★★★



# చాగంటి శేషయ్య

ఏ దేశానికైనా, ఏ జాతికైనా తర తరాలుగా వెలుగునిచ్చేవారు సాహిత్య నిర్మాతలు, సప్త సంతానాలలో అన్నిటికన్న ప్రసిద్ధి పొందేది 'కృతి' అని అల్లసాని పెద్దన్నగారు అందుకే అన్నారు. చాగంటి శేషయ్య గారనగానే వెంటనే జ్ఞాపకం వచ్చేవి ఆయన రచించిన ఆంధ్రకవి తరంగిణి సంపుటాలు. వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రను ఆయా కవుల పరంగా 25 సంపుటాలు వ్రాయాలని శేషయ్యగారు సంకల్పించారు. ఇందుకు కావలసిన వివరాలన్నీ సమకూర్చారు.

కవుల చరిత్రలు వ్రాయడం చాలా కష్టమైన పని. శాసనాధారాలు, సాహిత్యం, చారిత్రకాధారాలు, సాంస్కృతిక పరిణామాలు ఎన్నో సమన్వయం చేయవలసి ఉంటుంది. అంతకు పూర్వం కవుల చరిత్ర విషయంగా వెలువడిన వాదవివాదాలన్నీ పుస్తకం చేయవలసి ఉంటుంది. ఆయా సందర్భాలలో అవునని కాదని కూడా చెప్పాల్సి ఉంటుంది.

కేవలం స్వయంకృషివల్లే శేషయ్యగారు నిరుపమాన ప్రతిభాపూర్ణులైనారు. ఏ విద్యా సంస్థలలోనూ ప్రవేశించి ఉన్నత విద్యను వీరు సాధించలేదు. స్వయంగా కృషిచేసి ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతం నేర్చుకున్నారు. బెంగాలీ కూడా సాధించడం విశేషం. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల ద్వారా ఎంతో ఖ్యాతినార్జించిన కొవ్వూరి చంద్రారెడ్డి వద్ద శేషయ్య గారు ఆ గ్రంథమాల నిర్వహణలో అంతరంగికులుగా ఉండేవారు. అటు తర్వాత శేషయ్యగారు గోదావరి జిల్లాలోని కపిలేశ్వరపురం జమీందారు వద్ద దివానుగా పనిచేశారు.

చాగంటి శేషయ్యగారు ఆంధ్రకవి తరంగిణి సంపుటాలు మొత్తం 13దాకా వెలువడ్డాయి. ఈ సంపుటాలలో రెండు వందల యాభై మించిన సంఖ్యలోనే కవి చరిత్రలు విపులంగా కూర్చారు వారు. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల తొలిరోజులలో బంకింబాబు నవలలు

దుర్గేశనందిని, నవాబునందిని వంటి నవలలు తెలుగులో అనువదించి ప్రకటించారు శేషయ్య. తెలుగువారికి స్థానిక సంఘాలను గూర్చి తెలియచెప్పటానికి ఎంతో కృషిచేశారు శేషయ్యగారు. 1920 నుంచి 16 సం.లు లోకల్ బోర్డ్ సంఘాలను గూర్చి తెలిపే పత్రిక నడిపారు. న్యాయశాస్త్ర విషయాలు తెలిపే గ్రంథాలు తెలుగులో తెచ్చారు. హిందూ ధర్మశాస్త్ర గ్రంథమాలను స్థాపించి పుస్తకాలు అచ్చువేశారు. 'హిందూలా'ను తెలుగుచేశారు.

తల్లిదండ్రులు సుబ్బమ్మ, కృష్ణయ్యగారలు. స్వస్థలం తూర్పుగోదావరి జిల్లా కపిలేశ్వరపురం. జననం 1881, స్వర్గతి 1956.

★★★★

# అయ్యదేవర కాళేశ్వరరావు



సుమారు రెండు శతాబ్దులు భారతదేశాన్ని విభజించి పాలించి, పీడించి తాడించి, ఈ దేశపు సాంస్కృతికమైన విలువలను, ఆదర్శాలను సాంఘిక వ్యవస్థను పాడుచేసిన బ్రిటిషు ప్రభుత్వం అంత సులభంగా భారతదేశాన్ని వదలిపెట్టి పోలేదు. ఎందరో మహావీరులు, దేశభక్తులు, త్యాగధనులు చెల్లించిన మూల్యంతో పరాయి ప్రభుత్వం పీడ విరగడైంది.

ఈ శతాబ్ది పూర్వార్థంలో ఎన్నో రంగాలలో మహనీయుల దేశహిత నిర్మాణ కార్యక్రమ దక్షత వల్ల భారత ప్రజలు స్వాతంత్ర్య సమరం సాగించటానికి సమాయత్తమైనారు. ఆసేతు శీతాచలం ప్రజల్లో దేశభక్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పట్ల అనురక్తి పెల్లుబకటానికి కారణం ప్రజా చైతన్య శక్తులను సమీకరించి సుసంఘటితం చేయగల నాయికత్వం ఆనాడు ప్రజలకు లభించటమే.

అయ్యదేవర కాళేశ్వరరావు 1881వ సంవత్సరం కృష్ణాజిల్లా నందిగామలో జన్మించారు. తండ్రి లక్ష్మయ్య, తల్లి వీరమ్మగారలు. బందరులోను, మద్రాసులోను చదివి 1905వ సంవత్సరానికి న్యాయవాద వృత్తిని సాగించటానికి బెజవాడ చేరుకున్నారు. ఆధునిక భారతదేశ చరిత్రలో స్వాతంత్రోద్యమంలో ప్రధాన ఘట్టమైన యీ 1905 నుంచి కాళేశ్వరరావు గారు తెలుగు ప్రజల జాతీయ చైతన్యానికి నిర్మాణ కార్యకర్తగా నడుం కట్టి నిలిచారు. సుమారు 15 సంవత్సరాలు ప్లీడరు వృత్తిలో వారు పుష్కలంగా ఆర్జించారు. కాని సహాయ నిరాకరణోద్యమం ప్రారంభం కాగానే వృత్తిని విసర్జించి పూర్తిగా దేశసేవకై అంకితమైనారు.

మొట్టమొదటి నుంచీ సంఘ సంస్కరణ కార్యక్రమాలపట్ల విశేషమైన శ్రద్ధ వహించారు పంతులుగారు. 1904వ సంవత్సరంలోనే కృష్ణా జిల్లా సంఘ సంస్కరణ సభలకు సారధ్యం

వహించి హరిజనుల వికాసం కోసం కృషి ప్రారంభించారు. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు స్థాపించిన విజ్ఞాన చంద్రికా మండలికి కార్యదర్శిగా తెలుగువారి చారిత్రక దృక్పథాన్ని చక్కదిద్దే దేశచరిత్రలు, మహాపురుషుల చరిత్రలు రచించి ప్రకటించారు. స్వాతంత్ర్యోద్యమంలో ఎన్నోసార్లు జైలుకు వెళ్ళారు. తండ్రి తాతలార్జించిన ఆస్తిలో నూరెకరాలకు పైగా దేశహిత కార్యక్రమాల కోసం పోగొట్టుకున్న త్యాగధనుడు పంతులుగారు. పేద విద్యార్థుల కెందరకో సాయం చేశారు. అట్టడుగు వర్గాల వారి అభివృద్ధి కెంతో కృషిచేశారు. తెలుగు ప్రజలందరూ సమగ్రమైన రాష్ట్రంలో సత్వరాభివృద్ధిని సాధించాలని అందుకై ఎంతో కృషిచేశారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత విధాన సభాధ్యక్షులయ్యే గౌరవం వారికి దక్కింది. ఆయన నిండు మనిషి. దైవభక్తి దేశభక్తి సమాజాసక్తి కలిగిన ఆదర్శ నాయకుడు. కాశేశ్వరరావు పంతులుగారి పరమపదం 1962.

★★★★

# జనమంచి శేషాద్రి శర్మ



తెలుగు సాహిత్యంలో పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధం ఇరవయ్యో శతాబ్ది ఉత్తరార్ధం వరకూ ఒక విధంగా సంధియుగమనే చెప్పవచ్చు. పాత క్రొత్తల మేలుకలయిక ప్రతిభావంతంగా సాగుతున్న కాలమది. సంప్రదాయం ఆధునికత పట్ల చెలిమినీ, ఆకర్షణను ప్రకటించిన కాలమది. పద్యకావ్యాలకు ఆదరణ కొరవడలేదు. మహాకావ్యాల రచన మరుగున పడలేదు.

ఆధునిక కాలంలో పురాణాలను తెనిగించిన ఖ్యాతి శ్రీ శేషాద్రిశర్మ గారిది. ఆయన కాశీ పండితుడు. వంగ దేశ విద్యత్పరిషత్తు నుంచి కావ్య తీర్థ బిరుదు పొందిన వారు. రామాయణాన్ని, భాగవతాన్ని స్వీయ ముద్రతో ఆంధ్రీకరించిన వారు. శర్మగారి మహాభాగవతం, తాండవ కృష్ణభాగవతం పేరుతో ప్రసిద్ధం. బ్రహ్మాండ పురాణం తెలుగులోకి తెచ్చారంటేనే వీరి సత్తా ఎటువంటిదో విశదమవుతుంది. ఇవి గాక వచన కావ్యాలు ఎన్నో వెలువరించారు. ఇంతటి మహాపండితుడు నవలలు కూడా రచించిడం విశేషం. శ్రీ కృష్ణావతార తత్త్వం, శ్రీ రామావతార తత్త్వం వంటి అవతార తత్త్వ గ్రంధాలు ఒక్కొక్కటి **9, 10** సంపుటాల లెక్కన రచించడం వీరి అసమాన ప్రజ్ఞకు నిదర్శనం.మనుచరిత్ర హృదయావిష్కరణం పేరున మను చరిత్ర గురించి ప్రశస్తమైన విమర్శా వ్యాఖ్యానం ప్రకటించారు.

జనమంచి వారు జనమెప్పు చాలా చూరగొన్నారు. నిరాడంబరులు. సౌమ్యులు. ఆధ్యాత్మిక తపోవిభవ సంపన్నులు శ్రీ శర్మ గారు. కడపలోని పురపాలకోన్నత పాఠశాలలో **36** సం. ఉపాధ్యాయులుగా పనిచేసి ఆ నగరానికెంతో పేరు తెచ్చారు. నగర వాసులందరికీ స్తుతిపాత్రులైనారు. శర్మగారి గ్రంధాలలో కడప మండల చరిత్ర చాలా ప్రసిద్ధి కెక్కింది. చిన్నతనాన అవధానాలు చేసినా, శర్మగారు ఆ ప్రవాహంలో పడి కొట్టుకొని పోలేదు. ఆ కాలాన్ని బట్టి ఆయన నాటక రచన కూడా చేశారు. పదుల కొద్దీ రచనలు చేసినా,

**ఆయన** పురాణాంధ్రీకరణం రచయితగానే ఈ శతాబ్దిలో తెలుగు దేశంలో ప్రసిద్ధి పొందారు.

తండ్రిగారు సుబ్రహ్మణ్యావధాని, తల్లి కామాక్షమ్మ. జన్మస్థానం నెల్లూరు జిల్లా కలువాయి గ్రామం, నివాస స్థానం బద్వేలు తాలూకా వేంకటాపురం, ఉద్యోగస్థానం కడప. కొన్నాళ్ళు పాటు బ్రహ్మ నందిని అనే పత్రికను కూడా నిర్వహించారు జననం **1882**. స్వర్గతి **1950**.

★★★★

# పేకుమళ్ల అచ్యుతరావు



తెలుగులో మొట్టమొదటిసారిగా కవుల చరిత్ర రచించాలన్న పూనిక గురజాడ శ్రీరామమూర్తిగారిది. అయితే అది ప్రథమ ప్రయత్నం కాబట్టి సాధికారంగాలేకపోవచ్చు. అటు తరువాత కందుకూరి వీరేశలింగం సుమారు రెండువందలమందికి మించిన సంఖ్యలో తెలుగుకవుల చరిత్రనుకూర్చాడు. మొదటి ప్రయత్నంమీద ఇది చాలా మెరుగు. అటు తర్వాత పది పదిహేను మంది తెలుగు సాహిత్య చరిత్రను కవిజీవితాల ఆలంబనంగా గ్రంధస్థం చేశారు.

అయితే తెలుగులో కవిజీవితాలను, సాహిత్య చరిత్రను రచించిన వారిలో పేకుమళ్ళ అచ్యుతరావు గారిది విశిష్టస్థానం. విలువైన విశ్లేషణం. ఆయన ఇంగ్లీషు సాహిత్యాన్ని బాగా మథించిన వారుకావడం వల్ల ఆ విమర్శరీతులు, సమాజానికీ సాహిత్యానికీ పరస్పర అనువర్తిత అధ్యయనపు లోతులు ఆధారంగా తెలుగు సాహిత్య చరిత్రను రాయడానికి పూనుకున్నారు. ప్రతి కాలంలోనూ సాహిత్యంలో కొత్తరీతులపట్ల సమాజంలో మోజు పెరుగుతూనే వుంటుంది. అప్రతిమాన సృజనాత్మక మహా ప్రతిభుల వల్ల ఆయా సాహిత్యరీతుల ప్రతిష్ఠాత్మకమైన యుగనిర్దేశం జరుగుతూ వుంటుంది. ఆయా మహాకవులు మార్గనిర్దేశకులవుతారు. ఆయా ప్రక్రియలు తరతరాలు శిరోధార్యాలవుతాయి.

అనేక నూతన పరిణామాలను, ప్రమాణాలను బట్టి చూసినా, విలక్షణతలను ఎన్నిక చేసినా తెలుగు సాహిత్య చరిత్రలో విజయనగర సామ్రాజ్యకాలంలో వెలువడిన సాహిత్యానికి విశిష్టమైన స్థానమున్నది. తెలుగు సాహిత్య చరిత్రలో అది ఒక స్వర్ణయుగం, సాహిత్య చరిత్ర అనగానే ఫలాని కవి పుట్టిన ఊరు, జననతేది, ఏ రాజు దగ్గర సాహిత్య వ్యాసంగం చేశాడు, ఆయన బిరుదులేమిటి, ఎన్ని గ్రంధాలు రచించాడు, అవి అనువాదాలా, మౌలికమైనవా ఆ గ్రంధస్థ వర్ణనలు, అలంకారాలు, గుణాలు, దోషాలు వీటిని ఏ కరువు పెట్టటం మాత్రమేకాదు. ఆ కాలంనాటి రాజకీయ, సాంఘిక, చారిత్రక పరిస్థితులు, ప్రజాజీవనం, సాహిత్య పరిణామాలు, సమకాలీన అభిరుచులు, ఒకకవి ఎన్నో గ్రంధాలు

వ్రాస్తే ఆ గ్రంధాలన్నిటిలో ఆయన ప్రతిభాసాదృశ్యం, పాత్రల ఆంతరికమనఃప్రవృత్తుల ఆవిష్కరణం, సమకాలీన సాంఘిక జీవిత ప్రతిఫలనం, సాహిత్య ధోరణుల క్రమపరిణామోన్మీలనం, ఈ అంశాల అన్నిటి సమాహార సమన్వయం ఉత్తమ శ్రేణి సాహిత్య విమర్శ అనిపించుకుంటుంది. ఇంగ్లీషులో ఇటువంటి గొప్ప సాహిత్య విమర్శకులున్నారు. విమర్శకు కావ్యత్వ గౌరవం సముపార్జించి పెట్టిన వాళ్ళున్నారు. తెలుగు సాహిత్యంలో అటువంటి విమర్శలను వేళ్ళమీదకూడా లెక్కపెట్టలేము. అచ్యుతరావుగారు ఇటువంటి నూతనరీతుల సాహిత్య విమర్శను చేసిన వాళ్ళలో అగ్రగణ్యులుగా నిలుస్తారు. అచ్యుతరావుగారిలో విశేషం ఏమంటే పాండిత్య బంధురమైన విమర్శపట్ల అభిరుచి వుండటమేకాక నిసర్గసుందరమైన ప్రజాసాహిత్యంపట్లకూడా ప్రీతి ఉండటం. ఆయన మొట్టమొదట అచ్చువేసిన పుస్తకం ఆంధ్ర పదములు-పాటలు అనేది (1924). అప్పటికింకా తెలుగుదేశపు జానపద సాహిత్యం పట్ల ఎవరికీ విశేషమైన ప్రత్యయం కలగలేదు. అచ్యుతరావుగారు ఆంధ్ర నాటకములు-రంగస్థలములు అనే గ్రంథాన్ని కూడా వ్రాశారు. తెలుగు సాహిత్యంలో నాటక రచన, ప్రదర్శనలు ఏ విధంగా క్రమపరిణామ వికాసదశను సాధించాయో సమీక్షించారు. విజయనగర సామ్రాజ్య వాఙ్మయ చరిత్రను విపులంగా పరిశోధనాత్మకంగా వెలయించారు. ఇంగ్లీషు సాహిత్యంలో సుప్రసిద్ధ విమర్శకుడైన మాథ్యూఆర్నాల్డ్ అచ్యుతరావుగారికి అభిమాన పాత్రులు. విజయనగర వాఙ్మయ చరిత్రను ఆయాకవుల తారతమ్య ప్రతిభాపాటవ పరిశీలన ప్రతిపాదకంగా సాంఘిక సారస్వత సమన్వయంగా నాలుగు భాగాలుగా అచ్యుతరావుగారు రచించినా రెండు భాగాలు మాత్రమే అచ్చుకావటం తెలుగువాళ్ళ అలసత్వానికి నిదర్శనం. పింగళి సూరననుగూర్చి, ఆ మహాకవి ప్రతిభ ప్రాగల్భ్యం గురించి ఇంగ్లీషులో చక్కని గ్రంథం రచించారు అచ్యుతరావుగారు. పూర్వకవుల రచనలకు సమకాలిక రచయితల రచనలకు విలువైన పీఠికలెన్నో కూర్చారురావుగారు. ఎన్నో శిలా తామ్రశాసనాలను సేకరించటమేకాక ఆయా చారిత్రక సారస్వత విశేషాలు కూడా తెలియచేశారు. విద్యాశాఖలో పాఠశాలల నిర్వహణ పర్యవేక్షణాధికారిగాను, ప్రధానోపాధ్యాయులుగాను, ఉపాధ్యాయ శిక్షణ విద్యాలయాల ప్రధానాధ్యాపకులుగాను రావుగారు తెలుగుదేశం నాలుగు చెరగుల ఉద్యోగించారు. పద్దెనిమిదేళ్ళ వయసున, బి.ఏ పరీక్షలో ప్రథమగణ్యంగా కృతార్థులు కావడమే కాక ఉత్తర సర్కార్లకంతకూ ఇంగ్లీషులో ప్రథమగణ్యత పొంది మాక్డొనాల్డ్ బంగారు పతకం గెల్చుకున్నారు. స్వయంకృషితో ఎమ్.ఏ.అయినారు. ఇంగ్లీషులో చక్కని కవిత్వం చెప్పారు. రాజమండ్రి, బందరు, నెల్లూరు, బళ్ళారి, తణుకు, భీమవరం మొదలైన చోట్ల విద్యాశాఖాధికారిగా పనిచేశారు. వర్జ్లాకిమిడిలో ఎఫ్.ఏ., విజయనగరంలో బి.ఏ. చదివారు. ఈ శతాబ్ది మొదటి నాలుగు దశాబ్దులలో ప్రఖ్యాత కవి పండిత సాహిత్యవేత్తలు రావుగారితో చెలిమి పాటించేవారు. పిఠాపురం రాజావారికి ప్రీతిపాత్రులైనారు అచ్యుతరావుగారు. పింగళి సూరన ప్రతిభను లోకానికి చాటిచెప్పి పండితుల మెప్పుపొందారు. జన్మస్థానం విజయనగరం దగ్గర పోతినవలస అగ్రహారం. తల్లిదండ్రులు వెంకమ్మ, కామయ్యగార్లు. జననం 1882. పరమపదం 1947.

అచ్యుతరావుగారి కొమారులు కామేశ్వరరావుగారు, కిందటితరం సుప్రసిద్ధ కథారచయిత.





# గాడిచెర్ల హరిసర్వోత్తమరావు

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఒక్క తెలుగుదేశంలోనే కాదు అనాటి మద్రాసు రాష్ట్రం మొత్తంనుంచీ కారాగార వాసం అనుభవించిన మొట్టమొదటి రాజకీయ ఖైదీ హరి సర్వోత్తమరావు

భారతదేశ రాజకీయ రంగంలో ఆధునికేతిహాస ప్రసిద్ధుడైన బాలగంగాధర తిలక్ మహాశయుడితో పోల్చదగిన వ్యక్తిత్వం హరి సర్వోత్తమరావుది. తిలక్ మహారాజు లాగా గాడిచెర్ల వారుకూడా పత్రికలెన్నో నడిపారు. ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని ప్రజ్వలింప చేశారు. పాతికేళ్ళ వయసుననే ''స్వరాజ్య'' అనే వారపత్రికను అయిన ప్రారంభించి బ్రిటిషు ప్రభుత్వం అరాచకాలను ఆయన నిర్భయంగా ఖండించారు చరిత్ర ప్రసిద్ధివహించిన తిలక్ మహాశయుని మాండలే కారాగార శిక్షవంటిదే వెల్లూరు జైలులో హరి సర్వోత్తమరావు అనుభవించిన కఠిన శిక్షకూడాను. మాండలే కారాగారంలో తిలక్ మహరాజ్ అనుభవించిన ఏకాంత కారాగారంకన్నా కూడా వెల్లూరులో హరిసర్వోత్తమరావు అనుభవించిన శిక్ష కఠినాతికఠినమైనది. స్వాతంత్రోద్యమాన్ని భయంకరంగా అణచివేసే కోరికతో బ్రిటిషు ప్రభుత్వం ఆరోజుల్లో రాజకీయ ఖైదీలను క్రూరంగా హింసించేది. తల గొరిగించి కాళ్ళకు సంకెళ్ళు తగిలించి మెడలో ఇనుప కంటెవేసి, మట్టిముంత, మట్టి మూకుడు తిండి తిప్పలకు ఉపయోగింపచేస్తూ, గోచీమాత్రమే నిండు శరీరం మీద ధరింపచేస్తూ అనాటి రాజకీయఖైదీ అయిన హరి సర్వోత్తమరావును తెల్ల ప్రభుత్వం దారుణంగా బాధించింది

దేశద్రోహ నేరంకింద నిర్బంధితుడైన మొట్టమొదటి తెలుగువీరుడు హరి సర్వోత్తముడు ఆనాడు తెలుగుదేశం నుంచి ఎమ్.ఏ.పట్టభద్రత పొందిన తెలుగు వారిలో ఈయిన రెండోవాడు. ఉన్నత పాఠశాల ఉన్నత పరీక్షలో జిల్లాకంతటికి ప్రథముడిగా ఉత్తీర్ణుడైనవాడు. ఇరవై మూడేళ్ళకే ఆయిన ఎమ్.ఏ.పట్టాపొందారు. తరవాత రాజ

మహేంద్రపరంలో ఎల్ టి చదువుతూ ఉండగా వందేమాతరం ఉద్యమంలోకి ఒక్కసారి దుమికారు అయిన కళాశాలనుంచి బహిష్కృతుడు కావడమేకాదు, ఆ రోజుల్లో ఎవరూ ఆయనకు ఉద్యోగం ఇవ్వరాదంటూ ప్రభుత్వం కట్టడిచేసింది ప్రభుత్వోద్యోగానికి ఆయిన అనర్హుడు. బహిష్కృతుడు అనే ప్రభుత్వం ఆంక్ష ముప్ఫై సంవత్సరాలు అమలులోవుంది. అది ఉపసంహృతమయ్యే నాటికి ఆయనకు పదవీ విరమణ వయస్సు వచ్చేసింది

1908లో పాతికేళ్ళ చిన్నతనంలోనే, రాజమండ్రిలో ఎల్.టి చదువుకుంటున్న రోజులలోనే భారతదేశ వయోజన విద్యాసమస్య ఆయిన్ను ఎంతగానో ఆకట్టుకొన్నది. ప్రజలందరూ దేశంలో జరుగుతున్న సంగతులను స్వయంగా తెలుసుకోజాలిన అక్షరాస్యులైతే తప్ప దేశంలో ప్రజాస్వామ్యం స్థిరంగా గట్టి పునాదులమీద నిలబడజాలదని ఆయిన గాఢవిశ్వాసం. తన జీవితకాలంలో తెలుగుదేశంలో వయోజన విద్యావ్యాప్తికి అర్థశతాబ్దికాలం ఆయన అవిరళమైన కృషి చేశాడు. కొత్తగా అక్షరాస్యులు కావాల్సిన వాళ్ళకోసం హరి సర్వోత్తమరావుగారు ఉద్యమ దీక్షతో శ్రమించారు. ఇందుకుగాను ఎన్నో రచనలు చేశారు. ఉపన్యాసాలు ఇచ్చారు. శిక్షణ శిబిరాలు నిర్వహించారు. గ్రంథాలయోద్యమ నేతగా తెలుగుదేశాన్ని ఉత్తేజ పరిచారు. ఈ శతాబ్ది తెలుగుదేశపు సామాజిక వికాస నిర్మాణ కార్యక్రమంలో ఆయిన మార్గదర్శనం చేశారు. కొమర్రాజు లక్ష్మణరావు మహోదయుల విజ్ఞాన చంద్రికామండలి కార్యనిర్వహణలో, దాని సంస్థాపనంలో ఆయిన కెంతగానో తోడ్పడ్డారు. ఈసంస్థ పక్షాన వెలువడ్డ అబ్రహాంలింకన్ జీవితచరిత్ర గాడిచెర్లవారే రచించారు ఇదే మొదటి ప్రచురణం. ఉత్తమ దేశభక్తుడు, మహాత్యాగి. చెప్పుకోదగిన రచయిత తల్లిదండ్రులు భాగీరథీబాయి, వేంకటరావులు.జననం 1883. పరమగతి 1960.

★★★★



# ఇప్పగుంట సుబ్బుకృష్ణయ్య

కిందటి శతాబ్దంలో రాజారామమోహన రాయలవారు ప్రారంభించిన ఉద్యమాలన్నీ నాటి చారిత్రక అవసరాలు. హిందూమతం చారిత్రక విషమపరిణామాలకు గురిఅయిన సంధికాలమది. అందువల్ల ఆయన సంఘ సంస్కరణకోసం ,మతసంస్కరణ కోసం ఉద్యమించవలసివచ్చింది. బాహిరమైన, నిష్కరుణమైన, దంభపూరితమైన కర్మకాండ, వంచనతో కూడిన దురాచారాలు, తోటివారిని సాటివారిని మోసంచేసే ఉద్దేశంతో ప్రచారంచేస్తున్న మతవిశ్వాసాలు ఆ రోజుల్లో హిందూసంఘంలో ప్రబలంగా ఉండేవి. అవి కొత్తగా ఇంగ్లీషు చదువులు చదువుకొన్న విద్యావంతులైనవారు హిందూమతాన్ని నిరసిస్తూ క్రైస్తవమతంపట్ల ఆకర్షితులవుతన్న రోజులు అందువల్ల రామ్మోహనరాయలవారు భారతీయవేదోప నిషదమైన జ్ఞానమార్గాన్ని ఉద్యమరూపంలోపునరుద్ధరించవలసి వచ్చింది. అదే బ్రహ్మసమాజమైంది ఇందువల్ల భారతదేశంలో విద్యాధికులలో క్రైస్తవమతవ్యాప్తి నిరోధం పొందింది. విగ్రహారాధనం ప్రశస్తంకాదన్నా, సామూహిక ప్రార్థనలను ప్రోత్సహించినా, పరిశుద్ధాస్తిక మతమని బ్రాహ్మ సమాజానికి పేరుపెట్టినా భారతీయమైన ఉపనిషన్మతం ప్రపంచంలో చాటిచెప్పే పరమార్థదృష్టి రామమోహనులను ఉద్యమింపచేసింది. ఆ రోజుల్లో ఎందరో విద్యావంతులు బ్రహ్మసమాజంచేత ఆకర్షితులైనారు.

తెలుగుదేశంలో అటువంటిమహనీయుడు ఇప్పగుంట సుబ్బుకృష్ణయ్యగారు. తన జీవితాన్నంతా బ్రహ్మసమాజ ఆశయ ప్రచారం కోసం, వివిధప్రదేశాలలోవ్యాప్తి కోసం అంకితం చేసుకున్నాడాయన. కాశ్మీరం నుంచి కన్యాకుమారం వరకు అయిన బ్రహ్మసమాజ ప్రచారం కోసం పర్యటించారు. అస్సాం, బెంగాల్, బీహార్ మారుమూలప్రాంతాలకు వెళ్లి సమాజాలను ఏర్పరిచారు. ఆ రోజుల్లో బ్రాహ్మసమాజ ప్రచారకులలో

బాబూహేమచంద్ర సర్కార్ చాల ప్రసిద్ధులు. సుబ్బుకృష్ణయ్య 20సంవత్సరాల వయసువాడైవుండగా హేమచంద్రసర్కార్ ఆయినకు బ్రహ్మదీక్షనిచ్చారు. పధ్నాలుగు సంవత్సరాల వయిసుననే తండ్రి చనిపోగా సుబ్బుకృష్ణయ్య జీవితంలో తన లక్ష్యాన్ని పరిధిని తానే నిర్దేశించుకోవలసి వచ్చింది. కాంచీపురం వెళ్లి నిప్పుచ్చరపు పరిస్థితులలో స్కూలుచదువులు చదవాల్సివచ్చింది. మెట్రిక్యులేషన్‌లో కృతార్ధుడు కాకపోయినా కలకత్తాకువెళ్లి బెంగాలీ నేర్చుకొని బ్రహ్మసమాజ కార్యకలాపాలలో చురుకుగాపాల్గొని ఆనాటి ప్రముఖ బ్రాహ్మసమాజవేత్తలైన పండిత శివనాధశాస్త్రీవంటివారిమెప్పు పొంది సాధారణ బ్రహ్మసమాజంవారు నిర్వహించే సాధనాశ్రమానికి కార్యదర్శి కాగలిగారు సుబ్బుకృష్ణయ్య. 45 సంవత్సరాల వయసున అమెరికా వెళ్లే అవకాశం లభించగా అక్కడి యూనిటేరియన్ చర్చ్‌వారు నిర్వహించే వేదాంత కళాశాలలోచేరి నాలుగేళ్ళు చదివి 'బాచిలర్ ఆఫ్ డివినిటి' పట్టం పొందారు సుబ్బుకృష్ణయ్య. ఎమ్.ఏ., బి.ఎస్‌సి. డిగ్రీలు కూడా ఆ కళాశాల నుంచి పొందారు. స్వదేశ భాషలతోపాటు ఫ్రెంచి, ఇటాలియన్ వంటి విదేశీ భాషలుకూడా అయన ఎన్నిటినో సాధించారు. భగవద్గీత ఆయన కెంతో ప్రియమైన గ్రంధం. పోతనగారి భాగవతం ఎంతో ఇష్టం తెలుగుదేశంలో బ్రహ్మసమాజ ప్రచారకులలో ఆయినది గొప్పస్థానం. 1883లో చిత్తూరుజిల్లా కార్వేటినగరం సమీపాన నగరిలో జన్మించిన సుబ్బుకృష్ణయ్య 1955లో కలకత్తాలో పరమపదించారు. ఆయిన జీవితం ఒక సుందర సుస్వర భక్తిగీతం. బ్రహ్మ ప్రార్థన గీతాలెన్నో ఆయిన రచించారు.





# రావు వెంకటసూర్యారావు

సంస్థానాధిపతులలో వేడుకకో, విలాసానికో లేక ప్రదర్శనకోతప్ప నిజమైన సాహిత్యాభిమానం, సాంస్కృతిక సంప్రదాయి విలువల పరిరక్షణపై అభిమానం ఉండటం అరుదు. కాని పిఠాపురం సంస్థానాధిపతులటువంటివాళ్ళుకారు. తరతరాలుగా తెలుగు సాహిత్యం, సంస్కృతులపట్ల వారెంతో మమత్వం ప్రదర్శించారు ఆ సంస్థానాధిపతులలో

అలనాటి కృష్ణదేవరాయల మాదిరిగా, రఘునాథ నాయకుడిలా కవి పండిత పోషకుడిగా ఈ శతాబ్దిలో రావువెంకట సూర్యారావు బహద్దూర్ వారు కీర్తిప్రతిష్ఠలు సంపాదించారు.

సూర్యారావుగారి తండ్రి గంగాధర రామారావుగారి గురించి వెనకటితరం కవి పండితులు కథలుగాథలుగా చెప్పుకొనేవారు. ఆ ప్రభువు ధర్మనిరతుడిగా, విద్వత్పోషకుడుగా ప్రసిద్ధుడు. పిఠాపురం సంస్థానంలో ప్రతి సంవత్సరమూ విద్వత్పరీక్షలు జరిగేవి. దేశం నలుమూలల నుంచీ ఎందరెందరో పండితులు తమ విద్వత్తను ఆ సంస్థానంలో ప్రకటించుకొనేవాళ్ళు. వాళ్ళందరికీ వార్షికాలు, బహుమానాలు ముట్టేవి. ఈ శతాబ్దిలో పిఠాపురం సంస్థానాన్ని తలుచుకోగానే దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి తండ్రులు సుబ్బరాయశాస్త్రి తమ్మన్నశాస్త్రిగారలు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, కూచి నరసింహం, పురాణపండ మల్లయ్యశాస్త్రి, వేంకట రామకృష్ణ కవులవంటి మహనీయులు వెంటనే తలపుకువస్తారు.

సూర్యారావుగారి చిన్నతనంలో పిఠాపురం సంస్థానం కోర్టు వ్యాజ్యాలలో చిక్కుకొంది. ఆయన దయనీయమైన పరిస్థితులను ఎదుర్కోవలసివచ్చింది. కాని దేవులపల్లి సోదరులు, జయంతి రామయ్య పండితులు వంటివారు ఆయనకు అండగా ఉండి ఆ వ్యాజ్యం నడిపించి ప్రభువుకు జయం చేకూర్చారు. అందువల్లనో మరి సహజంగానో కాని కవి పండితులంటే సూర్యారావు బహద్దూర్‌గారికి వల్లమాలిన ప్రేమాభిమానాలు. వారికి ఆ సంస్థానంలో ఆదర గౌరవసత్కారాలు ఇనుమిక్కుటంగా లభించేవి.

సూర్యారావు బహదూర్‌గారి పేరు సుస్థిరంగా, ఆచంద్రార్కంగా నిలిపేవి, ఆయన

చేసిన దానధర్మాలు, ప్రజాహిత కార్యాలు, భాషాసాహిత్య సేవలు ఈ శతాబ్ది తెలుగుదేశంలో భాషాసాహిత్య సముద్ధరణంకోసం, దీనజనోద్ధరణం కోసం ఒక్క చేతిమీదుగా అయిన చూపిన వదాన్యత నిరుపమానమని చెప్పాలి సూర్యరాయాంధ్ర నిఘంటువు 8 సంపుటాలు రాజావారి వదాన్యతకు నిదర్శనంగా లక్షల వ్యయింతో వెలుగు చూశాయి. పిఠాపురం మహారాజా కళాశాలతోపాటుగా కాకినాడలో ఆయిన పేరిట ఎన్నో ధర్మసంస్థలు నెలకొన్నాయి. కాకినాడలో అనాథ శరణాలయం, దీనజనావన వసతిగృహం మొదలైనవాటికి మహారాజావారు భూరి విరాళాలు ఇచ్చారు రాజమండ్రిలో హితకారిణీ పాఠశాల ఆయనే నిర్మించినా వీరేశలింగంపట్ల తన గౌరవానికి నిదర్శనంగా ఆ పాఠశాలకు ఆయిన పేరుంచాడు మహారాజావారు. రఘుపతి వేంకటరత్నం నాయుడిగారిపట్ల అపారమైన భక్తివిశ్వాసాలతో వినుతి కెక్కాడు.

ఆంధ్ర సాహిత్య పరిషత్తుకు మూలస్తంభం సూర్యారావు బహద్దూర్ వారు ఆయిన తన ఆస్థానంలో కవిపండితులను ఆదరించి గొప్ప నిఘంటువును వారిచే నిర్మింపజేయుటమే కాక, ప్రాచీన కావ్యాలను పండితులచే పరిష్కరింపజేసి ప్రకటించారు సర్వజ్ఞ సింగభూపాలుడి రసార్ణవసుధాకరం అనే అలంకార గ్రంథం, రత్నపాంచాలిక అనే నాటకం, పింగళి సూరన కళాపూర్ణోదయం, ప్రభావతీ ప్రద్యుమ్నం వంటి గ్రంథాలను వివరణలతో, టిప్పణులతో సర్వాంగ సుందరంగా ముద్రింపజేశారు ఈ శతాబ్దిపూర్వార్థంలో కవి పండితులెందరో ఆయిన, పట్ల సత్కారాలు పొందారు. వారికి తమ గ్రంథాలు అంకితం చేశారు.

సూర్యారావు బహద్దూర్ వారి జననం **1885**. కాలధర్మం **1964**. జననీ జనకులు మంగయాంబా, గంగాధర రామారావుగారలు.





# కోడి రామమూర్తి

ఈ శతాబ్దంలో తెలుగువారికీ తద్వారా భారతదేశానికీ అనితరసాధ్యమైన కీర్తి నార్జించి పెట్టినవాడు. జగదేకమల్లుడు కోడి రామమూర్తిజాతీయోద్యమజ్వలిత చేతనుడు మహోజ్ఞాని దేశాభిమాని.

కీర్తిప్రతిష్ఠలలో, జాతీయోద్యమ స్ఫూర్తిల్లో అగ్రగాములుగా ఉన్నారు తెలుగువారు ఒకవాడు. 'అఖిల భారతముమారదన్న నాడు' అది. గొప్పవస్తాదుగా, అజేయుడైన మల్లవిద్యా ప్రవీణుడిగా, అమానుష బలసంపన్నుడిగా, జగజ్జెట్టిగా మాత్రమే కోడిరామమూర్తిని గురించి చాలామందికి తెలుసుగాని ఆయన చేతికి ఎముకలేదని చాలా మందికి తెలియదు. ఆయిన ఈ చేయియిచ్చింది, ఆ చేయి ఎరుగదని కూడా ఎంతోమందికి తెలియదు. ఆయిన ఈ వినిరుపమానమైంది. ఆయిన ఆంతరంగిక కార్యదర్శి ఆయిన చేసిన దానధర్మాలు అయిన ఆర్జించిన దనసంపద జమాఖర్చుల నిమిత్తం పద్దురాసి ఉంచగా ఆయిన దానధర్మాలు కోటిరూపాయిలపైన తేలాయి.కోడి రామమూర్తి భారతదేశ యోగవిద్యాకోటీర ధగద్ధగాయి మాన రత్నం. ప్రాణమున్న కోహినూరు ఆయన. ప్రాణం ఉంటే అది ఎప్పుడో ఒకప్పుడు పోకతప్పదు. కాబట్టే ఆయన కాలయవనిక వెనక్కు తప్పుకున్నాడు. ప్రాణాయామం అభ్యసించి దానిద్వైన గొప్పబలంతో తేజస్సుతో ఇనుప గొలుసులు తెంచేవాడు రామమూర్తి 'రామమూర్తికిన్ రెండవసాటి మల్లుడిక లేడను గడకట్టి భేరీకాదండడ డాండడాండ వినదమ్మ'ల ఆయన కీర్తి ప్రపంచవ్యాప్తమైంది. వేగంగా పోయేకారును ఆయన చేతితో పట్టుకుని ఆపేసేవాడు. ఛాతీమీద ఏనుగున్ను ఎక్కించుకొనేవాడు. రొమ్ముమీన పెద్ద బండ రాళ్ళు వుంచుకొని సమ్మెటలతో మోదినా ఆయన సిగపూవు వాడేది కాదు. భారతదేశానికి ఒక మకుటాయమానమైన ఒక గొప్ప వ్యాయామ విద్యా సంస్థను నెలకొల్పాలని ఆయిన జీవితాశయంగా ఉండేది. కాని భారతదేశం దురదృష్టంవల్ల ఆయన కోరిక నెరవేరలేదు. భీష్ముడు అంపశయ్య మీద చివరిరోజులు గడపవలసివచ్చినట్లుగా కోడిరామమూర్తి జీవితంలో చివరి రోజులు కూడా దయనీయంగా గడపవలసివచ్చింది. కాలిమీద రాచపుండుతో చివరి రోజుల్లో ఆయన అశక్తుడైనాడు. భారతదేశం రత్నగర్భ అని చెప్పుకోవటానికి నిదర్శనమైన

మదనమోహన మాలవ్యా పండితుడు కోడి రామమూర్తిని వారణాసి తీసుకొనివెళ్లి తన సంరక్షణ భారంలో రామమూర్తికి కొంత స్వాస్థ్యం కలిగించాడు. తొలితరం జాతీయ మహానాయకులందరికీ కోడి రామమూర్తి అంటే మహాఅభిమానం వుండేది. ఒకసారి లోకమాన్య బాలగంగాధర్ తిలక్ మహాశయుడు గొప్ప జాతీయోద్ధారక మహోత్సవాలు నిర్వహిస్తూ అత్యంత స్వల్పమైన వ్యవధిలో కోడి రామమూర్తిని ఆ ఉత్సవాలలో పాల్గొని ప్రదర్శనలు ఇవ్వవలసిందిగా కోరారు. తన సర్కసు పరివారంతో ఆ చోటు చేరటానికి కూడా వ్యవధి చాలదు. అయినా తిలక్ మహాశయునిపైన ఉండే అభిమానంతో రామమూర్తి అక్కడకు వెళ్లి ప్రదర్శనలు నిర్వహించి 'సెహబాస్' అనిపించుకొన్నాడు. ఆ రోజుల్లో భారత జాతీయత వెల్లివిరిసే సందర్భాలన్నిటా రామమూర్తి తప్పక హాజరయ్యేవాడు. జాతీయ కాంగ్రెస్ సమావేశాలకు, జాతీయ మేళాలకు ఆయన వెళ్లి ప్రజల్లో చైతన్యం కల్గించాడు. భారత జాతీయ కాంగ్రెస్ సంస్థ పుట్టిన సంవత్సరమే ఆయన జన్మించాడు. కాని ఆయన శత జయంతిని గూర్చి అనుకొన్నవారే లేరు. స్మారక తపాలబిళ్ళలేదు. సభలు లేవు. సమావేశాలు లేవు. ఆర్భాట ప్రకటనలు లేవు.

మహాకాయానికీ అద్భుతమైన బలానికి నుడికారమైన ఆంగ్లదేశీయుడు యూజిన్ సాండో రామమూర్తి ముందు నతమస్తకుడు కావలసి వచ్చింది. రామమూర్తి సాండోను కుస్తీకాహ్వానించగా అది తన వృత్తి కాదని అతడు తప్పించు కున్నాడు.

కోడి రామమూర్తి పుట్టింది నాగావళీ తీరాన వీరఘట్టం అనే గ్రామంలో. రామమూర్తి జన్మతో వీరఘట్టం సార్థక నామధేయత పొందింది. వాయుదేవుడి ఇద్దరు కుమారులకు - ఆంజనేయుడికీ, భీముడికీ - ఈ వీరఘట్టపు వీరుడు సాటివస్తాడు. ప్రాణాయామం అభ్యసించటంవల్ల కోడి రామమూర్తి కూడా వాయుదేవుడి బలాన్ని, ప్రభంజనత్వాన్ని సాధించాడని చెప్పవచ్చు. ఈయన తండ్రి కోడి వెంకన్నగారు భూకామందు.

రామమూర్తి జననం 1885. విజయనగరంలోని ప్రోవిన్షియల్ లోవర్ సెకండరీ స్కూలులో వ్యాయామోపాధ్యాయుడిగా కొంతకాలం పనిచేశాడు రామమూర్తి. తెలుగుజిల్లాల లోని జమీందారులు ముఖ్యంగా తుని జమీందారు ధనసహాయం చేయడంతో సర్కస్ కంపెనీ స్థాపించి రామమూర్తి తెలుగుదేశమంతా ప్రదర్శన లిచ్చాడు. 1912లో ఆయన మద్రాసు వెళ్ళి ప్రదర్శనలివ్వడంతో ఆయన కీర్తి గొప్పగా వ్యాపించింది. తరువాత విదేశాలలో ఆయన ప్రదర్శనలిచ్చాడు.

ఇటువంటి మహావీరుడు కాలిమీద రాచపుండుతో బాధపడి కాలుతీసివేయగా 1942 సంవత్సరంలో పరమపదించాడు.

★★★★



# మాడపాటి హనుమంతరావు

1948వ సంవత్సరం సెప్టెంబర్‌లో పోలీసు చర్య జరిగి నైజాం లొంగిపోయి హైదరాబాదు రాష్ట్రం స్వతంత్ర భారతదేశంలో విలీనమైనదాకా నిజాం రాజ్యంలో పౌరహక్కులు ఉండేవికావు. నూటికి ఎనభై అయిదు మందిపై నూటికి పదిహేను శాతంగల అల్పసంఖ్యాక వర్గం వారి ప్రాబల్యమే ఎక్కువగా చెల్లుబాటు అయ్యేది ఉన్నత విద్య అంతా ఉర్దూ మాధ్యం ద్వారానే తెలుగు, కన్నడ, మహారాష్ట్ర మాతృ భాషీయులు అంతా అభ్యసించవలసి ఉండేది. 1918లో స్థాపితమైన ఉస్మానియా విశ్వ విద్యాలయం, ఉర్దూ భాషా మాధ్యం ద్వారా ఉన్నత విద్యను, వైద్య సాంకేతిక విద్యను కూడా బోధించటానికి గట్టి కృషిచేసింది. తెలంగాణమని వ్యవహరించబడే ఎనిమిది తెలుగు జిల్లాలలో కేవలం అప్పుడు 18 మాత్రమే మాధ్యమిక పాఠశాలలుండేవి ఎన్నో గ్రామాలలో ప్రాథమిక పాఠశాలలు కూడా ఉండేవి కావు. మాధ్యమిక పాఠశాలల్లో కూడా తెలుగును రెండోభాషగా నేర్చుకోవటానికి మాత్రమే అవకాశం ఉండేది. ఇక ఉన్నత పాఠశాలలు, కళాశాలలు, అందులో అధిక సంఖ్యాకుల మాతృ భాషలో విద్య నేర్చుకోవటం గురించి అడిగేదేమున్నది? చెప్పేదే మున్నది? అధిక సంఖ్యాకులలో నూటికి ముగ్గురు కూడా అక్షరాస్యులు లేని దయనీయమైన స్థితి అది. 1930 సంవత్సర ప్రాంతాల వరకు ఇటువంటి పరిస్థితులు ఉండేవి. మహమ్మదీయులలో నూటికి 6 మంది దాకా అక్షరాస్యులుండే వారు. ప్రభుత్వోద్యోగాలలో చిన్న, పెద్ద వాటిలో వాళ్ళదే ప్రాబల్యం. అప్పట్లో తెలుగు భాషకు ఎటువంటి అవకాశమూ, వికాసమూ లేనేలేవు. పఠన పాఠనాదులు లేనే లేవు. గ్రంథాలయాలు లేవు. సభలు, సమావేశాలు లేవు. ఎటువంటి సభగాని, సమావేశం గాని జరపాలనుకున్నా, ముందుగా ప్రభుత్వం వారి అనుజ్ఞపొందాల్సి ఉండేది. ప్రసంగ పాఠాలు కూడా ముందుగా సమర్పించి ప్రభుత్వం వారి అనుమతి పొందవలసి ఉండేది ఆ రోజుల్లో.

ఈ పరిస్థితులలో తెలుగు భాషా వికాసానికి, తెలుగు వారి చైతన్యానికి, తెలుగువారి ఉనికికి, ఆత్మోన్నతికి, కృషిచేసిన మహనీయుడు మాడపాటి హనుమంతరావు పంతులు.

ఆంధ్ర మహాసభ సంస్థాపక కార్యదర్శిగా ఈయన చేసిన సేవ నిరుపమానం. ప్రతి సంవత్సరమూ గ్రంథాలయ మహాసభలు జరిపి, ప్రజలలో స్వీయ సంస్కృతిపట్ల, స్వీయభాషపట్ల అభిమానం సుసంఘటితంగా విస్తరింపజేసిన కీర్తిమంతుడు హనుమంతరావు. అనేక సందర్భాలలో ఆశాభంగానికి, అమర్యాదకు, కష్ట నిష్ఠూరాలకు ఓర్చుకొని, సంస్థాగత మైన కృషి జరిపి ప్రజలలో చైతన్యాన్ని కలిగించాడాయన. ప్రజాహిత కార్యక్రమాలలో అవిశ్రాంతంగా పరిశ్రమిస్తూనే పైసా పైసా కూడగట్టి లెక్కరాసి తన జీవితాన్ని తెరచిన పుస్తకంలా సంస్థా నిర్వహణలో ఉదాత్త సంప్రదాయిం నెలకొల్పిన త్యాగశీలి పంతులుగారు. ఎటువంటి ఆడంబరమూ, ఎటువంటి వ్యక్తిగత అభినివేశమూ ఎప్పుడూ ప్రదర్శించిన వాడు కాడాయున  మితవాదిగానే అయినా అమిత సాంఘిక సేవా తత్పరతను, ఉత్తమ సంప్రదాయాలను జాతికి అలవరచిన వాడు పంతులుగారు.

సాంఘిక రంగంలోనే కాక సాహిత్య రంగంలోనూ కూడా హనుమంతరావుగారి విశిష్ట వ్యక్తిత్వం సువాసించింది. కోస్తా జిల్లాల్లో వీరేశలింగం సాగించిన ఉద్యమ ఫలితాలన్నిటినీ ఈ ప్రాంతపు తెలుగు జిల్లాలలో సాధించిన దొడ్డ వ్యక్తి హనుమంతరావు  ఆయున కన్నా ఈయున విషమ పరిస్థితుల నెదుర్కొన్న వాడు. తల్లిదండ్రులు సుబ్బమ్మ, వేంకటప్పారావు గారలు. పరమపదం **1870.**



# గిడుగు వెంకటసీతాపతి



అధునిక తెలుగు సాహిత్య చరిత్రలో గిడుగురామమూర్తి పంతులుగారి స్థానం అద్వితీయం. తండ్రంత వాడు సీతాపతి. భాషాసాహిత్య, చరిత్ర, పురాతత్వ మానవ విజ్ఞాన రంగాలలో భాషా వివాదాలలో తండ్రికి కుడి భుజంలా సాయపడ్డాడు. తండ్రి అధిష్టించిన స్థానాన్నే ఆయన తరువాత పర్లాకిమిడి కళాశాలలో తానూ అధిష్టించి ఆచార్యత్వం నెరిపారు.

అనేక రంగాలలో ప్రజ్ఞా ప్రాభవాలు ప్రదర్శించారు సీతాపతి. సంగీతం, నృత్యం, నాటకకళ, మానవశాస్త్రం, శాసనలిపిత్వం ఇవన్నీ ఆయనకు కరతలామలకం. సంస్కృతంలో గొప్ప పండితుడు. ప్రాచీన తెలుగు కవుల ప్రతిభాస్ఫోరక కవితాఘట్టాలను క్షేత్రయ్య పదాలను ఆయన సంస్కృతంలోకి అనువదించి కవితోదయ చంద్రికగా ప్రకటించారు. తెలుగు వారికి సంబంధించిన రాజకీయాందోళనలలో కూడా ముందంజ వేశారు సీతాపతి. 1936 ప్రాంతాలలో ఉత్కళరాష్ట్రం ఏర్పడ నున్న తరుణంలో తెలుగు ప్రాంతమైన పర్లాకిమిడి తాలూకాను ఒరిస్సాలో చేర్చాలన్న వాదనను వ్యతిరేకించి ఇంగ్లండుకు వెళ్ళి వాదించారు సీతాపతి.

ఆదిమ జాతులైన సవరల భాష, సంస్కృతులను గూర్చి లోకానికి తెలియజెయ్యడానికి చాలా కృషి చేశారు సీతాపతి. ఈ విషయంలో ఆయన తండ్రిగారికిచ్చిన సహకారం దొడ్డది సవర తెలుగు, తెలుగు సవరనిఘంటు నిర్మాణంలో ఆయన తండ్రిగారికి చాలా తోడ్పడ్డారు. సవరల సంగీత వాద్యాలు తీసుకొని వెళ్ళి పారిస్ విశ్వవిద్యాలయంలో ప్రదర్శన పూర్వక ప్రసంగం చేశారు, సవరల భాషాసంస్కృతులను గూర్చి ప్రఖ్యాత భాషాశాస్త్రవేత్త సర్ జార్జ్ గ్రియర్ సన్ 80వ జన్మదినోత్సవాభినందన సంపుటిలో తెలుగు ఉనిక గూర్చి సీతాపతి గారు వ్రాశారు.

అంతర్జాతీయంగా గుర్తింపు పొందారు సీతాపతి. అమెరికాలోని ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అమెరికా వారు సీతాపతికి డాక్టరేట్ ఇచ్చి గౌరవించారు.

వాడుక భాష పద్యరచనకు సొంపుగా ఉండదనటాన్ని పరాస్తం చేస్తూ భారతీశతకాన్ని హృదయంగమంగా వాడుక భాషలో రచించారు. ఛందః శాస్త్రంలో సీతాపతి గారి పాండిత్యం తలమానికం. తెలుగులో ఛందోరీతుల గ్రంథానికి రాష్ట్ర సాహిత్య అకాడమీ పురస్కారం వీరికి లభించింది. తెలుగు భాషా సమితి వారి విజ్ఞాన సర్వస్వాల కొన్నిటికో సీతాపతిగారు సంపాదకత్వం వహించారు. చలన చిత్రాలలో నటించి జేజేలందుకున్నారు సీతాపతి . రైతు బిడ్డలో వీరిజమీందారు వేషం చాలా ప్రశంసాపాత్రమైంది. సూర్యరాయాంధ్రనిఘంటువు చివర మూడు సంపుటాల ప్రచరణ నిర్వహణం సీతాపతి గారిదే. విశాఖ జిల్లా భీమునిపట్నంలో సీతాపతి 1885 జనవరి 28న జన్మించారు. సహస్రమాస జీవితం గడిపారు. కవి, పండితుడు, విమర్శకుడు, సంగీత నృత్య నాటక కళావిజ్ఞాని. భాషాసాహిత్య పరిశోధకుడుగా ఆధునిక తెలుగు సాహిత్యంలో చిరస్మరణీయమైన స్థానం సంపాదించారు. పరమపదం 1968. తల్లిదండ్రులు అన్నపూర్ణమ్మ, రామమూర్తిపంతులు.



# కొప్పరపు కవులు

ఈశతాబ్దపు మొదటి ఇరవై సంవత్సరాలు ఎక్కడ చూసినా అష్టావధానాలు, శతావధానాలు, జంటకవుల కవితా సంరంభమే తెలుగుదేశంలో. తిరుపతి వెంకట కవులను చూసి, కొప్పరపు సోదర కవులను చూసి, వేంకట పార్వతీశ్వర కవులను చూసి, వెంకట రామకృష్ణ కవులను చూసి, కాస్త పద్యాలల్లగలిగి కవిత్వపు తళుకులు చూపగల కవి మిత్రులిద్దరు కూడారా, జంటకవులుగా కీర్తిసంపాదించాలని తహతహ లాడారు ఆరోజుల్లో విశ్వనాథ సత్యనారాయణ గారంతటి ప్రతిభావంతుడు, కొడాలి ఆంజనేయులుగారి వంటి మధురకవి, పరమ సాత్వికుడు, 'మహాత్ముని అసిలేని సేన బడిపోయిన సాధుమహాశీలి' తో కలిసి 'సత్యాంజనేయ కవులు'గా నేస్తం కట్టి పద్యాలు చెప్పాడు. ఈమాట విశ్వనాథ వారే చెప్పారు. ఆకాలం అవధానాలయుగం. జంటకవుల వైభోగం. ఆశుకవిత్వ కోలాహలం. పింగళి కాటూరివారూ ఇంకా ఎందరో జంటకవులు బయలుదేరారు ఆ రోజుల్లోనే. ఊరూరావాడవాడా అవధానసభలు, అదొక పెద్ద ఆకర్షణ ఆ రోజుల్లో. నాటక ప్రదర్శనలకు మల్లే పోటాపోటీలు. అంతటితో ఆగలేదు. ఆగడాలు, స్పర్ధలు, మాత్సర్యాలు, వాచావాచి మల్లయుద్ధాలు చేశారు. సాక్ష్యాలు సంపన్నాలు, సంవాదాలు, వివాదాలు ప్రకటించారు

ఎంత పెద్దవారిలో అయినా పండితులలో అయినా మాత్సర్యాలు, స్పర్ధలు, స్వాభిమాన విజిగీషలు, పట్టుతలలు ఎటువంటి పరిణామాలకు దారితీస్తాయో ఇటు తిరుపతి వెంకటకవులు ఈవేపు కొప్పరపు సోదరకవులతో ఆవేపు పిఠాపురంలోని వేంకట రామకృష్ణకవులతో సలిపిన సాహిత్య హోరాహోరీ పోరాటాలు, రెండు పక్షాలలోను

వెలువడిన శతఘ్నులు, పాశుపతాలు, శృంగభంగాలు, తృణీకరణాలు, గీరతాలు, గుంటూరు సీమలు వెల్లడి చేస్తాయి

అప్పట్లో వాళ్ళకది వినోదమో, విరోధమో కాని సబబుకాదు సముచితంకాదు అనిపించిందో అనిపించలేదోకాని ఇప్పుడవన్నీ చదివితే, తలుచుకొంటేనే ఎందుకన్ని సిగపట్లు అందునా సాహిత్యలోకంలో అనిపిస్తుంది.

చిలికి చిలికి గాలివాన అయినట్లుగా, వడ్లగింజలో బియ్యపు గింజగానే ప్రారంభమైనాయి ఈ వాదవివాదాలు, జయనాదాలు. బోద్ధారో మత్సరగ్రస్తః అని ఊరికే అనలేదు సుభాషితకారుడు.

గుంటూరులో 1910,11 సంవత్సరాల ప్రాంతంలో ఒక విద్వత్సభలో అదిన్నీ తిరుపతి వెంకటకవుల అవధానసభలో సహా సనాసీన యోగ్యతను గూర్చి ఈ జంటకవుల జంటమధ్య కంటగింపు ప్రారంభమైంది. మాటలమంటలు రాజుకున్నాయి.

కొప్పరపు సోదరకవులు మహాప్రతిభాపూర్ణులు. అందుకు సందేహం లేదు. తిరుపతి కవులూ ఆరాధ్యులే, అందుకున్నూ అసలు సందేహం లేదు, అయితే కలహాశనత్వం వుండే అది ఊరుకోనియ్యదు కొప్పరపు కవుల గొప్పేమిటి, బడబడ పద్యాలు చెబితే అదొక గొప్పా అన్నారు తప్పుఒప్పులు కూడా కనుక్కోవడానికి వీల్లేనంత ధాటీగా వేగంగా ఆశుకవిత్వం చెప్పడం అదొక సాముగరిడీ విద్యకన్నా స్తుతిపాత్రమైన ప్రతిభా ఏమిటి అన్నారు తిరుపతి వేంకట కవులు. కాని కొప్పరపు కవులు వొట్టి ఆశుకవులేకాదు. అష్టావధానాలు చేశారు. శతావధానాలు చేశారు అదిన్నీకాక అవ్యవహితంగా ఒకసారి వెంటవెంట ఒక రోజుననే రెండు శతావధానాలు చేశారు 17 సీస పద్యాలు, తక్కిన వృత్తాలతోపాటు ఆశువుగా చెప్పి సభనమాపనంలో ఆ వందపద్యాలూ మళ్ళీచెప్పారు. వేదం వెంకట్రాయశాస్త్రి, వావిలికొలను సుబ్బారావు, శతఘంటం వెంకటరంగశాస్త్రి, కొమర్రాజు లక్ష్మణరావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, కానుకొలను త్రివిక్రమరావు (వీరే తరువాత విమలానంద భారతీ స్వాములుగా యోగపట్టం వహించి కుర్తాలం సిద్దేశ్వరీ పీఠ పరమాచార్యులైనారు) మొదలైన మహామహులంతా కొప్పరపు సోదరకవుల మహాప్రతిభ చూసి అప్రతిభులై పోయినారు. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు విజ్ఞాన చంద్రికామండలి పక్షాన కొప్పరం వారిని గొప్పచేసి ఆశుకవి చక్రవర్తులు అనే బిరుద సత్కారంకూడా కలుగచేశారు. అన్నిటికన్నా గొప్ప విషయం వంగదేశంలో సుప్రతిష్ఠితమైన నవద్వీపమహాపండిత మండలిచేతనే జోహార్లందుకున్న కావ్యకంఠ వాసిష్ఠగణపతి ముని 'శారదా దేవి లాస్యంచేస్తున్న దర్రామీముఖాంభోజ వినిర్గత వాక్ప్ర ధారనధార రూపకంగా' అని మెచ్చారు కొప్పరపు కవులను కొప్పరపు సోదరులు ఒకసారి సభలో గంటకు 480 పద్యాలు చెప్పారుట అంటే నిమిషానికి 8 పద్యాలు నమ్మలేని సంగతి అయినా అల్లావఝల శివశంకర శాస్త్రిగారు కొప్పరపు కవులు నిమిషానికి పది పద్యాలు పైగా చెప్పారని తన స్మృతులు – జ్ఞాపకాలలో వ్రాసుకున్నారు చిలకమర్తి

లక్ష్మీనరసింహం అధ్యక్షత వహించిన ఒక సాహిత్య సభలో కొప్పరపు కవులు సదస్యులు కోరిన ఇతివృత్తంతో ఒక ఆశుకావ్యం చెప్పారు. మూడుగంటల్లో 4 వందలపైగా పద్యాలు చెప్పి శకుంతల వృత్తాంతం అద్భుతమైన ప్రబంధ వర్ణనలతో పూర్తిచేశారుట. ఇది అసాధ్యం, అనన్యసదృశం అని పొగిడారు చిలకమర్తివారు. ఆ సభలో గొప్ప పండితులెందరో వున్నారు. తమ శతావధానాలలో ఆశుకవితా విద్యా సదస్సులలో కొప్పరపు సోదరకవులు మొత్తం 3 లక్షల పద్యాలు చెప్పి వుంటారని నిడుదవోలు వేంకటరావుగారి కొప్పరపు సోదరకవుల యశఃశరీర నిరూపకమైన కైమోడ్పు.

కొప్పరపు సోదరకవుల అవధానంలో స్రగ్ధర, మహా స్రగ్ధర, భుజంగ ప్రయాతం, లయగ్రాహి, స్రగ్విణి, మందాక్రాంత, మత్తకోకిల, మాలిని, సుగంధివంటి విశేష వృత్తాలు కూడా చెప్పేవారుట. వీళ్ళు 'పల్కిన పల్కులెల్ల పద్యములవుతాయి' అని సంస్తుతి చేశారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. గజారోహణం వంటి గొప్పసన్మానాలు 'ఆశుకవీంద్ర సింహ' వంటి గొప్ప బిరుదులు ఎన్నో పొందారు కొప్పరపు కవులు. పిఠాపురం రాజాగారి సన్మానం పొందారు. అయితే వీళ్ళు గ్రంథాలు ప్రకటించక పోవడం శిష్యప్రశిష్యులను చేరదియ్యకపోవడంవల్ల లోకంలో ఖ్యాతి అంతగా వ్యాపించలేదు. వేలూరి శివరామశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, పింగళి-కాటూరి విశ్వనాథ సత్యనారాయణవంటి మహాకవులు తిరుపతి వేంకట కవుల శిష్యులైనారు కాబట్టి, తి.వెం. కవులు నాటకాలు వ్రాశారు కాబట్టి మహానటకులు వాటిని ఆడారు, కాబట్టి వాళ్లకు గొప్ప ఖ్యాతి వచ్చింది. కొప్పరపు కవులలో పెద్దవారు వేంకట సుబ్బరాయకవి జననం **1885**. పరమపదం **1932**. రెండవవారు వేంకటరమణకవి. జననం **1887**. పరమపదం **1942**. తల్లిదండ్రులు వేంకటరాయలు, సుబ్బమాంబగారలు కొప్పరం స్వగ్రామం. 'కవిత పుట్టిల్లు సోదరకవుల ఇల్లు అనే అభాణకం వీళ్ళపట్ల అన్వర్థం. అరగంటలో వీళ్ళు రెండు శతకాలు చెప్పారు ఒకసారి. 'జయంతితేసుకృతినో'

★★★★

# ఎల్లాప్రగడ సుబ్బారావు



ఒక్క క్షణంకాలం వృథాగా గడిచిపోతే మళ్ళీదాని రాబట్టలేం. కాలం చాలా విలువైంది. దేనినైనా ప్రయత్నంమీద పొందవచ్చు. కాని కాలాన్ని మాత్రం మళ్ళీ సంపాదించుకోలేము! ఇది యల్లాప్రగడ సుబ్బారావు వైద్య శాస్త్ర పరిశోధనా నిమగ్నత.

భూమి మీద రుజాగ్రస్తులెందరో వున్నారు. వాళ్ళ రుజాక్లేశం విమోచించాలి నేను. అని తన యావజ్జీవితం వైద్య పరిశోధనలకు అర్పించిన మహనీయుడు యల్లాప్రగడ సుబ్బారావు. సౌజన్యం సౌమనస్యం మూర్తీభవించిన సత్యసంధుడాయిన. తపస్వి, శాంతిదూత, ప్రాచ్యదేశ ఆధ్యాత్మిక సందేశహారి.

ఈయన మద్రాసులో వైద్యం చదివాడు. తరువాత లండన్ ట్రాపికల్ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌లో డిప్లొమా తీసుకున్నాడు. 1923లో అమెరికా వెళ్ళాడు. న్యూయార్క్‌లోని హార్వర్డ్ స్కూల్ ఆఫ్‌ట్రాపికల్ మెడిసిన్‌లో గొప్ప గ్రంధాలయం వుంది. అవన్నీ వైద్యానికి సంబంధించినవి ఆ సంస్థలో గ్రంధాలయ నిర్వహణోద్యోగం ఇచ్చారు సుబ్బారావుకి. అటు తర్వాత సుబ్బారావు హార్వర్డ్ యూనివర్శిటీ నుంచి ఆరోగ్య పరిరక్షణ శాస్త్రంలో పి హెచ్.డి తీసుకున్నారు. జీవ రసాయన శాస్త్రంలో (బయోకెమిస్ట్రీ) మహా ప్రతిభతో కొత్త విషయాలెన్నో కనిపెట్టి మానవుడి మనుగడకి ఆశ్వాసాన్ని కలిగించారు దేశదేశాలలో యల్లాప్రగడ విఖ్యాతి వ్యాపించింది. విటమిన్ బి 12ను గురించి ఈ మహాత్ముడు చేసిన ఆవిష్కరణలే వైద్యశాస్త్ర పురోగతిలో ఇప్పటివాళ్ళకు మార్గదర్శకమైనవి. రక్త విజ్ఞాన శాస్త్రవేత్తగా అంతర్జాతీయ ఖ్యాతి లభించింది సుబ్బారావుకు. హెట్రాజాన్ (బోదకాలు చికిత్సకు) ఏరోమైసిన్ (టైఫాయిడ్‌లాంటి జ్వరాలు తెచ్చే క్రిమినాశని) రక్త క్షయవ్యాధి నివారిణి పోలికామ్లం, క్షయనిరోధిని ఐసోనికోటి నికాసిడ్ మొదలైన ఔషధ సంధాన విజ్ఞానాన్ని లోకానికి ప్రసాదించిన ధన్వంతరి వరప్రసాదమూర్తిమంతుడు సుబ్బారావు.

ఆ మహాప్రభువు అస్తమించినప్పుడు న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక ఆయన మహోన్నత మానవ సేవా దీక్ష నీవిధంగా నివాళించింది. ''నవీన ఔషధ శాస్త్ర విజ్ఞానంలో ఎన్నో నూతనా విష్కరణలు ఆయన నిరుపమాన ప్రతిభకు నిదర్శనాలు. రాబోయే

తరతరాల వేలాది మానవులు ఆయిన కనుక్కొన్న మందులవల్ల వేదన దూరులవుతారు. ఆయిన వైద్యశాస్త్రంలో చేసిన పరిశోధనలు చిరస్మరణీయాలు.''

దుర్విధిహసించింది. భారతదేశం తన పుత్రరత్నాన్ని కోల్పోయింది లేకుంటే ఆయిన మేధా దివ్యదీధితులు రుజాగ్రస్త మానవాళికి మరెన్నో ఉపశమన చికిత్సలు ప్రసాదించి ఉండేవి. స్వయంకృషి, సత్కార్యాచరణ దీక్ష, జగత్కల్యాణ కాంక్ష, 'యద్యత్కర్మకరోమితత్తదఖిలం, వైద్య శాస్త్రారాధనం' అనే తపస్వితసుబ్బారావు జీవితంలో పరిమళించాయి ఎక్కడో నరసాపురం దగ్గర జన్మించి అమెరికాలో పరిశోధనలు జరిపి భారతదేశానికి వన్నె, వాసీ కూర్చిన శాస్త్రవేత్త సుబ్బారావు. ఆయిన అకాలమరణం వల్ల లోకం ఎంతో కోల్పోయింది యెల్లాప్రగడ సుబ్బారావు జననం 1886. పరమాత్మలో కలిసిపోవడం 1948



# బారు రాజారావు



సముద్రపు ఉప్పూ అడవి ఉసిరి కలిసినట్లు స్వాతంత్ర్యోద్యమంలో భారతదేశంలోని నాలుగు మూలల నుంచీ ఇనుము అయిస్కాంతంచేత ఆకర్షితమైనట్లు దేశభక్తులు జైళ్ళలో పోగుపడ్డారు అదొక ఉజ్వల వీరగాథ లేకపోతే ఎక్కడి నరసాపురం ఎక్కడి అలహాబాదు. ఆసేతు శీతాచలం స్వాతంత్ర్యోద్యమ మహా ప్రవాహాభిముఖంగా నాటి త్యాగధనుల వీరగాథలు సాగాయి

నడీచప్పుడూ లేకుండా తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించిన దేశభక్తులు ఒక మహామందిరపు పునాది రాళ్ళవంటివారన్నారు ఒక రచయిత. వాళ్ళకు పదవులు, అధికారాలు, గౌరవాలు, సన్మానాలు లభించక పోవచ్చు కానివాళ్ళు లేకపోతే దేశం లేదు. స్వాతంత్ర్య మహామందిరం లేదు.

బారు రాజారావు 1888వ సంవత్సరం తెలుగునాడులోని పశ్చిమగోదావరి జిల్లా నరసాపురంలో జన్మించాడు నరసాపురంలో కాకినాడలో పెద్దాపురంలో ఆయిన ఉన్నత పాఠశాల విద్యాభ్యాసం సాగింది 1905వ సంవత్సరం కాలేజీ చదువులకోసం రాజమండ్రి చేరారు. అప్పటికే వందేమాతరం ఉద్యమం తీవ్రంగా వీస్తున్నది. రాజమండ్రి ఆర్ట్సు కాలేజి ప్రిన్సిపాల్ మార్క్ హంటర్ విద్యార్థులపై కఠినమైన ఆంక్షలను విధించాడు ఎందరి విద్యార్థులనో కళాశాల నుంచి వెళ్ళగొట్టాడు. రాజారావు కూడా ఇటువంటి బహిష్కరణకు గురిఅయినాడు. అటు తర్వాత ఆయిన మద్రాసులో పచ్చయుప్ప కళాశాలలో చేరాడు. అటు తర్వాత కలకత్తా వెళ్ళాడు. అక్కడ విశ్వవిద్యాలయం నుంచి ఆయిన పట్టభద్రుడైనాడు.

న్యాపతి సుబ్బారావు [illegible] 1917వ సంవత్సరంలో అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శి అయినాడు అప్పుడు రాజారావు చురుకుతనం, చిత్తశుద్ధి, మేధావిత ఆయిన్ను ఆకర్షించి సంస్థ కార్యాలయ కార్యదర్శిగా ఆయిన్ను నియమించాడు అప్పటి నుంచి 17 సంవత్సరాలు

రాజారావు కాంగ్రెసు కార్యాలయ కార్యదర్శిగా పనిచేశాడు. పది సంవత్సరాల పైన అలహాబాదులో స్థిరంగా నివసించాడు. మోతీలాల్ నెహ్రూ కుటుంబంలో ఒక సభ్యుడే అయిపోయినాడు రాజారావు. జవహర్‌లాల్ నెహ్రూ, రాజారావును రక్తసంబంధీకుడైన సోదరుడిగానే చూసుకున్నాడు. కాంగ్రెస్ సంస్థ అధ్యక్షులందరూ రాజారావుని ఎంతగానో అభిమానించే వాళ్ళు ఆయనపై ఎంతగానో ఆధారపడేవాళ్ళు.

1930 సత్యాగ్రహంలో రాజారావు ఇల్లాలు శ్రీమతి అలివేలమ్మ జవహర్లాల్ ఇల్లాలు కమలాదేవితో పాటు విదేశీ వస్త్ర విక్రయశాలల ముందు 'పికెటింగ్' చేసింది రాజారావు సంతానం, ఇందిరా గాంధీతో పాటు బాల సేవాదళంలో సభ్యులుగా చేరారు.

మోతీలాల్ నెహ్రూ చితా భస్మాస్థికలను రాజారావు రాజమండ్రి తెచ్చి గోదావరిలో కలిపాడు. భారత స్వాతంత్ర్యోద్యమ సత్యాగ్రహంలో ఇతర జాతీయ నాయకులందరితో పాటు రాజారావు కారాగారశిక్ష అనుభవించాడు

1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకుగాను మహాత్మాగాంధీతో పాటు రాజారావు కూడా యెరవాడ జైలులో శిక్ష అనుభవించాడు. ఢిల్లీ జైలులో 1931వ సంవత్సరంలో నిర్బంధ జైలు శిక్ష అనుభవించాడు. విఠల్‌భాయ్ పటేల్, మోతీలాల్ నెహ్రూ, మదనమోహన మాలవ్యాలు రాజారావు వ్రాసిన నివేదికలను ఎంతగానో మెచ్చుకొనేవాళ్ళు. రాజారావు రామకృష్ణ పరమహంస భక్తులు. మాతా శారదా దేవిని ఆయన సందర్భ పడినప్పుడల్లా వెళ్ళి దర్శించుకొనేవాడు. స్వామి వివేకానంద సోదరుడైన మహేంద్రనాథ్ దత్త 'నవ ఆసియా' అనే తన గ్రంథాన్ని రాజారావుకు అంకితం చేశాడు. జవహర్‌లాల్ నెహ్రూ ఒకసారి రాజమండ్రి వచ్చినప్పుడు సంపన్నులైన పురప్రముఖులెందరో ఆయనకు ఆతిథ్యం ఇవ్వాలని పోటాపోటీలు పడ్డారు. కాని రాజారావు ఇంటనే ఆతిథ్యం స్వీకరించారు నెహ్రూజీ. అసౌకర్యాలనేమీ లక్ష్యపెట్టలేదు రాజారావు తాతగారు ఈ పేరిటి వాడే అయిన రాజారావు పంతులు వీరేశలింగం పట్ల అభిమానంతో ఆయన సంఘ సంస్కరణ కార్యక్రమాలకు చేయూతనిచ్చాడు. రాజారావు 1938వ సంవత్సరం 50 సం.ల పిన్నవయస్సులోనే చనిపోయాడు.



# వేటూరి ప్రభాకరశాస్త్రి



వేటూరి వారి సారస్వతసేవ బహుముఖీనం నిరుపమానం సంప్రదాయ విద్వాంసులందరిలాగా కాకుండా తెలుగు సాహిత్యంలో నూతన మార్గాలకు శాస్త్రిగారు స్వాగతం పలికి అందులో తాము పాత్రులైనారు. సాహిత్యంలోకాని సంఘంలో కాని నవ్యసంస్కారాలను ఆయన కాదనలేదు. సాహిత్యవేత్త అనగానే ఛందోలంకార రస సామగ్రిని పుష్కలంగా సాధించిన వారు అనే అభిప్రాయం వుండేది. పూర్వపు రోజులలో గ్రంథ పరిష్కరణం, కవి కాలాదుల చర్చ, చారిత్రక పరిజ్ఞానం, శాసన విజ్ఞానం, వ్యాఖ్యానగరిమ, పదపదార్థ నిరూపణం, తక్కిన లలితకళల పాండిత్యం ఇవన్నీ సాహితీవేత్తను సానబట్టిన రత్నంలా చేస్తాయి అటువంటి మహారత్నం శాస్త్రిగారు.

మద్రాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో శాస్త్రిగారు చాలాకాలం పండితులుగా పనిచేశారు ఆ సంపదనంతా పరిశీలించి అపూర్వమైన విషయాలెన్నో ప్రకటించారు. చాటుపద్య మణిమంజరి పేరున చాటు పద్యాలను సంకలితం చేసి రెండు భాగాలుగా ప్రకటించారు ప్రాచీనకావ్యాలలోని వ్యాసఘట్టాల నెన్నింటినో పరిష్కరించి తరవాత తరం పరిశోధకులకు శాస్త్రిగారు మార్గదర్శకులైనారు ప్రభాకర శాస్త్రిగారు తెలుగుదేశంలోని శాసనాలెన్నింటినో చదివి చారిత్రకమైన విశేషాలను, యథార్థాలను వెలికితీసి సమన్వయం చేసి చెప్పారు కవుల చరిత్రకు ఎక్కని ఎందరో తెలుగు కవులను 'ప్రబంధ రత్నావళి' అనే సంకలన గ్రంథాన్ని ప్రకటించటం ద్వారా శాస్త్రిగారు తెలుగువారికి పరిచయం చేశారు. ఆధునిక కాలంలో తెలుగుభాషా సాహిత్యాలలో శాస్త్రిగారు పరిశోధన రంగానికి ప్రమాణాలు ఏర్పరచి రాచబాటలు వేశారు. అన్నమయ్య కీర్తనలను తొలిసారిగా తెలుగువారికి ఎరుక పరిచింది శాస్త్రిగారే అన్నమాచార్యుల రచనలే కాక తాళ్ళపాక వారి సంకీర్తన సాహిత్యపు ఉనికినీ తెలుగువారికి చూపింది శాస్త్రిగారే వారి స్వీయ చరిత్ర ప్రజ్ఞా ప్రభాకరం, అసంపూర్ణమైనా ఎంతో విలువైనది. ప్రభాకర శాస్త్రులవారు గొప్ప సాహిత్యవేత్తలే కాకుండా ఆధ్యాత్మిక దివ్య పథాలలో కూడా శిఖరాలను చేరగలిగారు. గొప్ప యోగశక్తుల ద్వారా

దీనుల దుఃఖితుల రుజగ్రస్తుల కష్టాలు తీర్చి సమాశ్వాసం కలిగించారు. మాస్టర్ సి.వి.వి అనే మంత్రాక్షర సంపుటికి కుదురైన మహాయోగీశ్వరులు ఒకరు కుంభకోణం నుంచి యీ శతాబ్దిలో యోగ విజ్ఞానం వెలయించారు. ఈ యోగదర్శనంలో ప్రభాకర శాస్త్రి గారు పరమాచార్యులైనారు. శాస్త్రిగారి జన్మస్థానం కృష్ణాజిల్లా పెదకళ్ళేపల్లి. తల్లిదండ్రులు శేషమ్మ, సుందరశాస్త్రిగారలు. జననం **1888** పరమపదం **1950**



# సర్వేపల్లి రాధాకృష్ణ



ఇరవయ్యో శతాబ్దం ప్రపంచానికి **భారతదేశం** సమర్పించిన **తత్త్వజ్ఞాన** నిధి దార్శనికుడు, వేదాంతి, ఉదార రాజనీతిజ్ఞుడు, ఉత్తమోత్తమ మానవతావాది, మహా మేధావి సర్వేపల్లి రాధాకృష్ణ. మానవుడి మనుగడ ఆధ్యాత్మిక విలువలతో నైతికబలంతో కూడిన మతంతోనే ముడివడి ఉందని చాటిచెప్పిన మహనీయుడు. ప్రాచ్యపాశ్చాత్య తత్త్వదర్శనాలను సమన్వయించేసి హిందూమత ఉత్కృష్టతను చాటిచెప్పిన, స్థాపించిన ఆచార్యుడు అద్వైతాన్ని ఆర్థిక సాంఘిక సిద్ధాంత దర్శనంగా ప్రవచించిన తత్త్వవేత్త.

తరతరాలుగా యుగయుగాలుగా భారతీయ విచార ధారలోని పరమార్థ విషయాలను సూటిగా సులభంగా విస్పష్టంగా ప్రపంచానికి అందించిన ధీమంతుడు. హృదయాన్ని, మేధస్సును సమపాళ్ళలో పండించిన ప్రజ్ఞాశాలి. తత్త్వ శాస్త్రానికి సాహిత్య మాధుర్యం చేకూర్చిన మహారచయిత. భారతీయ సాంఘిక వ్యవస్థలో కుటుంబిని సంస్కారమే కుటుంబానికి శ్రీరామరక్షగా, సమాజానికి విచక్షణ చక్షువుగా కాపాడుతూ వచ్చిందని స్వీయచరిత్ర సంగ్రహంలో ఆయన పేర్కొన్నారు మతాన్ని హేతువాద దృష్టితో వివేచించారు. పవిత్రమైన శీలమూ, నిర్మలాంతఃకరణమూ పరతత్త్వ దర్శనానికి ముఖ్యమని ఆయిన అభిప్రాయపడ్డారు. భారతీయ గృహిణిలో ఉదారమైన ఓరిమి, ఉదాత్తమైన కూరిమి, నిరీక్షణతో కూడిన పేరిమి దివ్యాంశలని ఆయన అభిప్రాయపడ్డారు. ఇది దోషమైతే లోపమైతే అసంగతమైతే భగవంతుడిలోనే ఈ లోపాలున్నాయి కదా అని ఆయిన మూదలించారు

పసిపిల్లవాడివలే అచ్ఛస్వచ్ఛమైన హృదయంతో తప్ప దైవాన్ని సమీపించ లేరెవ్వరూ అని ఆయిన అభిప్రాయం. భారతీయ గ్రామీణ జీవనంలో ఒక ఆదర్శం ఉండేదని ఆయిన విశ్వాసం ఇట్లా అని తరతరాలుగా సాంఘిక వ్యవస్థలో ప్రవేశించిన అకర్మణ్యతను, అహేతుకతను ఆయన మెచ్చలేదు. సర్వమతాలవారు ఇతర మతాలపట్ల విశాలమూ,

వుదారమూ అయిన దృక్పథాన్ని అవలంబించాలని ఆయన ప్రబోధించారు. క్రైస్తవాది మతాలు ఇతర సంస్కృతులను, మతాలను, విమర్శించడాన్ని, నిరసించడాన్ని చూసి వారు విస్తుపోయేవారు.

బోధగురువులు, బాధగురువుల లక్షణాల గురించి ఆయన స్వీయ చరిత్ర సంగ్రహంలో ప్రస్తావించారు. ప్రభావశీలమైన వయస్సులో వివేకానందుడి విజ్ఞానంతమను ప్రబోధించిన విషయం చెప్పి హిందూమత తత్త్వజ్ఞాన దార్శనిక కృషికి అది తమను ప్రేరేచినట్లు ప్రసక్తం చేశారు.

మేధావిగా భారతీయ తత్త్వదర్శన వ్యాఖ్యాతగా రాధాకృష్ణ అంతర్జాతీయ ఖ్యాతి పొందారు. ప్రపంచ దేశాల ప్రసిద్ధ విశ్వవిద్యాలయాలన్నీ ఆయనకు గౌరవపట్ట ప్రదానం చేశాయి. బహుశా ఇరవయ్యోశతాబ్దంలో ఇన్ని విశ్వవిద్యాలయాల నుంచి ఇన్ని గౌరవ పట్టాలు పొందిన విశిష్ట వ్యక్తి ఇంకొకరు లేరేమోనన్నా అది అయథార్థం కాదు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం, వారణాసి హిందూ విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షులుగా ఆధునిక భారతీయ విద్యారంగానికి వారుచేసిన సేవ నిరుపమానం. కలకత్తా విశ్వవిద్యాలయంలో మానవ నైతిక విజ్ఞానం తత్త్వశాస్త్ర బోధనాచార్యులుగా వారికృషి అంతర్జాతీయంగా ఆకర్షకమైంది. 1926వ సంవత్సరంలో ఆయన ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంవారి ఆహ్వానంపై అక్కడ తత్త్వ శాస్త్రోపన్యాసాలు చేశారు. అటుతరువాత మూడేళ్ళకు ఆయన ఆక్స్‌ఫర్డ్‌లో వివిధమతాల తులనాత్మక అధ్యయన, ప్రాబోధిక ఆచార్యపీఠం అధివసించారు. ఐక్యరాజ్యసమితిలో సాంస్కృతిక సందేశ మేధావిగా ఆయన నిర్వహించిన పాత్ర విశిష్టమైనది. భారత ప్రభుత్వం ఉన్నత విద్యావిచారణ సంఘానికి ఆయన్ను అధ్యక్షుణ్ణే చేసింది. ఆ విషయమై వారి నివేదిక ఎంతో విలువైనదిగా విజ్ఞులు భావించారు. 1949లో శ్రీ రాధాకృష్ణ రష్యాకు రాయబారిగా నియుక్తులైనారు. ఆదేశంలో వారి విశిష్ట వ్యక్తిత్వం ఎంతగానో ప్రశంసాపాత్రమైంది 1952 నుంచి 1962 వరకు శ్రీ రాధాకృష్ణ భారత ఉపరాష్ట్రపతిగా ఆపదవికి వన్నె తెచ్చారు. 1962లో వారు భారత రాష్ట్రపతి అయినారు. పరమపదం 1975.





# దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

'రామదండు' అనగానే వెంటనే మనసులోకి వచ్చే మనిషి గోపాలకృష్ణయ్య. ఆయిన్ను ఆంధ్రరత్న అని జాతి అంతా పొగిడి పరవశించింది బ్రిటీష్ ప్రభుత్వపు అధికారాన్ని సవాలు చేసి, ధిక్కరించి నెగ్గుకొచ్చిన గొప్ప నాయకుడాయిన. 1921వ సంవత్సరంలో గోపాలకృష్ణయ్య చీరాల పురపాలక సంఘం నిర్మాణానికి వ్యతిరేకంగా సాగించిన సత్యాగ్రహం ఆధునిక దేశచరిత్రలో ప్రసిద్ధిపొందిన ఘట్టం. ఊరి ప్రజలనందరినీ ఊరి వెలుపలకు చేర్చి రోజుల తరబడి సత్యాగ్రహం నిర్వహింపచేశాడు గోపాలకృష్ణయ్య.

బారిస్టర్ చదువుకై స్కాట్లండ్ వెళ్ళినా ఆ చదువు ఆయిన్ను ఆకర్షించలేదు. అప్పటికే భారతీయ కళా సాంస్కృతిక రంగాలలో ఖ్యాతిగాంచిన ఆనందకుమార స్వామితో కలసి గోపాలకృష్ణయ్య నంది కేశ్వరుడి నాట్యశాస్త్రం ఇంగ్లీషులోకి పరివర్తింప చేశారు ఇంగ్లండులో బందరులో తెలుగువారు స్థాపించుకొన్న జాతీయ కళాశాలలో కొన్నాళ్ళు అధ్యాపకత్వం చేపట్టారు.

వెయ్యి మంది ఐచ్ఛిక భటులను తయారుచేసి ప్రజలలో క్రమశిక్షణను, దేశభక్తిని, సభలూ, సమావేశాలు సాఫీగా సాగిపోయే క్రమాన్ని ఆయిన నేర్పుతూ వచ్చారు. రాజమండ్రి ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకుడిగా పనిచేస్తున్న రోజులలో విదేశీయుడైన ప్రిన్సిపాల్‌తో వివాదపడి వెంటనే ఆంధ్రరత్న తన పదవికి రాజీనామా చేశాడు ఆయన అన్నిటికన్నా ఆత్మగౌరవం మిన్నగా తలచేవాడు. అందువల్ల ఆంధ్ర జాతీయ కళాశాలలో కూడా ఒకటి రెండేండ్లకంటే ఎక్కువ ఉండలేకపోయినారు.

మధురమైన కంఠంతో భక్తిగీతాలు పాడి సభా సమావేశాలలో ఆయిన ప్రజలను దేశభక్తి పూరితులను ఉత్తేజితులను చేస్తూ ఉండేవారు. ఆయిన చుట్టూ ఎల్లప్పుడూ వాతావరణం ఉత్సాహ తరంగితంగా ఉండేది. హాస్య సంభాషణ లోనూ, చతుర సంభాషణలోనూ,

నొప్పి కలిగించకుండా ఇతరులను విమర్శించడంలోనూ, ఆయన చాలా నేర్పరి.

ఆయిన సూక్తులు, ఛలోక్తులు, చాటూక్తులు, వెటకారపు పద్యాలు ఒకప్పుడు తెలుగుదేశంలో చాలా ప్రచారంలో ఉండేవి. 39 సంవత్సరాల పిన్న వయిస్సులోనే ఆయన మరణించడం వల్ల ఆయిన సాధించదలచుకొన్న మహత్కార్యాలకు ఆయన తుదిరూపం ఇవ్వలేక పోయివుండవచ్చు. కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలులో 1889వ సంవత్సరంలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య జననం 1928లో పరమపదం. అఖిల భారత కాంగ్రెస్‌కు కొన్నాళ్ళు కార్యదర్శిగా ఉన్నారు ఆంధ్రరత్న.

★★★★

# అక్కిరాజు ఉమాకాంతం



ఉమాకాంతంగారి పేరు తలచుకోగానే వెంటనే తలపుకు వచ్చేది 'నేటి కాలపు కవిత్వం' అనే ఆయున నిమర్శ గ్రంథం

జనసమ్మర్దం గల రహదారులలో వాహనాల రద్దీని పాదచారుల యాతాయాత వేగాన్ని నియంత్రించే అధికారులు కాని, యాంత్రిక సాధనాలు కాని ఎట్లా అవసరమో, అప్పుడప్పుడు సాహిత్య అపమార్గాలను కూడా నిరోధించగల, నియంత్రించగల పండితులు కూడా అంతే అవసరం సాహిత్య లోకంలో ఉపజ్ఞవచ్చిపోయి అంధానుకరణం పెచ్చు మీరిపోయి, గతానుగతికత్వం ప్రజ్ఞగా చెలామణి అవుతున్న రోజుల్లో ఉమాకాంతంగారి లాంటి విమర్శకులుఅవసరం ఎంతైనా ఉంటుంది. నవద్వీప పండిత పరిషత్తువారు ఆయన పాండిత్య ప్రతిభకు మెచ్చి విద్యాశేఖర అనే బిరుదు ఇచ్చారు. కలకత్తా సంస్కృత కళాశాలలో ఆయన తమ పాండిత్యానికి మెరుగులు దిద్దుకున్నారు. ప్రమధ నాధతర్క వాచస్పతి వద్ద ఉమాకాంతం తర్కం చదువుకున్నారు కలకత్తాలో. చిన్నతనంలో ఆయన శతావధానాలు చేసినా వాటివల్ల సమకూరే సాహిత్య ప్రయోజనం కాని, వినోదం కాని ఉదాత్త స్థాయివి కావని వాటిని వదిలేశారు.

ఉమాకాంత విద్యాశేఖరుల పేరుతో వెంటనే స్ఫురించేవిఆయిన పరిష్కరించి ప్రకటించిన శ్రీనాధకృతిగా విశ్రుతమవుతున్న పలనాటి వీరచరిత్రమూ, భావ కవిత్వ ఉల్బణాన్ని తీవ్రంగా విమర్శించిన నేటికాలపు కవిత్వమూ. చెన్నపట్నంలోని రాజధాని కళాశాలలో ఆయిన రెండు దశాబ్దాలు పాటు తెలుగు పండితులుగా ఉద్యోగించారు తెలుగు దేశపు వాఙ్మయి పత్రికను సుమారు మూడేళ్ళపాటు నడిపారు సంస్కృత పాణినీయానికి సాంధ్రతాత్పర్య వ్యాఖ్యానాన్ని ప్రకటించారు సంస్కృత వ్యాకరణానికి వివృతి వ్రాశారు. అరవ దేశమందలి ఆంధ్ర వాఙ్మయిం అనే పరిశోధన వివరణ గ్రంథం కూర్చారు. రసమీమాంస, నైషధతత్వ జిజ్ఞాస, రామాయణ మహాభారత విమర్శనం వంటి ప్రశస్త

విమర్శలు వెలువరించారు. వావిళ్ళ సంస్థవారు ప్రారంభించిన త్రిలింగ పత్రికకు తొలిసంపుటాల సంపాదకత్వ బాధ్యత వహించినవారు ఉమాకాంతంగారే మెడోస్ టైలర్ రచించిన టిప్పు సుల్తాన్ అనే ఇంగ్లీషు నవలకు తెలుగు అనువాదం ప్రకటిస్తూ ఉపోద్ఘాతంలో ప్రపంచ సారస్వత చరిత్రలో నవలా ప్రక్రియ ఉద్భవ వికాస పరిమాణాలను విపులంగా సమీక్షించారు. పల్నాటి వీర చరిత్రకు ఆయన వ్రాసిన పీఠిక చాలా విలువైనది. దాన్ని ఆయన ఇంగ్లీషులోను తెలుగులోను కూడా వ్రాశారు.

అమెరికా ఓరియంటల్ రిసెర్చిజర్నల్ నుంచి ఎపిగ్రాఫికా ఇండికా నుంచి ప్రాకృత శాసనసంపుటాలనుంచి ఉమాకాంతవిద్యా శేఖరులు పల్నాటి వీర చరిత్ర పీఠికకు విషయ సంగ్రహణం చేశారు. అఖండ భారతీయ సంస్కృతి పట్ల ఆయనకు అత్యంతాభినివేశం ఉండేది. తెలుగుదేశం పట్ల తెలుగుతనం పట్ల అత్యంత వీరారాధన తత్పరత్వం ఉండేది. సాహిత్య విమర్శలో చాలా తీవ్రతను కనపరచినందు వల్ల సమకాలీన సాహిత్య లోకంలో ఆయనకు రావల్సినంత గుర్తింపు రాలేదేమోననుకోవల్సి వస్తుంది. ఉమాకాంతం గారి జననం **1889** విరోధి నామ సంవత్సరం పరమపదం **1942** చిత్రభాను సంవత్సరం. తల్లిదండ్రులు లక్ష్మమ్మ, లక్ష్మీనారయణ గారలు. స్వస్థలం గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా గుత్తికొండ గ్రామం.

★★★★



# ఈదుప్రగంటి రాఘవేంద్రరావు

రాఘవేంద్రరావు బహుముఖ ప్రజ్ఞాశాలి. గొప్ప పరిపాలనా దక్షుడు. వక్త, ఉత్తమ దేశభక్తుడు. బహుభాషా కోవిదుడు. ఈదుప్రగంటి వారి స్వస్థలం అసలు కృష్ణాజిల్లా పెదమద్దాలి గ్రామం. కిందటి శతాబ్దంలో వ్యాపారరీత్యా మధ్యపరగణాలకు వెళ్ళారు. అందువల్ల రాఘవేంద్రరావు బిలాస్‌పూర్‌లో జన్మించాడు అలహాబాదులోను, నాగపూర్‌లోను ఆయన ఉన్నత విద్యాభ్యాసం చేశాడు 1909వ సంవత్సరం బారిష్టర్ పట్టా పుచ్చుకోవటానికి ఆయన ఇంగ్లాండు వెళ్ళాడు అప్పటికే జాతీయోద్యమం బహుముఖాలుగా విస్తరిస్తూ ఉన్నది. రాఘవేంద్రరావును అప్పట్లో తీవ్ర జాతీయవాదులు ఆకర్షించటంలో ఆశ్చర్యం లేదు. శ్యాంజీ కృష్ణవర్మ, వినాయక దామోదర సావర్కార్ ప్రభావం రావుగారిపైన కూడా ప్రసరించింది ఆయన రాజకీయ జీవిత ప్రారంభదశలో రావుగారు తిలక్ మహాశయుని ఆరాధకుడు ప్రజాభిమానం పొంది బిలాస్‌పూర్ మున్సిపాలిటీకి ఆయన దశాబ్దంపైనే అధ్యక్షులుగా ఉన్నారు. అనిబిసెంట్ నేతృత్వంలో సాగిన హోమ్‌రూల్ ఉద్యమంలో కూడా రాఘవేంద్రరావు పాల్గొన్నారు. చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూల అనుయాయిగా ఆయన స్వరాజ్య పార్టీకార్యకలాపాలలో పాల్గొన్నారు. శాసనసభకు ఎన్నికై ప్రభుత్వాన్ని ఎన్నో సందర్భాలలో చాలా ఇరకాటంలో పెట్టారు. తమ అధీనంలోని స్థానిక సంస్థల ఉద్యోగులంతా ఖాదీ ధరించాలని ఆయన ఉత్తర్వులు జారీ చేయటం చాలా విశేషం అనాటి బ్రిటిష్ ప్రభుత్వం రోజులలోనే ఆయన గాంధీ, తిలక్ జయంతులను తమ అధికారంలోని విద్యాసంస్థలలో జరిపించేవారు హిందీలోను, మరాఠీలోను ఆయన కొన్ని పత్రికలు నడిపారు. ఆయన విదేశాలకు వెళ్ళి వచ్చి ఉన్నత విద్యాధికుడైనా ఎప్పుడూ ఎంతటి అధికారిక సమావేశాలకు వెళ్ళవలసి వచ్చినా ఖాదీనే ధరించేవారు. గాంధీటోపీ పెట్టుకొనే వెళ్ళేవారు. శాసనసభకు ఎన్నికై అప్పటి మధ్యపరగణాల రాష్ట్రానికి ఆయన ముఖ్యమంత్రి అయినారు. **భారతదేశంలో**

తొట్టతొలుతసారిగా 1932 లోనే రైతుల రుణం మాఫీచట్టాన్ని ప్రవేశ పెట్టినవారు రాఘవేంద్రరావుగారే. గొప్ప సంస్థానాధిపతులు వారికి దివాన్ పదవిని ఇవ్వజూపినా ప్రజాహిత కార్యకలాపాలపట్ల మక్కువతో రావుగారు నిరాకరించారు. ఆయన కొద్దికాలం వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో సభ్యులుగా కూడా ఉన్నారు. ఆయన రాష్ట్ర శాసనసభలో ఉన్నా, అత్యున్నతమైన ప్రభుత్వ పరిపాలన మండలి సభ్యుడిగా ఉన్నా భారతదేశ ప్రజల ప్రయోజనాలపట్ల ఆయన ఏనాడూ మెతకధోరణి వహించలేదు. నాగపురంలో హైకోర్టు, రాఘవేంద్రరావుగారి కృషివల్లనే స్థాపనమైంది. ఆయునకు మహిళల విద్యపట్ల ఎంతో అభిమానం. నాగపురంలో కేంద్రీయ మహిళా కళాశాల కూడా ఆయన కృషిఫలితంగానే స్థాపించబడ్డది

చింతామణి ద్వారకనాథ్ దేశ్‌ముఖ్‌కు రాఘవేంద్రరావు పరిపాలనా దక్షతపట్ల, వ్యక్తిత్వంపట్ల, రాజనీతిజ్ఞత, దూరదృష్టి, శక్తి సామర్థ్యాలపట్ల గొప్ప గౌరవం. దేశ్‌ముఖ్ స్వీయచరిత్రలో రాఘవేంద్రరావుపట్ల ఆయనకుండే గౌరవభావం, మైత్రి అభిమానం ఎటువంటిదో ఆయిన వెల్లడించారు. భారతదేశ నాయకులలో పరిపాలనాదక్షులలో రాజనీతిజ్ఞులలో అన్నివిధాల రాఘవేంద్రరావు సర్దార్ వల్లభాయ్ పటేల్ సరసన నిలవతగినవారు అని దేశ్‌ముఖ్ ప్రస్తుతించారు. ఒకవిధంగా చూస్తే సర్దార్ పటేల్ కన్నాకూడా రాఘవేంద్రరావుది సమగ్ర మూర్తిమత్వం. రాఘవేంద్రరావు గొప్ప విద్వాంసుడు. ఆయిన జ్ఞానతృష్ణ అపారం, అనికూడా దేశ్‌ముఖ్ నివాళి అర్పించారు రాఘవేంద్రరావుగారికి. రాఘవేంద్రరావు గారివద్ద గొప్ప విద్యాసంస్థలలోను, విద్యావేత్తలు ఎవరివద్దా కూడాలేని అపార గ్రంథసంచయం ఉండేదట. దాన్నంతా ఆయన నాగపూర్ విశ్వవిద్యాలయానికి విరాళంగా ఇచ్చివేశారు

ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారి జననం 1889. తండ్రి నాగన్నగారు. రావుగారు స్వతంత్ర భారతదేశంలో జీవించి ఉంటే ఆయిన అనుభవం, పరిపాలనాదక్షత దేశ పరిపాలనలో ఎంతో తోడ్పడే ఉండేవని దేశ్‌ముఖ్ బాధపడ్డారు. ఆయన చివరిరోజులలో రోగగ్రస్తుడై ఉండగా గొప్ప వైద్యుల చేత చికిత్స చేయించారు చింతామణి ద్వారకనాథ్ దేశ్‌ముఖ్ కాని దుర్విధి తోడై దేశం దురదృష్టంవల్ల రాఘవేంద్రరావు 1942లో 52 సంవత్సరముల పిన్నవయుసున పరమపదించారు

★★★★



# మామిడిపూడి వెంకటరంగయ్య

విద్యావినయ సంపన్నులు వెంకట రంగయ్యగారు. ఏదేశం ఔన్నత్యాన్ని అయినా నాగరికతనైనా అభివృద్ధినైనా నిర్దేశించేవారు, విద్యావేత్తలూ, అధ్యాపకోత్తములున్నూ. అందుకనే గాంధీజీ రవీంద్రనాథ ఠాగూర్‌ను గురుదేవులని శ్లాఘించారు. ఈశతాబ్దిలో చెప్పుకోవలసిన గొప్ప ఆచార్యులలో విద్యావేత్తలలో అధ్యాపక శ్రేష్ఠులలో వెంకట రంగయ్యగారు ఒకరు. తెలుగుదేశానికి వారివల్ల ఒక గుర్తింపు వచ్చింది. చాలా సాధారణమైన కుటుంబంలో జన్మించినా స్వయంకృషితో జీవితంలో ఉన్నతపదవుల నధిష్టించారు. ఆచార్యులుగా కీర్తిగాంచారు.

ఆధునిక భారతదేశ సమాఖ్య స్వరూప స్వభావాలను గురించి వెంకట రంగయ్యగారు పరమ ప్రామాణికమైన గ్రంథాలు రచించారు. యావద్భారతదేశంలోను రాజనీతి చరిత్ర విద్యార్థుల కవి ఉపదేశాలు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రాజనీతి శాస్త్రాచార్యులుగా వారు విద్యార్థులకు చాలా ప్రీతిపాత్రులైనారు. వ్యక్తి స్వేచ్ఛ, మహిళా వికాసం, భారతదేశ సమాఖ్య వ్యవస్థ, సామాజిక చారిత్రకాధ్యాయనం వారికి మిక్కిలి ప్రియమైన విషయాలు. వెంకట రంగయ్యగారు తొంభై సంవత్సరాల వయసున 'మారుతున్న సమాజం, నా జ్ఞాపకాలు' పేరుతో వ్రాసిన స్వీయచరిత్ర చాలా విలువైన గ్రంథం. అది ఈశతాబ్ది సామాజిక చారిత్రక పరిణామాలకు, ముఖ్యంగా తెలుగుదేశంలో వచ్చిన ఆర్థిక సాంఘిక రాజకీయ మత నైతిక స్వాతంత్ర్యోద్యమ పరిణామాలకు అద్దం పడుతున్న, ఆకరగ్రంథం భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రను విపులంగా, మౌలిక విశ్లేషణ ప్రతిభాస్ఫోరకంగా మూడు సంపుటాలలో వెంకట రంగయ్యగారు రచించారు. అధ్యాయ విభజనం, విషయ విన్యాసం, ప్రముఖ సంఘటనల విశ్లేషణ వినూత్న రీతిలో సంతరించారు ఈ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర సంపుటాలలోవారు.

**1907**వ సంవత్సరంలో మద్రాసు విద్యాలయంనుంచి ముబ్బడి 'ఫస్టుక్లాస్'తో

పట్టభద్రస్థాయి పరీక్షలో వారు విజయులై బంగారు పతకం పొందారు. 1910లో ఎమ్.ఏ.లో కృతార్థులైనారు. కాకినాడలోని పిఠాపురం మహారాజావారి కళాశాలలో కొద్దికాలం అధ్యాపకులుగా ఉన్నారు అప్పుడు రఘుపతి వేంకటరత్నం నాయుడు గారక్కడి ప్రధానాధ్యాపకులు. అటుతర్వాత విజయనగరం మహారాజా కళాశాలలో ఆచార్యత్వం వహించారు. ఒక్క సంవత్సరం విజయనగరం సంస్థానం దివాన్‌గా పదవిని నిర్వహించారు. తర్వాత 1933 నుంచి 1944 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆర్థిక రాజకీయ చారిత్రక శాఖలో అధ్యాపకత్వం నెరిపారు. పదవీవిరమణ చేసిన తర్వాత క్రొత్తగా స్థాపితమైన భీమవరం కళాశాల ప్రధానాధ్యాపకులుగా కొన్నాళ్ళు పనిచేశారు. మహా మహోపాధ్యాయ పి.వి.కాణే మహాశయుడు బొంబాయి విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులుగా ఉన్న రోజులలో అక్కడ క్రొత్తగా రూపొందుతున్న రాజనీతి అధ్యయన విభాగానికి వెంకట రంగయ్యగారు ఆచార్యులుగా ఆశాఖను తీర్చిదిద్దారు.

ఆర్థిక రాజకీయ సామాజిక అధ్యయన సంబంధమైన బహుగ్రంథ నిర్మాతలు వెంకట రంగయ్యగారు. మొదటిసారిగా 1952వ సంవత్సరం భారతదేశంలో జరిగిన సార్వత్రిక ఎన్నికల ఫలితాలను విశ్లేషించడంలో వెంకట రంగయ్యగారు జయప్రకాష్ నారాయణ్, మొరార్జీదేశాయి ప్రభృతులతో చర్చలు జరిపారు ప్రపంచ మహానగరాల గూర్చిన విజ్ఞాన సర్వస్వంలో భారతదేశ మహానగరాలను కొన్నిటిని గూర్చి వెంకట రంగయ్యగారు వ్రాశారు. వారు తెలుగు సాహిత్యం, చరిత్ర, సంస్కృతులను గూర్చి కూడా 1910 ఆంధ్రభారతి కాలంనుంచే ఎన్నో రచనలు పత్రికలలో ప్రకటించారు. కౌటిల్యుని రాజనీతి, అర్థశాస్త్రాన్ని సరళమైన భాషలో అనువదించారు.

పద్మభూషణ సత్కారాన్ని పొందిన తెలుగువారిలో వెంకట రంగయ్యగారు ఒకరు. ఆంధ్రప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాల గౌరవ డాక్టరేటు వారు స్వీకరించారు. నెల్లూరు జిల్లా పురిణి గ్రామంలో 1889 వీరిజననం. 1981 పరమపదం. తల్లిదండ్రులు నరసమ్మగారు, వేంకటేశయ్యగారు.



# ఆదిరాజు వీరభద్రరావు



సమాజ మందిరానికి మహాత్ముల జీవితాలు కిటికీల వంటివి అన్నారు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. అది చాలా గొప్ప మాట కిటికీలు ఇంట్లోకి శుభ్రమైన గాలీ వెలుతురూ ప్రసరింపచేస్తాయి. కిటికీలులేని ఇల్లు వాసయోగ్యం కాదు. క్రమంగా ఆ ఇంట్లో పురుగూ పుట్రా చేరి దుమ్మూ ధూళీ అలుముకుంటుంది. కాబట్టే చక్కగా గాలీ వెలుతురు వచ్చే రీతిని ఇల్లు కట్టుకోవాలి. ఎప్పటికప్పుడు సమాజాన్ని పటిష్టంగా పునర్నిర్మించుకుంటూ వుండాలి.

ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు పరమ నిరాడంబరమైన జీవితాన్ని గడిపారు. తమ శక్తియుక్తులన్నీ సాహిత్యసేవకూ, అధ్యాపకత్వానికీ ధారపోశారు. ఆయా కాలగమనాన్నిబట్టే పళ్లచెట్లు పండ్లు ఇస్తాయి, పూలచెట్లు పూలు పూస్తాయి, మేఘాలు వర్షిస్తాయి, జీవనదులు గలగల సాగి ప్రవహిస్తాయి. ఇవన్నీ వాటి స్వభావచోదితమైన కార్యక్రమాలు. అట్లానే మహనీయులైన వాళ్ళు ఎటువంటి ప్రతిఫలాన్నీ ఆశించకుండా తమ తమ కార్యక్షేత్రాలలో సమాజహిత కార్యకలాపాలు సాగిస్తూనే ఉంటారు అట్లా తమ జీవితాన్ని సమాజపరం చెయ్యకుండా వాళ్ళు ఉండలేరు.

ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు సామాన్యమైన పాఠశాలోపాధ్యాయులుగా మాత్రమే జీవిక సాగించారు. సుమారు నలభై సంవత్సరాలు హైదరాబాదులో ఆయన పాఠశాలల్లో తెలుగు బోధించారు. గొప్ప వక్తకాదు. విశ్వవిద్యాలయ ఆచార్యత్వం ఆయనన్ను వరించలేదు. విద్యావేత్తగా ఊరూర తిరిగి ఆయన ఉపన్యాసాలు ఇవ్వలేదు. అయినా ఆయన చేసిన కృషి తరతరాల స్మరింపదగినది. తెలుగంటే చిన్నచూపు చూసే తెలంగాణంలోని ఆనాటి రోజుల్లో తెలుగు భాషా సాహిత్యాల చరిత్ర సంస్కృతుల అధ్యయనానికి అధ్యాపనానికి పునరుజ్జీవనానికి అవిరళమైన కృషి చేశారు వీరభద్రరావు పంతులుగారు. తోటలో చెట్లూ,

పూలూ కళకళలాడుతూ వుంటే చక్కగా పాదులు తీసివుంటే నీరు కట్టివుంటే అంతా చూచి ఆనందించే వాళ్ళేకాని తోటమాలిని తలుచుకొనేదెవ్వరు? అన్నారొక ప్రముఖ విమర్శకులు? ఈ భావం వీరభద్రరావు పంతులుగారికి కూడా అన్వయిస్తుంది.

చిరకాలం హైదరాబాదు నగరంలోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ కార్యదర్శిగా ఉండి నగరంలో తెలుగుతనాన్ని ఆయన ప్రోది చేశారు. భాషానిలయ సంస్థాపన నాడొక ఐచ్ఛిక సేవావ్రతిగా ఆహూతులకు అతిథి సత్కారాలు చేసినవారు ఆదిరాజువారు. ఆయన సుప్రసిద్ధ చరిత్ర రచయితలు. సంస్థా నిర్మాతలు. తెలుగువారి సర్వతోముఖ విజ్ఞాన వర్ధనం కోసం కృషి సలిపిన మహనీయులు. కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారి అంతే వాసిత్వం నెరిపారు. లక్ష్మణరావు మహోదయులు నిర్వహించిన విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిలో ఆయన హార్దికలో తర్ఫీదు అయినవారు వీరభద్రరావు పంతులుగారు. ప్రాచీనాంధ్ర చరిత్ర, శాసన పరిశోధన, ఆంధ్ర నగర చరిత్ర, సాంస్కృతిక చరిత్ర ఆదిరాజువారికి అభిమాన విషయాలు.

హైదరాబాదులో లక్ష్మణరాయ పరిశోధక మండలిని స్థాపించి తెలంగాణంలో ప్రాచీన చారిత్రక ప్రదేశాలను పర్యటించి అమూల్యమైన ఎన్నో శాసనాలను వెలికితెచ్చారు ఆదిరాజువారు. వాటన్నిటినీ వ్యాఖ్యాన సహితంగా ప్రచురించారు. హైదరాబాదులో నెలకొన్న సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ నిర్మితిలో ప్రధాన లేఖకులుగా శ్రీ వీరభద్రరావు పంతులుగారు అమూల్యమైన ఎన్నో వ్యాసాలు వ్రాశారు. పండు ముదుసలి అయ్యే వరకు కూడా ఆయన కలం అవతల పెట్టలేదు. ఎప్పుడూ ఏదో వ్రాస్తూనో, చదువుతూనో పరిశోధిస్తూనో ఆయన యువకులకు స్ఫూర్తి నిచ్చేవారు.

ఆ రోజుల్లో సురవరం ప్రతాపరెడ్డిగారు ప్రకటించిన గోలుకొండ కవుల సంచికకు ప్రధానమైన ప్రోద్బలం ఆదిరాజువారిదే. ఆంధ్రుల చరిత్ర, సంస్కృతులకు సంబంధించి వీరభద్రరావుగారు వివిధ పత్రికలలో వ్రాసిన వ్యాసాలు చాలా విలువైనవి.

ఆదిరాజు వీరభద్రరావు పంతులు ఖమ్మం జిల్లా మధిర తాలూకా దెందుకూరు గ్రామంలో **1890**వ సంవత్సరంలో జన్మించారు. తండ్రి లింగయ్యపంతులు. తల్లి వేంకమాంబ. **1978**లో వారు హైదరాబాదు నగరంలో పరమపదించారు.



# చిలుకూరి నారాయణరావు



చిలుకూరి నారాయణరావుగారు తాను రచించిన గ్రంథాలన్నీ అచ్చుపడట్లానికి నోచుకోలేదు. అవన్నీ అచ్చు అయిఉంటే అదొక మహాసారస్వతరాశి అయివుండేది అయితే వాఙ్మయ మహాంబుధి అయిఉండేది అయితే ఆ మహానుభావుడు తన ముద్రితాముద్రిత గ్రంథాల పరిచయ కరపత్రం మాత్రం అచ్చువేయగలిగారు ఎంత ఆశ్చర్యం! ఆయన మొత్తం **240** గ్రంథాలు రచించారు. పట్టుమని ఆయన బతికింది అరవై ఏళ్ళు మాత్రమే. అథర్వణవేదం ప్రతిపదార్థ తాత్పర్యం దగ్గరనుంచి 'అంబ' లేదా మొండి శిఖండి అనేనాటకందాకా ఆయన సారస్వత యాత్ర సాగింది. తత్వశాస్త్రం, మతం, జీవిత చరిత్ర, భాషాసారస్వత చరిత్రలు, పరిశోధన, నవల, నాటకం, విమర్శ, పద్య, గద్య, గేయ కృతులు, ఆయన పట్టుకున్న ప్రతిప్రక్రియ స్వీయ ప్రతిభాముద్రతో భాసించింది. లక్షా ఇరవై అయిదువేల పుటల పరిమితిగల గ్రంథరచన అట నారాయణరావు గారిది. అన్నిటికన్నా గొప్పగా చెప్పుకోవలసిన విషయం ఇంకొకటుంది లక్షా ఏభైవేల తెలుగు సామెతలాయన సేకరించి వరీకరించారు. వీటిని ఆనాటి విశ్వవిద్యాలయోపాధ్యక్షులకు, తదితర పెద్దలకు, వదాన్యులకు వారు చూపారు ప్రపంచ భాషలలో ఎక్కడా కూడా ఇటువంటి పరిశ్రమ జరిగిందోలేదో! తెలుగుదేశం నాలుగు మూలలనుంచీ సామెతలను పోగుచేశారు పంతులుగారు శ్రీ మధునా పంతుల సత్యనారాయణ శాస్త్రిగారు ఆంధ్ర రచయితలలో వీరేశలింగం పంతులుతో పోల్చడం ఎంతో బావుంది, గొప్ప పరిశోధకుడై ఉండి కూడా సృజనాత్మక ప్రతిభావంతుడైన రచయిత నారాయణరావును.

అన్నట్లు తెలుగులో మొట్టమొదటిసారి పరిశోధన పట్టం పొందిన మహామనీషి నారాయణరావు. తెలుగుభాషా సాహిత్యాలను పరిశోధన విషయంగా తీసుకొని మద్రాసు విశ్వవిద్యాలయం నుంచి తొలిసారి 'పిహెచ్.డి' పొందిన మహనీయులు నారాయణరావుగారు. అటు తర్వాతనే తెలుగువారు సాహిత్యంలో ఎందరో

'డాక్టర్లయి' నారు.

నారాయణరావుగారు సేకరించిన లక్షా ఏభైవేల తెలుగు సామెతల గూర్చి ఆయిన జీవితకాలంలోను ఆయిన పరమపదించిన తర్వాత యీ ముప్పైఐదు సంవత్సరాలలోను విశ్వవిద్యాలయాలుకాని, అకాడమీలుకాని పట్టించుకోక పోవటం చాలా అన్యాయం. ఓకుమళ్ళ కామేశ్వరరావుగారనే యువ సాహితీ మిత్రుడికి నారాయణరావుగారు తమ సామెతల సేకరణ విషయం ప్రస్తావిస్తూ ఇట్లా వ్రాశారుట 'ప్రపంచకంలో ఉన్న ఇతర భాషలలోని సామెతల గ్రంథాలకంటె తెలుగులోది సర్వంకషంగా (ఎగ్జాస్టివ్) ఉండాలి. నాకు అవసరమైన ఉత్సాహము, ఓపిక ఉన్నాయి. సహకారం తక్కువగా ఉంది. తెలుగువారికి అసూయ ఎక్కువ. దేనిలోనైనా కూడా అసలు పనికంటె వ్యర్థమైన మాటలు అధికం' అని తెలుగువాళ్ళ లోపాన్ని బట్టబయలుచేశారు చిలుకూరివారు

ఏకసంథాగ్రాహి నారాయణరావు. పర్లాకిమిడి కళాశాలలో ఎఫ్ ఏ. చదువుకుంటున్న రోజులలో గిడుగు రామమూర్తి పంతులుకు ప్రియశిష్యుడు మిల్టన్ కవీశ్వరుడి 'సానెట్'ను క్లాసులో ఓసారి రామ్మూర్తి పంతులు చదివి ఎవరైనా ధారణ చేశారా, చేయగలరా? అని అడిగారుట ఇంకోసారి చదవండి నేచెపుతానన్నాడు నారాయణరావు. అలా తు.చ. తప్పకుండా రెండుసార్లు వినగానే ఇంగ్లీషు పద్యాన్ని కంఠస్థం చేయగలిగిన మేధావి నారాయణరావు పువ్వుపుట్టగానే పరిమళిస్తుంది మరి

అవునోకాదో సాహిత్య ప్రపంచంలో బహుపండిత సమ్మతమైన సిద్ధాంతాన్ని కాదని గట్టిగా వాదించి తన సిద్ధాంతం నిలబెట్టుకోగల ప్రజ్ఞ ఎందరికుంటుంది? నారాయణరావు వంటి మహాపండితులకి తప్ప? కాల్డ్వెల్ అనే బిషప్ ద్రావిడ భాషాసిద్ధాంతాన్ని ప్రచారంలోకి తెచ్చి దక్షిణాది భాషలు సంస్కృత జన్యంకావన్నాడు ఇంగ్లీషు చదివినవాళ్ళంతా వెంటనే వొప్పేసుకున్నారు కాని నారాయణరావు వొప్పుకోలేదు ఆంధ్రభాషా చరిత్ర అనే రెండు సంపుటాలలో తెలుగుకు సంస్కృత ప్రాకృత భాషామూల సంబంధ సిద్ధాంతాన్ని ఆయిన ప్రతిపాదించాడు బైబిలును, ఖురాన్‌ను, త్రిపిటకాలను ఆఖరుకు పార్శీల వేదమైన జెండ అవెస్తాను ఆయిన తెలుగుచేశారు. గుజరాతీ భాషా సాహిత్య చరిత్ర రచించాడు. జపాన్ దేశ చరిత్ర రచించటమే కాదు, జపాన్ భాషను నేర్చుకున్నాడు ఉపనిషత్తులను సరళశైలిలో అనువదించారు గీతను సరళార్థబోధకంగా తెనుగుచేశారు నవ్యసాహిత్య పరిషత్తు (1933) తొలి అధ్యక్షులు వీరే బహుకాలం రాజమహేంద్రవరం, అనంతపురం కళాశాలల్లో తెలుగు బోధించే ఆచార్యులుగా ఉద్యోగించారు రావుగారు ఆంధ్ర విశ్వవిద్యాలయం వారి 'కళాప్రపూర్ణ' బిరుదుకు ఆయిన వల్ల సార్థకత చేకూరింది కాశీ విద్యాపీఠం ఆయినకు

మహోపాధ్యాయి బిరుదం ఇచ్చి సత్కరించింది. బ్రిటిషు ప్రభుత్వంవారి మహామహోపాధ్యాయి పురస్కారం ఆయిన ఒప్పుకోలేదట దత్తమండలాలనే పదం బాగాలేదని రాయలసీమ అనే పదాన్ని వ్యాప్తికి తెచ్చినవారు నారాయణరావుగారే. చిన్ననాటి తరగతులలోనే తెలుగు పండితుడీయినను 'లింగ్విస్ట్' అని మెచ్చుకున్నారుట. అది అక్షరాల

సార్థకమైంది శ్రీకాకుళం జిల్లా పొందూరు దగ్గర ఆనందపురం నారాయణరావుగారి జన్మస్థలి. అనంతపురంలో ఆయన 'ఆత్రేయాశ్రమం' సాహిత్య తీర్థరాజంగా వినుతికెక్కింది. తల్లిదండ్రులు లక్ష్మమ్మగారు, భీమసేనరావుగారు. చిలుకూరివారి జననం **1890**, పరమపదం **1951**.

★★★★

# బండారు తమ్మయ్య



స్వావలంబనానికి స్వయం కృషికి నిరుపమానమైన తార్కాణం బండారు తమ్మయ్యగారి జీవితం. ఈ శతాబ్ది సారస్వత మూర్తులలో ఆయనది విశిష్టమైన వ్యక్తిత్వం. శైవ సాహిత్య పాదోధిని చుళుకించిన అగస్త్యుడాయన. పాల్కురికి సోమనాథుడి సాహిత్యంపై ఆయనదే ప్రమాణ వాక్యం.

పుట్టింది అతిసాధారణమైన కుటుంబంలోనే అయినా అసాధారణమైన విద్వత్తను ఆయన సాధించారు. స్వయం కృషితో సంస్కృతాంధ్రాలలో తలస్పర్శి అయిన పాండిత్యం సముపార్జించారు. శైవ సాహిత్య వేత్తృత్వానికి కన్నడ భాషలో ఘనమైన పరిచితి అవసరం కాబట్టి అలవోకగా దాన్ని కూడా స్వాయత్తం చేసుకున్నారు. ఈ శతాబ్ది సాహిత్య విమర్శకులలో ఆయనంత సత్వగుణ సంపన్నులు అరుదు. 'సత్యంబ్రూయాత్, ప్రియంబ్రూయాత్, నబ్రూయాత్ సత్యమప్రియం' అనే ఆర్యవాక్యానికి సాకారమనస్విత తమ్మయ్యగారి సారస్వత కృషిగా రూపుదాల్చింది.

సుమారు అర్థ శతాబ్దిపాటు సాహిత్య చరిత్ర సమీక్షలో తమ్మయ్యగారి తీర్పరితనం శైవ సాహిత్యం విషయంలో మూదలగా ప్రకాశించింది. వీర శైవ సంప్రదాయాన్ని గూర్చి చెప్పాలంటే తమ్మయ్యగారే చెప్పాలన్నంత నుడి ఏర్పడింది. శ్రీ తమ్మయ్యగారు నలభై సంవత్సరాలు కలెక్టరాఫీసులో గుమాస్తాగా పని చేశారు. షట్కాల శివ పూజ చేయడానికి సర్కారు కొలువు అనుకూలించదన్న బాధతో రోజులో ఆరోవంతైనా శివుడి కర్పించకపోతే ఎలానన్న చింతతో ఉభయ సంధ్యలలో నాలుగు గంటలు శివ పూజాపరత్వం ఆ జీవం నిలుపుకొన్నామని స్వీయ చరిత్రలో అభిభాషించిన మనస్వి తమ్మయ్యగారు. పదహారు సంవత్సరాల వయసులోనే పై చదువులు చదువుకునే అవకాశం కనుమరుగైంది. అంటే ఆయన తండ్రిగారు హఠాత్తుగా మరణించారు. గంపెడంత సంసార భారాన్ని తమ్మయ్యగారు నిర్వహించ వలసి వచ్చింది. ఆ సంవత్సరం ఆయన అమలాపురం హైస్కూల్లో స్కూలు ఫైనల్ క్లాసు చదువుతున్నారు.

1907లో అంటే 16సం.ల వయసున ఆయన స్కూలు ఫైనల్ పాసైనారు. స్కూలు మొత్తంలో సత్ప్రవర్తనకు బహుమానం వారిదే. ఆ సంవత్సరం వంద మంది విద్యార్థులు స్కూలు ఫైనల్ పరీక్ష వ్రాయగా అందులో ఎనిమిది మంది మాత్రమే కృతార్థులు కాగా అందులో తమ్మయ్యగారొకరు.

పాల్కురికి సోమనాథుడి బసవపురాణానికి గొప్ప పీఠిక సంతరించారు తమ్మయ్యగారు. శ్రీనాథుడి క్రీడాభిరామానికి, భీమేశ్వర పురాణానికి విలువైన పీఠికలు కూర్చారు. శ్రీనాథుడు శృంగార ప్రియుడనీ, రసికుడనీ అనటానికి తమ్మయ్యగారంగీకరించరు. ఆయన ఈశ్వరార్చన కళాశీలుడు, మహాపురుషుడు అని తమ్మయ్యగారి విశ్వాసం. పరిశోధన పత్రికలో శ్రీ తిరుమల రామచంద్ర వీర శైవ వాఙ్మయ పరిశ్రమను గూర్చి ఇట్లా వ్రాశారు. "వీరశైవ వాఙ్మయము గురించి జీవితము అంకితమొనర్చిన పండిత ప్రకాండులు శ్రీ బండారు తమ్మయ్యగారు. కావున పాల్కురికి సోమన గూర్చియు వారే ప్రామాణికులనుట చర్వితచర్వణము."

శ్రీ తమ్మయ్య గారు వీరశైవ సాహిత్యానికి చేసిన కృషి నిరుపమానం, జగద్విదితం అని చిలుకూరి నారాయణరావు గారు కూడా శ్లాఘించారు. శైవ వాఙ్మయ విషయంలో శ్రీ తమ్మయ్య గారేది చెప్పిన అది సిద్ధాంతమే అన్నారు విడదవోలు వారు. సాహిత్యంలోనూ, జీవయాత్రలోనూ కూడా అంతఃకరణనైర్మల్యాన్ని అసిధారా వ్రతంగా పాటించిన వారు తమ్మయ్యగారు. వాద విషయంపై ఎంతటి అభినివేశం ఉన్నా పరుషమైన ఒక్కవాక్యం కూడా ఆయన వ్రాయరు.

'మనియుండెడి జనమెల్లను, చనిపోయిన వారి దివ్య సత్కథలమిన్, వినవలెగనవలెమనవలె' అనే వేమన పద్యం తమ్మయ్యగారి కెంతో ప్రీతిపాత్రం. భక్త భండారి బసవేశుడి మహిమను వేనోళ్ళ కొనియాడతారు తమ్మయ్యగారు. ఆంధ్ర సాహిత్యపరిషత్తుకు కొంతకాలం పీఠాధ్యక్షులుగా ఉన్నారు.

తమ్మయ్యగారి జననం 1891. శివసాయుజ్యం 1970, కాకినాడ. తల్లిదండ్రులు లింగయ్య, పట్టెమ్మగారులు. జన్మస్థలం కోనసీమలోని అమలాపురం దగ్గర గంగలకుర్రు.



# శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి



ఈ శతాబ్ది తెలుగు కథకులలో విశిష్టంగా చెప్పవలసిన రచయిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ఆయిన అన్నిటా తెలుగువాడు. భాషలో, భావంలో విన్యాణంలో. తెలుగు నుడికారాన్ని ఆయనలా చూపగలిగిన రచయిత మరొకరు లేరు అనటం అతిశయోక్తి కాదు ఒక సంధి యుగంలో ఆయన వ్యక్తిత్వం రూపుదిద్దుకొన్నది. పాత సాంప్రదాయాలకు స్వస్తి పలుకుతూ కొత్త నాగరికత ఆకర్షిస్తున్న సమయంలో పాత కొత్తల మేలు కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా కథారచన చేసినవాడు శాస్త్రిగారు. ఆయిన ఇతర ప్రక్రియలను కూడా చేపట్టినా ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్య చరిత్రలో స్థిరస్థానం సంపాదించుకొన్న కథారచయితగా స్మృతిలో నిలుస్తారు

వేద వేదాంగాలు తర తరాలుగా అధ్యయనం చేస్తూ మహా పండితులు, కర్మిష్టులూ అయిన కుటుంబంలో పుట్టి తెలుగు సాహిత్యంలో చిన్న కథను ఆయిన అభిమానించి దాన్ని తీర్చిదిద్దడం విశేషం. కథకు కావ్యప్రతిపత్తిని కల్పించిన సాహిత్య శిల్పి శాస్త్రిగారు నాలుగు దశాబ్దాలు పాటు నాలుగు కాలాలు నిలిచే సాహిత్య రచనలు ముఖ్యంగా కథలు ఆయిన తెలుగు వారికిచ్చారు తన కాలం నాటి సమాజంలో బాగోగుల్ని ఆర్తితో, ఆర్ద్రతతో, ఉపదేశిక దృష్టితో నిరూపించి చూపారు శాస్త్రిగారు. సుమధురమైన వచన రచన కాయిన పెట్టింది పేరు. శ్రీ మద్రామాయణాన్ని శ్రీపాదవారు వచనంలో వ్రాశారు రాజరాజు అనే నాటకంలో నన్నయ భట్టారకుల మహోన్నత వ్యక్తిత్వానికి రూపురేఖలు తీర్చారు

శాస్త్రిగారి వీరపూజ అనే చారిత్రక విమర్శ గ్రంథం ఆనాటి పెద్దల మెప్పునందుకొన్నది పిఠాపురంలో ఆస్థాన కవులుగా ఆ రోజుల్లో పేరు పెంపులు వహించిన వేంకట రామకృష్ణ కవుల శిష్యరికం నెరిపారు శాస్త్రిగారు కొన్నాళ్ళు చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారంతటి మహాకవితో సాహిత్య వాద వివాదానికి శ్రీపాదవారు వెనుకంజవేయిలేదు. తిరుపతి వేంకట కవులు పాణిగృహీతను 'శృంఖలా' బద్ధం చేశారు శాస్త్రిగారు శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'ప్రబుద్ధాంధ్ర' అనే పత్రికను నడిపి తెలుగువారి అలసత్వానికి చురకలు వేశారు.

శాస్త్రిగారి షష్టిపూర్తి అభినందనోత్సవ సమావేశాలు విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రి వంటి సుప్రసిద్ధ సాహితీమూర్తులు అధ్యక్షత వహించి నిర్వహించడం ఆనాటి రచయితలకు ఆయనెంత అభిమానపాత్రుడో వ్యక్తం చేస్తుంది. వ్యవహారిక భాషలో రచనలు చేసే నేటి రచయితలలో మీరు ప్రథమగణ్యులు అని విశ్వనాథ శ్రీపాదవారిని ప్రశంసించారు. శాస్త్రిగారి ఆత్మకథ అనుభవాలు-జ్ఞాపకాలూను, ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యంలో మణిదీపం వంటిది. తాత తాతల నాటి కథలతో పాటు జాతికి జవసత్వాలు ప్రసాదించే స్వీయ చరిత్ర అది. నన్నయ శైలీ మాధుర్యం వీరేశలింగం సామాజిక దృక్పథమూ గల గొప్ప రచయిత శ్రీపాద. తల్లిదండ్రులు మహాలక్ష్మి సోదెమ్మ, లక్ష్మిపతి సోమయాజులు. జననం 1891, స్వర్గతి 1961, స్వస్థలం తూర్పుగోదావరి జిల్లా మహేంద్రవాడ.



# మల్లంపల్లి సోమశేఖర శర్మ



తెలుగువాళ్ళ చరిత్ర సంస్కృతులను గూర్చి ప్రస్తావన రాగానే ముందుగా స్మరణకు వచ్చే పేరు మల్లంపల్లి సోమశేఖర శర్మ గారిది. ఆయన ఏది వ్రాసినా అది శర్మదంగానే ఉంటుంది. తెలుగువారి చరిత్రను శాసనాల నుంచి వెలికి తీసిన మహామనిషి శ్రీ సోమశేఖర శర్మ. తెలుగు భాషా సమితి వారు ప్రచురించిన ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి సంపుటంలో ఒక్క చేతి మీదుగా ఆయన సుమారు 50 అంశాల గురించి వ్రాశారు. ఇక ప్రతి పుట ఆయన ఉపజ్ఞా శోభితంగా పరిష్కృతమని వేరుగా చెప్పాల్సిన పనిలేదు. కొమర్రాజు లక్ష్మణరావు పంతులు గారికి చరిత్ర, శాసన పరిశోధనలలో చిన్ననాడు సహాయకుడిగా ఉండి ఆయన వారసత్వానికి నూటికి నూరుపాళ్ళు అర్హులైనవారు శర్మగారు. ఆధునికకాలంలో ఆంధ్రుల చరిత్రకు ప్రామాణిక సామగ్రిని అందించిన వారు శర్మగారు. చరిత్ర రచనాశైలీ నిర్మాతలలో ఆయన ప్రముఖులు. ఆంధ్రదేశంలో ఎక్కడ, ఏమూల, ఏ శాసనపు ఉనికిని గూర్చి తెలిసినా ఆయన అక్కడకు రెక్కలు కట్టుకొని వెళ్ళేవారు. శాసన పరిశోధనకే ఆయన జీవితం అంకితమైంది. లిపి శాస్త్ర పరిజ్ఞాతలలో ఆధునికులలో శర్మగారి పేరు అగ్రగణ్యం. అమరావతీ స్థూపం గురించి దాని అట్టు పుట్టు ఆనవాళ్ళు గురించి తవ్వితలకెత్తి ఆంధ్రులకు ఎన్నో విషయాలు తెలియజేశారు.

చరిత్ర రచనలో సిద్ధ హస్తులే కాక నవలలు, నాటకాలు, శ్రవ్య రూపకాలు రచించారు శర్మగారు. రెడ్డి రాజులను గూర్చి వారు వ్రాసిన గ్రంథాలే వాటికి నేటికి కొలమానాలుగా వినుతి కెక్కాయి. ఆంధ్రుల చరిత్రను ఆదికాలం నుంచి ఆంధ్ర రాజ్య స్థాపనం వరకు వారు ఆకాశవాణి ప్రసంగాలుగా రూపొందించారు.

చిలకమర్తి లక్ష్మీనరసింహం వంటి గొప్ప జాతీయ వాదినిర్వహించిన దేశమాత పత్రికలో పని చేయడం సోమశేఖర శర్మగారికి చిన్నతనంలో గొప్ప స్ఫూర్తి నిచ్చి ఉంటుంది. అటు తర్వాత చరిత్ర చతురానన చిలుకూరి వీరభద్రరావు ఆంధ్రదేశ

చరిత్రకు ఆధారాలు సేకరిస్తున్నారు. ఆ పనిలో ఆవిధంగా సోమశేఖర శర్మగారికి అభిరుచి పెంపొంది ఉంటుంది. ప్రాకృతం, సంస్కృతాలలో దిటమైన పాండిత్యం అప్పుడే ఆయనకు లభించడానికి అవకాశమున్నూ కలిగింది. శర్మగారి చరిత్ర రచనకూ ఇతరుల చరిత్ర రచనకూ ఉండే ముఖ్యమైన భేదం ఏమంటే రాచవంశాల అనుక్రమ కథనం కాక ఆనాటి ప్రజాజీవన పరిణామాల అధ్యయనం ముఖ్యమన్నది ఆయన దృష్టిగా ఉండేది. అందువల్ల ఆయన కొమర్రాజు వారి నుంచి కాశీనాథుని వారి వరకు గొప్ప చరిత్ర పరిశోధకుడుగా, తత్వవేత్తగా గుర్తింపు పొందాడు. రెండువందలకుపైగా వివిధ విషయాలను గురించి ఆయన అమూల్యమై వ్యాసాలు వ్రాసినట్లు వేత్తలు గుర్తించి ఆయన చరిత్ర పరిశోధన కృషిని తమకు దారిదివ్వెగా స్మరిస్తారు. మల్లంపల్లివారు గొప్ప శాసన పరిశోధకులేకాక చారిత్రకేతివృత్తాలతో రమ్యమైన చిన్నకథలు కూడా ఎన్నో రచించారు. వాటిలో ఆయన సృజనాత్మక ప్రతిభ వెల్లివిరుస్తూ ఉంటుంది. జన్మస్థలం పశ్చిమ గోదావరి జిల్లా మినుమించిలిపాడు. తల్లితండ్రులు నాగమ్మ, భద్రయగారలు. సోమశేఖర శర్మ జననం **1891**, కాలగతి **1963**.





# మాడభూషి అనంతశయనం అయ్యంగార్

ఈ శతాబ్ది ప్రథమపాదంలో జాతి జీవనంలో ఎందరో త్యాగమూర్తులు దేశ స్వాతంత్ర్యం కోసం తమ సర్వస్వం అర్పించారు. జాతిని సుసంఘటితం చేయడానికి ఎంతగానో కృషిచేశారు. వందేమాతరం ఉద్యమం ఈ శతాబ్ది ప్రథమ దశకంలో ప్రారంభమైన నాటినుంచీ విద్యార్థులను ఎంతో ఉత్తేజితులను చేసింది గాంధీజీ ఉద్యమ నాయకత్వం స్వీకరించినప్పటి నుంచీ జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమానికి ప్రాధాన్యం లభించింది. జాతిగౌరవం, స్వావలంబనం స్వాతంత్ర్యానికి అర్థమైన జాతి సంతరించుకోవాలని ఆనాటి మేధావులంతా బోధించారు విద్యారంగంలో, న్యాయవాద వృత్తిలో వాణిజ్యరంగంలో దేశీయాభిమానం రేకెత్తించటానికి దేశం నలుమూలలా ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. విదేశీ వస్తుబహిష్కరణం, న్యాయవాద వృత్తి విసర్జనం, పాఠశాలలను కళాశాలలను విద్యార్థులు బహిష్కరించడం స్వాతంత్రోద్యమం తొలి రోజులలోని ప్రధాన ఘట్టాలు.

మాడభూషి అనంతశయనం అయ్యంగార్ చిత్తూరు జిల్లాలో తిరుపతికి దగ్గరగా ఉన్న తిరుచానూరులో పేదకుటుంబంలో జన్మించారు. వారిది విద్వత్కుటుంబం. సంస్కృత విద్వత్తుకు ఆ కుటుంబం పెట్టింది పేరు. తిరుపతిలోని ఉన్నత పాఠశాలలో చదివి ఆయన మెట్రిక్యులేషన్ పాసైనారు. అటు తర్వాత మద్రాసు వెళ్ళి పచ్చయప్ప కళాశాలలో చదివి పట్టభద్రులైనారు మద్రాసులోనే 'లా' పూర్తిచేశారు. చిత్తూరులో ఆనాడు సుప్రసిద్ధ న్యాయవాదులైన దొరస్వామి అయ్యంగారి దగ్గర జూనియర్‌గా చేరి వృత్తిలో రాణించసాగారు. అప్పటికే దేశంలో స్వాతంత్ర్యోద్యమం ముమ్మరమైంది. దొరస్వామయ్యంగారు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులు. అందువల్ల అనంతశయనం గారు కార్యదర్శిత్వం చేపట్టటం జరిగింది.

న్యాయవాద వృత్తిలో అగ్రేసర స్థానం త్వరలోనే చేరుకొన్నప్పటికీ పేద వారిపట్ల, అన్యాయాలకు గురి అయిన వారిపట్ల ఆయన ఫీజు ఏమీ తీసుకోకుండా ఇంకా అవసరమైతే సొంతడబ్బు ఖర్చుపెట్టి న్యాయస్థానాలలో అభియోగాలు నడిపేవారు. హరిజనుల అభ్యున్నతికై ప్రత్యేకించి తమ శ్రద్ధాసక్తులను వినియోగించేవారు. సంప్రదాయ కుటుంబంలో పుట్టినప్పటికిన్నీ ఉదారమైన విశాలమైన సాంఘిక సేవా దృక్పథంతో ఆయన అన్ని రంగాలలోను ముందుండి కృషిచేసే వారు సంఘ సంస్కరణ ఆశయాలను ఆయన ఎంతో అభిమానించేవారు కళా సాహిత్య రంగాలలో అయ్యంగారికి ఎంతో అభిరుచి ఉండేది. చిత్తూరులోని రామవిలాస నాటక సభ కార్యక్రమాలతో ఆయన కెంతో సాన్నిహిత్య ముండేది 1916వ సంవత్సరంలో అనీబిసెంట్ ప్రారంభించిన 'హోమ్‌రూల్' ఉద్యమంలో క్రియాశీలక పాత్ర వహించారు అయ్యంగారు. 1921వ సంవత్సరం విజయవాడలో జరిగిన కాంగ్రెస్ నిర్వాహక వర్గం సమావేశానికి అయ్యంగారు హాజరై మహానాయకులనెందరినో సందర్శించారు అటు తర్వాత వారు న్యాయవాద వృత్తిని విసర్జించారు నిర్మాణ కార్యక్రమంలో పూర్తిగా నిమగ్నమైనారు. గ్రామీణ ప్రాంతాలు విస్తృతంగా పర్యటించి జాతీయతా స్ఫూర్తిని కలిగించారు. తిరుపతిలో హరిజన హాస్టలును ఆయన నిర్వహించారు స్వాతంత్ర్యోద్యమంలో 2 సం.లు కారాగారవాస శిక్ష అనుభవించారు

సుమారు 28 సంవత్సరాలు అయ్యంగారు పార్లమెంటు సభ్యుడిగా ఉండి స్వతంత్ర భారతదేశ రాజ్యాంగ నిర్వహణను క్రమబద్ధం చేశారు మొదట లోక్‌సభ డిప్యూటీ స్పీకరుగా ఉండి తరవాత స్పీకరై సభా కార్యక్రమాలను ఎంతో హుందాగా, సమర్థంగా నిర్వహించారు. అటు తర్వాత ఆయన బీహార్ రాష్ట్రానికి గవర్నరుగా ఉన్నారు.

రాజకీయాలలో గొప్ప పదవులు హోదాలు ఎన్నో వీరిని వరించినా ఆయన హృదయ మార్దవం, సంగీత సాహిత్య కళాహృదయుం,సంస్కృతం పట్ల అభిమానం వృద్ధిచెందుతూనే వచ్చాయి విశ్రాంతి దశలో అయ్యంగారు తిరుపతి కేంద్రీయ సంస్కృత సంస్థ పాలకమండలి అధ్యక్షులై ఆ సంస్థ కార్యకలాపాలను తీర్చిదిద్దారు

మాడభూషి అనంతశయనం అయ్యంగారితో అర్థ శతాబ్ది పరిచయుంగల శ్రీ మాచిరాజు సీతాపతిరావుగారు అయ్యంగారి సౌమ్య గంభీర వ్యక్తిత్వాన్ని ఇట్లా వర్ణిస్తున్నారు. ''ఆయన వైష్ణవులలో వైష్ణవుడు వేదాంతులలో వేదాంతి. సంగీత ప్రియుడు. ఢిల్లీలోని శ్రీకృష్ణగాన సమాజపోషక ప్రముఖులలో ఒకరు. హాస్యరసప్రియుడు. గొప్ప వాక్చాతుర్యము, వాఙ్మాధుర్యముకల లౌకిక జ్ఞాన సంపన్నులు, గొప్ప దేశాభిమాని. తెలుగు సాహిత్యం పట్ల ఆయన కెంతో ప్రీతి భారత భాగవతాల నుంచి మనుచరిత్రాది సుప్రసిద్ధ ప్రబంధాల నుంచీ అయ్యంగారు గోష్ఠి ప్రసంగాలలో ఎన్నో పద్యాలు వినిపిస్తూ ఉండేవారు''

అయ్యంగారి జననం 1891 పరమ పదం తిరుపతిలో 1978.



# గొబ్బూరి వెంకటానంద రాఘవరావు



గొబ్బూరివారి పేరు తలచుకోగానే ముందుగా జ్ఞాపకానికి వచ్చేది జ్యోతిర్వేదం. ఖగోళశాస్త్ర విజ్ఞానులలో ఆయిన మేటి. సాహిత్యంతో ఖగోళాన్ని సంవదింపచేయడంలో ఆయినకాయినే సాటి. 'భువిదివమ్ముల కొక్క ముడి' బిగించగలఘనాపాటి ఆయిన భారతీయ నాగరికత, భారతీయ సంస్కృతి, భారతీయ విజ్ఞానం శ్రీ రాఘవరావుకు అంకస్థితార్థపేటి. ఆకాశంలోని చుక్కలన్నీ ఆయినకు అరచేతిలోని రేఖల కన్నాబాగా తెలుసు. మనపండుగుల నన్నిటినీ ఆయన ఆకాశంమీద నక్షత్ర సంచారంతో వ్యాఖ్యానింపచేయుగలరు. ఖగోళశాస్త్ర మహాకవి శ్రీ రాఘవ రావు. గొబ్బూరివారి వేదపాండిత్యం అబ్బురం గొలుపుతుంది. ఖగోళ శాస్త్రాన్ని ఒకనవలలా చదివించగల నేర్పరి ఆయిన. మహాభారతాన్ని అంతా ఆకాశంమీద చూపిన ఆయిన ప్రతిభను చూసి విశ్వనాధ సత్యనారాయణగారు ఆయినకు జోహార్లు అర్పించారు. చుక్కల సుద్ది, నక్షత్రాలు అనే మరో రెండుగ్రంథాలుకూడా జ్యోతిర్వేదంతో పాటు ఖగోళశాస్త్ర రహస్యాలను గూర్చి తేట తెలుగులో కూర్చారు రాఘవరావు. పాశ్చాత్య జ్యోతిశ్శాస్త్రజ్ఞుల తబ్బిబ్బులన్నీ ఆయిన సోపపత్తికంగా నిరూపించారు. వేదాలలో అద్భుతమైన ఖగోళశాస్త్ర విజ్ఞానం ఉందని నిరూపించారు. సృష్టిగమనాన్ని, సృష్టి రహస్యాన్ని చుక్కలు, గీతలుద్వారా తేట తెల్లంచేశారు. మనపురాణ గాధలు సముద్రమధనం, గరుత్మంతుడి కధ, వామనావతారం, త్రిపురా సురసంహారం, మొదలైనవన్నీ ఖగోళశాస్త్రపు అర్థవాదాలని చక్కటి కధలుగా రూపించారు రావుగారు.

రావుగారు చదివింది ఫిజిక్సు అయినా చేపట్టింది న్యాయువాద వృత్తి అయినా వేదవిజ్ఞానంలో ముఖ్యంగా ఖగోళశాస్త్ర పాండితిలో ఆయిన కృషి నిరుపమానం. మహాభాకతంలోని జ్యోతిశ్శాస్త్ర రహస్యాలన్నీ భారతిలో వివరించారు రావుగారు. ఆంధ్రవచన రచనా పరిణామాన్ని గురించి చక్కని ప్రామాణికగ్రంథం రచించారు

రావుగారు. ఇది తెలుగు భాషా సమితి వారి బహుమానాన్ని కూడా పొందింది. ఈ గ్రంధంలో నన్నయ్య నాటినుంచి దక్షిణాంధ్ర వచన వాఙ్మయ వికాసం వరకు తెలుగు వచన రచనా పరిణామాన్ని వివరించారు. సాహిత్య ప్రతిభతో పాటు శాస్త్రవిజ్ఞానంకూడా ఉండటం చాలా అరుదు. ఈ శతాబ్ది తెలుగు మేధావులలో ఇటువంటి ప్రతిభ నాన్యతోదర్శనీయం. విశాఖజిల్లా ఎలమంచిలిలో వీరు చాలా కాలం ఉన్నారు. మారేపల్లి రామాచంద్రశాస్త్రిగారి సన్నిహిత సాహితీ మిత్రులలో వీరొకరు. జననం 1892 స్వర్గతి 1958. తల్లిదండ్రులు వెంకటరమణమ్మ వెంకట చలపతి రావుగారు.

★★★★



# రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

ఆధునిక తెలుగు సాహిత్యాన్ని చూస్తే గొప్ప పండితులున్నారు, అంతకన్నా గొప్ప కవులున్నారు సృజనాత్మక మహా ప్రతిభులున్నారు కాని విమర్శకులు విరళంగా ఉన్నారు విమర్శలేనిదే ఆ సాహిత్యం ఉత్తమ స్థాయిని చేరుకున్నట్లు కాదు. ఇంతే కాదు. తెలుగులో చెప్పుకోదగిన శైలీ నిర్మాతలు కూడా వేళ్ళమీదనే లెక్కించవలసి వస్తారు వచన రచనలో సిద్ధహస్తులు లేరు నిష్ణాతులు లేరు. అసలు తెలుగు వచనమే యీ నూరు నూటయాభై ఏళ్ళ నుంచి మాత్రమే వికసిస్తున్నది

ఆధునిక తెలుగు సాహిత్య వచన శైలీ నిర్మాతలలో రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారు అగ్రేసరులు. మహామేధావి, ఏక సంథాగ్రాహి పది సంవత్సరాల వయస్సుననే రాజస్థాన కథావళిని ఇతివృత్తం గ్రహించి తారాబాయి, మీరాబాయి వంటి కావ్యాలు రచించిన ధీశాలి అనంత కృష్ణుడు విమర్శ రీతులలో వారి మార్గదర్శనం తెలుగు సాహిత్యానికి గొప్ప వెలుగు నిచ్చింది. అన్నమాచార్యుల కృతులను కొన్ని వందలను వారు స్వరపరచి అన్నమయ్య సంగీత సౌరభం తెలుగుదేశాన్ని సువాసితం చేయిడానికి కారకులైనారు.

నాచన సోమునిపైనా, శ్రీకృష్ణ దేవరాయులపైనా వారు వ్రాసిన విమర్శలు ఒజ్జబంతులు. వేమనపై సమగ్రమైన సాధికారమైన విమర్శ గ్రంథం వారు వెలయించారు.

సాహిత్య విమర్శను దర్శన స్థాయికి తీసుకొని వెళ్ళిన మహామనీషి. అనంత కృష్ణశర్మ. సంగీత సాహిత్యాల రెండింటా వారు సమస్కంధులు. మైసూరు మహారాజా వారి కళాశాలలో ముప్పై ఎనిమిది సంవత్సరాలు వారు అధ్యాపకత్వం నిర్వహించారు. కట్టమంచి రామలింగారెడ్డి తమకు సాహిత్యాభిరుచిని పెంపొందించిన మాన్య మిత్రుడుగా రాళ్ళపల్లి వారిని గౌరవించారు. తమ రచనలలో వారి సాయం ఎంతో ఉన్నదని స్మరించారు రాళ్ళపల్లి వారు కూడా రెడ్డిగారి సాంగత్యం వల్ల తమ దృక్పథం నవీనమూ విశాలమూ అయిందని వారిని కృతజ్ఞతా పూర్వకంగా స్మరిస్తారు. సుమారు రెండు వేల ఏళ్ళనాడు సంకలితమైన

హాల చక్రవర్తి గాధా సప్తశతి, అటువంటిదే తమిళ సంగం వాఙ్మయం నాటి ప్రాచీనతమమైన సుందర పాండ్యుని ఆర్యా సంకలనాన్ని సరళ సుందర మధురపవోభిరామంగా అనంత కృష్ణశర్మగారు తెనిగించారు. సమకాలికుల గ్రంధాల కెన్నిటికో వారు చక్కని పీఠికలు వ్రాశారు.

మైసూరులోని పరకాల మఠంలో శ్రీకృష్ణ బ్రహ్మ పరకాలయతీంద్రుల వద్దసంస్కృత సాహిత్యాన్ని అధ్యయనం చేశారు శ్రీ అనంత కృష్ణ శర్మ. ఒకసారి ఒక గొప్ప విద్వాంసులు అప్పయ్య దీక్షితుల వారిని గురించిన ప్రాస్తావిక శ్లోకం ఒకటి చదవగా శ్రీ కృష్ణ పరకాలయతీంద్రుల వారు అప్పటికి పన్నెండేళ్ళ వాడైన తమ అంతేవాసి-అనంత కృష్ణులను దానిని గుర్తుపెట్టుకోమన్నారట ఆ ఘన విద్వాంసుడు ఒకసారి వినగానే ధారణ చేయగల శర్మగారి ప్రతిభకు ఆశ్చర్యపోయినారట మైసూరు లోని యీ మఠంలో అనంత కృష్ణ శర్మగారు ఏడేళ్ళు చదువుకున్నారు. సంగీతంలో వారికి గొప్ప పాండిత్యం వుండేది. వాయులీన వాయిద్యాన్ని వారు చక్కగా వాయించేవారు. అన్నమయ్య కృతులను సుందరంగా గానం చేసేవారు.

తెలుగు కవులలో తిక్కన గారంటే వారికి వల్లమాలిన అభిమానం. వ్యాస వాల్మీకుల భారతీయ సాహిత్య సంస్కారం రచయితలు అధ్యయనం చేసి అనుభూతం చేసికొని ఉత్తమ రచనల పట్ల అభిలాష కనపరచాలని వారి ఆకాంక్ష. సాహిత్యం ద్వారా చిత్త సంస్కారం కలిగించటమే రచయిత పరమార్థంగా భావించాలని వారి సందేశం. తల్లి అలమేలు మంగమ్మ. తండ్రి కర్నమడకల కృష్ణమాచార్యులు. జననం 1892. పరమపదం 1978.

★★★



# వేలూరి

ఈ శతాబ్ది ప్రథమ పాదంలో ఎక్కడ చూసినా అవధానాలు. జంటకవులు! కవితాస్పర్థలు. సాహిత్య కోలాహలం, వాద వివాదాలు. "చెళ్ళ పిళ్ళ వెంకన గురువంచు చెప్పికోనగా అది గొప్ప తెలుంగునాడునన్". 1910 ప్రాంతంలో చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు మచిలీ బందరులోని హిందూ జాతీయ పాఠశాలలో అధ్యాపకత్వం చేపట్టారు. ఒక పదేళ్ళపాటు అదొక గొప్ప వెలుగు బందరుకు. ఆ తర్వాత యీ శతాబ్దిలో గొప్ప పేరు ప్రఖ్యాతులు సంపాదించిన కవులు, పండితులు, విమర్శకులు, సాహిత్య వ్రతులు అందరూ కూడా చెళ్ళపిళ్ళ వారితో అంతో ఇంతో శైష్యోపాధ్యాయికను ప్రకటించుకొని సంతుష్టి చెందారు అటు గద్వాలిటు చెన్నపట్టణము దాకా జైత్రయాత్ర చేశాము అని ప్రకటించుకున్నారు తిరుపతి వేంకటకవులు. ఆ రోజుల్లో వాళ్ళ నాటకాలకు జనం విరగబడే వాళ్ళు తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగ విజయాలలోని పద్యాలు పామరులు కూడా చదివి ఆనందించే వాళ్ళు ఏ ఊర చూసినా తిరుపతి వేంకట కవుల అవధానాలు జరుగుతూ ఉండేవి

అవధానంలో ఆశు కవిత్వం చెప్పడం కూడా ఒక అంశం అడిగిన అంశాన్ని గురించి లంపోకగా పద్యాలు చెప్పాలి. మహా కావ్యాలలోని వర్ణనలు కూడా ఆ అశుకవితా ధారలోనే నిర్వహించాలి. ఒకసారి గుంటూరులో కొప్పరపుసోదర కవులకు, తిరుపతి వేంకట కవులకు విద్యా వివాదం సంభవించింది వెనకటి రోజుల్లో గౌడ డిండిమభట్టుకు శ్రీ నాథుడికి సంభవించిన స్పర్థను మించిపోయింది అది. తిరుపతి వేంకటకవులు అన్నిటా అఘుట నఘటనా సమర్థులే. కాని అశు కవిత్వంలో మాత్రం కొప్పరపు సోదర కవులకు ఒక వాసి తక్కువేనని ఆ రోజుల్లో అనుకొనే వాళ్ళు ఈ విషయాలు తెలిసిన వాళ్ళు.

వేలూరి శివరామ శాస్త్రిగారి కప్పటికి పద్దెనిమిదేళ్ళు సకల శాస్త్రాలలో అప్పటికే ఆయన

పారంగతుడు. గొప్ప వర్చస్వి. గుంటూరు విద్యా వివాదంలో గురువుల పక్షాన కొప్పరపు కవులతో ఢీకొని అందరినీ మెప్పించాడు శివరామశాస్త్రి

వేలూరి శివరామశాస్త్రి గారు వేద వేదాంగాలలో, షట్శాస్త్రాలలో లోతులు తెలిసిన మహామనీషి. ఇంగ్లీషు, ఫ్రెంచి భాషలలో పండితులు, భారతీయ భాషలెన్నిటినో సాధించిన ఘన విద్వాంసుడు. యోగం, సాంఖ్యం, వేదాంతం, జ్యోతిష్యం, మొదలైన వాటిలో ఆయన పరిశ్రమ నిరుపమానం, వ్యాకరణంలో ఆయన పరమావధిని సాధించారు.

ఇంతటి మహాపండితుడై, దార్శనికుడై, మహాకవియై కూడా ఆధునిక తెలుగు సాహిత్యానికి వెలలేని భూషలాయన సమకూర్చాడు వాడుక భాషలో గొప్ప శైలీ నిర్మాత వేలూరి వారు. గొప్ప కథలు వ్రాశారు శాస్త్రిగారు మంచి నవలలు రచించారు. వంగభాష నుంచి శరత్‌బాబు రచనలను తెలుగువారికి మొట్టమొదట సారిగా పరిచయం చేసింది శాస్త్రిగారే. గుజరాతీ నుంచి మహాత్ముని ఆత్మకథను తెనిగించారు శాస్త్రిగారు ఫ్రెంచి భాష నుంచే నేరుగా విక్టర్ హ్యూగో 'లేమిజరబల్స్' నవలను దివ్య జీవనంగా ఆంధ్రీకరించారు. శ్రుతిస్మృతి పురాణేతిహాసాదులలో శాస్త్రిగారికి తలస్పర్శియైన పాండిత్యం వుండేది. అరవిందుల యోగదర్శనాన్ని తెలుగులోకి తెచ్చారు శాస్త్రిగారు. 'ఇదియు నొక్క ఆరాధనా విశేషం బగుటం జేసి' అని తిక్కన మనీషి భావించినట్లు సాహిత్యాన్ని తపస్సులా సాధించారు వేలూరి శివరామశాస్త్రి గారు శంకర భగవత్పాదుల గ్రంథాలను తెలుగు వారి కందించారు అంటేనే శాస్త్రిగారి తత్త్వదర్శనం ఎంత లోకోత్తరమో తెలిసిపోతుంది. అరవిందుల 'సూపర్ మైండ్' అనే దర్శనాన్ని 'పురుషోత్తమ తత్త్వం'గా తెలుగువారి కందించారు శాస్త్రిగారు. కావ్య సంసారయోగి శ్రీ వేలూరి శివరామశాస్త్రి. తల్లిదండ్రులు విశాలాక్షి, వెంకటేశ్వరావధానులు జననం 1892, పరమపదం 1967



# రాయప్రోలు సుబ్బారావు



ఈ శతాబ్ది ప్రథమ దశకంలో ప్రభవించిన వందేమాతరోద్యమం భారత దేశంలో మహాకవులను సృష్టించింది. పురా భారతీయ ఔన్నత్య సంస్మరణకు, అమూల్య సాంస్కృతిక పరిరక్షణకు, జీవిత సాఫల్య ప్రేరణకు స్వాతంత్ర్య సముపార్జన దీక్షకు ఆ మహోద్యమం భారతీయులను కంకణ బద్ధులను, కటి బద్ధులను చేసింది. ఒక రవీంద్రుడు, ఒక అరవిందుడు, ఒక సావర్కారు అవతరించి జాతీయ చైతన్యాన్ని జ్వలింపచేసిన కాలమది.

భారతదేశంలోని వివిధ ప్రాంతాలు, వివిధ భాషలు, వివిధ స్థానిక అభిరుచులు అఖండ భారతంలోని అఖండ సంస్కృతి వైవిధ్య స్వరూపమే నన్న సత్యాన్ని మేధావులు, కవులు, కళాకారులు ఉద్బోధించిన కాలమది. ఒక ప్రాంతం, ఒక భాష, ఒక సాహిత్యం గురించి, దాని విశిష్ట వ్యక్తిత్వం గురించి కవులు గానంచేసినా, చరిత్రకారులు ప్రబోధించినా స్వాతంత్రోద్యమాన్ని ప్రాంతీయ భాషా వాహిక ద్వారా ప్రబోధించడమే దాని పరమార్థం.

తెలుగువారి చరిత్రను, సంస్కృతిని, బాషా సాహిత్యాల ప్రాభవాన్ని ఈ శతాబ్ది తొలి పాదంలో రమణీయంగా గానం చేసిన మహాకవి రాయప్రోలు సుబ్బారావు. జాతీయ చైతన్యాన్ని ప్రబోధింప చేశాడు ఈ మహాకవి. తెలుగు సాహిత్యానికి నూతనాధ్యాయానికి శ్రీకారం చుట్టాడు. సాధు, సాత్త్విక రమణీయ రతిపతీ శృంగారమే మానవుణ్ణి ఉదాత్తుణ్ణి చేస్తుందని కావ్య ఖండికల ద్వారా ప్రబోధించాడు. తెలుగుమాట కూర్పులోని గొప్ప సోయగాన్ని, పరమ రామణీయకతను, శబ్ద మాధురీ సమృద్ధిని కవితల ద్వారా వెలార్చాడు అక్షర రమ్యతకు రాయప్రోలు కవిత ప్రథమోదాహరణంగా నిలుస్తుంది ఆధునిక తెలుగు సాహిత్యంలో ఏ దేశ మేగినా ఎందుకాలిడినా, అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు, వేద శాఖలు వెలసెనిచ్చట, ఆది కావ్యం బలరె నిచ్చట'' మొదలైన జాతీయ గీతాల ద్వారా పారతంత్ర్య జాతి ఉల్లం పల్లవింప చేశాడు రాయప్రోలు. ఆయన కవితా ఖండికలు నిత్య వసంతాభిరామాలు ''మామిడి కొమ్మ పైన కలమంత్ర పరాయణుడైన కోకిల స్వామికి మ్రొక్కి'' అభినవ గీతాలు ఆలపిస్తాను అని చెప్పుకున్నారు రాయప్రోలు వారు. అంటే వసంతా రామపికరుతంలా కవిత్వం

వుంటుందన్న అర్థం కన్నా ''వందే వాల్మీకి కోకిలం'' అని ఆ ఆదికవిని ఆరాధిస్తూ నేను అక్షరార్చన చేస్తాను అని కవి స్తుతి చేస్తున్నాడని చెప్పటం బాగుంటుంది. రవీంద్రుని శాంతినికేతనంలో ఉండి సుమారు రెండేళ్ళు గురుదేవుని అంతే వాసిత్వం నెరిపారు రాయప్రోలు వారు. ''నల్లమేకల మూక నవసి పోతున్నాది, తెల్లపోతుల పొగరు త్రెళ్ళిపోతున్నాది'' అని నిర్భయంగా దేశభక్తి గీతాలు రచించారు. లలిత, తృణకంకణము, కష్టకమల, స్నేహిలతాదేవి లేఖ, మొదలైన రాయప్రోలు వారి ఖండకావ్యాలు తెలుగుతల్లికి మేలి ఆభరణాలు గురజాడ నవ్యసాహిత్యానికి ఏ విధంగా దోహదం చేశారో రాయప్రోలు ముఖ్యంగా నవ్య కవిత్వానికి కొత్త స్ఫూర్తి ఇచ్చారు. భావ కవిత్వయుగ ప్రవక్త శ్రీ రాయప్రోలు సుబ్బారావు.

రాయప్రోలు వారు **1892**వ సంవత్సరంలో జన్మించారు. సుదీర్ఘమైన ధన్య జీవితాన్ని గడిపి **1984** జూన్ **30**న స్వర్గస్థులైనారు పీరి తల్లిదండ్రులు ఆదెమ్మ, వెంకట అప్పావధాని గారలు ఈ శతాబ్ది తెలుగు కవులలో ఎన్నదగిన మహాకవి రాయప్రోలు



# పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి



కాశీ వెళ్లి వ్యాకరణంలో గొప్ప పాండిత్యం సంపాదించి నవద్వీపం వెళ్ళి తర్కంలో విశిష్టమైన ప్రజ్ఞ సంపాదించి, సాహిత్యంలో నిరుపమానమైన విద్వత్తు సముపార్జించి, వ్యవహారిక భాషావాదాన్ని సర్వాత్మనా సమర్థించి అత్యంత అభినివేశంతో దాని ప్రచారానికి పూనుకొని, నందూరి సుబ్బారావు ఎంకి పాటలను ఎంతగానో మెచ్చుకొని విమర్శించే వాళ్ళందరినీ ఎదుర్కొని అందులోని కవితాకళను ప్రతిపాదించిన ప్రజ్ఞానిధి పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు.

గిడుగు రామమూర్తి సప్తతి తమ జన్మదినోత్సవ సభకు అధ్యక్షత వహించింది శాస్త్రిగారే రామ్మూర్తి పంతుల కృషిని నాలుగు సంపుటాలు గానూ, ఆయన అభిమానులు పంతులుగారి డెబ్భయి ఏళ్ళ పుట్టిన రోజు పండుగు అభినందన కానుకగానూ సమర్పించిన వ్యాసావళి సంపుటాన్నీ వెండిపెట్టెలో పెట్టి ఆయినకు అందించింది పంచాగ్నుల వారే గిడుగు వారికి ఆ నాదు సమర్పించిన అభినఢదన సంపుటంలో ప్రాకృత కవులూ-ప్రజా భాషనూ అనే గొప్ప వ్యాసం వ్రాశారు శాస్త్రిగారు. ప్రాకృత సాహిత్యంలో పంచాగ్నుల వారి ధిషణ ఎటువంటిదో ఈ వ్యాసం నిలువుటద్దంలా ప్రతిబింబింపచేస్తున్నది

అంత గొప్ప ఫండితుడు, సంప్రదాయి విజ్ఞానఖని వాడుక భాషలో రచనలు చేసి ఈ శతాబ్ది వ్యవహారిక భాషోద్యమానికి వెండి కొండలా నిలిచారు. దండి అండ కలిగించారు ఆయిన రచనల వల్లనే వ్యవహారిక భాషోద్యమానికి ఘంటాపథం ఏర్పాటైంది జైనుల మత కథలు శాస్త్రిగారి సృజనాత్మక మహాప్రతిభకు కలికితురాయి ఇటు చెన్నపట్నం నుంచి అటు బరంపురం వరకు తెలుగు దేశమంతా పర్యటించి తెలుగువారి సాహిత్య సర్వతోముఖ వికాసం కోసం గొప్ప పూనిక వహించారు శాస్త్రిగారు. ఆర్యభారతీ గ్రంథ

మాలికను స్థాపించి ఎన్నో శ్రమల కోర్చి వాత్స్యాయన మహర్షి లోకతంత్రాన్నీ రాజశేఖర మహాకవి కావ్య మీమాంసను, గౌతమ మహర్షి ధర్మశాస్త్రాన్నీ తేటతెల్లమైన తెలుగు వచనంలో అందించారు శాస్త్రిగారు. బరంపురం కళాశాలలో చాలా సంవత్సరాలు తెలుగు బోధించి అధ్యాపకులుగా పనిచేశారు నవ్య సాహిత్య పరిషత్తు వార్షిక సభకు అధ్యక్షత వహించారు. చిలకమర్తి స్వీయ చరిత్ర ఆవిష్కరణోత్సవ సభకు అధ్యక్షత వహించారు భావకవులను చేరదీసి ఆదరించారు అన్నిటా ముందు చూపు పంచాగ్నుల వారిది అయితే సంప్రదాయాన్ని స్థిరంగా పాదుకొల్పాలని ప్రబోధించారు.

చిన్నతనంలోనే కాశీ వెళ్ళి కూలంకషమైన పాండిత్యం సంపాదించి కావ్య తీర్థ వ్యాకరణ తీర్థ వంటి యోగ్యతలను సంపాదించి నవ్య సాహిత్య వికాసానికి నిరుపమానమైన కృషిచేసి స్వయంగా గ్రంథమాలికను స్థాపించి అపూర్వమైన గ్రంథాలు అచ్చువేసిన ఖ్యాతి శాస్త్రిగారిది. అలుమేలు మంగా వేంకటేశ్వర శాస్త్రులు శాస్త్రిగారి తల్లిదండ్రులు. 1893 ప్రాంతం జననం. పరమగతి 1951



# ఓంకార స్వామి



అనాదికాలం నుంచీ భారతదేశం ఆత్మవిద్యకు ఆలవాలం. జన్మ సముద్రానికి వెలుగులు విరజిమ్మే దీపగృహం. భూదివమ్ముల సంధానపథం. ఎందరో యోగులు, ఎందరో మహర్షులు, సాధువులు, సత్పురుషులు, సంత్‌లు, భగవంతుడి సాక్షాత్కారాన్ని ఈ భూలోక వాసులకు ప్రత్యక్షం చేశారు. ఆత్మ సాక్షాత్కారాన్ని సులభంగా బోధించారు. ఎన్నివేల సంవత్సరాల నుంచో భారతదేశంలో మానవుడికీ భగవంతుడికీ ఉండే పరస్పర సంబంధం ఏమిటో, ప్రకృతికి, పరమేశ్వరుడికీ సంయోగాలేమిటో ఆవిష్కృతమవుతూనే ఉన్నాయి. 'యోగోజ్ఞానం తథాసాంఖ్యం విద్యాశిల్పాది కర్మచ, వేదా శాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్' అని మన దివ్యనామ పారాయణ గ్రంథాలు చెపుతున్నాయి. సృష్టిలోని సర్వప్రాణులలో తనను తనలో సర్వసృష్టినీ దర్శించడం నేర్చుకోమంటోంది భారతీయాత్మ.

గడచిన ఒకటి రెండు శతాబ్దాలను చూస్తే చాలా ఆశ్చర్యం వేస్తుంది త్రైలింగ స్వామి, రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి, రామతీర్థస్వామి, వివేకానందస్వామి, శివానంద, అరవింద యోగివంటి మహాజ్యోతి స్వరూపులు భారతదేశంలో ప్రభవించారు భారతీయ ఆధ్యాత్మిక దివ్యపథాన్ని వెన్నెలమయం చేశారు.

ఓంకారస్వామి కిందటి శతాబ్ది చివరి దశకంలో తెలుగుదేశంలోని పిఠాపురం పరిసరాలలో జన్మించారు. ఆయన పూర్వాశ్రమనామం వెంకటరావు. బాల్యంనుంచీ ఆధ్యాత్మిక సాధనలలో నిమగ్నులైనారు. అతి చిన్నతనంలోనే వారికి ఆత్మజ్ఞానం లభించింది.

'ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః, సర్వేజనా స్సుఖినోభవంతు' అనేదే భారతీయుల నిరంతర చిరంతన ఆకాంక్ష. ఇష్టజపం ఓంకారానికి 'శాంతి' వ్యాఖ్యానం. ఓంకారమే తల్లి. ఓంకారమే రక్ష. ఓంకారమే శాంతి. ఒకసారి స్వామివారికి దేహంలో కొంచెం అస్వస్థత కనిపించినప్పుడు డాక్టరు ఆయనను పరీక్షిస్తుండగా స్వామిగారు అడిగారుట. ఘమస్తనాడులూ ధమనులు,

నరవరాలు, ఓంకారాన్ని స్పందిస్తున్నాయి కదా అని.

తెలుగుదేశంలోని పిఠాపురం దగ్గర తోటపల్లి కొండలలో స్వామివారు శాంతి ఆశ్రమాన్ని స్థాపించారు ఎన్నో దశాబ్దాలుగా ఈ ఆశ్రమం ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ 'శాంతి' పత్రికను ప్రచురిస్తూ ఉంది. లోకంలో శాంతి నెలకొనాలని స్వామివారి ఆశ, ఆశయం, ప్రబోధం, ప్రయత్నం ఉపశాంతి కాదు. శాంతి కావాలి పది పన్నెండేళ్ళ వయస్సునే శాంతి సందేశదూతగా అమెరికా వెళ్ళాలని ఉత్సహించి ప్రయాణం చేశారు స్వామివారు. అయితే విదేశీ ప్రయాణీకుల నియమ నిబంధనలు సరిగా తెలియకుండానే ఆ దేశం చేరడంవల్ల స్వామివారికి ఆ దేశంలో ప్రవేశానుమతి లభించలేదు. బలవంతంగా ఆయనన్ను వెనక్కు-పంపించి వేశారు సముద్రయాన నిబంధనాధికారులు. అయితే అటుతర్వాత స్వామివారు మూడుసార్లు అమెరికా వెళ్ళి తమ దివ్య సందేశాన్ని వినిపించారు. కాలిఫోర్నియాలో ఆయన ఆనాడు స్వామి వివేకానందను ప్రపంచ మత మహాసభలో చూసి పరవశించిన వారి ఆతిథ్యం పొందారు ఎన్నోచోట్ల శాంతి ఆశ్రమాలు స్థాపించారు. భారతదేశంలో కూడా తోటపల్లిలో, వాల్తేర్ లో, నీలగిరిలో, విశాఖ పరిసరంలో కైలాసాశ్రమాలు స్థాపించారు.

స్వామి రామతీర్థ దివ్య జీవన సందేశంతో ఉత్తేజితులై తమ ఆధ్యాత్మిక గవేషణను సాగించారు ఓంకారస్వామి. హిమాలయ తపోవన భూముల్లో ఆరేళ్ళు తపస్సు చేశారు. దివ్యజీవన హిమాలయ ధామ స్థాపకులైన స్వామీ శివానంద తమ ఆశ్రమం స్థాపించటానికి ముందు ఓంకార స్వామిమీది ప్రేమతో అభిమానంతో తోటపల్లి శాంతి ఆశ్రమంలో తపస్సు చేశారు ప్రపంచంలోని ఎన్ని ప్రాంతాల వారో, ఎన్ని దేశాల వారో ఎన్ని భాషల వారో స్వామివారి దివ్య సందేశానికి ముగ్ధులైనారు స్వామివారు తమ ఆత్మకథలో సాధుసన్యాసులు, యోగులు మహర్షులు భారతదేశంలోనూ, ఇతరత్రా శాంతి సందేశహారులుగానూ 55 లక్షల మంది ఉన్నారని వ్రాశారు. స్వామివారి 'సోహం' అనే గ్రంథానికి స్వామీ శివానంద ఉపోద్ఘాతం వ్రాశారు. స్వామివారి స్వీయచరిత్రలో అద్భుత వృత్తాంతాలున్నాయి స్వామి యోగానందతో వారికి అమెరికాలో పరిచయం వారు భారతదేశంలో వీరిని చూడాలని రావటం ఆసక్తికరమైన విషయం. నేటికీ శాంతి ఆశ్రమం శాంతిసందేశం ప్రసారం చేస్తూనే వుంది స్వామి జననం 1893 నిర్యాణం 1983

★★★★



# గడియారం వేంకటశేషశాస్త్రి

ఆధునికాంధ్ర సాహిత్యంలో శివభారతం పేరు వినని వాళ్ళు ఉండరు. కవిత్రయం వారి మహాభారతమంత సుందరంగా ఛత్రపతి శివాజీ చరిత్రను కావ్యంగా వెలయించారు శ్రీ శేషశాస్త్రిగారు ఎనిమిది ఆశ్వాసాల మహాకావ్యంగా శివభారతం రూపు దిద్దుకొన్నది. రసోద్దీపకమైన శైలి చిక్కణంగా కావ్యమంతా పరచుకొని ఉంది నన్నయగారి ప్రసన్నమాధుర్య శైలి, తిక్కనగారి వీర రసావేశం, ప్రబంధ పరమేశ్వరుడి సూక్తివైచిత్రి, పోతనగారి భక్తి రసావేశం, శ్రీనాధుడి ప్రౌఢ గంభీరశైలి తలపింపజేస్తుంది శివ భారత రచన. ఇది వెలువడేనాటికి భారత స్వాతంత్ర్యోద్యమం ఫలదీకరణానికి సిద్ధంగా వుంది. అందువల్ల జాతీయోద్యమ స్ఫూర్తిని తెలుగు వారిలో రసోత్తుంగ తరంగితం చేసింది.

వేంకటశేషశాస్త్రిగారు గొప్ప వ్యుత్పన్నులైన పండితులు భావుకులు అందువల్లనే కవిత్రయి భారతంతో తమకృతి తులతూగ గలదన్న విషయాన్ని వాచ్యంగానే చెప్పగలిగారు. ముప్పైసంవత్సరాలు తపస్సుచేసి ఏభైమూడో ఏట ఈ గ్రంధాన్ని వెలువరించారంటే వారి కవితా తపస్సు ఎంత దీక్షగా సాగిందో తెలుస్తుంది. రాజశేఖర శతావధాని గారితో కలిసి వేంకటశాస్త్రిగారు అవధాన విహారాలు చేశారు. జంటకవులైనారు. అయినా రాణాప్రతాప చరిత్రం వంటి మరొక గొప్ప కావ్యం శివభారతం రచించి ఆ జంటకవి స్థానాన్ని పరమ సుందరంగా పదిల పరచుకొన్నారు. సార్థకం చేసుకొన్నారు. ఇరవయ్యో శతాబ్ది భారతపురాచారిత్రక కావ్యాకాశంలో ఈ రెండు కావ్యాలు ఏనాటికీ నిలచి ఉండే గొప్ప నక్షత్రాలుగా ప్రకాశిస్తూనే ఉంటాయి. శివభారతం వెలువడిందాకా ఈ కవిని గూర్చి ఆంధ్రదేశానికి తెలియనే తెలియదు కాని అటు తర్వాత వీరి సాహిత్య కీర్తి త్రివిక్రమంగా వ్యాపించింది ''ఎట్టి శుష్క విషయము నైనను కళ కట్టించి కవితలో లలిత మనోహరముగా బెట్టగల నేర్పు తీర్పు వేంకటశేషశాస్త్రి గారి కతి వేలముగ నున్నది. '' అన్న మధునా పంతుల వారి మాటలు వరాల

మాటలు. సంగీత సాహిత్య సరస్వతి రాళ్ళపల్లివారు శివభారతాన్ని గూర్చి ఇట్లా అన్నారు. ''ఆధునికాంధ్ర సాహిత్య మందు నాకుగల యల్పానుభవములో మహాకావ్యమను పేరున కింత తగిన గ్రంథమునునే జూడలేదు ఈ భారతము భాష గొప్ప వర్చస్సుతో ప్రసన్న మధురముగా ప్రవహించు చున్నది. పలుచోట్ల 'తెలుగుకింత లగువు బిగువు కలదా' యని యాశ్చర్యపడునట్లు చేయు నుడికారము అందు గలవు''.

గడియారం వారు శివభారతమే కాక దక్షిణ దేశాంధ్ర కవి భోజుడైన రఘునాథరాయల వారిని గూర్చి కూడా రెండువేల పద్యాలతో కమనీయమైన ఒక మహాకావ్యం సంతరించారు. 'వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితివం చనిపించుకో' అని విశ్వనాథ వారన్నట్లు రామాయణాన్ని యథా వాల్మీకంగా ఏడువేల పద్యాలలో కూర్చారు. శ్రీనాథుని కవితాసామ్రాజ్యం వంటి విమర్శ గ్రంథాలు కూడా రచించారు. ఏది వ్రాసినా గడియారం వారి ముద్ర ప్రతిభాసిస్తూనే ఉంటుంది.

కడప జిల్లా జమ్మలమడగు తాలూకా నెమళ్ళదిన్నె వీరి స్వస్థలం. ప్రొద్దుటూరులో బహుకాలం ఉన్నత పారశాలలో ఉపాధ్యాయత్వం నెరిపారు. పరిపూర్ణమైన ఆయుర్దాయంతో తెలుగునాట ఎన్నో సాహిత్యోత్సవాలలో ప్రకాశించారు.

తల్లి దండ్రులు నరసమాంబా, రామయ్యగారలు, జననం **1894**, పరమపదం **1982**.



# వరాహగిరి వెంకటగిరి



భారతదేశ స్వాతంత్ర్యోద్యమ నాయకులలో వరాహగిరి వెంకటగిరి విశిష్టమైన స్థానం. పదవులకోసం ఆయన ఏనాడూ ప్రాకులాడలేదు అవసరమనుకొన్నప్పుడు అంతరాత్మ ప్రబోధానికనుగుణంగా ఆయన పదవులను సైతం పరిత్యజించాడు. మనఃస్వాతంత్ర్యాన్ని ఎన్నడూ వీడలేదు. దేశ స్వాతంత్ర్యోద్యమంలో సుసంఘటిత కార్మికశక్తిని ఉద్యమీకరించాల్సిన అవసరాన్ని గుర్తించి ఆ కృషి చేసిన తొలితరంవారిలో ఆయన ప్రముఖుడు. ఉత్తమ దేశభక్తుల ఉన్నత జాతీయవాదుల ఇంట ఆయన జన్మించడం జీవితంలో తన మార్గాన్ని ఎంచుకొనే స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఆయినకు లభించడానికి విశేషించి దోహదకారి అయివుంటుంది.

పన్నెండేళ్ళ వయసుకే గిరి కేంబ్రిడ్జి సీనియర్ పరీక్ష ప్యాసై విదేశాలలో చదువు సాగించటానికి వెళ్ళాడు బ్రిటన్‌లోని భారతీయ విద్యార్థి సంఘానికి గిరి కార్యదర్శిగా ఉండేవాడు చిన్నవయసులోనే ఆయన ఐర్లండ్ సాగించిన స్వపరిపాలన ఉద్యమానికి సానుభూతి చూపి అందులో పాల్గొన్నాడు. ఐర్లండు కార్మిక నాయకుడైన డి.వెరాలతో గిరికి సాన్నిహిత్యం కూడా పెంపొందింది. **1916**వ సంవత్సరం నాటికే ఐర్లండ్ జాతీయోద్యమంతో సంబంధం వుందన్న కారణంగా బ్రిటన్ గిరిపైన దేశబహిష్కారణ ఆంక్షలు విధించింది. ఆయన ఎలాగో బారిస్టర్ పట్టా స్వీకరించ గలిగాడు. అక్కడినుంచి స్వదేశానికి వచ్చాడు. గాంధీజీ అహింసావాదాన్ని గిరి తొలిరోజుల్లో సర్వాత్మనా అంగీకరించక పోయినా సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నాడు. అఖిల భారత కార్మిక సంఘానికి ఆయన రెండు సార్లు అధ్యక్షులుగా ఎన్నిక అయినారు.

ఆ రోజుల్లో బ్రిటిషువారి ఎత్తుబిడ్డ అయిన జస్టిసు పార్టీని వోడించడం గిరి సాధించిన

ఎన్నికల విజయాలతో చరిత్రాత్మకమైనది. బొబ్బిలి రాజాను 1937వ సంవత్సరం ఎన్నికలలో గిరి వోడించి రాజగోపాలాచారి మంత్రివర్గంలో కార్మిక మంత్రిత్వ శాఖను చేపట్టాడు. అటుతర్వాత 1946లో ప్రకాశం మంత్రి వర్గంలో కూడా ఆయన మంత్రి పదవిని చేపట్టాడు

అప్పట్లో భారతదేశ రైల్వేసంస్థ తెల్లవారి గుత్తాధిపత్యంలో వుండేది. ప్రైవేట్ యాజమాన్యం కాబట్టి వాళ్ళు విశేషమైన లాభాలార్జించి పనివాళ్ళ శ్రేయస్సు ఏమీ పట్టించుకొనే వాళ్ళుకారు. కార్మిక నాయకుడిగా గిరి రైల్వే కార్మికుల సమ్మెకు సారథ్యం వహించి జయప్రదంగా నిర్వహించాడు ఎన్నోసార్లు.

స్వాతంత్ర్యానంతరం శ్రీలంకలో భారత హైకమీషనరుగా గిరి 4 సంవత్సరములు ఉన్నాడు. 1952 ఎన్నికల తర్వాత ఆయన పార్లమెంటుకు ఎన్నికై భారత ప్రభుత్వ కార్మిక మంత్రిత్వ శాఖను స్వీకరించాడు. అయితే అటు తర్వాత 2 సంవత్సరములకు బ్యాంకు ఉద్యోగుల స్థితిగతులను గూర్చిన విచారణ కమిటీవారి సిఫార్సులతో ఆయన ఏకీభవించక ప్రభుత్వం వారి నిర్ణయాన్ని విభేదించి మంత్రి పదవికి రాజీనామా చేశాడు

వరహాగిరి వెంకటగిరి ఉత్తర ప్రదేశ్, కేరళ, మైసూరు రాష్ట్రాలకు గవర్నరుగా పనిచేశారు. అటుతర్వాత ఆయన భారత ఉపరాష్ట్రపతి అయినారు 1969లో అఖిల భారత కాంగ్రెస్ నిట్టనిలువునా చీలిపోయినప్పుడు శ్రీమతిఇందిరాగాంధీ మద్దతుతో రాష్ట్రపతి పదవికి స్వతంత్రుడిగా పోటీ చేసి గిరి రాష్ట్రపతి అయినారు.

గిరి ఏ పదవి నలంకరించినా ఉన్నత జాతీయ ప్రయోజనాశయంతో, పెద్ద మనిషిగా ఉన్నత దేశభక్తుడిగా, దేశంలోని అన్ని వర్గాల వారి ఆదరాభిమానాలకు పాత్రులైనారు. పార్టీ ప్రయోజనాలకు, అధికార స్థిరీకరణకూ అతీతంగా వ్యవహరించారు. ఒరిస్సా రాష్ట్రంలోని బరంపురంలో 1894వ సంవత్సరంలో జన్మించారు శ్రీ వరాహగిరి వెంకటగిరి. 1980వ సంవత్సరంలో కీర్తిశేషులైనారు తల్లిదండ్రులు సుబ్బమ్మ, జోగయ్య పంతులుగారలు.

★★★★



ఈ శతాబ్ది ప్రథమపాదంలో కవగా కవిత్వం చెప్పడమనేది సాహిత్యలోకంలో ఒక గొప్ప ఆకర్షణగా రూపుదిద్దు కొన్నది. ఆనాడు ఎక్కడ చూసినా జంటకవిత్వకోలాహలమే ఎక్కువగా కనపడేది. తర్వాత తర్వాత సుప్రసిద్ధులైన కవులెందరో తమ వెంట జంటకవిని తొలిరోజుల్లో వెతుక్కోవడానికి ఎంతగానో ఉత్సాహించినవారే. చెళ్ళపిళ్ళవారి శిష్యులలో ఆ విధంగా జంటకవులుగా తర్వాత ప్రసిద్ధులైన వారు పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వరరావు గారలు. 'తొలకరి' రచనతోనే ఆధునిక సాహిత్యంలో వీరు విలక్షణమైన గుర్తింపు పొందారు. ఆధునిక సాహిత్య విమర్శకులలో, శైలీ నిర్మాతలలో పింగళి లక్ష్మీకాంతం ప్రథమ బహుకాల విశ్వవిద్యాలయాలలో పార ప్రవచనం చేసిన వారు కావడం వల్ల వారి రచనలో ఒక జిగి, ఒక బిగి కానవస్తాయి. తరతరాల సాహిత్య విద్యార్థులకు సాహిత్య చరిత్ర విషయంలో వారిదే వరవడి. గౌతమవ్యాసాలు, సాహిత్య విద్యార్థులకు సాహిత్య చరిత్ర విషయంలో వారిదే వరవడి. గౌతమవ్యాసాలు, సాహిత్య శిల్ప సమీక్ష, సంస్కృత వ్యాకరణం శబ్దాలుగా తెలుగు సాహిత్య విద్యార్థులకు అవశ్య పఠనీయాలు. పరీక్షోత్తీర్ణతా ప్రాభావ ప్రాపకాలు. ఆంధ్ర విశ్వవిద్యాలయం పక్షాన వారు వెలువరించిన ద్విపద వాఙ్మయం, రంగనాథ రామాయణం వారి శేముషీ ప్రౌఢికి నిదర్శనాలు. వారి శిష్య వాత్సల్యాన్ని గురించి ఆంధ్రదేశంలో ఎన్నో కథలు, గాథలు ప్రాచుర్యంలో ఉన్నాయి. శ్రీ తిరుమలచంద్ర వంటి భాషా సాహిత్య వేత్త పింగళి లక్ష్మీకాంతంగారిని ఔచిత్య విచార చర్చ ప్రసిద్ధుడైన క్షేమేంద్రుడితో పోలుస్తారు. మధురపండితరాజం, గంగాలహరి వంటి అనువాదాల ద్వారా పింగళి వారి పాండితీశక్తీ కవితా పారమ్యమూ వెల్లడవుతాయి.

అర్ధనారీశ్వరతత్త్వంలాగా కలసిపోయారు పింగళి – కాటూరి కవులు. 'నాకు దైవమూ, గురువూ, స్నేహితుడూ' ఒక్కరే అని లక్ష్మీకాంతంచే సంభావితులైన

వారు కాటూరి వేంకటేశ్వరరావుగారు.'ప్రాణము ప్రాణమైన గుణ రమ్యుడు' అని వెంకటేశ్వర్రావు గారిని పింగళి వారు వర్ణించారు.

పింగళి, కాటూరి కవులు విడివిడిగా కూడా గ్రంథ రచనం చేయడం విశేషం. కాటూరివారు పౌలస్త్య హృదయం, గుడిగంటలు వంటి ఖండ కావ్యాలు రచించి పేరు తెచ్చుకున్నారు. శంకరుల సౌందర్యలహరిని అద్భుతంగా అనువాదం చేశారు. గాంధీజీ స్వీయ చరిత్రను పరమ రమణీయంగా తెలుగు చేశారు. ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో పింగళి-కాటూరి కవులది నిరుపమానమైన స్థానం. సౌందర నంద కావ్యానిది అతులితమైన విన్నాణం.

పింగళి లక్ష్మీకాంతం జననం 1894. స్వర్గతి 1972, కాటూరి వేంకటేశ్వరరావు జననం 1895, స్వర్గతి 1962. ఇద్దరూ కృష్ణా జిల్లావారే. అంతేకాక సౌందరనందనంలో తమను గూర్చి ఇట్లా చెప్పుకున్నారు.

"బంధువులేక మానసులు బాల్య సఖుల్ సహపాఠులున్ సమ
స్కంధులు, పింగళాన్వయుడు కాంతుడు కాటు రి వేంకటేశుడున్
సుందర నందరాగరస శోభితవృత్తము, రమ్యతత్త్వ మీ
సౌందర నంద సత్కృతిని సల్పిరి దేశికుడిచ్చమెచ్చగన్".

★★★★



# కొలవెన్ను రామకోటేశ్వరరావు

భారతదేశపు స్వాతంత్ర్యోద్యమం, అది ఒక దివ్యోజ్జ్వల అధ్యాయం. వంగదేశ విభజనం, లజపతిరాయ్ ప్రవాస శిక్ష, తిలక్ ప్రవాసశిక్ష, మింటోమార్లే సంస్కరణలు, మాంటేగ్‌చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు త్రివిధ బహిష్కారం, జాతీయ పాఠశాలల స్థాపనం, సత్యాగ్రహం, ఒళ్ళు జలదరింప చేసే త్యాగాలు, ఆధునిక చరిత్ర. దేవతలు సైతం మెచ్చే ఆనాటి దేశభక్తుల స్వాతంత్ర్య సమర సన్నాహగాథలు. 'కోటి నదులు ధనుష్కోటిలో నుండగ' అన్నట్లు, భారత దేశ సమస్త సాంఘికోద్యమాలు జాతీయోద్యమ మహాప్రవాహాభిముఖంగా ఆ రోజుల్లో పరవళ్ళు తొక్కాయి.

'త్రివేణి' అనే సాంస్కృతిక పత్రికను సుమారు 4 దశాబ్దాలు నిర్వహించారు రామకోటేశ్వరరావు. అన్నిటా కళాత్మక హృదయం రామకోటేశ్వరరావుగారిది. ఆయన సౌందర్యవాది. సౌజన్యమూర్తి. 'మోడరన్ రెవ్యూ' ప్రభావం ఎంతగానో ఉండేది రామకోటేశ్వరరావు గారిపైన. 1917వ సంవత్సరం కాంగ్రెస్ సమావేశంలో పాల్గొన్నారు. 1920లో నాగపూర్ కాంగ్రెస్‌కు వెళ్ళి వచ్చిన తరువాత న్యాయవాద వృత్తిని విసర్జించారు. కొన్నాళ్ళు బందరు జాతీయ కళాశాలలో పనిచేశారు.

కాని వీటన్నిటికన్నా త్రివేణి సంపాదకులుగానే ఆయిన అఖిల భారత స్థాయిన ప్రసిద్ధులు. జాతీయైకమత్యానికి, మధ్యతరగతి మేధావుల, విద్యాధికుల సాంస్కృతిక దృఢానుబంధానికి త్రివేణి పత్రిక ఎంతగానో తోడ్పడింది. త్రివేణి పత్రిక ఆశయ ముద్రికగా వజ్రం, కమలం, జ్వాలావలయయుతమైన సంకేతం ప్రచురితమయ్యేది. భక్తి జ్ఞాన, కర్మలు, సత్యసౌందర్య శివంకరములూ ప్రతీకగా త్రివేణి ఆవిర్భవించింది 1934వ సంవత్సరం గాంధీ మహాత్ముడు బందరు వచ్చినప్పుడు 'త్రివేణి' బాగా వుంటు న్నదని మెచ్చుకొన్నారు భారతదేశంలో వివిధ రాష్ట్రాల భాషా సాహిత్యాలను, స్థానిక సాంస్కృతిక విలక్షణతలను ఇతర రాష్ట్రాల

వారికి పరిచయం చేసి భారత జాతీయ సామాజిక జీవనంలో ఏకత్వంలో భిన్నత్వాన్ని, భిన్నత్వంలో ఏకత్వాన్ని నిరూపించటమే త్రివేణి ధ్యేయంగా ఉండేది. ప్రతి సంచికలోను భారతీయ భాషలసుసంపన్నతను గురించినవీ సృజనాత్మక ప్రతిభను వెలార్చేవీ అయిన రచనలుండేవి సుప్రసిద్ధ రచయితలు కథలు, కవితలు, సంగీతం చిత్రకళ తదితర కళారూపాలను గూర్చి రాస్తుండేవాళ్ళు 1928వ సంవత్సరంలో త్రివేణి ప్రారంభమైంది రాధాకృష్ణన్, రాజాజి, జవహర్‌లాల్ వంటి తత్త్వవేత్తలు, మేధావులు, దేశనాయకులు కూడా త్రివేణి పత్రికలో రచనలు చేసేవాళ్ళు. అస్సామీ, బెంగాలీ, మరాఠీ, గుజరాతీ, పంజాబీ, సింధీ భాషలలోని సృజనాత్మక రచనలను ఇంగ్లీషు అనువాదాల ద్వారా దాక్షిణాత్య సాహితీపరులు చదవగలిగేవారు పత్రిక రూపురేఖలు కూడా శుచిగా, రుచిగా పరమ సుందరంగా ఉండాలని రావుగారి కోరిక అందువల్ల వ్యాపార ప్రకటనలను అంగీకరించేవారు కారాయన.

బందరు జాతీయ కళాశాలలో కొన్నాళ్ళు చరిత్రాధ్యాపకులుగా ఉన్నారు శ్రీ రామకోటేశ్వరరావు. తెలుగు సాహిత్యాన్ని ఈ శతాబ్దిలో సంపన్నం చేసిన రచయితలంతా రామకోటేశ్వరరావు గారికి మిత్రులు త్రివేణిని స్థాపించక ముందు ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారి స్వరాజ్య పత్రికలో 2 సం.లు పనిచేశారు రావుగారు అఖిల భారతదేశంలోనే అగ్రగణ్యులైన పత్రికా రచయితలలో రామకోటేశ్వరరావు స్థానం విశిష్టమైందని సాహితీవేత్తలు, మేధావులు మెచ్చుకొనేవారు అడవి బాపిరాజు, నండూరి సుబ్బారావు, పింగళి, కాటూరి కోలవెన్ను వారికి కూర్చు మిత్రులు. మొదట్లో త్రివేణి ద్వైమాస పత్రికగా వచ్చేది తరువాత మాసపత్రికగా నిర్వహించాలని ప్రయత్నించారు, కాని ఎక్కువకాలం సాగలేదు. అటు తర్వాత త్రైమాసికగా వచ్చింది చాలా సంవత్సరాలు. సత్యాగ్రహోద్యమంలో రెండేళ్ళు కారాగారవాసం చేశారు కోలవెన్నువారు. 20వ శతాబ్ది భారతదేశ పత్రికా రచయితలలో కోలవెన్నువారిది చెప్పదగిన స్థానం. ఉత్తమమైన ఆదర్శాలను, ఆశయాలను భారతీయ సంస్కృతిని వారారాధించారు.

జననం **1894**. కాలధర్మం **1970**. తల్లిదండ్రులు రుక్మిణమ్మ, వియ్యన్న పంతులుగారలు స్వస్థలం నరసరావు పేట.



# జిడ్డు కృష్ణమూర్తి



'గురువులు తమకునులో బడు, తెరువులు సెప్పెదరు విష్ణు దివ్యపదవికిన్, దెరువులు సెప్పరుచీకటి బరువులువెట్టంగ నేల అని' ప్రహ్లాదుడన్నట్లే అరవై సంవత్సరాలు జిడ్డు కృష్ణమూర్తిలోకాన్ని ప్రబోధించారు. ఏమతమూ, ఏ సంప్రదాయమూ, ఏవ్యవస్థ, ఏకర్మకాండా ఏనమ్మకమూ, సూటిగా అనివార్యంగా సత్యాన్ని చేర్చలేవు. తనదైన సాధనద్వారా సత్యాన్ని సాధకుడు తెలుసుకోవాలి. ఎవరో తనకు ఆత్మసాక్షాత్కారం చేయిస్తారనుకోవడం వొట్టిభ్రమ మాత్రమే అనేది ఆయిన పదేపదే నొక్కిచెప్పేప్రబోధసారంశం. 'పూర్ణమద: , పూర్ణమిదం' అనే దివ్యానుభూతికిలోను గావాలి. అది తానుకావాలి. అంతేగాని వ్యవస్థీకృతమైన ప్రయత్నం అక్కడ పనికిరాదు అంటారాయన. భారతీయ తత్త్వదర్శనంలో ఇదేమీకొత్త విషయంకాదు. అయితే సరళంగా సూటిగా అరటి పండు వొలిచి చేతిలో పెట్టేసట్లు తిన్నవాళ్ళు తలవూచేట్లు చెప్పటం జె.కె. మహాశయుడి విశిష్టమూర్తి మంతం.

స్వేచ్ఛకోసం బంధాలను ఆహ్వానించడందేనికి! తానెవరో తెలుసుకుంటే, 'తన తనం' ఏమిటో కనుక్కొంటే దాన్ని మించింది మరేమీలేదు. అన్ని సందేహాలు నివృత్తి అవుతాయి. అనిభగవాన్ రమణులు చూపినత్రోవ కూడా ఇదేకదా!

'కర్మంబులు కోరకచేయు వలయు. కోరిచేసిన దుఃఖంబులు ప్రాప్తించు' అని చెప్పాడు శ్రీ మహాభాగవతంలో ప్రహ్లాదస్వామి. జిడ్డు కృష్ణమూర్తి అంటున్నది కూడా ఇదే. 'అజ్ఞానంబునం జేసి పురుషుండు కర్మదేహంబుల విస్తరించు... జ్ఞానలభ్యంబు మోక్షంబు' అనికూడా చెప్పాడు ఆ మహాభాగవతుడు.

అంతేకాదు. 'నరుండు విద్వాంసుండనని యభిమానించి, కర్మంబులాచరించి యమోఘంబులైన విపరీత ఫలంబులనొందు' అని కూడా చెప్పాడు ప్రహ్లాదుడు. జిడ్డుకృష్ణమూర్తి మహాశయులుకూడా ఏ మతమూ, ఏ వ్యవస్థీకృతమార్గమూ,

స్వీయప్రతిపాదిత బంధమూ, హృదయంలోని నివ్వరిముల్లును కనపడేట్లు చేయలేదనీ, దాన్ని చూడటమే సంశయ విచ్ఛేదమనీ అదే ఆనందమనీ ఆయన అభిభాషణ. ఆనివ్వరిముల్లును కనక దర్శిస్తే జగత్తు అంతటా అదే కానవస్తుంది అప్పుడు చూసేదీ చూడబడేదీ చూస్తున్నా ననేదీ ఉండదు. అది సత్యావిష్కారం అంటారు శ్రీ కృష్ణమూర్తి. 'అప్రాప్యమనసాసహ' అనేస్థితికి చేరుకోవాలంటారు వారు.అదేధ్యానం అదే ఆనందం

వంశపరంపరయా జిడ్డు వారిది బందరు ప్రాంతంలాగా కనపడుతుంది. జిడ్డు పూర్ణయ్య పంతులుగారనేవారు ముముక్షు మార్గోపదేశిని అనే పత్రికను కూడా కొన్నాళ్ళు నిర్వహించినట్లు కనపడుతుంది. కృష్ణమూర్తి జన్మించేనాటికే జిడ్డువారి కుటుంబాలకు దివ్యజ్ఞాన సమాజం సంబంధం వుంది అందుకే ఆయన తండ్రిగారు తన నలుగురు కుమారులను తీసుకొని మద్రాసులోని అడయారుచేరడం జరిగింది. 1909లో ఈ సన్నివేశం సంభవించింది. దివ్యజ్ఞాన సమాజ నిర్మాతలైన అనీబిసెంట్, సి డబ్లు.లెడ్ బీటర్, కృష్ణమూర్తిని జగద్గురువుగా ప్రకటించి ప్రవక్తగా స్థాపించాలని ప్రయత్నించారు అందుకోసం ఒక పెద్ద వ్యవస్థను నిర్మించారు. కాని శ్రీ జిడ్డుకృష్ణమూర్తి 1929లో దివ్యజ్ఞాన సమాజంనుంచి పూర్తిగా విడిపడ్డారు. తన అనుయాయులంటూ ఎవరూలేరని ప్రకటించారు శ్రీ జిడ్డుకృష్ణమూర్తిని ప్రవక్తగా మానవజాతిని తరింపజేయటానికి వచ్చిన దివ్యపురుషుడిగా లోకాన్ని అంగీకరింపచేయడానికివ్యజ్ఞాన సమాజ ప్రముఖులు సాగించిన ఉద్యమంలో శ్రీ కృష్ణమూర్తి తండ్రికి, అనీబిసెంటుకు న్యాయస్థానాల్లో అభియోగాలు నడిచి ప్రివీకౌన్సిల్ వరకు ప్రాకాయి. కాని శ్రీ కృష్ణమూర్తి ఈ ఆచార్య సంప్రదాయాన్నే వ్యతిరేకించారు తనకుతానే గురువు తనకుతానేలక్ష్యం, ఇదే ఆయన బోధ.

1895వ సంవత్సరం మదనపల్లిలో జన్మించారు శ్రీ కృష్ణమూర్తి. నిర్యాణం 1986 ఫిబ్రవరి 17 తల్లిదండ్రులు సంజీవమ్మ, నారాయణయ్యగారలు.

తెలుగుదేశానికి తద్వారా యావత్ ప్రపంచానికి గొప్పవెలుగు శ్రీ జిడ్డు కృష్ణమూర్తి.





# అడవి బాపిరాజు

అడవి బాపిరాజుది విశిష్టమైనవ్యక్తిత్వం, ఆయనకవి, చిత్రకారుడు, లలితకళామూర్తి తొలుత నానివాసమ్ము గంధర్వలోక మధుర సుషమానుథాగాన మంజువా టి' అన్నాడే కృష్ణశాస్త్రి, అట్లానే బాపిరాజుకూడా గంధర్వలోకంనుంచి తెలుగుదేశానికి ప్రవాసం వచ్చాడేమో ననిపిస్తుంది. ఆటపాటలలో మేటి, అమృతహృదయుడు. స్వాప్నిక లోకవిహారి, అతిలోక భావుకుడు. ఆయన రచించిన తిక్కన సోమయాజి, సముద్రగుప్తుడు వంటి చిత్రాలు, చిత్రకళతో ఆయనకుగల విశారదత్వాన్ని నిరూపిస్తాయి. కథవ్రాసినా కవితలల్లినా పాటపాడినా నవలలు రచించినా అన్నిటా ఆయన రమణీయ భావుకత వెల్లివిరుస్తుంది. తెలుగు వాళ్ళసంస్కృతి, నాగరకత, చరిత్రల పట్ల ఆయనకు విశిష్టమైన అభిమానం.

బాపిరాజు సుమారునాలుగు దశాబ్దాల కిందట హైదరాబాదునుంచి వెలువడిన మీజాన్ అనే తెలుగు పత్రికకు సంపాదకుడిగా కొన్నినాళ్ళుపనిచేశారు. యాజమాన్యం పరాయి వ్యక్తిదైనా బాపిరాజు జాతీయాభి మానతత్పరుడిగానే ఆ పత్రికను నిర్వహించారు. బాపిరాజు రచించిన నవలలు నారాయణరావు, గోనగన్నారెడ్డి, హిమబిందు, అడవిశాంతి శ్రీ, తుఫాను వంటివి తెలుగు వారికి చాలాప్రీతి పాత్రాలైనవి. హిమబిందు ఆంధ్ర శాతవాహనులనాటి ఆంధ్ర దేశవైభవాన్ని పరమోజ్జ్వలంగా నిరూపిస్తున్న ఇతివృత్తంతో వ్రాసిన నవల. అరోజుల్లో అంటే 1922 ప్రాంతంలో బందరు నుంచి వెలువడుతూ వచ్చిన శారద పత్రికలో హిమబిందుధారావాహికంగా ప్రచురితం. విశ్వనాధ సత్యనారాయణ తన కిన్నెరసాని పాటలను బాపిరాజుకే అంకిత మిచ్చారు. అందులోని రేఖాచిత్రాలు బాపిబావతో గీయించుకున్నారు. ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు 1934 ప్రాంతంలో నిర్వహించిన నవలాపోటీలో విశ్వనాథవారి వేయిపడగలతోపాటు బాపిరాజు నారాయణరావుకు కూడా సమానంగా బహుమానం విభక్తమైంది.

ఆంధ్రదేశంలో స్వాతంత్ర్యోద్యమ కాలాన్ని చిత్రించిన నవలల్లో బాపిరాజుగారి నవల నారాయణరావు అగ్రగణ్యం. అది లలిత సుందరమైన మహాకావ్యం. అందులో ఆయన

చిత్రించిన పాత్రలు తెలుగువారి మనోఫలకాలనుండి చెరిగిపోవు గోనగన్నారెడ్డి నవలలో కాకతీయుల కాలంనాటి తెలుగు వారి మహావైభవాన్ని పరమరమణీయభావుకంగా మూర్తీభవింపచేశారు బాపిరాజు. అడవిశాంతి శ్రీ తెలుగు ఇక్ష్వాకుల కాలపు నాటికకథ, తెలుగు అనే మాట వినపడితేచాలు పులకించి పోతారు బాపిరాజుఆయినమనస్వి. సంగీత సాహిత్యనాట్య విజ్ఞానాల త్రివేణీసంగమం ఆధునిక భారతీయ చిత్రకారులలోసుప్రసిద్ధులైన ప్రమోదకుమార్ ఛటర్జీ వద్దతన చిత్రకళా విజ్ఞానానికి మెరుగులు దిద్దుకున్నారు. బాపిరాజు-బందరులోని ఆంధ్ర జాతీయకళాశాలకు ప్రధానాచార్యులుగా కొంతకాలం పనిచేశారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఆయిన కారాగారవాసం చేశారు. జాతీయాభిమాన మానసీయ పూరితులు బాపిరాజు. న్యాయువాద వృత్తి చేపట్టినా అది ఆయిన్ను ఆకర్షించలేదు.

ఆయినసాహిత్య తపస్సు ఆధునిక సాహిత్యంలో విశిష్టస్థానాన్ని ఆయనకు కూర్చింది. బాపిరాజు జననం 1895. స్వర్గతి 1952



# విశ్వనాథ సత్యనారాయణ



నన్నయ్య, తిక్కన, పోతన శ్రీనాథుడు అని తెలుగు సాహిత్యంలో 'పూర్వమహాకవుల పేర్లు తెలుగువాళ్ళకు ఎట్లా సుపరిచితాలో, ఈ శతాబ్దినుంచి తెలుగువాళ్ళకు విశ్వనాథ పేరుకూడా ముందు అట్లానే సుపరిచితమవుతుంది.

గతంలోని సామాజిక వ్యవస్థలో కూడా మంచి అనేది లేకపోలేదు అనగానే అటు వంటి వాళ్ళను అనభ్యుదయ వాదులుగా పరిగణించడం చాలా పొరపాటు. గతాన్ని పూర్తిగా తవ్వి తలకెత్తుకోవాల్సిన పనిలేదు, భూషించాల్సిన పనిలేదు. కాని గత మనగానే గంగవెఱ్ఱులెత్తాల్సిన అవసరంకూడాలేదు. మానవుడిలోని బలహీనతలను, అధర్మాన్ని, స్వార్థపరత్వాన్ని కాలానికి, వ్యవస్థకు ఆపాదించటం అభ్యుదయ దృక్పథం అనిపించుకోదని మోహమాటం లేకుండా ఉద్ఘాటించారు. ఈ శాతాబ్ది సాహిత్యలోకంలో ఆయనంతటి సృజనాత్మక మహాప్రతిభులు చాలా అరుదుగా కన్పిస్తారు

ఆధునిక కాలాన తెలుగు సాహత్యంలో ఆయన చేపట్టని ప్రక్రియ లేదు. చేపట్టిన ప్రతిప్రక్రియలోను తనదైన ముద్రను ఆవిష్కరించారు.

ఈ శతాబ్దిలో విశ్వనాథవలె విస్తారమైన సాహిత్య సృష్టిచేసిన మరొక రచయిత కనిపించరు. శతాధిక గ్రంథకర్త అనేది పాతకాలపుమాట. సంఖ్యాపూరణకు పనికి వచ్చేగ్రంథాలు ఇంకా ఒకరో ఇద్దరో రాసి ఉండవచ్చు. కాని ఈ శతాబ్ద తెలుగు సాహిత్యాన్ని ఇంతగా పరచుకొన్న వారు మరొకరులేరు. అరవై పైగా నవలలు, ముప్పై పైగా కావ్యాలు, నాటకాలు, కథలు. సాహిత్య విమర్శ, శ్రీమద్రామాయణ కల్పవృక్షం వంటి మహాకావ్యరచన విశ్వనాథను ఈ శతాబ్దిరచయిత చేశాయి. ఆయన్ను ఒక గొప్ప సాహిత్య శిఖరంగా నిలిపాయి. వేయి పడగలు, ఏకవీర, మాబాబు, చెలియలికట్ట, తెరచిరాజు, భ్రమరవాసిని మొదలైన నవలలు ఏనాటికైనా రుచించేవే

తెలుగు సాహిత్యంలోని సృజనాత్మక మహాప్రతిభానిరూపకంగా జ్ఞానపీఠ పురస్కారాన్ని

పొందినవారు విశ్వనాథ ఒక్కరే ఇప్పటి వరకు కనిపిస్తున్నారు. ఈ విషయంలో కనిష్ఠికాధిష్ఠితుడైన కాళిదాసుని తలపింప జేస్తున్నారు.

కాలంతో సంబంధించని ప్రతిభా పూర్ణుడనీ, పూర్తిగా సనాతన తత్పరుడనీ విశ్వనాథను పరిగణించడం ఆయనకు చాలా అన్యాయం చేసినట్లవుతుంది. విశ్వనాథ వారు నిర్వహించిన జయంతి పత్రికను చూస్తే ఆయన నవనవోన్మేషితమైన అచ్ఛప్రతిభకు అర్ధశతాబ్దం పాటు తెలుగు సాహిత్యంలో 'తనకావించిన సృష్టి తక్కొరుల చేతంగాదు' అనే సూక్తికి లక్ష్యంగా ఆయన నిలిచారు. సాహిత్య రసవాది, వేది, సర్వస్వతంత్రుడు. సంప్రదాయ పరినిష్ఠితుడు. జననం 1895, స్వర్గతి 1976. కన్నతల్లి దండ్రులు పార్వతి శోభనాద్రి పుణ్యదంపతులు. జన్మస్థలం కృష్ణా జిల్లా నందమూరు.



# గుర్రం జాషువా



అసూయ బానిసజాతి రుగ్మత అన్నాడు స్వామి వివేకానంద. స్వపరిపాలన లేక పోవటం మాత్రమేకాదు, పరాధీనత అంటేను బానిసత్వ మంటేనూ, మానసికమైన, ప్రవర్తనాపరమైన, విక్లబత్వం కూడా బానిసత్వమే అనిపించుకుంటుంది. వెయ్యేళ్ళ పరాధీనత వల్ల కాబోలు భారతదేశంలో మానవధర్మం కుచించుకొని పోయినట్లున్నది. మనీషా పంచకం ఏం చెపుతున్నా మనుషులు మాత్రం అంటరానితనం పాటించటం నుండి ముక్తులు కాలేకపోయినారు. మసిపాతల్లోని మాణిక్యాలను గుర్తించలేక పోయినారు. బాహ్యమైన విలువలకు, అంధపరంపరగా ఆచారానికి బద్ధులైపోయినారేగాని, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమభావంతో బలమైన జాతీయతా సమాజ వ్యక్తిత్వాన్ని రూపొందించుకోలేక పోయినారు. ఇందుకు కారణం చరిత్ర కావచ్చు కాలం కావచ్చు.

కిందటి శతాబ్ది చివరి దశకంలో పుట్టి ఈ శతాబ్దిలో గొప్ప తెలుగు కవిగా ప్రతిష్ఠితుడైన జాషువా తెలుగు సాహిత్యంలో పురాణ కవులలో తిక్కన, పాల్కురికి సోమనలతోను, మధ్యయుగ కవులలో శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరనలతోను పోల్చదగిన ప్రతిభావంతుడైన కవిశ్రేష్ఠుడు.

సుకవి కవిత స్నిగ్ధవర్ణ ముగ్ధాకృతియు చతురపద విన్యాస ధన్యాసికయుగా ఉంటుందన్నాడు తెనాలి రామకృష్ణుడు. ఈ లక్షణం జాషువా కృతుల్లో పుష్కలం. కౌమార యౌవన దశల్లో సమాజం ఆయన్ను బాధించింది అవివేకంగా కాని ప్రౌఢ నిర్భరవయః పరిపాకంలో చాలా గౌరవించింది. సాహిత్య యుగకర్త చెళ్ళపిళ్ళ వెంకట కవీంద్రుడు 'నీ కవిత్వమ్ము జాషువ భేష్‌భేష్' అని పొగడి స్వయంగా ఆయన కాలికి పెండేరం అలంకరించారు. చిన్ననాటి బాధలను, అవమానాలను పెద్ద మనసుతో మన్నించి మరచిపోయి విశ్వ మానవుడిగా విశ్వకవిగా జాషువా ఎదిగాడు. ఆయన రచించిన ఫిరదౌసి, గబ్బిలం, ముంతాజ్ మహల్, స్వప్నకథ, శరత్కాలపు వెన్నెలవలె ఏనాటి కీరుచించేవే.

ఆహ్లాదం కలిగించేవే.

ఆయన్ను హైందవ సమాజం మాత్రమే కాదు క్రైస్తవ మతం కూడా వెలివేసింది మొదటి రోజుల్లో. అంటే ఏమన్నట్లు?! మానవ సహజమైన మానమద ప్రహరణములకు ఆయన గురి అయినాడు. పుటం పెట్టిన తర్వాత మరింత కాంతి లభిస్తుంది పసిడికి. ఆయన కవిత్వం చొక్కమైంది.

''మధురరసమును గడుపునమాటుకొన్న
ద్రాక్షఫలగుచ్ఛముల యిందముల తూగు
వరకవీంద్రుని కావ్య ప్రపంచమందు
బ్రతిపదంబున మదికి దర్శనమొసంగు''

అన్న ఆయిం మాట జాషువా కవిత్వానికి చక్కగా వర్తిస్తుంది. కవులలో ఆయన ఉచ్చైఃశ్రవం ''సీతారాముల పెండ్లి పేరటములున్ శ్రీ కృష్ణరాధారతుల్ త్రేతాద్వాపర యుజ్ఞకర్తలు వినాలేవా కథా వస్తువుల్'' అనడం సంప్రదాయి నిరసనంతో కాదు, క్రొత్త లోకాలు సందర్శింప జేయడానికి. ''భయకంపితమై హింసా పీడితమై ఉన్న ప్రజానీకానికి కవి వాక్కు ఆశా కిరణాన్నందించాలి. మిట్టపల్లాల్ని సమంచేసి చూపాలి. హింసిత ప్రజల మూక బాష్పాలకు నోరిచ్చి రచ్చకెక్కించాలి'' అనేది జాషువా ఆదర్శం. ఈ శతాబ్ది తెలుగు కవిగా తరతరాల గుర్తుంచుకోవాల్సిన జాషువా జాషువా పనితనం వంటి విలువగల కవిత్వం వ్రాశారు. ఆయన్ను కన్న ధన్యులైన తల్లిదండ్రులు లింగమాంబ, వీరయ్యగారలు. జననం **1895**. స్వర్గతి **1971**. జన్మస్థలం వినుకొండ, పరమపదం గుంటూరు. నవయుగ చక్రవర్తి, కవికోకిల ఆయన బిరుదులు.

★★★★



# స్వామి జ్ఞానానంద

పరమాణు విజ్ఞాన రహస్యాలు వెలికితీయడానికి పరమహంస పరివ్రాజకాచార్య కత్వానికీ ఎక్కడైనా పొత్తు వుందా? ఆది శంకర భగత్పాదుల వారికీ ఆల్బర్ట్ ఐన్ స్టీన్‌కూ సమన్వయ యోగమా, అద్వైత సిద్ధీ సాధ్యమా? అంటే స్వామీ జ్ఞానానంద పరమాద్భుత జీవిత చరిత్రను తెలుసుకోవాలి. 'కొన్ని వందల సంవత్సరాలకు కాని భారతదేశ ఆధ్యాత్మిక పథయాత్రలో స్వామీ జ్ఞానానంద వంటి మహోన్నత వ్యక్తిత్వం అవతరించదేమో! ఇదివరలో అవతరించలేదేమో! జ్ఞాన విజ్ఞాన యోగాలను సమన్వయించిన పరమోన్నత తాత్త్వికాచార్యులు జ్ఞానానంద. ఆధునిక విజ్ఞాన శాస్త్రంలో ఉన్నత శిఖరాలందుకొన్న, పరమాణు భౌతిక శాస్త్రవేత్త. దేశదేశాల గుర్తింపు పొందిన మహా విజ్ఞాని. ఇరవై యేళ్ళ వయసున ఇంటినుంచి వెళ్ళిపోయి హిమాలయాల్లో అవధూతగా అత్యద్భుతమైన తపస్సుచేసి ఆత్మ సాక్షాత్కారం పొందిన పరమావధి మూర్తిమంతం స్వామి వారిది.

లోకంలో అన్నిటికన్నా ఆశ్చర్యకరమైన విషయం స్వామివారి జీవితంలో సంభవించింది. లోకయాత్రలో విద్యార్జనా, వృత్తీ ఉద్యోగమూ, కీర్తి ప్రతిష్టలు, కుటుంబ జీవనం, మొదలైనవన్నీ మొదటి మూడు ఆశ్రమాలుగా ఉన్నాయి. తరువాతదే తురీయాశ్రమం, వానప్రస్థం. సాంఘిక జీవనం మొదటిమెట్టు. తరవాతదే సన్యాసం సాధారణంగా. కాని స్వామివారి జీవితం వానప్రస్థంతో మొదలైంది. అటు తర్వాత వారు జర్మనీ, ఇంగ్లండ్, అమెరికా దేశాలలో పరమాణు భౌతిక విజ్ఞాన శాస్త్ర గవేషణలలో పరమాచార్యుడిగా కీర్తితులైనారు. ముందు ఆధ్యాత్మిక దివ్యశిఖరాధిరోహించి ఇల్లు విడిచి తపోభూములకు వెళ్ళేటప్పుడు కళాశాలలో కూడా ప్రవేశించిని స్వామివారు ముప్పై సంవత్సరాల వయస్సున జర్మనీలో భౌతిక శాస్త్ర విజ్ఞానం చదవడం ప్రారంభించి డి.ఎస్‌సి.పి.హెచ్.డి. అంతర్జాతీయ భౌతిక విజ్ఞాన సంస్థ ఇంగ్లండ్ సభ్యత్వం, అమెరికాలోని అత్యున్నత విజ్ఞాన శాస్త్ర వేతృత్వ పురస్కారం పొందారు.

పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం దగ్గరగా వున్న గొరగనమూడి స్వామివారి జన్మస్థలం.

1896వ సంవత్సరంలో సీతయ్యమ్మ, శ్రీరామరాజు అనే పుణ్యదంపతులకు భూపతిరాజు లక్ష్మీ నరసింహ రాజుగా స్వామివారు జన్మించారు. బాల్యంలోనే వివాహం జరిగినా గృహస్థాశ్రమాన్ని పరిత్యజించారు స్వామి. 1917లో హిమాలయాలకు వెళ్ళి 1927 వరకు తీవ్రమైన తపశ్చర్యకు పూనుకొన్నారు. అవధూతగా హిమాలయ శిఖర సానువులలో ఇరవై వేల అడుగుల ఎత్తున తపస్సుచేసి ఆత్మ సాక్షాత్కారం పొందారు.

అటు తర్వాత పూర్తిగా ఉన్నిబట్టలు ధరించి దర్జా అయిన ఫుల్‌సూటులో జర్మనీ వెళ్ళి ఫిజిక్సు చదివి డి.ఎస్ సి పొందారు. 1940 వరకు జర్మనీలోను, జెకోస్లొవేకియాలోనూ ఉన్నారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం పరిస్థితుల వల్ల 'స్వామి' ఇంగ్లండ్ చేరుకున్నారు. న్యూట్రాన్‌ను కనిపెట్టిన సర్ జేమ్స్ చాడ్విక్‌తో కలసి పరమాణు భౌతిక విజ్ఞాన పరిశోధనలు చేశారు స్వామివారు. 1944 వరకు వారు ఇంగ్లండులో ఉన్నారు. స్వామి జ్ఞానానంద ఉత్తమ దేశభక్తులు. జర్మనీలో ఉండగా ఒకసారి వీరిని సుభాష్ చంద్రబోస్ విందుకు ఆహ్వానించి ఎంతో గౌరవించారు. ఆనాటి మోడరన్ రెవ్యూ పత్రికలో ఈ వృత్తాంతం ప్రకటితం. ఇంగ్లండ్‌లో ఉండటం ఇష్టం లేక 1945లో స్వామి అమెరికాకు వెళ్ళారు. అక్కడ 1947 వరకు ఉన్నారు. 1947లో స్వతంత్ర భారత దేశానికి వచ్చారు. భారత ప్రభుత్వం ఏర్పాటు చేసిన పరమాణు భౌతిక విజ్ఞాన పరిశోధన సంస్థలో శాస్త్రవేత్తగా ఉద్యోగం చేపట్టారు.

భక్తి జ్ఞాన కర్మ రాజహఠ ఇత్యాది యోగ విజ్ఞానాన్నంతా సమన్వయించి స్వామి జ్ఞానానంద 'పూర్ణయోగ' సూత్రాలు రచించారు. పరమాణు భౌతిక విజ్ఞాన పరిశోధనకు సంబంధించి ఎందరో పరిశోధన విద్యార్థులకు ఆచార్యత్వం వహించారు. వంద పరిశోధన పత్రాలు ప్రకటించారు. పరమాణు భౌతిక విజ్ఞాన పాఠ్యగ్రంథాలు స్వామివారు రచించినవి పరమ ప్రామాణికంగా విశ్వవిద్యాలయ అణు విజ్ఞాన శాస్త్ర అధ్యాపకులు అధ్యయనం చేస్తారు. అపూర్వము, అద్భుతము, అత్యంత మహిమోపేతము స్వామి జ్ఞానానంద జీవిత చరిత్ర. ఆయన గౌతమ, కణాద, బ్రహ్మ గుప్తుల వంటి శాస్త్రవేత్త. ఆధునిక భారత దేశ దార్శనికులలో, ఆధ్యాత్మిక పరమాచార్య వర్యులలో, విజ్ఞాన శాస్త్రవేత్తలలో పరమ విశిష్ట వ్యక్తిత్వ పూర్ణులైన మహాయోగి. 1969 స్వామివారి శ్రీకైవల్యము. గొరగనమూడిలో స్వామి జ్ఞానానందుల దివ్యసమాధి తెలుగువారి పుణ్యక్షేత్రం.

★★★★

# స్వామి ప్రణవానంద



భారతీయులకు యుగయుగాలుగా పరమ పవిత్రమైనది హిమవన్నగం. అక్కడి మానస సరోవరం, కైలాసగిరి శిఖరి అత్యంత పూజ్యస్థానాలు. తలచినంతనే ఒళ్ళు పులకరింపచేస్తాయి. కైలాసగిరి చుట్టుకొలత 32 మైళ్ళు. మానస సరోవరం చుట్టుకొలత 54 మైళ్ళు. శ్రీ శ్రీ శ్రీ ప్రణవానందస్వామి తెలుగువారిగా పుట్టారు.

శ్రీ ప్రణవానందస్వామి మహరాజ్ ఈ కైలాసగిరికి, మానస సరోవరాలకూ కలిపి 33 సార్లుప్రదక్షిణలు చేశారు ఇన్నిసార్లు కైలాసాచలానికి ప్రదక్షిణం చేయటం అత్యద్భుతం, అపూర్వం. చలికాలం వచ్చేసరికి నీటికన్నా గాలి ఎక్కువ చలిగా ఉంటుంది ఆ హిమాలయ శిఖరాలలో నీరు గడ్డకట్టుకొని పోతుంది. నీళ్ళు గడ్డకట్టటానికన్నా 52.5 డిగ్రీల తక్కువ శైత్య దుర్భరస్థాయి వాతావరణం అది. ఆ వాతావరణంలో కైలాస మానస సరోవర ప్రాంతంలోనే దృఢదీక్షతో 25 చాతుర్మాస్యాలు నిర్వహించారు శ్రీ ప్రణవానందస్వామి. శ్రీవారు కైలాస మానస సరోవర యాత్ర 1926లో మొదటిసారి నిర్వహించారు.

1921వ సంవత్సరంలో శ్రీ ప్రణవానందస్వామి పరమహంస పరివ్రాజకాచార్య, విశ్వవిఖ్యాత పరమాణు భౌతికవిజ్ఞాన శాస్త్రవేత్త జ్ఞానానంద పరిచయ భాగ్యం పొందారు. 1926వ సంవత్సరంలో శ్రీ జ్ఞానానంద సద్గురుపాదుల వద్దనే శ్రీ ప్రణవానంద సన్యాసాశ్రమ స్వీకారం చేశారు.

శ్రీ స్వామి ప్రణవానంద సన్యాసాశ్రమ స్వీకారం చేయుటానికి ముందు జాతీయోద్యమంలో పాల్గొన్నారు. భారతమాత పారతంత్ర్య విదళనంకోసం నడుంకట్టి ముందుకురికారు. 'బానిసల సంకెళ్ళు బిగిసే పాదుకాలం' అయింపచేయుటానికి తెల్లదొరల నిర్వాహకత్వంలో వున్న విద్యాలయాలు పనికిరావని నిశ్చయించుకున్నారు. జాతీయ విద్య, జాతీయాభిమానం, జాతీయోత్తేజం జాతికి విముక్తి మార్గాలని దృఢంగా సంకల్పించారు. తెలుగుదేశపు స్వాతంత్రోద్యమ తొలితరం విప్లవస్ఫూర్తిని పండించిన ముదిగంటి జగ్గన్న శాస్త్రి మహాభాగులతో పూర్వాశ్రమ సుగృహీత నామధేయులైన కనకదండి వెంకట

సోమయాజులు (స్వామి ప్రణవానంద 1926 నుంచి) 1918వ సంవత్సరంలో కళాశాలలో చదవడానికి పయనమైనారు లాలాలజపతిరాయ్ మూర్తిమంతంతో వెలిసిన దివ్యోజ్జ్వల జాతీయ విద్యాసంస్థ అది అ డి.ఏ.వి. కళాశాలలో చదివి స్వామి ప్రణవానంద 1919లో పట్టభద్రులైనారు.

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది కదా! సమధిక చైతన్య యౌవనోత్సాహపు వేళనే భవిష్య మాహాత్మ్యంబయట పడుతుంది మహాత్ములలో. 1918వ సంవత్సర ప్రాంతాల స్వామివారు లాహోర్‌లో చదువుకుంటున్న రోజులలోనే ఘర్వాల్ జిల్లాలో గొప్పకరువు వచ్చింది. చెలరేగి ప్రజల ప్రాణాలు బలిగొన్నదాకాటకం. భారతదేశానికి మొదటిసారి 'ఇన్‌ఫ్లూయెంజా' మహమ్మారి దిగుమతియైంది అప్పుడే.

లక్షలాది ప్రజలు హాహాకారాలతో చనిపోయారు. లాహోర్ కళాశాల యాజమాన్యం కళాశాల విద్యార్థులనుంచి ఒకసేవాదళం నిర్మించి చిచ్చుతో మలమలలాడే నిస్సహాయులకు, సాంక్రామిక తీవ్రమహమ్మారికి గురియై విలవిలలాడే దీనులకు, ఆకలిని ఆదుకొని వైద్యసాహాయ్యం చేసే నిమిత్తం పంపింది. శ్రీ స్వామి ఆ సేవాదళంలో ప్రముఖులు, ఘర్వాల్ జిల్లా అంతటా సంచరించి ప్రజల నాదుకొన్నారు. ధన ధాన్యాదులను ప్రజలకు ఉచితంగా అందజేస్తూ అట్లా ఉచితంగా పొందటానికి ఇష్టం లేనివాళ్ళకు రూపాయికి నాలుగుసేర్లు ధాన్యం చొప్పున అమ్మామని శ్రీ స్వామి ఈ రచయితకు చెప్పారు.

1915వ సంవత్సరం నుంచే శ్రీ స్వామి జాతీయోద్యమంతో గాఢమైన సంబంధం పెట్టుకొన్నారు. 1919 జలియన్ వాలాబాగ్ దురంతాల ప్రత్యక్ష బాధితులు వారు. 1919రౌలత్ చట్టం కఠిన నిర్బంధాలు ఆ కాని దేశంలో వీరు అనుభవించారు. 'మార్షల్‌లా'ను క్రూరంగా అమలుచేస్తూ తెల్ల సైనికులు రాత్రి 9.30 గంటలకు లాహోర్‌గేటు దగ్గర ప్రజల గుంపులపై కాల్పులు జరిపారు. ఆ గుంపులో ఉన్న శ్రీ స్వామివారికి రొమ్ము కుడివైపున చిచ్చుకత్తి గుచ్చుకొని గాయాలు తగిలాయి. లాహోర్ కళాశాల విద్యార్థులు రోజుకు నాలుగు సార్లు మార్షల్ లా అధికారులకు తమ హాజరీ విన్నవించుకోవాల్సి వచ్చింది.

1920లో వారు తెలుగుదేశంలో స్వస్థలానికి వచ్చారు. 1926 దాకా సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. ఆంధ్రదేశంలో తణుకులో 'జాతీయోన్నత పాఠశాల' నిర్వహించారు 1923లో కాకినాడలో జరిగిన భారత జాతీయ కాంగ్రెసుకు సేవాదళ నాయకులు శ్రీస్వామి. మొదటిసారి కైలాస మానస సరోవరయాత్ర ముగించుకొని 1928లో లాహోర్ వచ్చారు. సరిగ్గా ఆ సమయంలోనే భగత్సింగు డి.ఏ.వి. కళాశాల ఆవరణం నుంచి సాండర్సు అనే పోలీసు ఉన్నతాధికారిని తుపాకీ పేల్చి మట్టుపెట్టడం జరిగింది. ప్రభుత్వం కళాశాలనంతా నిఘాలో వుంచింది. శ్రీ స్వామివారికి పోలీసు నిఘా ఎక్కువైంది.

శ్రీ స్వామి సన్యసించిన తరువాత కూడా జాతీయ చైతన్య కృషి మానలేదు. అల్మోరా,

పిథోర్‌గఢ్ ప్రాంతాలలో గిరిజనులలో ఎంతో చైతన్యం కలిగించారు. హిమాలయ యాత్రికుల నిమిత్తం నాలుగు దశాబ్దులు ఒక సంచార వైద్యశాలను నిర్వహించారు.

శ్రీ స్వామివారికి టిబెట్ భాష బాగా వచ్చు. కైలాస మానస సరోవరం గురించి వారు ఇంగ్లీషులో వ్రాసిన గ్రంథమే ఇప్పుడు దేశవిదేశాలలో పరమ ప్రమాణ గ్రంథం. శ్రీ స్వామి వారు గావించిన హిమాలయ భౌగోళిక పురాతత్త్వ పరిశోధన నిరుపమానం. చైనావాళ్ళు, పాకిస్తానీలు భారత దేశంపట్ల గావించిన విద్రోహ చర్యలను కనిపెట్టివుంటూ **3500** పుటల రహస్య సమాచారం శ్రీ ప్రణవానందస్వామి భారత ప్రభుత్వానికి, ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానికి అందజేశారు. 'చెక్ పోస్టులను' ఏర్పాటు చేయించింది మన స్వాములవారే.

**18** సంవత్సరముల నుంచి భారతదేశంలోని శ్రీచక్ర సంప్రదాయం గురించి పరిశోధనలు చేసి నూర్లపుటల గ్రంథం తయారుచేశారు. మంచుమనిషి రహస్యం అద్భుతాన్ని ఛేదించారు. ఆ హిమవత్పర్వతపు ఎలుగుగొడ్డు గూర్చి, కస్తూరిని గూర్చి గొప్ప కృషి చేశారు ఫలితాలు పుస్తకంగా అందించారు. హిమాలయాలలో సట్లెజ్ (శతద్రు), బ్రహ్మపుత్ర, సింధు, కర్నాలీ (సరయు), గంగల ఉత్పత్తి స్థానాలకు వెళ్ళి చూసి నిర్ణయించారు మానస సరోవరం లోతు ఆధునిక సాధన సంపత్తితో, శాస్త్ర విజ్ఞానంతో కొలిచి చెప్పారు శ్రీ స్వామి జన్మించిన పవిత్ర స్థలం తూర్పుగోదావరి జిల్లా ఏనుగుల మహలు, వీరిని కన్న పుణ్యాత్ములు సీతమ్మ, విశ్వపతి శాస్త్రిగారలు. శ్రీ ప్రణవానందస్వామి జననం **1896** జనవరి **14** శ్రీ ప్రణవానంద స్వామి భగవద్గీతకు 'జ్ఞాన దీపిక' పేరుతో సరళసుందర విశేష తాత్పర్య సహిత వ్యాఖ్యను కూర్చారు. **90** సంవత్సరముల వయస్సున ఇప్పటికీ నిరంతరోత్సాహ కర్మయోగి శ్రీ స్వామి



# సురవరం ప్రతాపరెడ్డి



ప్రతి కాలంలోను, ప్రతి దేశంలోను, ప్రతి జాతిలోను, ఆ జాతిని సన్మార్గంలో నడిపించటానికి కొందరు పెద్దమనుషులు అవసరం. వారి నడవడిని బట్టి, జాతికి వారు మప్పే ఆదర్శాలను బట్టి ఆ జాతి మనుగడ అభ్యుదయమూ కొనసాగుతాయి.

కవి, పండితుడు, ప్రతిభావంతుడైన విమర్శక రచయిత శ్రీ సురవరం ప్రతాపరెడ్డి తెలుగువారిని స్వస్థాన వేషభాషాభిమాన మాననీయులుగా చేయడానికి ప్రతాపరెడ్డి గారు ఎంతో కృషిచేశారు. ముఖ్యంగా తెలంగాణంలోని తెలుగు జిల్లాలలో అన్ని ప్రజాహిత కార్యక్రమాలలోను ఆయన తెలుగువారిని ప్రబోధించారు. మొట్టమొదటి సారిగా తెలంగాణాలో జరిగిన ఆంధ్ర మహాసభలకు ప్రతాపరెడ్డిగారే అధ్యక్షత వహించారు.

ఆంధ్రుల సాంఘిక చరిత్రం వంటి గొప్ప పరిశోధన గ్రంథం వ్రాసి ప్రతాపరెడ్డిగారు జాతి కృతజ్ఞతకు పాత్రులైనారు. సాహిత్యాధారాల నుంచి సాంఘిక చరిత్రను పునర్నిర్మించటమనే ప్రక్రియకు తెలుగువారిలో ప్రతాపరెడ్డి గారే ఆద్యులు, మార్గదర్శకులూనూ. రామాయణ రహస్యములు, హిందువుల పండుగలు వంటి ప్రశస్తమైన గ్రంథాలు వ్రాసి భారతీయ సామాజిక జీవనంలోని ఉత్కృష్టతను ప్రతాపరెడ్డిగారు ఆవిష్కరించారు. గోలుకొండ పత్రికకు సంపాదకత్వం వహించి తెలుగు ప్రజల మానసిక వికాసానికై వారు సల్పిన కృషి లోకవిదితం.

ఆనాటి నిజాం రాష్ట్రంలో ప్రజల హక్కులకు ఏ మాత్రము గుర్తింపు ఉండేది కాదు. ప్రజలు చైతన్య వంతులౌతారేమో నన్న భయంతో సభలన్నా, సమావేశాలన్నా ప్రభుత్వం ఎన్నో ఆంక్షలు విధించేది. ప్రజలను అజ్ఞానంలో, తమ అధికారపు గుప్పిటలో ఉంచుకోవటమే ఆనాటి అధికారుల ధ్యేయంగా ఉండేది. అటువంటి పరిస్థితులలో కూడా ప్రతాపరెడ్డి గారు ప్రభుత్వానికి అప్రియం కలిగించేవైనా యథార్థాలను పత్రిక ద్వారా ప్రజలకు

తెలియజేసే వారు. ప్రజల ప్రాథమిక హక్కులను గూర్చివారు ఒక పుస్తకం కూడా ప్రచురించారు.

యువజనుల విజ్ఞాన వికాసాల కోసం ప్రతాపరెడ్డి గారు కనుకలిగి ఉండేవారు. యువజన విజ్ఞానం అనే గ్రంథం వారు ప్రకటించారు. ఇది చాలా విలువైన గ్రంథం. కథలు, నవలలు, నాటకాలు కూడా రచించారు సురవరం వారు.

జననం 1896 జన్మస్థానం అలంపురం తాలూకాలోని ఇటికాలపాడు. తల్లిదండ్రులు రంగమ్మ. నారాయణ రెడ్డి. స్వర్గతి 1953.

★★★★

# కల్లూరి సుబ్బారావు



ఈ శతాబ్ది తొలిదశకాలు భారతదేశ సామాజిక పునరుజ్జీవన వికాసానికి దోహదకారులైనాయి. అన్ని ప్రాంతాలలోను గొప్ప వ్యక్తిత్వం గల మహాపురుషులు తమ సేవలందించారు. ఘర్షణలో చైతన్యం సముజ్జ్వలించినట్లు పారతంత్ర్యం ఆత్మశక్తిని ఉద్దీపింపచేసింది.

స్వాతంత్ర్యోద్యమ రథసారథులైన అగ్రతరం నాయకులలో తెలుగునాడు నుంచి ఎన్నవలసిన వారిలో కల్లూరి సుబ్బారావు ఒకరు. ఆయునది సమగ్రమైన వ్యక్తిత్వం. రాయలసీమ ప్రాంతంలో జాతీయోద్యమ స్ఫూర్తిని కలిగించి సుసంఘటితమైన ప్రజాఉద్యమాలకు, నిర్మాణ కార్యక్రమానికి రూపకల్పన చేసినవాడాయన.

ఆయిన రాయలసీమలోని అనంతపురం జిల్లాలోని కల్లూరనే చిన్నపల్లెలో జన్మించినా తనదైన శీల సంపద వల్ల దేశభక్తి వల్ల కార్యదీక్ష వల్ల, జాతీయ కార్యక్రమ కృషి వల్ల భారత రాజ్యాంగ నిర్ణయి సభాసభ్యుదు కాగలిగారు. ఆయనకు సాహిత్యమన్నా, సంగీతమన్నా, లలితకళలన్నా ఎంతో ప్రీతి.

పదిహేను పదహారేళ్ళ వయసుననే సుబ్బారావు అనిబిసెంట్, తిలక్ మహరాజులు సాగిస్తున్న రాజకీయ ఉద్యమాల పట్ల, ప్రబోధాల పట్లఆకర్షితులైనారు. తరువాత పూర్తిగా మహాత్మాగాంధీ వల్ల ప్రభావితులైనారు. ఆయన బాల్య విద్యాభ్యాసం కల్లూరులోను, హిందూపురంలోను, అటు తరవాత ఉన్నత పాఠశాల విద్యాభ్యాసం మదనపల్లె, బెంగుళూరులోను జరిగాయి. 1917వ సంవత్సరంలో అంటే ఇరవై ఏళ్ళ వయసున విజాతీయుల పరిపాలనలో విద్యాలయాల విద్యకు స్వస్తిచెప్పి జాతీయోద్యమానికి పూర్తిగా తనను తాను అర్పించుకున్నారు. 1921 సహాయ నిరాకరణోద్యమంలో, 1930 ఉప్పు సత్యాగ్రహంలో, 1941 వ్యక్తి సత్యాగ్రహంలో, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని ఆయన జైలుకు వెళ్ళారు. ప్రథమంగా రాయలసీమ జిల్లాల నుంచి పర ప్రభుత్వం

నిర్బంధ విధానానికి గురి అయిన ప్రముఖ వ్యక్తి ఆయనే.

అస్పృశ్యత నిర్మూలన విషయంలో సుబ్బారావు గారు చేసిన సేవ చిరస్మరణీయమైనది. ఆంధ్రదేశంలో నెలకొన్న హరిజన సేవక సమాజంలో ఆయన ప్రముఖపాత్ర నిర్వహించారు. దానికాయన కొంతకాలం అధ్యక్షులుగా కూడా ఉన్నారు. హరిజనుల కాయన పాఠశాలలు వసతి విద్యాగృహాలు నిర్వహించారు. గ్రామీణ పునర్నిర్మాణ కృషిలో హిందూపురంలో సేవామందిరాన్ని స్థాపించి ఆయన కృషిచేశారు. సంఘ సంస్కార దృక్పథం సాంఘిక పునర్నిర్మాణ ఉదారాశయాలు కలవాడాయన. గాంధీజీ అభిమానించిన అభిలషించిన జాతీయ విద్యా కార్యక్రమం పట్ల సుబ్బారావు చాల ఉత్సుకత చూపి ప్రచారం చేశారు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విషయంలో కూడా ఆయన నిర్మాణాత్మకమైన పాత్రను నిర్వర్తించి సర్కారు జిల్లాల పెద్దలకు రాయలసీమ పెద్దలకు మధ్య దృఢానుబంధం కోసం కృషిచేశారు. రెండు సంవత్సరాలు పాటు 1921వ సం. నుంచి ఆయన లోకమాన్య అనే పత్రిక నడిపారు. సుబ్బారావుగారు గొప్ప వక్త, తెలుగుతో పాటు కన్నడంలో కూడా ఆయన ప్రజ్ఞాశాలి. హిందూపురానికి దగ్గరగా ఉన్న శిల్ప కళాసౌంధర్య విరాజితమైన ప్రాచీనక్షేత్రం లేపాక్షిని పునరుద్ధరించటానికి ఆయన సలిపిన కృషి ప్రశంసనీయం. అక్కడి శిల్పాలను చిత్రాలను ఆయిన పునర్నవీకరింప చేశారు.

భారతదేశం తన స్వీయ వ్యక్తిత్వాన్ని కోల్పోకుండా పారిశ్రామికంగా సాంకేతిక విద్యా విజ్ఞాన పథీనంగా, పాశ్చాత్య ప్రగతిని అందుకోవాలని ఆయన ఆశయం.సాహిత్య పరులకు కళాకారులకు ఆయిన ప్రోత్సాహ సహకారాలందించేవారు. సుబ్బారావు గారి తల్లిదండ్రులు పుట్టమ్మ, సూరప్పగారలు. సూరప్పగారు కల్లూరు కరణం. సుబ్బారావు జననం 1897. పరమపదం 1973.



# దామెర్లరామారావు



''బ్రిటిష్ ఎంపైర్ ఎగ్జిబిషన్'' అనే పేరున 1923వ సంవత్సర ప్రాంతంలో ఇంగ్లండులోని వెంబ్లా నగరంలో ఒక గొప్ప చిత్రకళాప్రదర్శనం జరిగింది. ఈ ప్రదర్శన కోసం భారతదేశం నుంచి మొత్తం 8 చిత్రాలు ఎన్నుకోబడి వాటిని పంపించటం జరిగింది. ఈ ఎనిమిది చిత్రాలతో రాజమండ్రి నుంచి దామెర్ల రామారావు చిత్రాలు మూడున్నాయి.

ఆధునికకాలపు భారతదేశ గణితశాస్త్రవేత్తలలో శ్రీనివాస రామానుజం ఎంత మహా ప్రతిభావంతుడో, చిత్రకకారులలో దామెర్లరామారావు అంతటివాడు. ఇద్దరూ చిరుత వయస్సులోనే స్వర్గతులైనారు. అత్యంత విషాదకరం, దామెర్లరామారావు 27 ఏళ్ళ పిన్నవ యసున కానరాని లోకాలకు కదలిపోవటం.

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో రామారావు చిత్రాలున్నాయి. అస్వాల్డ్‌జెన్నింగ్ కూల్డ్రే దొర రామారావు చిత్రించిన 'కృష్ణలీల' అనే చిత్రం భద్రపరచుకొన్నాడు.

1921వ సంవత్సరం కలకత్తాలో రామారావు చిత్రకళా ప్రదర్శనం జరిగింది. ఆయన ''ఋష్యశృంగుని పరాధీనాగమనం'' అన్నచిత్రం బహు ప్రశంసలు పొందింది. ''పాపికొండల మధ్య గోదావరి'' అనే రామారావు చిత్రాన్ని ఆనాటి గవర్నర్ జెనరల్ లార్డ్‌రీడింగ్ మెచ్చుకున్నాడు.

రామారావు గుజరాత్‌లోని భావనగర్‌లో ఒకసారి 6 నెలలున్నాడు. తన చిత్ర కళా ప్రదర్శనలు నిర్వహిస్తూ: విశ్వకవి రవీంద్రనాథుడు ఏదో పనిమీద అక్కడకు వచ్చారు. రామారావుని ఆయినకు పరిచయం చేశారు. పదినిమిషాల వ్యవధిలో రామారావు రవీంద్ర కవీంద్రుని ఉరః చిత్రం(బస్ట్) గీసి అయన మెప్పుపొంది ఆశీర్వచనం పొందాడు.

ఆరోజుల్లో అంటే ఈ శతాబ్ది మొదటి పాదంలో రాజమహేంద్రవర ప్రభుత్వ కళాశాలకు అస్వాల్డ్‌జెన్నింగ్‌కూల్డ్రే ప్రిన్సిపాల్‌గా ఉండేవారు. ఆయనది గొప్ప కళాత్మక హృదయం. ప్రాచ్యదేశ సంస్కృతి అన్నా, కళలన్నా పరవశించి అంజలి ఘటించేవాడు కూల్డ్రేదొర. కూల్డ్రే ప్రోత్సాహంవల్ల రామారావు తండ్రిగారు రామారావును బొంబాయిలోని సుప్రసిద్ధ

చిత్రకళాశాలలకు పంపించారు. జె.జె.స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అనే ఆ కళాశాలలో రామారావుని మొదటి రెండు సంవత్సరాల తరగతి ఆయన చదవనక్కరలేదని నేరుగా 3వ సంవత్సరంలో చేర్చుకున్నారు. అత్యద్భుతమైన మేధావిత చూపి ఆయన అక్కడ శిక్షణపూర్తి చేసుకున్నాడు. కొన్నాళ్ళు బొంబాయిలో అధ్యాపకత్వం కూడా చేపట్టాడు. తూలికారచనలో అనితర సాధారణ ప్రతిభావంతుడు రామారావు.

ప్రాచ్య పాశ్చాత్య చిత్ర, శిల్ప, తూలికాసంరచన శైలులన్నింటినీ ఆకళింపు చేసుకొని పరమాద్భుతంగా అధ్యయనం చేసి, సొంతదైన, ఒక చిత్రకళా శైలిని ఆయన రూపొందించాడు. ఆయన సృజనాత్మక ప్రతిభ నిరుపమానం. రామారావు సృష్టించిన ఈ చిత్రకళాశైలికి ఆయన ఆంధ్ర చిత్రకళా సంప్రదాయం అని నామకరణం చేసి రాజ మహేంద్రవరంలో చిత్రకళాభ్యాసన కళాశాలను స్థాపించి ఈ నూత్న శైలిని పరిపుష్టంచేసే చిత్రాలు రచిస్తూ 1925లో ఫిబ్రవరి 6వతేది హఠాన్మరణం పాలైనారు. భారతీయ ఆధునిక చిత్రకళ కది ఆశనిపాతం. భారతదేశంలోని చిత్రకళావేత్తలు, ప్రముఖ చిత్రకారులు అంతా ఆయన మృతికి సంతాపించారు. పత్రికలన్నీ విషాద నివాళులు ఘటించాయి, ఆయనపేరును తరతరాల స్మృతీకరించడానికి రామారావు పేరిట చిత్రకళాశాల రాజమండ్రిలో స్థాపితమైంది.

1897 మార్చి 8న రామారావు రాజమండ్రిలో జన్మించాడు. ఆయన తండ్రి వెంకటరమణారావు ప్రముఖవైద్యులు. పువ్వుపూర్తిగా వికసించి తన పరిమళాలు విరజిమ్మకుండానే అరవిరి మొగ్గగానే రాలిపోయిన స్థితి దామెర్లరావుని తలచుకోగానే అనిపిస్తుంది.





# కేశిరాజు సత్యనారాయణ

కొంతమంది మహనీయులు అతి సాధారణంగా, ప్రశాంతంగా, పవిత్రంగా జీవితాన్ని గడుపుకుంటారు. వాళ్ళు సంఘానికి ఆభరణాలు, సృష్టికి అందాలు. ఏ గుర్తింపులకోసం, మెప్పులకోసం వాళ్ళు ఆరాటపడరు. జ్ఞానతృష్ణను తీర్చుకోవడమే వాళ్ళ జీవితధ్యేయం.

ముప్పైనాలుగు సంవత్సరాలు కళాశాలాధ్యాపకులుగా అత్యంత ప్రతిభావంతంగా గణితశాస్త్రాన్ని బోధించారు శ్రీ కేశిరాజు సత్యనారాయణ. తమ అధ్యాపకవృత్తి ఎక్కువకాలం వారు రాజమహేంద్రవరంలోనే నిర్వహించారు. పట్టభద్రస్థాయి విద్యార్థులకు, అధ్యాపక శిక్షణ విద్యార్థులకు వారు గణితం బోధించేవారు, ఆయన గొప్ప గణితశాస్త్ర మేధావి. ప్రపంచంలో ఇది వరలో సాధించని గణిత సమస్యలకు శ్రీ సత్యనారానణ సులభమైన పరిష్కార సమాధానాలు కనిపెట్టారు. గణిత విజ్ఞాన పరిశోధనలో అవి చాలా అమూల్యమైనవి. విదేశాలు ఆయన గణిత మేధావితను కొనియాడాయి. అంతర్జాతీయ మేధావివర్గ గణిత విజ్ఞాన ప్రసార పత్రికలలో శ్రీ సత్యనారాయణగారి గణిత సాధనలు ప్రచురితమైనాయి. క్షేత్రమితికి, జ్యామితికి సంబంధించిన అనేక నూత్న విషయ పరిష్కరణలు శ్రీ సత్యనారాయణ ప్రకటించి ప్రపంచ గణిత మేధావుల మెప్పును పొందారు. భారతీయ గణిత మేధావుల మెప్పును పొందారు. భారతీయ గణిత విజ్ఞాన సంఘం యావజ్జీవిత సభ్యులు శ్రీ సత్యనారాయణ. కెనడాలోని గణిత విజ్ఞాన విశిష్టాధ్యయన సంస్థ 'క్రక్స్ మేథమేటి కోరమ్'లో శ్రీ సత్యనారాయణ సభ్యులు. భారతీయ గణితశాస్త్ర విజ్ఞాన పత్రికలో ఎన్నో రచనలు ప్రకటించారు శ్రీ సత్యనారాయణ. కెనడాలోని గణిత విజ్ఞానసంస్థ పత్రికలో ఇదివరలో సాధించబడని అనేక సమస్యలకు సమాధానాలు ప్రచురించారు. అమెరికాలోని విశ్వ విద్యాలయాల గణిత శాస్త్రాచార్యులు శ్రీ సత్యనారాయణ ప్రతిభా సంపదను మెచ్చుకొని వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. 'అమెరికన్ మేథ మేటికల్ మంత్లీ'లో ఆయన గణిత సమస్య రచన ప్రచురణకు అంగీకృతమైంది. జటిలమైన సమస్యలకు సరళమైన పరిష్కరణ సాధనలు రూపొందించడం శ్రీ సత్యనారాయణగారి ప్రత్యేకత. గణిత విజ్ఞానానికి ముఖ్యంగా 'జామెట్రీ సమస్యలను' గూర్చి శ్రీ సత్యనారాయణ మూడు విశిష్ట పరిశోధన గ్రంథాలు ప్రచురించారు.

అవి దేశ విదేశాల గణితశాస్త్ర విజ్ఞానుల మెప్పుపొందాయి. వీరు కనుక్కొన్న పద్ధతులు విదేశాలలో బాగా గుర్తింపు పొందాయి. ప్రముఖంగా వాడుకలోకి వచ్చాయి. జర్మనీ, గ్రీస్, ఇంగ్లండ్, ఫ్రాన్స్, ఇండోనేషియా, సింగపూర్, అమెరికా, కెనడాల నుంచి గణితశాస్త్ర పరిశోధన మేధావులు, ఆచార్యులు వీరి మార్గదర్శనంకోసం , సంప్రదింపులకోసం కొన్ని సమస్యలను వీరికి పంపుతూ వుండేవారు. వీటిని సాధించి, వివరించి, సమాధానాలు పంపుతూ వుండేవారు శ్రీ సత్యనారాయణ. ఆంధ్రప్రదేశ్‌లోని పశ్చిమ గోదావరిజిల్లా, మలకపల్లిలో **1897**వ సం. అక్టోబర్ **6**వ తేదీన శ్రీ కేశిరాజు సత్యనారాయణ జన్మించారు. ప్రభుత్వ కళాశాల, రాజమహేంద్రవరము నుంచి ఇంటర్మీడియెట్‌లో గణ్యత సాధించి మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో గణిత శాస్త్రంలో బి.ఏ. ఆనర్సు ప్రథమతరగతి కృతార్థత్వం సాధించారు. **1920**వ సంవత్సరంలో మద్రాసు విశ్వ విదాలయంనుంచి గణితశాస్త్రంలో ప్రథమ తరగతిలో ఎమ్.ఏ.పట్టానిపొందారు. రాజమండ్రి బోధనాభ్యసన కళాశాలకు ప్రిన్సిపాలుగా శ్రీ సత్యనారాయణ పదవీవిరమణ చేశారు.

**88** సంవత్సరాల పండు వయసున **13-8-1985**న హైదరాబాదులో శ్రీ సత్యనారాయణ పరమపదించారు. కెనడా నుంచి వెలువడే ‘క్రక్స్ మేథమేటికోరమ్’ శ్రీ సత్యనారాయణగారి జీవిత విశేషాలను ఆయన మృతికి సంతాపం వెలిబుచ్చేవార్తతో ప్రచురించింది.

ఈ శతాబ్దివిజ్ఞాన శాస్త్రవేత్తలైన తెలుగు ప్రముఖులలో శ్రీ సత్యనారాయణ ఎన్నదగిన వారు. తల్లిదండ్రులు, రంగమ్మ, వేంకట సుబ్బారాయుడుగారలు.





# దేవులపల్లి కృష్ణశాస్త్రి

ఈ శతాబ్దిలో తెలుగు సాహిత్యంలో విలక్షణంగా విలసిల్లిన భావకవితోద్యమ, అనగానే ముందుగా గుర్తు వచ్చేది దేవులపల్లి వారే. భావ కవిత్వానికి ఆయన పేరు పర్యాయ పదమైపోయింది. కృష్ణపక్షం, ప్రవాసం, ఊర్వసి పేరులు వినని తెలుగు సాహితీ ప్రియులు ఈ శతాబ్దిపూర్వార్ధంలో ఎవరూ ఉండేవారుకారు.

శబ్దానాకి రంగు, రుచి, వాసన ఉంటాయిని కృష్ణశాస్త్రి ప్రగాఢమైన విశ్వాసం. కవిత చెప్పినా, పాట పాడినా, కాలక్షేప రచన చేసినా, నాటిక వ్రాసినా అందులో కృష్ణశాస్త్రి భావుకత పరమాహ్లాదకరంగా పరిమళిస్తూంది. అప్పుడే పుట్టి ఉంటే అని పురాసాహిత్య ప్రాభవభావన స్వప్న వీధుల్లో విహరిస్తూ అప్పుడు పుట్టి వుంటే 'అల్లసాని పెద్దన అంటారు నా పేరు' అని కృష్ణశాస్త్రి మాత్రమే చెప్పుకోగలడనిపిస్తుంది. బాల సాహిత్యంలో బంగారు పనితనం కనిపిస్తుంది కృష్ణశాస్త్రి రచనలో. సంగీతం వినిపిస్తుంది ఆయిన పదాల పోహళింపులో వెన్నెలలు విరుస్తాయి ఆయన భావనా వీధులలో రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిష్యరికం ఆయిన కవితలో మానవతకు, నిజాయితీకీ, హృదయవాదితకూ ముప్పేటల చంద్రహారంలా రాణించింది. ఆయన వచనంలోనూ, కవిత్వంలోనూ సంగీతం సాధించగలరు. లోకంలోని వేదనను కవితామయంగా వెలువరించిన కవి కృష్ణశాస్త్రి. 'శ్రావణములు మూడు చనేగాని చినుకేని, లేక నేలగుండెదాక బగిలే' అని వరపును వర్ణించటం ఆయన కొక్కడికే చెల్లింది.

కృష్ణశాస్త్రి తండ్రీ, పెత్తండ్రీ ఇద్దరూ మహాకవులు. దేవులపల్లి సోదరులుగా ప్రసిద్ధి చెందారు. పిఠాపురం మహారాజా ఆస్థానానికి అలంకారాలు వారు. తన కవితలోని శ్రవణసుభగత్వానికీ, జిగికీ తన తండ్రుల కవితా వారసత్వమే కారణమని కృష్ణశాస్త్రి చెప్పుకున్నారు. భావకవితోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులలో కృష్ణశాస్త్రి

భావగీతాలు భావుక మనోహరంగా ఆలపించేవారు. భావ కవితా ప్రాచుర్యానికి అదెంతగానో దోహదం చేసింది.

మల్లీశ్వరి సినిమారచనను కూడా ఆయన గొప్పకళాఖండం చేశారు. ఆకాశవాణిలో సాహిత్య ప్రయోక్తగా ఆయన ఉద్యోగించడం ఆధునిక తెలుగు సాహిత్యానికి కొత్త అందచందాలను చేకూర్చింది. శర్మిష్ఠ, వేణుకుంజం, అతిథిశాల, ఆండాళ్ళు, విద్యాపతి, వసంతోత్సవం లాంటి శ్రవ్యరూపకాలు ఆకాశవాణికి అలంకారాలైనాయి.

జననం 1897. పరమపదం 1981. జన్మస్థానం పిఠాపురం దగ్గర చంద్రంపాలెం. బ్రతుకులోనూ, కవిత్వంలోనూ అన్నిటా హృదయవాది కృష్ణశాస్త్రి.

★★★★★★

# అల్లూరి సీతారామరాజు



పురాణంలోని అభిమన్యుడు, చరిత్రలోని బాలచంద్రుడు తలపుకు వస్తారు అల్లూరి సీతరామరాజును గూర్చి అనుకుంటే. ధర్మంకోసం, న్యాయం కోసం స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం తన జీవితాన్ని బలిదానం గావించిన మహాసాహసి. విప్లవవీరుడు సీతారామరాజు రవి అస్తమించని సామ్రాజ్యమని దర్పించిన బ్రిటిషువారిని కూడా గడగడలాడించాడు. మన్నెంలో మానవ స్వాతంత్ర్య యజ్ఞకీలగా వెలుగొందాడు. కొండకోనల్లోని ప్రజలు ఆయనను తమ విముక్తిదాతగా కొలిచారు. పొట్టకూటి చదువుల మీద సీతారామరాజుకి చిన్ననాటి నుంచీ ఆసక్తి లేదు. విలువిద్య, గుర్రపుస్వారి, చక్కగా అభ్యసించాడు. వనమూలికా విద్యలో నిష్ణాతుడీయన. తన సన్నిధానంలో ప్రజలందరూ ఆయన పట్ల అనుచర భావాన్ని కలిగి ఉండేవాళ్ళు. అందువల్ల ఆనాటి ఆంగ్ల ప్రభుత్వం ఈయనను అనుమానించి గూఢచారులను ఎప్పుడూ ఈయన వెంట వుండేట్లు చేసింది.

శ్రీ రాజు విశాఖ జిల్లా కొండకోనల మధ్య నరసీపట్నం తాలూకా కృష్ణదేవి పేటలో శ్రీ రామమందిరం నిర్మించుకొని అక్కడ నివసిస్తూ ఉండేవారు. 1920 ప్రాంతాల సహాయ నిరాకరణోద్యమంలో న్యాయస్థానాలను ప్రజలు బహిష్కరించటం ముఖ్య అంశం కాబట్టి విశాఖజిల్లా గూడెం తాలూకా అంటాడ, రంప, పెదవలస గ్రామాల్లో పంచాయతీ న్యాయస్థానాలు నెలకొల్పాడు సీతారామరాజు. అందువల్ల ప్రభుత్వం కన్నెర్ర చేసి సీతారామ రాజును దేశద్రోహం క్రింద కారాగారంలో ఉంచింది. కాని సీతారామరాజుకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పేవాళ్ళు లేక పోవటంతో ఆయనను వదలి వేయక తప్పలేదు. అయితే ఆయన్ను పైడిపుట్ట అనే గ్రామం విడిచి పోగూడదని నిర్బంధాజ్ఞలు విధించింది ప్రభుత్వం. బ్రిటిషు ప్రభుత్వం సీతారామరాజును అనుమానించి నిర్బంధాలు కలిగించడంతో గూడెం ప్రజలు కోపోద్రిక్తులైనారు. ఆయన నాయకత్వంలో తిరుగుబాటుకు సిద్ధమైనారు.

అటవీశాఖ ప్రభుత్వోద్యోగులు, తాబేదారులు, అడవి సంపద దోచుకునే మురాదారులు గిరిజనులను, వనజనులను పెట్టేబాధలు సహించ లేకపోయినాడు సీతారామరాజు. గూడెం కొండల మధ్య గావాల పాళెం వాసులు గాము మల్లుదొర, గంటం దొరలు సీతారామరాజుకు అనుచరులైనారు. గూడెం తహసీలుదారు బాస్టియన్ వనవాసులను పెట్టే బాధలు మితిమీరడంతో ప్రభుత్వంపై తిరుగుబాటు చేశాడు సీతారామరాజు. 1922 ఆగస్టులో చింతపల్లి పోలీస్‌స్టేషన్‌పై దాడిచేశాడు సీతారామరాజు. అటు తరువాత కృష్ణదేవిపేట, రాజవొమ్మంగి, అడ్డతీగెల పోలీసు స్టేషనుల మీద దాడి జరిపి ఆయుధాలు స్వాధీనం చేసుకున్నాడు రాజు. ప్రభుత్వం అధిక సంఖ్యలో సైనిక దళాన్ని నియమించి సీతారామరాజును నిర్బంధించటానికి అహోరాత్రులు కృషిచేసింది. ఆయన్ను పట్టి ఇచ్చిన వారికి పదివేల రూపాయలు బహుమానం ప్రకటించింది. అస్సాము నుంచి మలబారు నుంచి వచ్చిన పటాలం సైనికులు ఇంగ్లీషు ఉద్యోగులు ఎంతగానో పరిశ్రమించిన మీదట కొయ్యూరు దగ్గర సీతారామరాజును కాల్చి చంపింది ప్రభుత్వం.

పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకా మోగల్లులో 1897వ సంవత్సరం జన్మించాడు సీతారామరాజు. 1923లో తనువు చాలించాడు. తెలుగువారి ధైర్యసాహసాల కొక దివ్యజ్యోతి సీతారామరాజు.

★★★★

# దిగవల్లి వెంకట శివరావు



చరిత్ర తెలియని జాతికి అభ్యుదయం లేదు. ప్రపంచంలో మనుగడ లేదు. జాతికి జీవశక్తి ఇస్తుంది చరిత్ర. అయితే చరిత్ర అంటే సంవత్సరాలు, తేదీలు, వంశ పురుషులు, రాచరిక వివద్దశలు మాత్రం కాదు. ప్రజా జీవనంలో క్రమ పరిణామం తెలిపేదే సరిఅయిన చరిత్ర. సత్యశోధనకు, చైతన్యబోధనకు జిజ్ఞాసువులను ఉత్తేజపరిచేట్లుగా ఉండాలి చరిత్ర రచన. ఈ దృక్పథంలో ప్రామాణికమైన చరిత్ర రచన చేసినవారు శివరావు గారు.

తెలుగువారి చరిత్రకారులలో కొమర్రాజు లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ గారలు చెప్పుకోదగినవారు. ఆర్జవం పరమాదర్శంగా చరిత్ర రచన చేసినవారు. అయితే వాళ్ల గ్రంథాలు ప్రాచీనకాల, మధ్యకాల చరిత్రకు సంబంధించినవి. ఆంధ్రదేశపు ఆధునికేతిహాసాన్ని పరమప్రామాణికంగా ఇంతవరకూ ఎవరూ రచించలేదు. కాని శివరావు 18, 19 శతాబ్దుల తెలుగువారి చరిత్రకు సంబంధించి ఆధికారికమైన ఘట్టాలెన్నో అక్షరబద్ధం చేశారు.

శివరావుగారు న్యాయవాద వృత్తిని చేపట్టినా చరిత్ర పరిశోధనకు వరవడి దిద్దారు. గాంధీ మహాత్ముడి సత్యాగ్రహం చిన్నతనాన్నే వీరిని ఆకర్షించింది. ఆ సత్యాగ్రహ స్వరూప స్వభావాలను తెలుగువారికి తేటతెల్లంగా తెలిపే ప్రబోధాత్మకమైన కరపత్రాల నుంచి దక్షిణాఫ్రికా సత్యాగ్రహం వంటి విపుల గ్రంథాల వరకు రెండు పదుల గ్రంథాలు రచించారు శివరావుగారు. పత్రికలలో వారు వెలువరించిన వ్యాసాలు వరశ్శతంగా ఉంటాయి. ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనా కాలానికి చెందిన చారిత్రకాధారాల కవిలెకట్ట వీరి దగ్గర ఎంతో ఉంది. 'యన్నేహాస్తి నతత్ క్వచిత్' అన్నట్టుగా ఈ విషయంలో శివరావుగారు

చెప్పలేని విషయం మరీ ఎవరూ చెప్పలేరు. బ్రిటీష్ యుగానికి సంబంధించిన తెలుగువారి చరిత్రకు శివరావుగారు కాణాచి.

ఎవరికైనా దిగవల్లి వేంకటశివరావుగారిని గూర్చి వినగానే వెంటనే గుర్తువచ్చే గ్రంధాలు, కథలు - గాథలు - యేనుగుల వీరస్వామయ్య కాశీయాత్ర చరిత్ర, అధినివేశ స్వరాజ్యం, **1857** పూర్వరంగాలు, మన ఆంధ్రత్వం, విశాలాంధ్ర-విస్మృతాంధ్రం అనేవి. వీటితోపాటు వ్యవహారకోశం, శాస్త్ర పరిభాష అనే రెండు సంపుటాలుగా ఇంగ్లీషు పారిభాషిక పదాలకు సమానార్థకాలైన తెలుగు పదకోశాలను కూర్చారు శివరావుగారు. ఆధునిక విజ్ఞానాన్ని తెలుగువారి కందించటంలో శివరావుగారు మార్గదర్శకులనీ వీరిప్రయత్నం ఘంటా పథమనీ అనాలి. ఆనాటి పత్రికలన్నీ వీరి పారిభాషిక పదకోశాన్ని ఎంతగానో శ్లాఘించాయి. భారతదేశంలో బ్రిటీష్ వారి రాజ్యతంత్రాన్ని గూర్చి అనేక మౌలికాధారాలతో రెండు సంపుటాలు తెలుగు వారికిచ్చారు శివరావుగారు. ఇంగ్లీషువాళ్ళు భారతదేశాన్ని ఎన్ని కుట్రలతో, కుతంత్రాలతో, కూహకాలతో ఆక్రమించుకున్నదీ, ఎట్లా భారతదేశం సాంఘిక ఆర్థిక రాజకీయ వ్యవస్థను పర్యనాశనం చేసిందీ ఆ బ్రిటీష్ పరిపాలన కాలంలోనే నిర్భయంగా వెల్లడి చేసిన జాతీయోద్యమ స్ఫూర్తి నిర్మాతలు శివరావుగారు.

శ్రీ దిగవల్లివారు ఏ రచన చేసినా జాతీయ దృక్పథం దానికి జీవశక్తి.పరిశోధనా ప్రవణత గీటురాయి. వారు రచించిన కథలు - గాథలు, అపూర్వాద్భుత సన్నివేశాలతో ఆధునిక చరిత్రను వ్యాఖ్యానిస్తాయి. యేనుగుల వీరాస్వామయ్య గారి కాశీయాత్ర చరిత్రకు విపులమైన సూచికలు ఇచ్చారువారు. విశాలాంధ్ర - విస్మృతాంధ్ర అనే గ్రంథంలో తెలుగుదేశపు ఆధునిక చరిత్రలో మరుగున పడిపోయిన విషయాల నెన్నిటినో ఆవిష్కరించారు. డెబ్బై ఏళ్ళ నుంచి చరిత్ర పరిశోధనలో తల మునకలై వుండికూడ్నీ నిరంతర నిత్యసత్య గవేషిగా పట్టుదల చూపడంలో వారికి వారేసాటి. తొమ్మిదో పడిలో కూడా రోజుకు పద్దెనిమిది గంటలు పుస్తకాలలో తలదూర్చి చరిత్ర సత్యాలకు పురం పెట్టడం వారి కఠినివేశం. అది వారికొక 'హఠ'యోగం. ఇటీవలి కాలంలో శ్రీ శివరావుగారు మన పోలీసు వ్యవస్థను గురించీ, విజయవాడ న్యాయవాద వృత్తిపరుల చరిత్రను గూర్చి గ్రంధాలు ప్రకటించారు.

ఎంతో సువ్యవస్థితమైన యీ ప్రపంచంలో కొక్కొండ వేంకటరత్నం పంతులు గారికి గ్రాంథిక భాష; సంఘ సంస్కరణం అనేవి మాత్రం గొప్ప ప్రమాదాలు, సరిపెట్టుకోలేని సమస్యలు అనిపిస్తాయి - అన్యథా ఈ నిష్కలంక ప్రపంచంతో ఆయన కేమీ పేచీలేదు అని గురజాడ అప్పారావుగారు కన్యాశుల్కం పీఠికలో కొక్కొండ వారిని వేళాకోళం చేసినట్లుగా దిగవల్లివారికి కూడా తెలుగుదేశపు ఆధునిక చరిత్రలో కందుకూరి వీరేశలింగమూ, బ్రహ్మసమాజమూ అంటే బొత్తిగా సదభిప్రాయం లేనట్లు కనిపిస్తుంది. ఇటీవలే ఈ విషయాలు పొందుపరుస్తూ వీరొక గ్రంధం వెలువరించారు కూడాను. తల్లిదండ్రులు మాణిక్యాంబ, వేంకటరత్నం పంతులు.

# మునిమాణిక్యం నరసింహారావు



ఈ శతాబ్దిలో రెండు ప్రపంచ మహాయుద్ధాలు జగత్తును అల్లకల్లోలం చేశాయి. కోట్లాది ప్రజలు ఆక్రందించారు. మానవ జీవితం అస్తవ్యస్తమై పోయింది. మానవ సంబంధాలలో అవాంఛనీయమైన పరిణామాలు ఏర్పడ్డాయి. ముఖ్యంగా యూరోపు ఖండంలో ఆర్థిక, మత, సాంఘిక, కళా, సాహిత్యరంగాలలో మొదటి ప్రపంచయుద్ధం తన ప్రభావాన్ని చూపింది. సాహిత్యంలో నైరాశ్యవాదం, విశృంఖలత, బీభత్సం, అనుపదేయాలు కావు అనే వాదం కూడా ప్రాచుర్యం పొందింది. తెలుగు సాహిత్యంపై కూడా ఈ పీడలు సోకకపోలేదు.

కుటుంబ జీవితంలో ఉండే మాధుర్యం, ప్రేమానుబంధాలు, కుదురు, సాంఘిక భద్రత, సాంస్కృతిక విలువల పరిరక్షణలను గూర్చి జాగ్రత్తపడే పరిస్థితులు ఈ శతాబ్ది ప్రథమ పాదంలో మృగ్యమైనాయి. తెలుగు సాహిత్యంలో కూడా ఆ కాలంలో ఈ పరిస్థితులే ప్రతిబింబించాయి.

మునిమాణిక్యం నరసింహారావు ఈ శాతాబ్ది ప్రథమ పాదం ముగుస్తుండగా కథకుడిగా రూపుదిద్దుకొన్నారు. ఎడారిలో ఒయాసిస్సుల్లాగా అనిపిస్తాయి ఈయన కథలు. కుటుంబ జీవితంలోని కష్టసుఖాలు, దాంపత్య సౌందర్యం మునిమాణిక్యం కథల్లో చోటు చేసుకున్నంతగా ఈ శతాబ్ది మరి ఇతర కథకులెవ్వరి రచనలలోనూ చోటుచేసుకోలేదు. ఈయన సృష్టించిన గృహిణి పాత్ర నవ్య సాహిత్యంలో ఒక నుడికారమైంది. 'కాంతం' 'కాంతుడి'గా మునిమాణిక్యం తెలుగు కథావస్తువును అపూర్వంగా చేశాడు.

కథ ఎత్తుగడలోనూ, ముగింపులోనూ తనదైన ముద్రను ఆవిష్కరింప చేయగల ప్రతిభావంతుడు మునిమాణిక్యం. కాంతం కథలు, నేను – మా కాంతం, తిరుమాగ, దీక్షితులు, రుక్కుతల్లి, శరద్రాత్రులు, కాంతంక్రైఫేయత్, ఉపాధ్యాయుడు మొదలైన రచనలు తెలుగు పాఠకులకు ఎంతో ప్రీతిపాత్రమైనాయి. అత్యంత సాధారణమైన సన్నివేశాలలోనే కమనీయతను సృష్టించగల నేర్పు ముని మాణిక్యం లేఖినికి ఉంది.

మధ్యతరగతి కుటుంబాలలో కపించే ఆర్థిక, హార్దిక అనుబంధాలు, కష్టసుఖాలు సాగసైన భాషలో, జిగి గల సంభాషణలలో కథించడం మునిమాణిక్యం వారి ప్రత్యేకత.

తనకు బాగా తెలిసిన కథావస్తువును, పాత్రలను, సంఘటనలను, సన్నివేశాలను, కథలుగా రూపొందించడం వల్ల ఆయన రచనలు వాస్తవికతకు అతి దగ్గరగా ఉండి పాఠకులను ఆహ్లాదపరుస్తాయి. మునిమాణిక్యం వారు లోకప్రవృత్తిలోని హాస్యాన్ని గూర్చి రాసిన లక్షణగ్రంథం తెలుగులో హాస్యాన్ని గురించి చెప్పిన ఉత్తమ గ్రంథం.

మునిమాణిక్యం జననం **1898.** కాలధర్మం **1972.** జన్మస్థలం గుంటూరు జిల్లా తెనాలి తాలూకా సంగం జాగర్లమూడి. తల్లిదండ్రులు వెంకాయమ్మ, సూర్య నారాయణ. మునిమాణిక్యం నరసింహారావు గారి కుమారుడు రఘునాథ యాజ్ఞవల్క్య కూడా స్వాతంత్ర్యానంతరం తెలుగు కథకులలో మంచిపేరున్న రచయిత.



# బూర్గుల రామకృష్ణారావు



ఆధునిక భారతదేశంలోని స్వతంత్ర సంస్థానాల చరిత్ర అంతా ఒకఎత్తు. నిజాం సంస్థానం ఒక ఎత్తు. స్వాతంత్ర్యానంతరం కూడా ఆనాటి నైజాం ప్రభుత్వం స్వతంత్ర భారతదేశానికి గుండెలమీద కుంపటిలాగా తయారైంది. ఆ చరిత్ర అంతా అదొక విషాద అధ్యాయం. అయినా శుభాంతమూ సుఖాంతముగా నాటి రాజనీతిజ్ఞులు యీ చరిత్రను పర్యవసింపచేశారు. అటువంటి మహనీయులలో బూర్గుల రామకృష్ణారావు ఎన్నదగినవారు. ఆనాటి హైదరాబాద్ సంస్థానం భారతదేశంలో విలీనం కావటానికి రామకృష్ణారావు ముందు చూపు, విజ్ఞత, రాజనీతిజ్ఞత, విచక్షణ, మేధావిత తనకు ఎంతగానో ఉపకరించాయినీ విలీనానికి పూర్వం స్వతంత్ర భారత ప్రభుత్వం తరపున హైదరాబాద్‌లో ఏజెంట్ జెనరల్‌గా ఉన్న కె.ఎన్ మున్షీ స్మరించారు.

నేటి మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి తాలూకా పడకల్ అనే చిన్నగ్రామంలో మేనమామల ఇంట రామకృష్ణారావు **1899**వ సంవత్సరం మార్చి, **13**వ తేదీన జన్మించారు. నరసింగరావు, రంగనాయికమ్మ అనే పుణ్యదంపతులు రామకృష్ణారావుగారి జననీజనకులు

**12** సంవత్సరాల వయసున హైదరాబాద్ నగరానికి వచ్చి రామకృష్ణారావు ధర్మవంత్ పాఠశాలలో ఏడవ తరగతిలో చేరి విద్యాభ్యాసం సాగించారు. నిజాం కళాశాల నుంచి ఇంటర్మీడియట్‌లో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైనారు. అటు తరువాత పూనాలోని ఫెర్గూసన్ కళాశాలలో **1920**లో బి.ఏ. ఆనర్స్ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైనారు. అటు తరువాత బొంబాయిలో చదివి ఎల్.ఎల్.బి. పట్టా పుచ్చుకున్నారు.

హైదరాబాద్ నగరంలో న్యాయవాద వృత్తిని ప్రారంభించి పుష్కలంగా ధనమార్జిస్తూ, ప్రజాహిత కార్యక్రమాలలో చొరవగా పాల్గొన్నారు. రామకృష్ణారావు తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, ఉర్దూ, పార్శీ, మహారాష్ట్రం, కన్నడ భాషలలో గొప్ప ప్రజ్ఞ సంపాదించిన

మహనీయులు.

హైదరాబాద్ సంస్థానం స్వతంత్రభారత దేశంలో విలీనమైన తర్వాత ఏర్పడిన ప్రజాప్రభుత్వానికి బూర్గులవారు ముఖ్యమంత్రి అయినారు. జాగీర్దారీల రద్దు విషయంలోను భూమి కౌలుకు సంబంధించిన చట్టాలు చేయటంలోను బూర్గులవారు ఎంతో ముందుచూపును, విజ్ఞతను ప్రదర్శించారు.

భారతీయ సంస్కృతి అన్నా, అధ్యాత్మిక జీవన విధానమన్నా రామకృష్ణారావుగారికి గొప్ప అభిమానం. అగ్రేసర న్యాయవాదులుగా వృత్తిలో తలమునకలై ఉన్నా, ప్రజాహిత కార్యక్రమాలలో పూర్తిగా నిమగ్నులై ఉన్నా, ప్రభుత్వ వ్యవస్థ అత్యంత బాధ్యతాయుతమైన పదవులు నిర్వహిస్తూ ఉన్నా రామకృష్ణారావుగారు నిరంతరం సారస్వత వ్యాసంగం కూడా చేస్తూనే ఉండేవారు. నూర్లకొద్దీ వ్యాసాలు వ్రాశారు. కేరళ రాష్ట్రానికి, ఉత్తరప్రదేశ్ రాష్ట్రానికి గవర్నర్‌గా ఉన్నప్పుడు కవి పండితులను సత్కరించారు. తీర్థక్షేత్రాలు సేవించుకున్నారు. పోతనగారి భాగవతంలోని కొన్ని ముఖ్యఘట్టాలను రామకృష్ణారావు ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా ఉండగా అనువదించి ప్రకటించారు. జాతియొక్క జీవచైతన్యమే సంస్కృతి అని నిర్వచనం చెప్పారు రామకృష్ణారావుగారు. పురుషులందు పుణ్యపురుషుల శ్రేణికి చెందినవారు రావుగారు. 1967 సెప్టెంబర్ 14 న పరమపదించారు.





# నాయని సుబ్బారావు

ఉదాత్త కావ్యములు పెక్కు చూచితినన్నాడు నన్నయ్యగారు. నాయని సుబ్బారావు గారు ఉదాత్తకవి. నవ్యభావ సంపన్నులలో ఆయన బాణీ విలక్షణమైనది. ఆయన పరమ భాగవతుడు ఆయన వాణి పరమార్ద్ర సుకుమారమైనది. భారతీయాత్మ సుబ్బారావు గారి కృతులలో మనోమోహకంగా సాక్షాత్కరిస్తుంది. భావ కవులలో నాయని వారిదొక లాలిత్యమైన శైలి. అరవిచ్చిన గులాబి పూల ప్రోవుల మసృణత్వం ఆయన భావ సుకుమారత. సహజ కవి శ్రీ సుబ్బారావు. భావకవిత్వ యుగంలో దేశభక్తి జాతీయ తాను రక్తి ప్రకృత్యుపాసన, ప్రణయోత్తేజ కత ప్రధాన కవితా వస్తువులని విమర్శకులు నిరూపించారు. వీటన్నిటా సుబ్బారావు గారిది అగ్రస్థానమే. తులసీదాసు రామగాథను స్వాంతస్సుఖ ముదితాత్మ విభవంగా వ్రాసుకున్నానని చెప్పినట్లు సుబ్బారావు గారికి తమ జీవితమే కావ్య వస్తువైంది. అందలి కష్టసుఖాలతో ఆత్మాను సంధానమే ఆయన కవితా కైంకర్యం. ఆయన రసైక జీవి. రసం బ్రహ్మమన్నారు. కాబట్టి ఆయన బ్రహ్మవిదుడు. శ్రీ మహా భాగవతంలోని జడభరతుని వంటి వారాయన అందుకనే ప్రాపంచిక కామనల పట్ల తగులం పెట్టుకోలేదు శ్రీ నాయని. తన ప్రణయగాథలో కూడా ఆయన సదాశివత్వ పదవినే కోరుకున్నాడు. అక్కడ పార్వతి శివుడి కోసం తపస్సు చేస్తే ఇక్కడ శివుడు పార్వతి కోసం తపస్సు చేశాడు. ''వత్సలా ఫాల భాగమున నెలవంక గురుతు, కందళించి వికాసించి కళలు దేర ''వంటి పద్యాలలో సుబ్బారావు గారి దివ్య ప్రణయావేశం గోచరిస్తుంది. 'కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యామ్'.

సౌభద్రుని ప్రణయయాత్ర, మాతృగీతాలు, ఫలశ్రుతి వంటివి తొలి నాళ్ళ కావ్యాలు . జన్మభూమి, వేదానా వాసుదేవము, విషాద మోహనము భాగ్య నగర కోకిల వంటి ఆయన చివరి కాలపు రచనలు. ఈ శతాబ్ది తెలుగు కవులలో సుబ్బారావు గారి విలుకుబడి ఏమిటో ముందు తరాల వారికి స్థిర ప్రాతిపదికపై నిరూపిస్తాయి. జన్మ భూమి వంటి కావ్యం ఒక మహాభక్తుడు, మహాజ్ఞాని, మహాయోగి మాత్రమే రచించగలడు. ఇదియు నొక్క ఆరాధనా విశేషం బగుటంజేసి' అని తిక్కన చెప్పినట్లు కవిత్వమొక దివ్య యోగంగా జీవించారు సుబ్బారావు గారు.

నాయని వ్రాసిందంతా సువర్ణమే నన్నాడు కృష్ణశాస్త్రి. సమకాలిక కవులలో నాయని పట్ల అందరికీ చాలా గౌరవం ఉండేది. ఎందుకంటే ఆయన ఎవరితోనూ పోటీ పడేవారు కారు. విశ్వనాథకు చాలా ప్రేమ పాత్రులు సుబ్బారావు. ఆధునిక తెలుగు సాహిత్యంలో కుల పాలిక ప్రణయమనే ఒక కొత్త కవితా మార్గాన్ని ప్రారంభించిన వారు శ్రీ సుబ్బారావు. మహాభారతంలో చెప్పినట్టు ''భార్యా శ్రేష్ఠతమస్సఖః, భార్యా మూలం తరిష్యతః'' అని నమ్మిన వారు నాయని. ఆయన ఎంత విశిష్టాద్వైతో అంత అద్వైతి.కవితానంద స్ఫూర్తదనుభవైకమతి.గృహవ్రతి అయిన యతి.

నాయని సుబ్బారావు జననం 1899. పరమపదం 1978. తల్లిదండ్రులు ఉదయమ్మ, కృష్ణారావు గారలు. జన్మస్థలం నెల్లూరు జిల్లా పాదిలె. ప్రఖ్యాత విదుషీమణి శ్రీమతి నాయని కృష్ణకుమారి సుబ్బారావు గారి పుత్రిక. సుమారు నాలుగ దశాబ్దులు ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నారు. తరవాత తరం సాహితీ పరులకెందరికో స్ఫూర్తినిచ్చారు.

★★★★

# తుమ్మల సీతారామమూర్తి



భారతదేశంలో 7 లక్షల గ్రామాలు ఉన్నాయి. తరతరాల నుంచి భారతీయులది గ్రామీణ సంస్కృతే. వ్యవసాయమే ముఖ్యవృత్తి. ముఖ్య పరిశ్రమ కూడా ప్రకృతితో తాదాత్మ్యం భారతీయుడి జీవితాన్ని ఉల్లాస పరుస్తుంది, ఉత్తేజ పరుస్తుంది. పచ్చని పంట పొలాలు, చెరువులు, దొరువులు, గుళ్ళు, గోపురాలు, వివిధ వృత్తుల వారి పరస్పర సహకార అనివార్యత వల్ల పల్లెటూళ్ళలో ప్రజల మధ్య నెలకొనే సఖ్యత ఒకనాటి భారతీయ సాంఘిక సాంస్కృతిక జీవితాన్ని ప్రభావితం చేశాయి. ఒకప్పుడు గ్రామీణ ప్రజలు కలిమిలేముల్లో కలసికట్టుగా ఉండేవాళ్లు.

భారతీయ గ్రామీణ జీవితాన్ని తెలుగులో చక్కగా చిత్రించిన కవి శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి. ఆధునిక కాలంలో తెలుగు వాడైన నిజమైన జాతీయ కవి ఈయన. ఈ శతాబ్ది మొదటి పాదంలో భారతీయులను ప్రభావితం చేసిన జాతీయోద్యమం ఈ కవిని కూడా చాలా ప్రభావితం చేసింది. పరాయి వారి పాలనలో భారతీయులు ముఖ్యంగా రైతులు పడుతున్న కష్టాలు ఆయన్ను బాగా కదిలించాయి 1922లో తెలుగునాట గుంటూరు జిల్లాలో రూపుదిద్దుకొన్న పెదనంది పాడు పన్నుల నిరాకరణోద్యమంలో వీరు పాల్గొన్నారు. గ్రామ గ్రామం తిరిగి ప్రభుత్వానికి పన్నులు చెల్లించవద్దని ప్రచారం చేశారు. అందుకు ప్రభుత్వం వారి కన్నెఱ్ఱకు గురి అయి జరిమానా పాలైనారు. ఇరవై రెండేళ్ళ వయసుననే కాకినాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభలకు హాజరైనారు. స్వాతంత్ర్యోద్యమ ప్రీతి జాతీయోద్బోధం వల్ల గాంధీజీకి మనోవాక్కాయ కర్మలు అంకితం చేసుకున్నారు. మహాత్ముని స్వీయ చరిత్ర తెలుగులో ఆత్మకథ పేరిట భావోత్తేజకంగా అనువదించి తెలుగువారి మెప్పుకు, కృతజ్ఞతకు పాత్రులైనారు.

1913 ప్రాంతంలో ఉద్యమరూపం దిద్దుకున్న ఆంధ్రుల స్వరాష్ట్ర వాంఛ కూడా

వీరినాకర్షించింది. అది భారత జాతీయోద్యమంలో ఏక దేశంగానే వీరు భావించారు. ఒక భాష మాట్లాడే వారికి ఒక రాష్ట్రం ఉంటే వాళ్ళు అభివృద్ధిని త్వరితగతిని సాధించగలరని వీరు కూడా అభిలషించారు. అప్పుడు తెలుగువారి పురాగాథలను, వర్తమాన పరిస్థితులను వీరు ప్రబోధించారు. ఆ రూపంగా వెలువడిందే వీరి రాష్ట్రగానం. పరిగపంట, పెద్దకాపు మొదలైన రచనలు గ్రామీణ సౌభాగ్యాన్ని వర్ణించే రచనలు. శ్రీ సీతారామమూర్తి గారి నుడికారపు సొగసు అచ్చ తెలుగు సోయగానికి అద్దం పదుతుంది. పండిత కవి శ్రీ సీతారామమూర్తి గారు. వీరి కవిత్వంలోని తెలుగు పొలపుకు అలరి తెలుగుదేశం వీరిని అభినవ తిక్కనగా అభిమానించింది. వృత్తులన్నిటిలో అత్యంత పవిత్రమైన ఉపాధ్యాయ వృత్తిలో శ్రీ తుమ్మల వారు నలభై సంవత్సరాలు తమ జీవితాన్ని సార్థకం చేసుకున్నారు. ఆయిన మనస్వీత ఆయన రచలన్నిటా ఉట్టిపడుతూ ఉంటుంది.

చిన్నతనాన వీరు కూడా అవధాన సరస్వతి నారాధించిన వారే. పెద్దైన తర్వాత వారు తమ జీవిత చరిత్రను 'నా కథలు' అనే పేరున రచించారు. అవన్నీ మధురమైన పద్య ఘట్టాలు. రత్న ఘరట్టాలు. శ్రీ సీతారామమూర్తి గారి జననం 1901. స్వగ్రామం కావూరు. కాలగతి 1990.

తల్లిదండ్రులు నారమ్మ చెంచయ్యగారలు. సంప్రదాయ జీవన ధన్యులు.



# పొట్టి శ్రీరాములు



ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి అసువులనే అర్పించిన నిరుపమాన త్యాగశీలి శ్రీరాములు. పురాణపురుషులైన శిబి, దధీచి, జీమూత వాహనులను పోలినది ఆయన త్యాగం.

ఒక భాష మాట్లాడేవారు ఒక రాష్ట్రంగా ఉంటే సత్వరమైన పురోభివృద్ధి, సర్వతోముఖమైన వికాసం, తమ ప్రత్యేకమైన భాషాసాహిత్య సాంస్కృతిక ఏకతా పురోగతికి ఎక్కువ అవకాశం ఉంటుందని తిలక్, గాంధీజీ వంటి మహనీయులు అభిప్రాయపడ్డారు. స్వాతంత్ర్యానంతరం ప్రాంతీయ భాషలలోనే ఉన్నత విద్యాభ్యాసం, పరిపాలనకూడా నిర్వహించవలసి వస్తుందని జాతీయనాయకులు విశ్వసించారు. అది సహజమూ, అనివార్యమూ అయిన పరిణామమని వాళ్ళు నమ్మారు. అంతేకాని భారత జాతీయ సమైక్యతకు, దేశ సమగ్రతకు భాషాప్రయుక్త రాష్ట్రాలు భంగకారులని అనుకోలేదువాళ్ళు.

పొట్టి శ్రీరాములు సర్వాత్మనా మహాత్మాగాంధీ అనుయాయి. సత్యాహింసల విషయంలో, త్యాగంవల్లనే అమృతత్వం లభిస్తుందనే నమ్మకంలో ఆయన గాంధీజీ ప్రబోధాలను తు.చ. తప్పకుండా ఆచరించాడు. గాంధీజీ ప్రారంభించిన నిర్మాణ కార్యక్రమానికి పూర్తిగా తనను తాను అర్పించుకున్నాడు శ్రీరాములు. స్వాతంత్ర్యోద్యమ ప్రబోధానికి ఆకర్షితుడై రైల్వేలో తానుచేస్తున్న ఉద్యోగాన్ని మానివేసి మహాత్మాగాంధీ సబర్మతీ ఆశ్రమంలో చేరిపోయినాడు శ్రీరాములు. గాంధీజీ ఆదేశంతో ఆయన ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నాడు.

గాంధీజీ తన జీవితాశయాలుగా కృషి చేసిన మద్యపాన నిర్మూలనం, అస్పృశ్యతా నివారణ కార్యక్రమాలలో శ్రీరాములు ఎంతగానో సేవాసక్తుడైనారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలోను కారాగారవాసం అనుభవించాడాయన. 1940లో జైలునుంచి విడుదల అయినతర్వాత ఆయన గుజరాత్‌లోని రాజకోట సత్యాగ్రహాశ్రమంలో ఉండి ఖాదీ అభివృద్ధి, మద్యపాన నిర్మూలన ప్రబోధం, అస్పృశ్యతా నివారణ కార్యక్రమాలలో పూర్తిగా సుశిక్షితులైనారు. తరువాత మళ్ళీ క్విట్ ఇండియా ఉద్యమంలో ఆయన జైలుకు వెళ్ళారు. విడుదలైన తర్వాత పూర్తిగా హరిజన

సేవకే అంకితమైనారు. తన స్వస్థలమైన నెల్లూరులో హరిజన దేవాలయ ప్రవేశానికి ఆటంకం కలిగిస్తున్న సనాతనవాదుల హృదయ పరివర్తన కోసం ఆయన 23 రోజులు ఉపవాస దీక్షపూని కృతకృత్యుడు కాగలిగారు. అటు తరువాత హరిజనుల సామాజిక ఉన్నతికి మద్రాసు ప్రభుత్వం తగినంత కృషిచేయటంలేదన్న అంశం ప్రభుత్వం దృష్టికి తేవటానికి ఆయన 29 రోజులు ఉపవాస దీక్ష సంకల్పించారు. అప్పుడు ఆంధ్రకేసరి ప్రకాశం ఆయనకు హామీ ఇవ్వడంతో ప్రభుత్వపక్షాన .కొన్ని చర్యలు ప్రకటించడంతో శ్రీరాములు తనదీక్షను విరమించుకున్నారు.

ఆంధ్రుల చిరకాల వాంఛితమైన ప్రత్యేక రాష్ట్రం గురించి భారత ప్రభుత్వం పట్టించుకోక పోవడంతో 1952 అక్టోబరు 19వ తేదీన శ్రీరాములు ఆమరణ ప్రాయోపవేశ దీక్షపూనారు. 58 రోజులు ప్రాయోపవేశం చేసి ఆశయసాధనకై తననుతాను బలిదానం గావించుకున్న పుణ్యపురుషుడు శ్రీరాములు. 1901లో మద్రాసులో జన్మించి 1952లో మద్రాసులోనే ఆయన తనుత్యాగం చేశారు. తల్లిదండ్రులు మహాలక్ష్మమ్మ, గురవయ్యగారలు.



# డాక్టరు కె.యల్.రావు



కె.యల్. రావుగారిని తలచుకోగానే గంగా — కావేరిజలాలు మనో వీధిలో జలతరంగ సంగీత భంగిమలు సందడింపచేస్తాయి. ఆయన చిరకాల వాంఛ అది. భారతదేశంలోని నదీనదాలన్నిటినీకలిపి అపారజలరాశి సంపదను వినియోగంలోకి తేవాలని ఆయన ఎన్నో కలలు కన్నాడు. ఆధునిక భారతదేశంలోని పెద్దపెద్ద ప్రాజెక్టులన్నీ ఆయన చేతిచలవ రూపంగానే నిర్వహింపబడ్డాయి. నీటివనరుల సమగ్ర వినియోగ పథకమహామతి ఆయన. అంతర్జాతీయ ఖ్యాతిగల మేటి ఇంజనీరు. జలశక్తిని సర్వసమగ్రంగా వినియోగించుకుంటున్న అనేక దేశాలనీటి వనరుల సమస్యలను గూర్చి ఆయన సలహాలందచేసిన మేటిసాంకేతిక నిపుణులు శ్రీరావు. 'రెయిన్ ఫోర్స్‌డ్ కాంక్రీటు' పైన శ్రీరావు వ్రాసిన గ్రంథాలు ప్రపంచ దేశాలన్నిటా పరమ ప్రామాణిక గౌరవాన్ని పొందాయి. ఆధునిక సాంకేతిక విజ్ఞానాన్ని వినియోగించుకుంటున్న ప్రతిదేశాన్ని ఆయన పర్యటించి ఆయాదేశాల గొప్ప ప్రాజెక్టులు పనిచేస్తున్న తీరుతెన్నులనాయన పరిశీలించారు. భారత ప్రభుత్వ జలవిద్యుచ్ఛక్తి బోర్డు నిర్వాహకుడిగా, విద్యుచ్ఛక్తి నీటి వనరులశాఖ మంత్రిగా ఆయన పదేళ్ళపాటు చేసిన సేవ నిరుపమానం. **1961**వ సంవత్సరానికి కేంద్ర పాలితమైన ఢిల్లీకి చెందిన **276** గ్రామాలలో **35** గ్రామాలకు మాత్రమే విద్యుచ్ఛక్తిసౌకర్యం వుండేది. **1966**వ సంవత్సరానికల్లా అంటే **5** సంవత్సరాలలో తక్కిన **241** గ్రామాలకు విద్యుచ్ఛక్తి అందడం కె.యల్.రావుగారి కృషిఫలితం. దేశం సుసంపన్నం కావడానికి జలసంపదను సక్రమంగా వినియోగించుకోవడమూ, విద్యుచ్ఛక్తిని ఉత్పాదించడం అవశ్యకర్తవ్యాలని ఆయన కేంద్రమంత్రిగా వున్న పది సంవత్సరాలూ అదే పనిలో నిమగ్నులైనారు. భారతదేశంలోని నదీనదాలు వాటి ప్రవాహ ఘనపరిమాణం జలరాశి ఆయనకు అరచేతిలో రేఖలంత స్పష్టంగా తెలుసు. **14** పెద్ద నదుల పరీవాహక ప్రాంతం ఒక్కొక్క నదికి **25**వేల చదరపు కిలో మీటర్లని భారతదేశంలో **85**

శాతం ఈ పరివాహక ప్రాంతం విస్తీర్ణం ఆక్రమిస్తుందనీ అయితే ఈ పెద్ద నదులన్నీ భారతదేశంలో వివిధ రాష్ట్రాలద్వారా ప్రవహిస్తాయనీ శాంతి సామరస్య సుహృద్భావ వాతావరణంలో జలసంపదను పంచుకోవాలనీ రావుగారు హితవు చెప్పారు.

ఇవికాక చిన్న నదులు ఇంకా కొన్ని ఉన్నాయి. ఇవి మధ్యస్థాయి ప్రవాహప్రమాణ జలాధారాలు. ఇవి కూడా అంతర్రాష్ట్రీయ నదులే. ఒక్కొక్కటి 2 వేల నుంచి 20 వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతానికి పరివాహకాలుగా ఉన్నాయి. అందువల్ల భారతదేశంలో సమైక్య భావం పెంపొందించుకొని నాలుగు చెరగులనూ అభివృద్ధి పరచుకోవాలని వృధా కలహాలతో వనరులను నిరుపయోగం చేసుకోరాదు అని విజ్ఞతతో, బాధతో రావుగారు స్వీయచరిత్రలో చెప్పారు.

ఈ శతాబ్ది ప్రారంభంలో భారతదేశంలో జలాధార సేద్యభూమి 14 మిలియన్ హెక్టార్‌లనీ, సగం శతాబ్ది గడిచేసరికి అది 20 మిలియన్ హెక్టారులైందనీ 1977 నాటికి 43 మిలియన్ హెక్టారు లైందనీ మొత్తం దేశంలోని సాగునేలలో 50 శాతమైనా జలాధార సేద్యభూమి అయితే కాని దేశం స్వావలంబనంతో మన జాలదని వారు స్పష్టంచేశారు.

నాగార్జున సాగరం, భాక్రానంగల్, కోసీ ఆనకట్టలు రావుగారి సాంకేతిక మేధావిజ్ఞాన దర్పణాలు. మొదటి పంచవర్ష ప్రణాళిక ఆరంభానికి 3800 గ్రామాలు మాత్రమే విద్యుత్‌కు నోచుకోగా, 19 వేలు మాత్రమే దేశం మొత్తం మీద పంపుసెట్లు ఉండగా 1977 నాటికి లక్షా 88వేల గ్రామాలకు విద్యుత్తు లభించిందనీ 28 లక్షల పంపుసెట్లు పనిచేస్తున్నాయనీ వివరాలిచ్చారు రావుగారు స్వీయచరిత్రలో. ఈ అభ్యుదయానికి శ్రీ లక్ష్మణరావు గారి కృషి మూలధనం. అమెరికా, చైనా, ఇంగ్లండు, రష్యా, జపాన్, జర్మనీ వంటి అభివృద్ధి చెందిన దేశాలలోను, చిన్నచిన్న దేశాలలోను ఎన్నోసార్లు పర్యటించి ఆయాదేశాల సాంకేతిక విజ్ఞానాన్ని అవగాహన చేసుకోవటమే గాకుండా వాళ్ళకు కూడా సలహాలందించారు రావుగారు.

శ్రీ రావు జననం కృష్ణాజిల్లాలో విజయవాడకు 20 మైళ్ళ సమీపానగల కంకిపాడు 1902లో, పరమపదం 1986 హైదరాబాదులో. శ్రీ రావు పూర్తిపేరు కానూరి లక్ష్మణరావు. సుప్రసిద్ధ చరిత్రవేత్తలు కొమర్రాజు వెంకటలక్ష్మణరావు వీరికి బావగారు.

★★★★

# స్థానం నరసింహారావు



ఆధునిక కాలనాటక ప్రదర్శనంలో అఖిలభారత దేశంలోనే ఒకనాడు 'స్థానం' ఆర్జించిన స్థానం నిరుపమానం. నాటక కళారంగంలో ఆయన లాగా పాత్రధారణ అనితర సాధ్యం అనిపించుకున్నాడు. స్త్రీ పాత్రలను అత్యంత సహజంగా, సొగసుగా నటించి రసజ్ఞుల మెప్పు పొందారు నాలుగుదశాబ్దులు సుమారు 20,25 పాత్రలను నటించి తెలుగునాటక రంగంలో తన అమేయప్రతిభతో చిరతరస్థానం సంపాదించుకున్నారు స్థానం నరసింహరావు.

1902 సెప్టెంబర్ 23వ తేదీన స్థానం నరసింహారావు జన్మించాడు. వీరితల్లిదండ్రులు ఆదెమ్మ, హనుమంతరావు గారలు. స్వస్థలం బాపట్ల. నాటకంలో ఏదైనా పాత్రను అభినయించటానికి ముందుమూడు నాలుగు గంటలువేషధారణను దిద్ది తీర్చుకొనే వారుట స్థానం వారు. దానితో రంగస్థలం మీద ఆపాత్ర అభినయింతో తాదాత్మ్యం, తన్మయీభావం పొందేవారు ప్రేక్షకులు. నెమళ్ళకు నాట్యాన్ని, అంచలకు నడకను, కోయిలలకు గాత్రమాధుర్యాన్ని పరిదిద్దగలడు స్థానం అని రసజ్ఞులు మెచ్చేటట్లు రంగస్థలం మీద శోభించారు స్థానంవారు.

అఖిలభారతంలోనూ కీర్తినార్జించారు

"ఏవేషము వేయుదలచుకొనిన ఆవేషమతనికి సలామొనరించి యితని వరించును ఇతని చురుకు దనము పులికి లేదు. రంజనమున నితడు చిత్రకళాచార్యునకు వన్నెలు దిద్దును. .కవిసృష్టికితడు వ్యాఖ్యాత మహామహోపాధ్యాయుడు లేక ప్రకృతి కద్దము. గురజాడ అప్పారావుగారి మధురవాణి మనకక్కరలేదు. స్థానం వారి మధుర వాణి మనకొకసారి కావలయును." అని ప్రశంసించారు, మహాపండితులైన వేటూరి శివరామశాస్త్రిగారు స్థానంవారిని. చిత్రాంగి, సత్యభామ, మధురవాణి, రోషనార, దేవదేవి,

చంద్రమతి, చింతామణి, పాత్రలను నభూతో నభవిష్యతిగా అభినయించి చూపారు స్థానంవారు.

నవరసాలను పోలికించటంలో అయిన స్థానాన్ని ఎవరూ అందుకోలేరు. మైసూరు, బెంగుళూరులలో వీరి రామ విలాస సభవారు నాటకాలు ప్రదర్శించి నెల్లూరు కస్తూరిబా బాలికా పాఠశాలకు పదివేలరూపాయలు విరాళ మందజేశారు. తెలుగు నాటకరంగ చరిత్రలో ఆనాటి రామ విలాససభ నాటకాలు, స్థానంవారి ప్రతిభ అపూర్వ దివ్యోజ్జ్వల అధ్యాయం. 1971లో స్థానంవారి పరమపదం.





# నిడదవోలు వేంకటరావు

ఈ శతాబ్ది తెలుగుసాహిత్య మహా ప్రతిభులలో నిడదవోలువారిది చెప్పుకోదగిన స్థానం ఒక్కచేతిమీదుగా పరిశోధన, విమర్శ పరిష్కరణ రంగాలలో ఆయిన లాగా కృషిచేసినవారు మరొకరు లేరు భాషా సార స్వత చరిత్రలలో ఆయిన మేధావి. ఇరుగు పొరుగు ద్రావిడ భాషలతో సాకల్యమైన పరిచయుం ఉన్నవారు. కవి, పండితుడు, పరిశోధకుడు, చారిత్రకవేత్త, ప్రయోగ పారావారపారీణుడు ఆయిన మహా వ్యక్తి ఆయిన ఇన్ని యోగ్యతలు, ప్రతిభలు ఒక చోట రాశీకరించటం ఎవరి విషయంలో నైనా అరుదనే చెప్పాలి. నిడదవోలు వేంకటరావు పంతులుగారు మహామేధావి అసాధారణ ధారణాశక్తి సంపన్నుడు గిడుగు రామమూర్తి పంతులు వంటి ప్రయోగోద్ధరణ చణుడు చతురమతి దేశచరిత్ర, జీవితచరిత్ర, భాషాచరిత్రలను శాసన, కావ్య, దేశవాఙ్మయుంనుంచి సమన్వయుం చేయుగల సూరి జనశ్లాఘనీయుడు వావిళ్ళవారి ప్రాచీనకావ్య ముద్రణాలలో వేంకటరావుగారి ఉపారపరిశ్రమం కనపడుతుంది ప్రాచీనకావ్యాలు దాదాపు 60 గ్రంథాలదాకా వేంకటరావుగారి పరిష్కరణకు నోచుకొని వెలుపడ్డాయి. వాటికాయిన ప్రామాణికమైన పీఠికలు, విశేషాంశాలు

సంతరించారు తెలుగు సాహిత్యానికాయిన ఒక వెండికొండ శైవవాఙ్మయాంబుధి చులుకించిన అగస్త్యుడు నిఘంటు నిర్మాణకుశలి. బహుజనపల్లి సీతారామాచార్యులవారి శబ్దరత్నాకరానికి నిడదవోలువారు కూర్చిన అనుబంధం వెయ్యేళ్ళ తెలుగుసాహిత్యంలో వారికి ఉన్నతాదాత్మ్యానుబంధం ఎటువంటిదో వెల్లడిస్తుంది తెలుగుసాహిత్యానికి వెలలేని భూషణమైన ఉదాహరణ వాఙ్మయ ప్రక్రియను ఉద్ధరించి తెలుగు వారికిచ్చిన వారు నిడదవోలువారు వెలువరించిన అన్ని రచనలు మరెవరూ చేయలేదనడం అతిశయోక్తికాదు వర్ధిష్ణువు లైన రచయితల కెందరకోవారు కమనీయ మైన పీఠికలు వ్రాసి ఇచ్చారు. వారిల్లు ఒక శారదాపీఠం

నిడదవోలు వారిది పండితవంశం వీరి తండ్రి సుందరం పంతులుగారింట గొప్ప గ్రంధాలయం ఉండేది. వేటూరిప్రభాకరశాస్త్రి మానవల్లి రామకృష్ణ కవివంటి పండిత మూర్ధన్యులు గ్రంధ సంగ్రహం కొరకు సుందరం పంతులుగారి వద్దకు వచ్చే వారంటేవారి గ్రంధ పరిశ్రమ ఎటువంటిదో అవగతమవుతుంది. పాల్కురికి సోమనాధుని బసవపురాణం తొలిసారి ముద్రించిన కీర్తి సుందరం పంతులుగారిదే. అందువల్లనే పన్నెండు పదమూడేళ్ళ లేతవయసుననే వేంకటరావుగారిలో సాహిత్యాభిరుచి కుట్మలించింది. ఆ జీవం అది వికసించి సౌరభం ప్రసరింప చేస్తూనే ఉన్నది నూనూగు మీసాల నూత్నయౌవనం ఇంపీరియల్ బ్యాంక్ గణకోద్యోగిగానే గడపినా వారి సాహిత్య పిపాస చెక్కుచెదరలేదు. 1936వ సంవత్సరం పిఠాపురం మహా రాజారావు సూర్యారావుగారి పరిచయం శ్రీ వేంకటరావుగారిని తెలుగు సాహిత్యానికొక ఆచార్యపీఠంగా తీర్చిదిద్దింది. సూర్యరాయాంధ్ర నిఘంటువు రెండు మూడు సంపుటాలకు వేంకటరావుగారు సంగ్రాహక పండితులుగా పనిచేశారు. అటు తర్వాత మద్రాసు విశ్వవిద్యాలయం వారి ఎమ్.ఏ. పరీక్షలో వారు సర్వ ప్రధములుగా ఉత్తీర్ణులై ఆవిశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రెండుదశాబ్దాలపాటు ఆచార్యులుగా పనిచేశారు. అక్కడ పదవీ విరమణానంతరం హైదరాబాదులో వచ్చి స్థిరపడ్డారు ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిశోధన కార్యక్రమాలలో 5సం.లు గౌరవాచార్యులుగా తమ శేముషిని అందించారు. మించుపల్లె, తెలుగు పొలుపు, శ్రీరామ కర్ణామృతం వంటి కావ్యాలు రచించారు. వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యానికి సంబంధించి 25,30 సంపుటాలకు సరిపడ విషయ వివరణ సంధానించారు పంతులుగారు. కాని అముద్రితంగా ఉండి పోయింది ఆయన అపార పరిశ్రమ. తెలుగులో వచన రచనా పరిణామానికి సంబంధించి వేంకటరావుగారు సప్రమాణికమైన గ్రంధంవెలువరించారు. తెలుగు నిఘంటువుల కెక్కని ముప్పైవేల పదాలను ప్రయోగ సహితంగా ఆయన ప్రోగుచేశారు.

పీఠికలు, సమీక్షలు, ప్రశంసలు, ఖండన, మండన సంబంధ వ్యాసాలు, సంవాదవిసంవాద సంబంధ వ్యాసాలు సంవాదవిసంవాద సంబంది భాషాసాహిత్య చర్చలు, పరశ్శతంగా వెలువరించారు నిడదవోలువారు. ఆయిన ఒక జంగమ విజ్ఞా న సర్వస్వంగావినుతికెక్కారు. విద్యారత్న, పరిశోధన పరమేశ్వర, అనేవి నిడదవోలువారి బిరుదులు జననం 1903, శివైక్యం1982. తండ్రి సుందరం పంతులుగారు. తల్లి జోగమ్మగారు స్వస్థలం విజయనగరం.



# పురిపండా అప్పలస్వామి



వెయ్యేళ్ళు ఇంచు మించుగా మనది పద్య కావ్యయుగం, పద్యం రాయడం ఎంత గొప్పో హృద్యమైన వచనం రాయడంకూడా అంతకన్నా చెప్పుకోదగిన సంగతి. సరళమైన వచనంరాసి మెప్పించడం అందరికీ సాధ్యమయ్యేదికాదు అందుకెంతో సృజనాత్మక ప్రతిభ కావాలి

అచ్చు వచ్చిన తర్వాత ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రక్రియా వైవిధ్యం రోజురోజుకీ విస్తరించింది. నవలలు, కథలు, సారస్వత విమర్శ, నూత్నకాంతులతో బయలుదేరాయి. ఈ శతాబ్ది తొలి దశకాలలో వ్యవహారిక భాషోద్యమం బయలుదేరింది.
దానితో వచనరచన పరిపుష్టినందింది

ఒక్కచేతిమీదుగా భారత రామాయణాలను పద్యకావ్యాలనుగా చేసిన వారున్నారు. కాని వచనంగా చేసిన వారిలో పురిపండా అప్పలస్వామిగారు చెప్పదగినవారు. ఆయన వచనరచన సరళమూ, ఆకర్షవంతమూ. ఆధునిక కాలంలో మహాప్రతిభులైన కవి పండిత సాహిత్యవేత్తలంతా మెచ్చుకొన్నది. రాయప్రోలు, విశ్వనాథ, రాళ్ళపల్లి, జాషువాలతోపాటు సరళ సుందరమైన వచన రచనకు పేరెన్నికగన్న మధునా పంతుల వారు పురిపండావచనం మెచ్చుకున్నారు. శ్రీ పాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారీయనకు మిత్రుడు. శ్రీ పాదవారు వదిలిపెట్టిదివికేగిన వ్యాసమహర్షి కృత సంస్కృత భారతాన్ని యథాతథంగా వచనంచేశారు పురిపండావారు వీరు వచనంలో రచించిన శ్రీ మద్రామాయణం ఈతరాన్ని ఎంతో అలరించింది. పురిపండావారు సంస్కృతంనుంచి అనువదించిన దేవీభాగవతంకూడా పెద్దల, పిన్నల మెప్పుపొందింది. జమ్మల మడక మాధవరామశర్మగారి వంటి గొప్ప అలంకారవేత్త పండితుడు పురిపండా వారి వచన భారతాన్ని అతివేలంగా ప్రస్తుతించారు.

ఈ శతాబ్ది తెలుగు వచనరచనా శైలి నిర్మాతలలో పురిపండా వారిది విశిష్టమైన స్థానం. వాడుకభాషపట్ల ఆయునకు వీర శైవులకన్నా ఆవేశమూ, శ్రీ వైష్ణవులకన్నాఎక్కువ భక్తి ప్రపత్తులున్నా, అయినా ఆయిన ఎక్కడా వాదవివాదాలలో తల దూర్చలేదు. పరుష భాషణలు పలకలేదు. నుడికారం తో కూడిన తెలుగుతల్లి గుడికట్టారు

ఆధునిక కవులలోకూడా పురిపండావారిది ప్రత్యేకమైన స్థానం కవితా సమితిని స్థాపించారు పురిపండా ఆధునిక సాహిత్యంలో ఒక మహాప్రస్థానాన్ని నిర్వహించిన శ్రీ శ్రీ కే ఆయిన గురుమైనారు 'పాతకొత్తల మేలుకలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా' అనే గురజాడ కవితాశయిం, సాహిత్యసమన్వయిం పురివండా వారిరచనా స్ఫూర్తి. ఆయిన 'పులిపంజా' కవితా సంకలనం విదేశాంధ్ర ప్రచురణలుగా ఇంగ్లండు నుంచి వెలువడింది.

ఉత్తమ దేశభక్తులు పురిపండా అప్పల స్వామి జాతీయోద్యమంలో విశాఖ జిల్లాలో నిర్మాణాత్మమైన పాత్రను నిర్వహించారు. బహుకాలం విశాఖలో ఒక ఖాదీవస్త్ర భాండారాన్ని నడిపారు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారిని సేవించుకున్నారు. ఒక్క తెలుగు సంస్కృతాలేకాక ఒరియా భాషలోకూడా పురిపండా ప్రజ్ఞావంతుడు. ఒరియా నుంచి తెలుగుకు, తెలుగునుంచి ఒరియాకు ఆదాన ప్రదాన సాహిత్య నిధులు అందించారు. ఒరియాలో గోపీనాథ మహంతి వ్రాసిన 'అమృత సంతానం' అనే నవలను పురిపండా వారు తెలుగులోకి అనువదించారు ఈ అనువాదం ద్వారా వారు అఖిలభారతీయ స్థాయిలోనే గొప్ప అనువాద ప్రమాణాలను నెలకొల్పారని చెప్పాలి.

పురిపండావారు కౌటిల్యుడి అర్థశాస్త్రాన్ని వాత్స్యాయనుడి లోకతంత్రాన్నీ కూడా అనువదించారు కానీ అవి వెలుగు చూడకపోవడం తెలుగువారి దురదృష్టం. ఎక్కడో శ్రీకాకుళం జిల్లా మారుమూల ప్రాంతమైన సాలూరులో పుట్టి, తెలుగు వారికీ ఒరియా వారికి సాహిత్యసేతువైనారు. **1928**లో అఖిలాంధ్ర కవి పండిత సభను భీమునిపట్నంలో నిర్వహించారు గిడుగు రామమూర్తిపంతులుగారి ఉద్యమాన్ని సర్వాత్మనా అభిమానించి అనుసరించిన వారు అప్పల స్వామి. విశాఖ నుంచి 'స్వశక్తి' అనే వారపత్రికను ఒక దశాబ్దం పైగా నిర్వహించారు.

ఉత్తరాంధ్రలో సాహిత్య సంరంభానికాయన ఒక పెద్దదిక్కు. సమస్తాంధ్రులకు ప్రీతిపాత్రుడు. మనస్వి, సౌమ్యులు, సాహిత్య తాదాత్మ్యం తప్ప తక్కినవి పరిగణనలోకి తీసుకొనే వారుకారాయన.

**1904**జననం, **1982** పరమపదం. సంప్రదాయానికి అభ్యుదయ ప్రయోగానికి లంకె అప్పలస్వామి.



# మల్లాది రామకృష్ణశాస్త్రి



వేదవేదాంగాలు, దర్శనాలు, మతము, ఆధ్యాత్మిక విద్య, ప్రపంచ నాగరికభాషా సారస్వతాలు లెస్సగా ఆకళింపు చేసుకొని కూడా ఆధునిక తెలుగు సాహిత్యంలో చిన్న కథకు కళాత్మకరూపం ఇవ్వడానికి కృషి చేయడమంటే ఎంతవింత?? ఎంత ఆశ్చర్యం! సంస్కృతాంధ్రాలలో తలస్పర్శి పాండిత్యం సంపాదించడమేకాక లోకంకోసం 'డిగ్రీ'లు కూడా పుచ్చుకున్నా, లౌకిక వృత్తులను ప్రవృత్తులను సుతరామూ దగ్గరకు రానివ్వకుండా తామరాకుమీద నీటిబొట్టులా మనగలిగిన స్థితప్రజ్ఞత ఎందరి కుండేను?! నిప్పుల కుంపట్లో కుసుమంలా మనగలగడం మాటలా? మనస్వికి మాత్రమే సాధ్యంఅది.

ఆధునిక తెలుగు సాహిత్యంలో చిన్న కథను కళాఖండంగా తీర్చిదిద్దిన శాస్త్రిత్రయం వున్నది. అలనాటి కవిత్రయంలా వీళ్ళు కథకత్రయం. శ్రీపాద, వేలూరి మల్లాదిశాస్త్రులు వీళ్ళు. వీళ్ళలో మల్లాది రామకృష్ణశాస్త్రి గొప్ప కథకుడుగా చిరస్మరణీయుడు. నాలుగు కాలాలపాటు అందరూ చెప్పుకునేకథలు వ్రాశాడాయన. నాలుగు దశాబ్దాలపాటు తనవైన నూరు, నూటఇరవై కథలతో కథాసాహిత్యాన్ని ఉర్రూతలూగించినవాడు మల్లాది రామకృష్ణశాస్త్రి.

మల్లాది రామకృష్ణశాస్త్రి కేవలం కథలు మాత్రమే వ్రాశాడు. కాగితంమీద పెట్టకుండా హితులకు, సన్నిహితులకు, స్నేహితులకు ఎన్నెన్ని కథలు చెప్పాడో! 'అశ్రుత సామముల్ కడు మధురముల్' అని ఒక గొప్ప ఇంగ్లీషు కవి అన్నాడు. ఆయన వ్రాయకుండా చెప్పిన కథలు ఇంకా ఎంత గొప్పగా ఉండి ఉండునో? మల్లాది రామకృష్ణశాస్త్రి హృదయం ఒక కథాసరిత్సాగరం. ఆయన ఒక గొప్ప సోమదేవసూరి. అంటే కథాసాహిత్యంలో పదహారు కళల కవిచంద్రుడు.

''డు,ము,వు,లు'' అనే గొప్పకథ వ్రాశాడు రామకృష్ణశాస్త్రి. ధ్వని సౌందర్యాత్మకమైన

కథఇది. తిక్కనగారు వ్యాసుణ్ణి తెలుగువాణ్ణి చేశారు అని ధ్వని. సాహిత్యం ప్రజలను ఉత్తేజపరచాలికాని పండితులకు మాత్రమే మూలధనం కాకూడదు అని సందేశం వినిపించేకథ. భూత భవిష్యద్వర్తమానాలను తెలుగుతనంతో నింపి కథలు వ్రాసిన కథశిల్పి రామకృష్ణశాస్త్రి. శ్రీనాథుణ్ణి గురించి వ్రాసినా, సినిమాపాటలు వ్రాసినా సాహిత్య సౌరభం గుబాళిస్తుంది ఆయారచనల్లో. దేశవిదేశ భాషలు సుమారు ఇరవై ఆయన చదవగలడు. అందులో వ్రాసిన అందచందాల రచనల స్వారస్యం విప్పి చెప్పగలడు. భారతీయ ఆధునిక భాషలన్నీ ఆయనకు కరతలామలకమే. అంతేకాదు ఫ్రెంచి, లాటిన్, గ్రీకుభాషలూ తెలుసుబాగా. సంగీతం, నాట్యం, వేదాంతం, న్యాయం అన్నిటిలోనూ వశంవదుడాయన. అయినా నూటికి నూటొక్కపాలు తెలుగు వాడాయన తెలుగునుడికి గుడి మల్లాది మధ్యాక్కర, కామునిపున్నను, చెంగల్వ, మునిగోరింట, యక్షగానం, కణ్వాశ్రమం, తపస్విలోకం, సర్వమంగళ, ఇవీ ఆయన కథలపేర్లు. ఆయనవి జాతికథలని ఆయిన చెప్పుకున్న మాట నిజమే. సర్వమంగళ అనే కథలో ఎంత ఆర్ద్రత, సమాజ వాస్తవికత, మనస్తత్వ చిత్రణ కథలో ఉండాల్సిన శిల్పం ఆయన చూపించాడు! జీవితం చమత్కారమైంది. శాస్త్రిగారు ఏ విశ్వ విద్యాలయంలోనో ఆచార్యుడిగా ఉంటేనో, ఏ పరిశోధన సంస్థకో చోదకుడై ఉంటేనో తెలుగుదేశం ఎంతో లాభం పొందిఉండేది. కాని ఆయిన సినిమాపాటలు వ్రాసుకుంటూ అంతర్ముఖ సమారాధ్యత్వం వహించవలసి వచ్చింది. ఆగర్భ శ్రీమంతుడిగా పుట్టిన లోకానికి నిరుపేదగా (మనసుకాదు, మాటకాదు, తత్త్వం అసలేకాదు) గడపవలసి వచ్చింది. ఆయినదొక తపస్విలోకం. ఆయిన హృదయం ఎప్పుడూ కామునిపున్నం, మనసు కణ్వాశ్రమం. ఆయన వ్రాసిన కథలు ఘంచిముత్యాలు. జననం **1905.** పరమగతి **1965.** జననీ జనకులు కనకమ్మ, నరసింహ శాస్త్రిగారలు.

పాలికేళ్ళు బందర్‌కు దగ్గరా, పాతికేళ్ళు మద్రాసులోనూ ఆయిన సాహిత్యప్రియం భావుకత సువాసనలు వెదజల్లింది.



# సి.ఎస్.ఆర్. ఆంజనేయులు



ఒక గొప్ప నటుడు అనగానే ఆ వ్యక్తిత్వాన్ని రూపొందించే విశిష్టమైన లక్షణాలు మూడు. ఒకటి అందమైన రూపం. రెండు హావభావాల ద్వారా చూసే వాళ్ల హృదయాలను ఆకర్షించుకోగల సామర్థ్యం. మూడు సమ్మోహకమైన కంఠ స్వరం. వీటినే ఆంగికం వాచకం అభినయం అంటారు. ఇందులో ఏది ప్రథమశ్రేణి కాక పోయినా ఆలోపం లోపమే. ఈ మూడింటిలో ఏది శ్రేష్ఠం, ఏది ప్రథమం, ఏది తర్వాతది అని నిర్ణయించాల్సివస్తే సి.ఎస్.ఆర్. విషయంలో ఇదమిద్ధంగా చెప్పలేమని ఆయన ప్రతిభను కనులారా కాంచిన వారంటారు. రంగస్థలం మీద ఏ పాత్ర ధరించి నప్పుడు ఆ పాత్రకు తగిన శరీర సౌందర్యం, శారీర రమణీయకత, తాదాత్మ్య అభివ్యక్తి వీటిని బట్టి ముమ్మాటికీ గొప్పనటుడని పించుకున్నాడు సి.ఎస్.ఆర్. ఆంజనేయులు. నాలుగు కాలాలపాటు తెలుగు ప్రేక్షకుల హృదయాలలో చిరస్థానం సముపార్జించుకున్నాడాయన. స్థానంతో సమఉజ్జీ అని ప్రశంసకు పాత్రుడున్నూ అయినాడు. సంగీత అభినయ నటనా విశారదుడాయన.

నాట్య శాస్త్రాన్ని భరత శాస్త్రం అంటారు. సంగీత నృత్త నాట్యాలకు పరమ ప్రామాణికమైనది భరత శాస్త్రమే. భరత శాస్త్రాన్ని అపూర్వ మేధావిలసనంగా మూడు ముక్కలలో నిర్వచించాడాయన. భావం రాగం తాళం మూడింటి సమాహారమే భరతుడి నాట్య శాస్త్రం నిరూపించే పరమార్థం అన్నారాయన.

కొందరు లోకంలో కొన్నిటి కోసమే జన్మిస్తారని పెద్దలంటారు. నాటకరంగంలో ఒక గొప్ప వెలుగులా జీవించటానికే సి.ఎస్.ఆర్. జన్మించినట్టు ఆయనన్ను, అభిమానించే వాళ్ళ విశ్వాసం. పదకొండేళ్ల వయసుననే ఆయన రంగస్థలం మీద రాణించాడు. ఆయన జీవించింది యాభై అయిదు సంవత్సరాలే. అంటే నాలుగు దశాబ్దాలు తెలుగు నాటకరంగాన్ని చలన చిత్రసీమను తన అపూర్వ నటనావైదుష్యంతో ప్రభావితం

చేశాడన్నమాట.

వర్చస్వి, మనస్వి, యశస్వి, సి.యస్.ఆర్. కలోపాసన ద్వారా సాంఘిక కర్తవ్యాన్ని కూడా నెరవేర్చిన ధన్యజీవి. జాతీయోద్యమంలో అత్యంత ప్రధాన స్థానం వహించిన హరిజనాభ్యుదయానికి ఆయన తన నాటక ప్రదర్శనల ద్వారా చేయూత నిచ్చాడు.

ఆనాటి సమాజంలో చాలా లోపాలున్న మాట నిజమే కాని ఈనాటి సమాజాన్ని గూర్చి సి.ఎస్ ఆర్. వెలువరించిన అభిప్రాయం గమనార్హం. ఆయన అంటారు స్వీయ జీవిత కథనంలో 'చదువుసంధ్యలు లాంటివి ఆరోజుల్లో అంత ఎక్కువ గా లేక పోయినా ప్రతి వారికి కాస్తో కూస్తో సంస్కారం పాపభీతి ఉంటుండేవి. ఈనాడు చదువు కున్న వాళ్ళలోనే, విజ్ఞాన వంతులమని రొమ్ములు విరుచుకొని తిరిగే వాళ్ళలోనే మూర్ఖులు ఎక్కువ మంది కనపడతారన్నది సుప్రీంకోర్టుకు అపీల్ చేయడానికి అగత్యం లేని సత్యం. వర్తమాన కాలంలో సుగుణాలకంటె దుర్గుణాలే మన సాంఘిక వ్యవస్థను పట్టుకొని పీల్చి పిప్పి చేస్తున్నాయని చెప్పక తప్పదు. ''ఇది గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్''అనే అభిప్రాయం కాక ఆయన జీవితానుభవం అని చెపుతున్నారు వారు. ద్రౌపదీ వస్త్రాపహరణం నుంచి దేవదాసు దాక ఆయన వైవిధ్యం గల పాత్రలు మెప్పించారు చలనచిత్ర రంగంలో. ఇక భక్తరామదాసు, సారంగధర, తులాభారం రాధాకృష్ణ, చింతామణి వంటి నాటకాలలో ఆయన చూపిన ప్రజ్ఞ అనితరసాధ్యం అన్నారు ఆనాటి ప్రేక్షకులు. శ్రీ చిలకపూడి సీతారామాంజనేయులు1907 జూలై 11న గుంటూరు జిల్లా నరసారావుపేటలో జన్మించారు. 1963 అక్టోబర్ 8 న మద్రాసులో పరమపదించారు. ఆయన జీవితం కళా సరస్వతి మంజీర శింజానం.



# జమలాపురం కేశవరావు

పాశ్చాత్య విద్యవల్ల మానసిక దౌర్బల్యం, అందువల్ల సంకుచితత్వం తద్వారా దౌర్జన్య ప్రవృత్తి మన సమాజంలో ప్రబలాయి. మనుషులలో అంతరాలు ఎక్కువైనాయి. వెనకటి తరాలలో కనపడే సారళ్యం, కలివిడితనం, సహానుభూతి సమాజంలో ఇవాళ లోపించాయి.

స్వాతంత్ర్యం యొక్క ఫలితం గ్రామాలను పునర్నిర్మించుకోవడంలో గ్రామీణ ఆర్థిక వ్యవస్థను మెరుగు పరచడంలో పర్యవసించాలి కాని నగరీకరణంలోకాదు.

రైతు దేశానికి వెన్నెముక గ్రామం దేశ సౌభాగ్యానికి పాదు. ఇలాంటి అభిప్రాయాలను ప్రచారంచేస్తూ గ్రామ పునర్నిర్మాణానికి కలలు కనేవారు జమలాపురం కేశవరావుగారు.

ఆయన నలభై అయిదు సంవత్సరాలు మాత్రమే జీవించారు ఆకారంలో ఆలోచనలలో ఉన్నతుడాయన. పరమ నిరాడంబరుడు, స్నేహశీలి, స్వార్థత్యాగి, ఉదాత్తాశయుడు, సాహసి.

ఈ శతాబ్ది పూర్వార్ధంలో అందునా రెండోపాదంలో తెలంగాణంలో జరిగిన ప్రజాపోరాటంలో ప్రజలకు అతి సన్నిహితుడిగా రాగలిగిన గొప్పకార్యకర్త ఆయన. **1908** కీలక నామ సంవత్సరంలో జన్మించారు. **17, 18** సంవత్సరముల వయస్సుననే ఆయన రాజకీయాలలోకి వచ్చారు. నిజాం ప్రజావ్యతిరేక చర్యలకు సంఘటితంగా ఎదుర్కోవడంలో కేశవరావు గ్రామీణ ప్రజలను సమీకరించి వారికి బాసటగా నిలబడ్డారు. **1938** నుంచి ఆయన ప్రజలకు మిక్కిలి ప్రేమ పాత్రుడుగా 'సర్దార్'గా పరిగణింప బడ్డారు. ఎన్నో మార్లు ఆయన జైలు పాలైనారు. అయినా అక్కడ కూడా తమ ఆత్మగౌరవాన్ని సాహసాన్ని ప్రదర్శించారు.

పండిత నరేంద్ర జీకి కేశవరావుగారు మిక్కిలి మిత్రులు. వీళ్ళిద్దరూ కలిసి తెలంగాణాలో

ఎన్నో గ్రామాలు పర్యటించి ప్రజలను భీతావహులను కాకుండా కాపాడారు. తల తెగిపోతుందేమోగానీ నిర్బంధంగా ఎవరూ వంగేట్లు మాత్రం చేయలేరు, అనేది ఆయన గాఢమైన ఆత్మవిశ్వాస ప్రకటనం. రజాకార్ల దుండగాలను, దాడులను ఎదుర్కోగల చిత్తస్థైర్యాన్ని ఆయన గ్రామ గ్రామంలో నెలకొల్పగలిగారు. భారతదేశం స్వాతంత్ర్యం సంపాదించిన తర్వాత కూడా నిజాంతాను స్వతంత్రుణ్ణి కాగలనని పగటి కలలు కంటూ రజాకార్లకు బందీ అయిపోయినాడు. ఆ సమయంలో తెలంగాణంలో బ్రహ్మాండమైన సత్యాగ్రహం చెలరేగింది. గాంధీజీ నిర్వహించిన సత్యాగ్రహోద్యమాలలో మాదిరిగానే వేలాది దేశభక్తులు నిజాం సంస్థానంలో చెరసాలలపాలైనారు. న్యాయవాదులు కోర్టులు బహిష్కరించారు. విద్యార్థులు విద్యాలయాలు బహిష్కరించారు. వేల సంఖ్యలో గ్రామాధికారులు తమ పదవులకు రాజీనామా నిచ్చారు. ప్రజలత్యాగ ఫలితంగా పోలీసుచర్య జరిగింది. హైదరాబాదు సంస్థానం విముక్తమైంది.

జమలాపురం కేశవరావు నిర్మాణ కార్యకర్తగా, ఉన్నతాశయ రాజకీయ నాయికులుగా ప్రజాసందోహాన్ని ప్రభావితంచేశారేకాని పదవుల వేట ఏనాడూ సాగించలేదు. ముఠారాజకీయాల జోలికిపోలేదు. తన తర్వాత తరంవారిని వెన్నుతట్టి తర్ఫీదు నిచ్చారు. ఒక గొంగళి భుజాన వేసుకుని ఆయన గ్రామగ్రామం పర్యటిస్తూ ఉంటే ప్రజలకు ప్రాణం లేచివచ్చేధి. తమబాగోగులు చెప్పుకొనే వాళ్ళు ఆయన వద్ద.

కేశవరావు గారిది ఆరడుగులపైన నిండైన విగ్రహం 'కర్మణ్యేవాధి కారస్తే' అనే తత్త్వం. తనచుట్టూ ఉన్న సమాజాన్ని ప్రబోధించడమే ఆయన కర్తవ్యంగా ఎంచుకున్నారు. హైదరాబాదు సంస్థానంలో అనాడు మత సామరస్యంకోసం ఆయన ఎంతోప్రబోధించారు. కృషిచేశారు. 1938లోనూ 47లోనూ ఆయన జైల్లో బేడీలతో నడుము పటకాలతో గడపవలసి వచ్చింది. ఆయనకు రామాయణ మహాభారతాలంటే చాలా ప్రీతి, దేశంకోసం, సమాజం కోసం తమ సర్వస్వం త్యాగంచేసిన మహానీయుడు సర్దార్ కేశవరావు. మధిర తాలూకా ఎర్రుబాలెంలో 1908 సెప్టెంబర్ 3న కేశవరావు జన్మించారు. తల్లిదండ్రులు వెంకటరామారావు, వెంకట నరసమ్మ గారలు. 1953వ సంవత్సరం ఆయన 45 సంవత్సరాల చిన్న వయసున హైదరాబాదులో మరణించారు. ప్రజాస్వామిక విలువలు ప్రాణాధికంగా ప్రేమించే వాళ్ళకు ఆయన జ్వలిత చేతనుడుగా తరతరాలకు దారిదివ్వె చూపుతూనే ఉంటారు.

★★★★



# ఖండవల్లి లక్ష్మీరంజనం

మూాడు దశాబ్దాలపాటు ఒక విశ్వ విద్యాలయంతో పెనవైమకొన్న జీవితంలో, అదీ ఆచార్యకత్వంలో, విద్యార్థులకు దివ్యస్ఫూర్తి దాయకమైన ఘట్టాలెన్నో ఉంటాయి. ఆచార్య లక్ష్మీరంజనంగారి సన్నిధిలో, ప్రేమవాత్సల్య పెన్నిధిగా ఆయన్ను భావించుకుంటూ ఎన్నోతరాల విద్యార్థులు బ్రతుకు తెరువుకైన విద్యనేగాక బ్రతుకు బరువును వదిలించుకొనే పరమార్థ విద్యను కూడా ఆకలించుకొనే ఉంటారు. ఆయన దగ్గర చదువుకున్న విద్యార్థులంతా ముక్తకంఠంగా ఆయన మంచితనాన్ని ముందుగా ఎంచుతుంటారు. ఆప్యాయమైన మందహాసం అరమరలులేని ప్రేముడి, ఆత్మీయమైన అనురాగం, ఆయన్ను తలుచుకోగానే ముందుగా మనసులో మెదులుతాయి, ఆయనతో శైష్యోపాధ్యాయిక ఏర్పడ్డ విద్యార్థులలో

మాటమెత్తన, మనసూమెత్తన, అంతర్యమూమెత్తన, ఇన్నీ కలిసిన వ్యక్తిత్వం లక్ష్మీరంజనంగారిది. ఆయిన- స్థిర సంకల్పుడుకూడాను. మందరగిరి వంటి భారమైన పనిని కూడా దానిక్రిందకు దూరికూర్మంలా వీపు ఇస్తేచాలు పనిచేసుకపోయే వాళ్ళు వాళ్ళే చేసుకొనిపోతారు అనే గుండె దిటవుగలదొడ్డ వ్యక్తి మేష్టారుగారు. ఆయన సాధించిన సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం అటువంటిది స్థాపించిన సంస్థలు అటువంటివి.

'శక్తిగలవారియందు సౌజన్యమరుదగు సౌజన్యంబుగల వారియందు సామర్థ్యంబుగానబడదు' అనేది సూక్తి 'అదియునిదియు బరగుటను జేసినెత్తావి పసిడి ఇత్తడు' అని వీరేశలింగంపంతులుగారిని ప్రశంసిస్తూ ఒక విద్యార్థి నూరేళ్ళ నాడొక పద్య మల్లాడు. ఆయనతో ఈయనకు పోలికలేక పోయినా స్వభావం మాత్రం సరిపోతుంది.

తెలుగుభాషా సారస్వతసేవ, తెలుగుశాఖ విద్యావిషయిక వికాసం, వీటికి సంబధించి లక్ష్మీరంజనంగారు ఇతడు తనవారు అతడు పరాయివాడు అని అనుకోలేదు ఎప్పుడు. ఆ తరతమభేదాలు ఆయనవి కావు. పని చేయడమంటే ఆయనకు పండుగ. ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతాలలో లక్ష్మీరంజనంగారికి చెప్పదగిన విద్వత్తవుండేది. విశ్వనాథ

సత్యనారాయణగారి (శ్రీ) గిరిశతకాన్ని లక్ష్మీరంజనంగారు ఇంగ్లీషులోకి అనువదించారు. ఏ పని చేసినా ఆచార్యులవారి పరిశ్రమ స్పష్టంగా కనపడటం వారుచేపట్టిన కృషిలో ప్రత్యేకత. కవిత్రయ మహాభారతాన్ని లక్ష్మీరంజనంగారు బహుళ పాఠాంతర, బహుప్రతి పరిశోధిత, పరిష్కరణ ముద్రణగా వెలువరించారు. ఆయన వచనం అచ్చ స్వచ్ఛంగా విశదమనోహరంగా వుంటుంది. కాసెసర్వప్పసిద్ధేశ్వర చరిత్రను లక్ష్మీరంజనంగారు సంపాదించి విపుల పీఠికతో ప్రచురించారు. వారు రచించిన ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి గ్రంథం సాహిత్యపరమైన సామాజిక చరిత్రావిష్కరణం. ఇటువంటి రచనలు తెలుగులో చాలా తక్కువ వచ్చాయి. వచ్చిన గ్రంథాలలో లక్ష్మీరంజనంగారి గ్రంథం విశిష్టమైనది.

లక్ష్మీరంజనంగారి ప్రాథమిక విద్యాభ్యాసం వరంగల్‌లో జరిగింది. స్కూలు ఫైనల్ పరీక్షలో ఆయన డొమినియన్ ఫస్ట్ వచ్చారు. హైదరాబాదులోని నిజాం కళాశాలలో చదివి పట్టభద్రులైనారు. ప్రైవేటుగా మద్రాసు విశ్వవిద్యాలయం ఎం.ఏ.కు కూర్చొని సంస్కృతం, తెలుగు, ప్రథమ గణ్యతగా కృతార్థులైనారు.

లక్ష్మీరంజనంగారు 'గురూణాంగురువు'. ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖ వికాసానికి మూలపురుషుడాయన. అక్కడ జరిగిన భాషాసాహిత్య పరిశోధనకు పట్టుగొమ్మ ఆయన. ఉద్యోగ విరమణానంతరం కూడా లక్ష్మీరంజనంగారు విద్యాసంస్థల అభ్యుదయానికై తెలుగుభాషా సాహిత్యాల వికాసానికై గణనీయమైన సేవలందించారు. **1936** నుంచి **1964** వరకు తెలుగుశాఖ అధ్యాపకులుగా వారు చేసిన కృషిస్తుతి పాత్రం. **1948**లో (శ్రీ) లక్ష్మీరంజనం ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖ అధ్యక్షులైనారు. **1954**లో ఆచార్యులైనారు. తెలుగుశాఖ వికాసానికి ఆయన అగస్త్య నక్షత్రంవంటి వారు. తల్లిదండ్రులు సీతమ్మ, సూర్యనారాయణ శాస్త్రిగారలు.

జననం **1908**, పరమగతి **1986**. లక్ష్మీరంజనంగారి రచనలు తెలుగు దుక్కి, ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి పరిశోధిత ఆంధ్ర మహా భారతానికి పీఠిక, పదకోశాలకు కూర్చిన విషయ వివేచనలు, మరెన్నో పీఠికలు, సంపాదకీయ వివరణలు తెలుగు భాషాసాహిత్యాలకు వెలకట్టరాని భూషలు.

★★★★

# ముదిగొండ వీరభద్రమూర్తి



తెలుగు సాహిత్యపు ఇరవయ్యో శతాబ్దపు మహాకావ్యం వందేమాతరం. ఇది ఆధునిక ఇతిహాసం. మూడువేల పైచిలుకు పద్యాలతో భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రను మనోహరంగా వర్ణించిన ఆధునిక మహాపురాణం ఇది. పద్దెనిమిది ఖండాలుగా విభజించారు దీనిని శ్రీ ముదిగొండ వీరభద్ర మూర్తి. ఆధునిక మహాభారతమని ధ్వని.

ఏ తరంలో కూడా ఆ తరానికి వినిపించవలసిన వీరగాథా కావ్యం ఉంటూనే ఉంటుంది అన్నారు నానాలాల్ అనే గుజరాతీ మహాకవి. ఈయన మన రాయప్రోలు సుబ్బారావులాంటివారు. ఆధునిక కవితా పునరుజ్జీవన ప్రథిత యశస్కుడు. మహాభారత గాథను భంగ్యంతరంగా చేసుకొని కురుక్షేత్రమనే మహాకావ్యం రచించినవాడు. మన వీరభద్రమూర్తిగారు వందేమాతరం, కావ్యం రచించి తెలుగుభాష కావ్య గౌరవాన్ని మహాకావ్య సంప్రదాయాన్ని సుస్థిరం చేశారు. సురుచిర సంపన్నంచేశారు.

కవిగారు ఆంధ్రకేసరి చరిత్రనుకూడా కావ్యీకరించారు. భారత స్వాతంత్ర్య సంగ్రామంపేరిట మహారాణి ఝాన్సీ లక్ష్మీభాయి దివ్యోజ్జ్వలచరితను ఎనిమిది రంగాలుగా కావ్యంగా వ్రాశారు. భారతీయ స్వాతంత్రోద్యమంలో పోరాడిన మహావీరులకే దీనిని అంకితం చేశారు.

వాసవదత్తవంటి ప్రౌఢ బంధుర సుబంధు కావ్యాన్ని అతి మనోజ్ఞంగా తెలుగు చేశారు. మరెన్నో స్తోత్రాలకు తెలుగు సొగసులు చూపారు. ఇంతటి సంప్రదాయ అనురక్తి ఉన్నప్పటికీ భావంలో భాషలో ఆయిన నవీనులలోనవీనుడు. యువకవులతో పోటీపడి వీరభద్రమూర్తిగారు వచనకవితా విహారంకూడా చేశారు. 'తెలుగు ఒక వెలుగు జాతి ఒక జ్యోతి' అనే పేరుతో అచ్ఛంద స్వచ్ఛందఃఖండ కావ్య సంహతిని వీరిటీవల ప్రచురించారు. ఇందులో 58 ఖండికలున్నాయి. ఈ ఖండ కావ్య సంపుటిద్వారా వీరి ఉభయ కవితా మిత్ర మూర్ధన్యత తెలుస్తుంది. ఇందులోని కవితలన్నీ రసవన్మనోహరంగా ఉన్నాయి.

ఈ ముదిగొండ వీరభద్రమూర్తి కీలక నామసంవత్సరంలో జన్మించారు. **(1908)**

ఆయన పుట్టిన తేదీలో మూడు ఎనిమిదిలున్నాయి. ఆగస్టు 8. అయన వ్రాసే కవితలో పరువం కూడా త్రిదశంగానే ఉంటుంది. కవిత్వపు స్పర్శవేది కీలకమేదో ఆయనకు తెలుసు. తల్లిదండ్రులు నాగమాంబా మల్లిఖార్జునారాధ్యులు. పద్దెనిమిదేళ్ళ వయసున శ్రీ వీరభద్రమూర్తి ఇంగ్లండు వెళ్ళారు. మద్రాసులో కేంబ్రిడ్జి సీనియర్ చదివారు. ఇంగ్లండులో ఉన్న కొద్దికాలంలో అక్కడి సమాజ స్వరూపం, ప్రకృతి రమణీయకత ఆయిన హృదయాన్ని హత్తుకున్నాయి. వందేమాతరం మహాకావ్యంలో ఇంగ్లండ్ ఖండంలో ఆ విశేషాలన్నీ రమణీయంగా ఆయిన వర్ణించారు. సువర్ణధార పేరుతో భగవత్పాదుల కనకధారాస్తవాన్ని, ప్రాచీన మహాకవుల శివపంచస్తవిని, దుర్వాస మహామునిరచిత శ్రీదేవీ మహిమ్నస్తోత్రాన్ని అందంగా తెలుగులో చెప్పారు. గిరి మల్లికార్జునస్తవం, మార్కండేయం, ఉద్భటుని ఉపనయనం వంటి ఖండకావ్యాలు మనోహరమైనవి కూర్చారు. కాళేశ్వర ఖండం తెలుగులో చెప్పారు.

రైలు ప్రయాణంలో నిద్రమేల్కొంటూ ఉండగానే ఉదయకాలపు మనోహరమైన సాంధ్యరాగం, సూర్యబింబం, బాట పక్కన నిద్రమేల్కొంటున్న ప్రకృతి, మధ్య మధ్య పలకరించే నిశ్శబ్ద జనపదాలు, కొలకులలో అరవిరుస్తున్న తామరపుష్పాలు, దూరంగా అస్పష్టంగా ఆలయగోపురాలు, క్రమక్రమంగా మిల మిల మెరిసే తళ తళలాడే ఎండ, ఎలాంటి అనుభూతి కలిగిస్తాయో అలాటి అనందోద్వేగాన్ని అనుభూతి సాంద్రతను కలిగిస్తాయి వీరభద్రమూర్తిగారి పద్యాలు.

''సిక్సర్ కొట్టరా! భాయీ!
సెంచరీ సేయరా! బ్రదర్
విక్కెట్ పోనీక ఆంధ్రాభ్యు
దయ క్రిక్కెట్ ప్రఖేలలో'' అని జాతి ఒకజ్యోతిగా అది 'అఖండం'గా చూసుకోవాలని హెచ్చరించారు శ్రీ వీరభద్రమూర్తి. క్రికెట్ పట్ల ఇంత అభిలాషగల శ్రీ ముదిగొండ కవీశ్వరులు జీవితంలో సెంచరీని తప్పక సాధించాలి, సాధిస్తారు.

జీ వేమ శరదశ్శతం
మోదామశరదశ్శతం.
అదివేదం. జీ వత్కావికిది అభివాదం.
కాని ముదిగొండ కవి వెండికొండ 1987లో చేరాడు.

★★★★

# శిష్టా సుబ్బారావు



మానవజీవితం కురుక్షేత్రం. ధర్మా ధర్మాలకు యుద్ధం జరుగుతూనే వుంటుంది. ఎన్నో కష్టాలు వస్తాయి. కన్నీళ్ళు తప్పవు. సంశయమనస్కత తప్పదు. అసహనం నుంచి విముక్తులం కాలేము. ఏదో జరుగుతుందని, ఏదో జరగాలని, సుఖమూ, పేరు ప్రతిష్టలు కావాలని, రావాలని మానవుడు ఆశిస్తాడు. కాని అనుకున్నవి జరగవు. వద్దనుకున్నవి జరుగుతాయి. యోగవా శిష్టంలో ఒక సూక్తి వుంది. సుఖం కోరుకోని మానవుడే ఉండడు. కాని ఆ సుఖం ఏమిటో, అది ఎట్లా సాధించాలో మాత్రం ఎవరూ ఆలోచించరు. అంతేకాదు దుఃఖం కోరుకొనేవాళ్ళు ఎవరూ ఉండరు. కాని దుఃఖం కలిగే పనులు మాత్రం అంతా ఎగబడి చేస్తారు. తాత్పర్యం ఏమంటే సుఖం కావాలి కాని అది కలిగే పనులు చెయ్యరు. దుఃఖం వద్దు. కాని అది కలిగే పనులు మాత్రం చేస్తారు అని.

సుఖదుఃఖాలను నిర్మలంగా నిర్వికారంగా అనుభవించే సాధన అతిసులభంగా, విశదంగా, తేటతెల్లంగా భారతీయ ఆధ్యాత్మిక దర్శనం లోకానికి ప్రసాదించింది. తరతరాలుగా వేల సంవత్సరాలుగా ఆధ్యాత్మిక పరమార్థజిజ్ఞాస భారతదేశంలో కొనసాగుతూనే వుంది. ఎందరో తపస్వులు, మహాపురుషులు, సాధువులు, సంత్‌లు, భక్తులు, దివ్యులు భారతదేశంలో అవతరించి తమ దివ్యవచస్సుధను అందిస్తూనే ఉన్నారు. మానవజీవిత రహస్యాన్ని, దానిని సార్థకం చేసుకొనే తీరుతెన్నులను వారు బోధిస్తూనే వచ్చారు. ఇటీవల కాలంలో రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి, జ్ఞానావతార మహాజ్యోతి స్వరూపులు. వారిని దర్శించిన వారి పుట్టుకలు ధన్యం. అటువంటివారిలో శిష్టా సుబ్బారావుగారి జీవితం చెప్పుకోదగినది. అతి సామాన్య కుటుంబంలో జన్మించి,

శారీరకమైన లోపాలను లెక్కచేయకుండా, శరణాగతితో ఆస్తికతాభావాన్ని ఎల్లెడలా ప్రచారం చేస్తూ జీవితాన్ని సార్థకం చేసుకున్నారు సుబ్బారావుగారు. చిన్నప్పటి నుంచీ సుబ్బారావు గారికి కంటిచూపు సరిగా కనిపించేది కాదు. క్రమేపీ అదిక్షీణించి నడివయస్సు అయ్యేసరికి వారు పూర్తిగా లోచూపునే ఆశ్రయించారు. నలభై నాలుగు సంవత్సరాలు వయస్సు వచ్చే సరికి పూర్తిగా అంధులైనారు. ఇరవై సంవత్సరాల వయసున మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో ఇంగ్లీషు ఆనర్సు చదివి రాజధానికంతకూ నాలుగో రాంక్‌లో కృతార్థులు కావటం వారి ప్రతిభను వెల్లడిస్తున్నది. ఇరవై సంవత్సరాల వయసునుంచే కంటి చూపు ఇబ్బందికరంగా పరిణమించటం వల్ల జీవితంలో ఏదైనా ఉద్యోగం చెయ్యడం పెద్ద సమస్య అయింది. భగవంతుడి కరుణ కోసం మహాపురుషుల వైపు మనస్సు పరుగులు తీసింది. తత్ఫలితంగా శ్రీ సుబ్బారావు గారు అరుణాచలం చేరారు. రమణ మహర్షి దివ్యసాన్నిధ్యం జీవితంలో ఐదారు సంవత్సరాలు అనుభవించారు అటు తర్వాత షిర్డీ సమీపంలోని సాకోరి చేరి ఉపాసనీ బాబా వారి దివ్య సన్నిధిలో అయిదేళ్ళున్నారు. అటు తరువాత హిమాలయ తపోవన భూములలోని హృషీకేశంలో స్వామి శివానంద మహర్షి వద్ద కొన్నాళ్ళు గడిపారు శ్రీ సుబ్బారావుగారి జీవితమంతా గీతాప్రచారానికే వినియోగించారు. కొన్ని వేల సార్లు ఆయన గీతాప్రవచనం చేశారు. ఇంగ్లీషులోను, తెలుగులోను కూడా సరళ సుబోధ విశేష వ్యాఖ్యాసుందరంగా గీతాజ్ఞానాన్ని ప్రబోధించారు. పుస్తకాలు రచించారు. వారి జీవితం జిజ్ఞాసువులకు ఉత్తేజకరం.

సుబ్బారావు గారి స్వస్థలం తూర్పుగోదావరి జిల్లా అమలాపురం దగ్గర సాకుర్రు. తల్లిదండ్రులు లక్ష్మీదేవమ్మ, కామేశ్వర రావు గారలు. జననం **1909**. పరమపదం **1980**.





# దుర్గాబాయ్ దేశ్‌ముఖ్

కాకినాడకు గాంధీజీ వస్తున్నారంటే కోలాహలం. పురమందిరంలో గొప్ప స్వాగత సభ ఏర్పాటుచేశారు. జాతీయోద్యమం నడపవలసిన తీరుగురించి అక్కడాయన ప్రసంగిస్తారు.

దుర్గాబాయ్‌కి పన్నెండేళ్ళ వయస్సు. ఆమె అమ్మానాన్న సాంఘిక సేవాతత్పరులు. వాళ్లపేర్లు బెన్నూరి రామారావు, కృష్ణవేణమ్మ. అప్పటికే కాకినాడలో స్వాతంత్ర్యోద్యమం గాలి బాగా వీస్తున్నది. హిందీలో బాగా మాట్లాడగలదు దుర్గాభాయ్. ఈ చిన్నపిల్ల అప్పటికే హిందీ పాఠశాల నిర్వహిస్తున్నది.

దేవదాసీలు ఆరోజుల్లో చాలా దయనీయమైన స్థితిలో వుండేవారు. గాంధీజీని దర్శిస్తే వాళ్ళలో పరివర్తనం వస్తుందని దుర్గాబాయ్ వాళ్ళను గాంధీజీని చూసి ఆయన ప్రబోధం వినవల్సింది అని ప్రోత్సహించింది. కాని వాళ్ళు బహిరంగసభకి ఎట్లా వస్తారు. ముస్లిమ్ మహిళలు కూడా గాంధీజీని చూడాలనుకున్నారు. కాని వాళ్ళకు ఘోషా అడ్డు వస్తుంది.

సభా నిర్వాహకుల దగ్గరకు వెళ్ళి అర్థించింది దుర్గాబాయ్. తమ ఒక ప్రత్యేక సమావేశానికి గాంధీజీ రావాలని. పన్నెండేళ్ళ ఆరిందా ఇలా పెద్ద మాటలు మాట్లాడుతుంటే వాళ్ళకు కాస్తహాస్యమాడాలని పించింది. గాంధీజీ ప్రతిఅడుగూ ప్రతిక్షణమూ చాలా అమూల్యమైనవి. ఐదువేల విరాళం చదివిస్తే ఆయనకు, దానిదేముంది ప్రత్యేకంగా నీకోసం ఓ సమావేశం ఏర్పాటు చేస్తామన్నారు. సరేనంది దుర్గాబాయ్. వెళ్ళి మహిళలకు చెప్పింది. ఓ! దానికేం అన్నారువాళ్ళు. ఆ డబ్బు వెంటనే వసూలు చేసింది. కాని సమావేశం కావడానికి స్థలం కావాలే. గాంధీజీకి మంచి నీళ్ళు ఇస్తే అరెస్టు చేసే కాలం అది. సభ ఏర్పాటు చేయడానికి జాగా ఎవరిస్తారు. ఐదువేల సంగతి విని పురమందిరం సభలోనే ఆ కానుక సమర్పించరాదా అన్నారు దుర్గాబాయ్‌తో పురప్రముఖులు. అట్లా ససేమిరా వీల్లేదంది ఆ దుర్గ.

బాలికా పాఠశాల హెడ్మాస్టరుశివయ్య శాస్త్రిగారిని కోరగానే సరేనమ్మా మీ సభ పాఠశాల ఆవరణలో జరపండి అన్నారువారు. మిమ్ముల్ని జైల్లో పెడతారేమో అన్నది దుర్గ. అమ్మదూ పన్నెండేళ్ళ చిన్నపిల్లవి నీవు ధైర్యంగా ముందడుగు వేస్తుంటే ముసిలాణ్ణి నేనేమైపోతే ఏం

ఫరవాలేదన్నారాయన.

సభ జరిగింది. రెండు నిముషాలు మాత్రమే సభలో ఉంటారు గాంధీజీ అని పుర ప్రముఖులన్నారు. సరేనంది దుర్గ. స్టేషన్ నుంచి పురమందిరం పోయేదారిలో ఉంది బాలికా పాఠశాల.

రెండు నిముషాలు కాదు: దగ్గర దగ్గర గంటసేపు ఆ దీన యువతులను ప్రబోధించారు గాంధీజీ. దేశంలో మహిళలు సంస్కారవంతులై పురుషుల్ని చక్కదిద్దాలని కోరారు. గాంధీజీ హిందీలో మాట్లాడగా వెంటవెంట తెలుగు చేసి చెప్పింది దుర్గాబాయ్. సభ చాలా జయప్రదమైంది. ఐదువేల రూపాయలాయినకు బహూకరించారు. గాంధీజీ జోలె పట్టారు. మరో 25 వేల రూపాయల విలువ చేసే నగలు నాణ్యాలు ఆయన కక్కడి కక్కడే దూసి ఇచ్చారా మహిళలు. పురమందిరం సభకు కార్లో ఎక్కుతూ దుర్గా నీవూ నాతోరా అన్నారు గాంధీజీ. కారులో కస్తూరిబా ప్రక్కనే కూచుంది దుర్గ. పుర మందిర సభలో గాంధీజీ ప్రసంగానికి తెలుగు అనువాదం చేస్తున్న కొండ వెంకటప్పయ్య పంతుల్ని ఆపి దుర్గా నీవు అనువాదం చెయ్యి అన్నారు గాంధీజీ. అలా ప్రారంభమైంది దుర్గాబాయ్ ప్రజాహిత జీవితం.

ఆమె గొప్ప సంస్థా నిర్మాత్రి. భారతదేశమంతా జేజేలు పలకవల్సిన మహిళామతల్లి. సంఘసంస్కార పరాయణురాలు. ఉత్తమ దేశభక్తురాలు. స్వాతంత్ర్యోద్యమ యోధాగ్రణి శ్రీమతి దుర్గాబాయ్. ఇరవై ఏళ్ళ వయస్సున మద్రాసులో ఆంధ్ర కేసరి ప్రకాశం అరెస్టయిన వెంటనే ఉప్పు సత్యాగ్రహం నడిపిన ధీరవనిత. మూడుసార్లు జైలుకు వెళ్ళింది. మధుర జైలులో నిర్మానుష్య కారాక్లేశం అనుభవించింది. ఐదో తరగతి పాఠశాల చదువు ఆపిన ఆ దుర్గాబాయ్ ఎమ్.ఏ., ఎల్.ఎల్.బి. చదివింది. రాజ్యాంగ నిర్మాణ శాసనసభ సభ్యురాలైంది. గడచిన తరం దేశభక్తుల, మహానాయకుల ప్రశంసలు పొందింది.

మద్రాసులో, హైదరాబాద్‌లో ఆంధ్ర మహిళా సభ సంస్థలు ఆమె దీక్షాదక్షతల కీర్తి పతాక. 46 దేశాలలో నుంచి సాంఘిక సేవా పరాయణతకు ఎన్నికైన ధీమంతురాలు. అక్షరాస్యత వ్యాప్తికి ప్రపంచస్థాయి యునెస్కో పురస్కారం పొందిన ఉజ్జ్వల మహిళామణి. ఆమె పట్టిందల్లా బంగారం. తలచిన తలపెల్లా సంస్థా నిర్మాణం. 1953 లో చింతామణి ద్వారకనాథ్ దేశ్‌ముఖ్‌ను వివాహమాడింది దుర్గాబాయ్. జననం 1909, జూలై 15. ఆమెది సార్థక జీవనం. 1981 పరమపదం. చైతన్యశక్తి ప్రతీక దుర్గాబాయ్.



# శ్రీ శ్రీ



ఇరవయ్యో శతాబ్ది తెలుగు కవితకు కొత్త మార్గం తొక్కించిన వ్యక్తి శ్రీ రంగం శ్రీనివాసరావు. విప్లవ కవితను శ్రీకారం చుట్టి అద్వితీయు డనిపించుకున్నాడాయన.

''పూర్వపు వృత్తాలలో నేటి మాటలు పట్టవు నేటి భాషకు తగిన వృత్తాలూ పాటలూ వాడుకలోకి తీసుకరావలెను'' అన్నారు. గిడుగు రామమూర్తి పంతులుగారు. ''ఋగ్వేద కాలమునాడు కూడా నూతన ఋషులు నవ్య ఋక్కులు చెప్పినారు. అప్పటికి అవి నవ్య సాహిత్యము'' అని చెవుతూ నవ్యసాహిత్యాన్ని దేశ కాల భూమికలను బట్టి ఆదరించాలని అని హితవు చెప్పారు. గిడుగు వారు.

కావ్య వస్తువులో దర్శనంలో అభివ్యక్తిలో పూర్తి కొత్తదనాన్ని సాధించిన ప్రజ్ఞాశాలి శ్రీ శ్రీ. మాటలో మనసులో పాటలో బాటలో 'అను 'రణనం' ఆయనది. నవీనులలో శబ్దం మీద ఇంత అధికారమున్న మరో తెలుగు కవి మృగ్యుడు. ఆధునికులలో మార్క్సిజం వల్ల ప్రభావితులై సాహిత్య కృషిచేసిన వారిలో కూడా శ్రీ శ్రీ అగ్రగణ్యుడు.

మార్క్సిజం బోధించేదేమంటే శ్రామికులకు రాజ్యాధికారం లభించి కార్మిక కర్షకుల నియంత్రణ పరిపాలన కేంద్రీకృతమైతే సామ్యవాద ప్రభుత్వము ఏర్పడి పెట్టుబడి దారి వ్యవస్థ నశించి సంఘంలో కలిమిలేములు రూపుమాసి వ్యక్తి ఆస్తి రద్దయి కళలు, సాహిత్యం మూడు పూలు ఆరు కాయలుగా వర్ధిల్లుతాయని, హెచ్చు తగ్గులు, స్వార్థపరత్వం, దోపిడి, స్వీయ ప్రయోజనం, సామ్యవాదంలో మనటానికి వీలులేదనీ, సామ్రాజ్యవాదం వల్లా, పెట్టుబడి దారి వ్యవస్థవల్లా సంపద సృష్టించే కార్మిక కర్షకవర్గం ఘోరమైన దోపిడికి గురి అవుతున్నారనీ, మార్క్స్ సిద్ధాంతీకరించాడు. వ్యక్తికి ఆస్తిపైన హక్కు, మతం, వర్గ ప్రయోజన తత్పరత్వం సర్వాలనర్థాలకు మూలకారణమని మార్క్సిజం ప్రతిపాదించింది. మార్క్స్ సిద్ధాంతాల వల్ల ప్రభావితమై రష్యాలో 1917లో అక్టోబరు విప్లవం విజయవంతమై ప్రపంచాన్ని కుదిపివేసింది. అయితే సామ్యవాద

సిద్ధాంతం ప్రపంచ రాజకీయ వ్యవస్థను ప్రభావితం చేసిన దానికన్నా సాహిత్య మేధావులను, తత్త్వవేత్తలను, కళాకారులను ప్రపంచ వ్యాప్తంగా ఉత్తేజపరిచింది. ఈ శతాబ్ది మూడో దశకం ముగిసిన తర్వాత స్పెయిన్‌లోని అంతర్యుద్ధం, ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోని ద్రవ్యోల్బణ పరిస్థితులు, ప్రపంచ యుద్ధాల పూర్వాపరాల సంక్షోభ పరిస్థితులు, జీవన నైరాశ్యం, భద్రతారాహిత్యం కళాకారులను, సృజనాత్మక మహాప్రతిభావంతులైన రచయితలను ఉద్వేగపరచాయి. భారతదేశంలో కూడా సామ్యవాద భావాలు సాహిత్యంలో ప్రవేశించాయి. యువ రచయితలను, నవ రచయితలను ఆ భావాలు బాగా ఆకట్టుకొన్నాయి. భావ కవితా యుగం ముగిసి అభ్యుదయ కవితా యుగం మొదలైంది. తెలుగుదేశంలో అభ్యుదయ కవితా ప్రవర్తకుడు శ్రీ శ్రీ. తెలుగు కవిత్వానికి ఆదికవి నన్నయ్యబట్టు ఎట్లాగో 'అభ్యుదయ కవిత్వానికి శ్రీ శ్రీ అటువంటి ఆద్యుడూ,

అగ్రేసరుడూ అయినాడు. సమాజంలో అనాది నుంచీ పీడిత తాడిత వర్గాల జనావళి పక్షం వహించి కవితలు చెప్పాడు. 'పతితులారా, భ్రష్టులారా, బాధా సర్పదష్టులారా, ఏడవకండేడవకండి. మీకోసం కలం పట్టిఆకాశపుదారులంట హడావిడిగా వెళిపోయే జగన్నాథ రథచక్ర ప్రళయఘోష భూ మార్గం పట్టిస్తా'నని సమాశ్వాసం కొలిపాడు. 'పొలాలనన్నీ హలాలదున్నీ ఇలాతలంలో హేమం పిండగ, పరిక్రమించే పరిశ్రమించే శ్రమజీవి' ధర్మ జలానికి, ఘర్మ జలానికి, ఖరీదు కట్టే షరాబులేడని ప్రకటించాడు. 'భూతాన్ని, యజ్ఞోపవీతాన్ని, వైప్లవ్య గీతాన్ని అని ఉద్యమించాడు. రుద్రాలికనయన జ్వాలిక, కలకత్తా కాళిక నాలిక, ఘూటెత్తిన గందకధూమం, పోటెత్తిన సప్తసముద్రాల్, పీడిత తాడితులను ప్రబోధించే కవితకు సంకేతాలు కావాలని ఉద్బోధించాడు. 'యముని మహిష పులోహ ఘంటలు' అనీ కనకదుర్గా చండసింహం ఫీకరించీ జూలూ దులిపిందీ, అని జాతీయ భావధారను, సంప్రదాయ సంకేతాలను వాడుకొన్నాడు శ్రీ శ్రీ. అందువల్లనే ఆయన కవితలో ఆ శక్తి పెల్లుబికింది. కొందరు యువకులు వెళ్ళి తామొక కొత్త పత్రికను పెడుతున్నామనీ దానికేదైనా మంచిపేరు సూచించవలసిందనీ ఆయనన్ను అడగగా 'సుషుమ్న' అని పేరు పెట్టండి - అని అయన సూచించినట్లు చెపుతారు.

శబ్దం మీద శ్రీ శ్రీ చెలాయించగల ప్రభుత - ఆయన సమకాలికులలో మరెవరికీ లేదనడం అతిశయోక్తి కాదు. **1930-40** మధ్య ఆయన రచించిన కవితలు మహా ప్రస్థానం అనే సంపుటంగా వచ్చి ఆ తర్వాత రెండు దశాబ్దాలు నవ కవులకు లక్షణ గ్రంథమైంది.

ఆయన వచనం ఎక్కువ రాయలేదు, అస్తిత్వ వాదం, చైతన్య ప్రవంతి, అరాచక వాదం, నైరూప్య వాదం వంటి పాశ్చాత్య దేశాల కళా సాహిత్య ప్రయోగాలను తెలుగు సాహిత్య మాధ్యం ద్వారా పరిచయం చేయాలని ప్రయత్నించాడు.

ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యంలో విలక్షణ కవితాయుగ ప్రవర్తకుడు శ్రీ శ్రీ.

తల్లిదండ్రులు అప్పలకొండ, వేంకట రమణయ్యగారలు. జననం **1910.** మరణం **1983.** జన్మస్థలం: విశాఖపట్నం.

****

# తిరుమల రామచంద్ర



ఇరవయ్యోశతాబ్ది రచయితకు అద్వైతం నుంచి అణుస్ఫోటనం వరకు తెలిసి ఉండటం అవసరం అన్నాడు ఆర్థర్ కోస్లర్ అనే గొప్ప తాత్త్విక సాహిత్యవేత్త. వెనుకటి కాలంలోమాదిరి తర్కమో, వ్యాకరణమో, న్యాయమో, సాహిత్యమో, పన్నెండేళ్ళో, పదహారేళ్ళో చదివి అందులో నాకెవరూ ఎదురుండకూడదు, అనే దృక్పథం కాదు ఇవాళ కావల్సింది. విజ్ఞాన పరిధులు విస్తరించి ఏకకేంద్ర అనుబంధ వృత్తాలవు తున్నాయి వివిధ విజ్ఞాన శాఖలు. విజ్ఞాన శాస్త్రాలు, మానవీయ శాస్త్రాలు, కళలు పరస్పరభావభూమికల సిద్ధాంతాల అనువర్తిత జిజ్ఞాసలకు దోహదకారులవుతున్నాయి పురాచరిత్ర, శాసన విజ్ఞానం, లిపి విజ్ఞానం, మానవశాస్త్రం, జానపద సంస్కృతి, దేవాలయ వాస్తు శిల్ప సంప్రదాయం , మొదలైన విషయాల పరిజ్ఞానం ఉంటేకాని సాహిత్య సాంస్కృతిక సామాజిక పరిణామాల సమన్వయం అవగాహనకాదు ఇవాళ.

శ్రీ తిరుమల రామచంద్రగారిది ''ఏకవిద్యా సురక్షితా'' తత్త్వంకాదు తాము ఏ విజ్ఞానాన్ని తరచిచూసినా దాని సురక్షితత్వాన్ని తెలుసుకొనే ప్రవృత్తి ఇంత బహుముఖమైన జిజ్ఞాస స్థాన, సమగ్రమైన సాహిత్యమూర్తి మంతం, వర్తమాన కాలంలో అసాధారణ దృగ్విషయం అనటం అతిశయోక్త్యలంకారంకాదు.

తర్క కర్కశవాదవివాద మేధాప్రదర్శన సంరంభం ఎన్నడూ వారివద్ద కానరాదు. మహాభాష్యాన్ని ఆలవోకగా పారంచెప్పగల మహాపండితుడు శబ్దమంజరిని బోధించాల్సివస్తే

ఎంత సారస్యంగా చెప్పగలరో అట్లా తమకు తెలిసిన విషయాన్ని సులభంగా లలితంగా చెప్పగలరు రామచంద్ర.

బహుభాషా సాహిత్య పరిచితి, సంప్రదాయం పట్ల గౌరవం, ఆధునికత పట్ల అనురాగం, అభ్యుదయదృక్పథం, దేశకాల సిద్ధాంత సేవితం కాకుండా, సమగ్రమానవ వికాసం, విలువలపట్ల అనురక్తి కలబోసిన రచయితగా శ్రీరామచంద్రను అర్థంచేసుకోవచ్చు.

పాతకాలానికీ కొత్తతరానికీ ఆయన ఒకవంతెన వంటివాడు. ఆయన సాహిత్యయాత్రలో నూతనావిష్కరణలు చాలా ఉన్నాయి. అవదానకల్పలత, లలిత విస్తరం, హిందువుల పండుగలు, నుడినానుడి, సాహితీసుగతుని స్వగతం, మన లిపి పుట్టుపూర్వోత్తరాలు, గాథాసప్తశతిలో తెలుగుపదాలు మొదలైనవన్నీ నూత్నగవేషణ ఫలితాలే. అపూర్వాలే. అయనను మిత్రులు, అభిమానులు, సాహిత్యపథస్మృతులను వ్రాయివలసిందిగా కోరితే 'హంపీనుంచి హరప్పా' అనిపేరు పెడుదునా, 'కమలా పురంనుంచి క్వెట్టావరకు' అందునా అని విచికిత్సను ఆస్వాదిస్తారు శ్రీరామచంద్ర. జీవితంలో ఇప్పటికి నాలుగు దశాబ్దాలపైననే శ్రీరామచంద్ర పత్రికారచయితగా సుప్రసిద్ధులు. ఆయన స్వాతంత్రోద్యమ వీరోచితరణరంగంలో పాల్గొన్నారు విరోధులకు పట్టుబడ్డారు. ఆనాడు మద్రాసుకుట్రకేసుగా ప్రసిద్ధి వహించిన .రాజకీయ నిర్బంధితులపై పభుత్వంమోపిన

సంచలనాత్మక అభియోగంలో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు వీరిపక్షాన వాదించారు.

తిరుపతి సంస్కృత కళాశాలలో సాహిత్యమూ వ్యాకరణమూ చదువుకుంటూ స్వాతంత్రోద్యమం పట్ల ఆకర్షితులై జైలు జీవితంకూడా గడిపారు. విశాలమైన దేశంలో విస్తృతమైన పర్యటనం వల్ల ఎందరో మహావిద్వాంసుల పరిచయం వీరికి లభించింది. మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకరశాస్త్రి వంటి మహనీయులతో కలిసి పనిచేసే అదృష్టం వీరికి కలిగింది బరోడా మహారాజా సంస్కృత సంస్థలో తాళపత్రగ్రంథాలయంలో పని చేసే సదవకాశం కాస్తలో తప్పిపోయింది. అయితే లాహోర్ లో ప్రాచ్య విద్యా మహా సంస్థలో వెయ్యిగ్రంథాలకుపైగా వివరణ సూచి తయారు చేశారు. 2సం.లుండి పన్నెండు సం.లు ఆంధ్రప్రభలోను, పదేళ్ళు ఆంధ్రపత్రిక సంస్థలోను, ఐదేళ్ళు ఆంధ్రభూమి దినపత్రిక లోను, అటుతర్వాత 4సం.లు హైదరాబాదులో పురావస్తు విజ్ఞాన సంస్థలో పనిచేశారు జైల్లో ఉండగా అంటే ఇరవై రెండేళ్ళ వయస్సునే ' సత్యాగ్రహవిజయం' అని సంస్కృత నాటకం రచించారు. 'భింధిభింధిభారతీయ మాతృ దాస్య శృంఖలం ' అనిపైనికోత్తేజకదన కుతూహలగీతం కారాగారంలోనే రచించారు గౌరీశంకర శిఖరంపై స్వతంత్ర భారత పతాకను అనాడే కాంక్షాదర్శనం చేశారు. సైన్యంతో 3సం.లున్నారు హవల్దారు గుమాస్తాగా. కాశీపండిత పరిషత్తు సత్కారం పొందారు. తంజావూరు సరస్వతీ మహలులో ఉద్యోగించారు. పరిశోధన

అనేగొప్ప పత్రిక 3సం.లు నడిపారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం **1970,80**లలో రెండుసార్లుపొందారు. వీరి పూర్వులు విజయనగరం మహారాజులకు వంశపారంపర్య ఆచార్యులు జననం **1913.** తల్లి దండ్రులు జానకమ్మ, శేషాచార్యులు.



# పుట్టపర్తి నారాయణాచార్యులు



చరిత్ర కొందరిని సృష్టిస్తుంది చరిత్రను కొందరు సృష్టిస్తారు. సాహిత్య చరిత్ర విషయంలో కూడా ఇది నిజం మన ప్రాచీన కవులు వాళ్ళ ఉద్గ్రంథాలు, వాళ్ళు జీవించిన ప్రదేశాలు, ఆనాటి కళా సాహిత్య సాంస్కృతిక విభవోజ్జ్వల ఘట్టాలు, ఆదేవాలయాలు, ఆ నగరాలు నేటికి కూడా సాహిత్య చరిత్ర విద్యార్థికి ఉత్తేజం కలిగిస్తూనే ఉంటాయి. అటువంటి వ్యక్తిత్వం పుట్టపర్తి వారిది

తటాకం ఎంత అందంగా ఉన్నా ఎంత విశాలంగా ఉన్నా ఒక పట్టణానికో నగరానికో జీవనప్రద పరిమితం మహానది అట్లాకాదు. తనదైన ఒక గాంభీర్యం, ఒక విశిష్టపథం ఒక సాంస్కృతిక పరిపోషకత్వం ఒక చరిత్ర మహానది జీవన పథాన్ని ఒక జాతి జనులకు ప్రియతమం చేస్తుంది.

వెనకటి కాలంలో అష్టభాషా విశారదులనీ చతుర్విధ కవితా ప్రవీణులనీ శతఘంటక వన విరాజితులనీ - ఇలాంటి ఉదంతాలుండేవని పుస్తకాలలో చదువుతాం ఇప్పుడు చాలా తక్కువ సందర్భాలలో మాత్రమే అలాంటివి కనపడతాయి వినపడతాయి. పుట్టపర్తి నారాయణాచార్యులు గారు ఆధునిక భారతదేశంలో బహుభాషా పండితులలో ఒకరు. సంగీత సాహిత్యాలలో నిష్ణాతులు. వాగ్గేయకారులు. కొన్ని వేల కృతులు వీరు రచించారు. భరతనాట్య శాస్త్రంలో కూడా వీరికి పాండిత్యం ఉంది.

ఒక్కొక్క కవి పేరు చెప్పగానే వారి ప్రసిద్ధమైన రచన ఒకటి వెంటనే స్ఫురిస్తుంది. లోకంలో పుట్టపర్తి వారి పేరు చెప్పగానే అట్లా స్ఫురించేది వారి శివతాండవం. ఈ రచనలో వారి సంగీత సాహిత్య నాట్య శాస్త్ర పాండితీ ప్రతిభ అంతా దర్శనీయం. ఆంధ్రదేశంలో ఈ శివతాండవాన్ని వారు కొన్ని వేల సభలలో విన్పించి ఉంటారు. రాసికి గాని వాసికి గాని ఒక మహాసృజనాత్మక ప్రతిభా విరాజతకు కాని సాగర

తీరంలో విశ్వనాథవారితో పోల్చదగిన రాయలసీమ మహా రచయిత పుట్టపర్తి వారు. అయితే విశ్వనాథలో కనపడని కొన్ని ప్రత్యేకతలు పుట్ట పర్తి వారిలో ఉన్నాయి. విశ్వనాథతో పోల్చినప్పుడు పుట్టపర్తి వారికి కూడా ఇది వర్తిస్తుంది. తన గ్రంథాన్ని తానే పరీక్ష పాఠ్యంగా చదవడమనేది లోకంలో వింతలలో వింత. పుట్టపర్తి వారు రచించిన పెనుగొండలక్ష్మి అనే ఖండకావ్యం విద్వాన్ పరీక్ష రాయడానికి ఆయనే చదువుకున్నారు. నవ్యులలో శతాధిక గ్రంథకర్తలంటూ చెప్పవలసి వస్తే వ్రేళ్ళమీదకైనా ఆ పేర్లు రావేమో! పుట్టపర్తి వారి గ్రంథాలు నూటికెప్పుడో మించి పోయినాయి. తెలుగుతో పాటు తమిళ, మలయాళ, కన్నడ భాషలలోనూ మహారాష్ట్రంలోనూ ఆచార్యుల వారు గొప్ప పండితులు. ఆయాభాషలనుంచి సుప్రసిద్ధ రచనలను ఇతర భాషలలోకి వీరు పరివర్తనం చేశారు.

పండరి భాగవతం ఇరవై నాలుగు వేల ద్విపదకావ్యం. పుట్టపర్తి వారి జనప్రియ రామాయణం సంగీత తరంగ సాహిత్య రసధుని. ఇన్ని భాషలలో గొప్ప పండితులై ఇన్ని రచనలు చేసిన వారు నేడు ఇంకొకరు లేరు.

తల్లిదండ్రులు శ్రీమతి లక్ష్మమ్మ, శ్రీ శ్రీనివాసాచార్యులు. జననం **1914.** జన్మస్థలం అనంతపురం జిల్లా చియ్యేడు చతుర్దశ దేశ భాషా విశారదులు, మహాకవి, **సంగీతం సాహిత్యం** సరి తూచిన త్రాసు శ్రీ పుట్టపర్తి నారాయణా చార్యులు. పరమ **పదం 1990.**

★★★★

# విద్వాన్ విశ్వం



ఆధునిక సాహిత్యంలో విశేషమేమంటే ప్రజల జీవితమే కావ్య వస్తువు కావడం. సామాన్యుడు సాహిత్యంలో మాన్యుడు కావడం. వాస్తవిక సృజనాత్మకతకు విలువ, ఆదరం హెచ్చడం సాహిత్యంలో ఊహాలోక విహారం తగ్గడం తాను జీవిస్తున్న సమాజం, తన అనుభవాలు, సమాజంలో వస్తున్న పరిణామాలు, వీటి పట్ల స్పృహ ఆధునిక రచయితకు అవసరం అని గుర్తించటం జరిగింది.

విద్వాన్ విశ్వం ఆధునిక రచయితలలో పండితులు, వ్యుత్పన్నులు. ఒక వైపున సంప్రదాయం పట్ల పరినిష్ఠితమైన బుద్ధి, సదవగాహన, మరొక వైపున ఆధునిక సామాజిక శాస్త్రీయ సిద్ధాంతాలు బాగా ఆకళింపు చేసుకున్నవాడాయన.

భాషా శాస్త్రం, వ్యాకరణం ఆయన అభిరుచితో అధ్యయనం చేశాడు ఇందుకు చిలుకూరి నారాయణ రావు గారి సాన్నిహిత్యం చాలా దోహదం చేసింది. చిన్నతనంలోనే కాశీ వెళ్ళి సంస్కృత పాండిత్యంలో మెరుగులు దిద్దుకున్నారు. ఈ విధంగా పాండిత్యం గడించినా పత్రికలలో పని చేయడం వల్ల సామాజిక విశాల దృక్పథం అలవడింది విశ్వంగారికి. పదిహేడేళ్ళ తారుణ్యంలోనే ఆయనకు చిలుకూరి నారాయణరావు గారి పరిచయం ఏర్పడింది. ''మీకో బంగారం ముద్ద తెచ్చాను. ఏం చేస్తారో చేసుకోండి'' అని కల్లూరి సుబ్బారావు గారు నారాయణరావు గారికి విశ్వం గారిని అప్పగించారుట. నారాయణరావు గారిసిఫార్సు ఉత్తరంతో విశ్వం కాశీ వెళ్ళారు. ఎ.బి. ధ్రువ, విధుశేఖర భట్టాచార్య వంటి పెద్దల, మహాపండితుల మన్ననలు పొందారు. రాయలసీమలో స్వాతంత్ర్యోద్యమ రాజకీయాలలో కూడా విశ్వంగారు ముందున్నారు. అనంతపురం జిల్లా కాంగ్రెసు సంఘానికి ముఖ్య కార్యదర్శిగా పని చేశారు. రాయలసీమ జాతీయోద్యమ పితామహులు కల్లూరి సుబ్బారావుగారికి, సుప్రసిద్ధ పత్రికా రచయిత పప్పూరి రామాచార్యులు గారికి దగ్గర వారైనారు.

శ్రీ విద్వాన్ విశ్వం **1950**లో కిన్నెర పత్రికలోనూ భారతిలోనూ వ్రాసిన

పుస్తక సమీక్షలు, వివిధ వ్యాసాలు ఎంతో అమూల్యమైనవి. జాన్ క్రిస్టోఫ్ రచించిన ప్రపంచ ప్రసిద్ధ నవల 'రోమారోలాను' ఎంతో చక్కగా అనువదించారు విద్వాన్ విశ్వం. మూడు దశాబ్దులకు పైగా ఆంధ్రప్రభ వారపత్రికలో మాణిక్య వీణను ఆయన పలికించారు.

విద్వాన్ విశ్వం గుర్తురాగానే తళుక్కున స్ఫురించేది వారి పెన్నేటి పాట కావ్యం. ఆధునికాంధ్ర సాహిత్యంలో ఈ పెన్నేటి పాట కావ్యానికి విశిష్ట స్థానం ఉన్నది. రాయలసీమ గ్రామీణ జీవనాన్నంతా ఈ కావ్యంలో ఆయన ప్రతిబింబింప చేశారు. పెన్నేటి పాట ఐదు సర్గల ఆధునిక కావ్యం. నారపరెడ్డి అనే మోతుబరి రైతు చితికి పోవడం అతడి కొడుకైన రంగడు ఆ పల్లెటూళ్లో బ్రతికిన తీరు ఈ కావ్యంలో ఇతి వృత్తం. "ఇదె పెన్న ఇదె పెన్న నిదానించినదు, విదారించు నెదన్ వట్టి ఎడారి తమ్ముడు" అని ప్రారంభమయ్యే ఈ కావ్యం రాయలసీమ పల్లెటూళ్ళ కరుణగాధను వినిపిస్తుంది ఒక ముద్దరాలి శీలాన్ని రక్షించటంలో తన ప్రాణాలనే బలిదానం చేసిన గొల్లహంపన్న ధైర్య సాహస కారుణ్య గాధను 'ఒకనాడు' అనే పేరుతో శ్రీ విశ్వం కావ్యీకరించారు. గుత్తి రైల్వేస్టేషన్‌కు సమీపంలో ఒక యూరోపియన్ సైనికుడు ఒక అబలను చెరపట్టపోగా హంపన్న ఆ సైనికుణ్ణి తుదముట్టించిన గాధ ఇది.

కాళిదాసు కావ్యాలను, మాఘు, బాణభట్ట, భారవి, దండి కవుల కావ్యాలను చక్కని వచనాకృతులుగా తీర్చిదిద్దారు విశ్వం. ఆధునిక వచన రచయితలలో విశ్వం గారి స్థానం పదిలంగా ఉంటుంది. జననం **1915** మరణం **1986.** తల్లిదండ్రులు శ్రీమతి లక్ష్మమ్మ, రామయ్యగారలు. జన్మస్థలం అనంతపురం జిల్లా తరిమెల.



# పాలగుమ్మి పద్మరాజు



పాలగుమ్మి పద్మరాజు 1915వ సంవత్సరంలో పుట్టాడు. మొదటి కథ 1938 లేదా 39 లో ప్రచురించానని ఆయన చెప్పాడు. ఆధునిక తెలుగు సాహిత్యంలో పద్మరాజు గొప్ప కథకుడుగా కీర్తి పొందాడు. తెలుగు కథకు అంతర్జాతీయమైన ఖ్యాతిని గూడా తెచ్చాడు. ఆయిన నాలుగు దశాబ్దాల రచనా వ్యాసంగంలో సుమారు **60** కథలు వ్రాసినట్లు ఆయిన గూర్చి రాసిన వాళ్ళు లెక్కలు' తేల్చారు. ఐదారు నవలలు కూడా రచించాడు పద్మరాజు. రామరాజ్యానికి రహదారీ, నల్లరేగడి అందులో బాగా పేరుతెచ్చుకున్నాయి. బతికిన కాలేజి, రెండో అశోకుడి మూణ్ణాళ్ల పాలన ఆయిన హాస్య నవలలు పద్మరాజు కవిత్వంతోనే తన సాహిత్య జీవితం ప్రారంభించాడు. కాని చాలా తొందరగానే కవిత్వం మానేశాడు.

పద్మరాజు కథారచనలో మూడు రకాలైన విశిష్టతలున్నాయి. ఆయిన ఎన్నుకొనే కథా వస్తువు, చెప్పే తీరు, భాష ఆ మూడున్నూ. ఆయిన మేధావి, రచయిత. హృదయోద్వేగాన్ని మేధా స్పందనతో నియంత్రితం చేసినప్పుడే ఆయిన రచన వెలువడుతుంది అనిపిస్తుంది. తాత్త్విక చింతనం కోసమే ఆయన కథ రాయకపోయినా కథలన్నిటా ఒక తాత్త్విక మధనం కనపడుతుంది. ఆయిన వాడుకొనే ఉపమానాలు, వాక్య సంయోజనం, శైలి కూడా ఒక గాంభీర్యాన్ని ఆయిన రచనలకు చేకూర్చటం చూడవచ్చు.

పద్మరాజు రచనల్లోనూ, జీవితంలోనూ కూడా హృదయస్పందనం ఎక్కువగా కన్పిస్తుంది. శబ్దగ్రాహక యంత్రాలు, కాంతిగ్రాహక యంత్రాలు కొన్ని అత్యంత శక్తివంతంగా పనిచేయుగలవి, ఆశ్చర్యం కలిగించేంత సున్నితమైనవి ఆధునిక విజ్ఞానం రూపొందించింది. మానవ జీవితాన్ని ఆ విధంగా సునిశితంగా మనోఫలకం మీదకి తెచ్చుకోగల శక్తిమంతుడు పద్మరాజు. ఏడెనిమిదేళ్ళ వయసునుంచీ తన పరిసరాలను మనోఫలకం మీద ముద్రించుకోగలగిన సూక్ష్మగ్రాహకత ఆయనలో వృద్ధి చెందుతూ వచ్చింది. తన చిన్నతనాన పసి మనస్సున భావ ముద్రవేసిన ఆ వ్యక్తులను,_ ఆ

ప్రవృత్తులను, ఆ మానవీయమైన సంబంధాలను, ఆ ఉద్రేకాలను, మానవ సంబంధ ఉద్వేగాలను ఆయన కథస్థం చేశాడు. అందుకే వాటిలో వాస్తవికతాశిల్ప విలక్షణత కనపడుతుంది.

పద్మరాజు తాను చేసిన సాహిత్య సృష్టికన్నా, ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యాలు ఆకళింపు చేసుకోవటానికి ఆయిన చేసిన కృషి చాలా ఎక్కువ. అంటే రాసిన దానికన్నా ఆయన ఎన్నో రెట్లు ఎక్కువగా చదివాడు. అందువల్ల ఆయన రచనల్లో ఒక చిక్కటనత్వం, నైశిత్యం కనపడతాయి.

1952వ సంవత్సరంలో తెలుగు కథా సాహిత్యానికి మహోన్నతమైన గుర్తింపును తెచ్చాడు పద్మరాజు ఆయిన అంతర్జాతీయ కథారచన పోటీకి పంపిన గాలివాన కథకు రెండో బహుమతి రావడమే ఆ గుర్తింపు. న్యూయార్కులోని ఒక సుప్రసిద్ధ పత్రిక ఈ కథల పోటీ నిర్వహించింది కొన్ని విపరీతమైన పరిస్థితులలో మానవ హృదయం ఏ విధంగా ప్రతిస్పందిస్తుందో చెప్పే కథ ఇది. మానవుడి ప్రవర్తనకు అతడి అంతరంగ ప్రకృతికీ, బహిరంగ ప్రకృతికీ ముడివడి ఉండే సంబంధాన్ని ఈ కథ గొప్పగా ప్రతిపాదించింది. తాను చీదరించుకున్న బిచ్చగత్తె విపత్కాలంలో తనకెంత ఆసరా అయిందో మానవుడి అతిశయం, కృత్రిమత్వం, మానవత్వం మేల్కొన్న వేళ ఎలా కరిగిపోతాయో నిరూపించే కథ ఇది.

యోగ సాధకులకు సాధారణ మానవులకు సృష్టిలో కనపడనివీ, వినపడనివీ కొన్ని రంగులు, రుచులూ నాదాలు అనుభూతమవుతాయింటారు. అటువంటి శక్తి ఏదో పద్మరాజుకు ఉందనిపిస్తుంది. నిశితమైన చూపుగలవాళ్ళు కొందరు వ్యక్తులను చూడగానే 'ఎక్స్‌రే'లాగే వాళ్ళ స్వభావాన్ని, ప్రకృతిని అంచనా వేయగలుతారంటారు అటువంటి ప్రజ్ఞ ఉన్నది పద్మరాజుకు. పడవ ప్రయాణం కథలో స్త్రీ పురుష సంబంధాల అనాది అగాధతత్వాన్ని ఆవిష్కరించాడు పద్మరాజు. అది ఆ కథకు కళాత్మక శిల్ప తాత్వికతను తెచ్చింది. గాలివాన, ఎదురుచూస్తున్న ముహూర్తం, పడవ ప్రయాణం ఈ మూడు పద్మరాజు రాసిన గొప్ప కథలు. రామరాజ్యానికి రహదారి స్వాతంత్ర్యోద్యమం నాటి సామాజిక స్పందనలను వివరించే మంచి నవల. నల్లరేగడి నగరీకరణం ప్రభావం పడక ముందే తెలుగుదేశపు గ్రామీణ వాతావరణాన్ని ప్రతిభావంతంగా చిత్రించిన కవితా స్పర్శగల నవల.

రాసింది తక్కువ అయినా వాసిలో మెచ్చదగిన రచనలు చేయిడం పద్మరాజు విశిష్టత. పాలగుమ్మి పద్మరాజు 1983లో స్వర్గస్థుడైనాడు. పరిపక్వమైన జీవితానుభవంతో మేధతో ఆయన ఇంకా కొన్ని రచనలు చేస్తే బావుండేది. ఆ అదృష్టం తెలుగువారికి లేకపోయింది. ఇంత గొప్ప రచయిత సినిమారంగంలో ప్రవేశించి రాణించలేక పోవడం ఈ కాలపు దుర్లక్షణాలలో విషాదకరమైనది.



# బుచ్చిబాబు



ఇరవయ్యో శతాబ్ది తెలుగు రచనలలో ఒకేఒక్క నవల వ్రాసి గొప్ప రచయితగా నిలిచిపోయిన వాళ్ళు బుచ్చిబాబు తప్ప ఇంకో రచయిత కనపడరు బుచ్చిబాబు కవితాత్మగల చిత్రకారుడు. చిత్రకళా కోవిదుడైన కవి తాత్త్వికుడైన సృజనాత్మక ప్రతిభాశాలి. ఆర్ద్రత, అవగాహనలతో కూడిన సంప్రదాయ గౌరవం, వర్తమానంతోతాదాత్మ్యం, ఆధునికత పట్లమక్కువ, భవిష్యత్తుపట్ల మమత, మానవ సమాజం మనుగడపట్ల కరుణ, ఆశ తన రచనలలో వెలార్చిన మేథావి రచయిత. సౌందర్య పిపాసి విశ్వలయను గుర్తించినవాడు సృష్టిపరమార్థం తెలుసుకునేందుకు సాహిత్యం ద్వారా తపించినవాడు పువ్వులు, మబ్బులు, నింగీ, నేలా, వెన్నెలా, వెలుగూ, కొండలూ, కోనలూ, చెట్లూ, పక్షులూ, ప్రకృతీ, పురుషుడూ, అనే ప్రపంచాన్ని సమాహారాత్మక సౌందర్య రూపంగా దర్శించినవాడు. అంతరంగ కథనాన్ని వినిపించినవాడు జీవితంలో పరిసర ప్రభావాల స్వరమేళను గుర్తించ గలిగినవాడు, సాహిత్యాన్ని వేదాంతంలా, వేదాంతాన్ని సాహిత్యంలా చదువుకున్న వాడు చదువులలో సారం గ్రహించగలిగిన జిజ్ఞాసి

బుచ్చిబాబు కథకుడిగా నవలారచయితగా ప్రసిద్ధుడు. ఆయన **60, 70** కథలు, చివరకు మిగిలేది అనే నవల, కొన్ని నాటికలు, ఒకటో రెండో నాటకాలు, మరికొన్ని వ్యాసాలు తన సాహిత్య జీవితంలో సృష్టించాడు. చిత్రమైన విషయం ఏమంటే ఆయనకు సంగీతాన్ని గురించి, చిత్రకళను గురించి, సాహిత్యాన్ని గురించినంత సాధికారంగా తెలుసు. చిన్నప్పుడు తనను ఎంతగానో కరగించిన, కదిలించిన బాలగంధర్వను చూదామని పూనా వెళ్ళి చూసి 72 సంవత్సరముల వయసు పైబడిన ఆయనతో తన చిన్నప్పటి ఇష్టమైన అనుభూతి పొందిన మనస్వి బుచ్చిబాబు. రవీంద్రనాధఠాగూర్ కాబూలీవాలా కథ చదివినప్పుడల్లా కళ్ళు చెమ్మగిలుతాయి అని వ్రాసుకోగలిగిన

మనస్సౌకుమార్యం కలవాడు.

అంతరంగకథనం పేరిట తన పదిహేనేళ్ళ బాల్యజీవితానుభవాలను ఆయిన వ్రాసుకొన్నాడు ఇటువంటి ప్రయత్నం తెలుగులో ప్రఖ్యాతులైన రచయితలు కూడా ఎవరూ చేసినట్టులేదు. మరీ పసితనం 5 సంవత్సరములు వదిలేస్తే పదేళ్ళ తన చిన్నప్పటి స్మృతులను బుచ్చిబాబు అద్భుతంగా యీ పుస్తకంలో చెప్పాడు. ఈ చిన్నపుస్తకం చదువుతుంటే రకరకాల అనుభూతుల్ని, ఉద్వేగాలను స్పందింపచేసే సంగీత కచేరీలో ఉన్నట్లుంటుంది. బుచ్చిబాబు సున్నితమైన భావుకుడు. ప్రకృతిలోని అందచందాలపట్ల ఎంతో తాదాత్మ్యభావం చూపిస్తాడు. తను సృష్టించిన పాత్రలు, వాతావరణం, వీటి మూలప్రకృతులను ఆయిన అంతరంగ కథనంలో వివరించాడు. రామాయిణంలో సీత పాత్రకూ భారతంలోని ద్రౌపది పాత్రకూ ఉండే తారతమ్యాన్ని ఎంతో భావుకంగా వర్ణించాడు బుచ్చిబాబు అంతరంగ కథనంలో. ఈ శతాబ్ది మొదటి మూడు దశాబ్దాలనాటి తెలుగుదేశపు సామాజిక వాతావరణం, కళలు, కవిత్వం, నాటకాలు, సినిమాలు ఆయిన ఈ స్మృతి గ్రంధంలో కళాత్మకంగా వర్ణించారు. **1946**లో ఆయిన చివరకు మిగిలేది అనే నవల వ్రాశాడు అంటే అప్పటికాయినకు వయుస్సు ముప్పై ఏళ్ళు నిండు యువ్వనం అయితే చివరకు మిగిలేది సమస్యతో ఆయిన చూపించిన తాత్త్విక జిజ్ఞాస చాలా గంభీరమైనది. హేమ్లెట్ సమస్య, సౌందర్యరాహిత్యం లాంటి అధ్యాయాలలో మానవ మనస్తత్త్వపు లోతులను బుచ్చిబాబు తరచి తరచి అవగాహన చేసుకున్నాడు. మనిషి జీవితంలో ప్రేమించలేకపోవడమే గొప్ప విషాదంకాని, ప్రేమించి విఫలం కావడం కాదు అంటాడాయిన. చివరకు మిగిలేది నవలలో బుచ్చిబాబు సృష్టించిన పాత్రలన్నీ సజీవమైనవి. ఒకసారి చదివినవాళ్ళకు చాలాకాలం జ్ఞాపకం ఉండిపోతాయి మానవజీవితంలోని సౌందర్యతృష్ణ, సామరస్యం, హార్దిక, కరుణ, విషాదం, ఉల్లాసం, పరితృప్తి, వేదన, వేసట, వాంఛ, వీటి స్వరూప స్వభావాలను, మూలతత్త్వాన్ని తన రచనలలో వ్యాఖ్యానించే సృజనాత్మక శిల్పం చూపాడు బుచ్చిబాబు

నా గాజుమేడ, కొత్తవంతెన పాతనీరు, అరకులోయలో కూలిన శిఖరం, నన్ను గురించి కథవ్రాయివూ, అడవికాచినవెన్నెల, 'బీ' లాంటి ఎన్నో మంచి కథలను ఆయిన వ్రాశారు బుచ్చిబాబు అనేది ఆయిన కలం పేరు. అసలు పేరు శివరాజు వెంకటసుబ్బారావు. జననం **1916**, మరణం **1967**. తల్లిదండ్రులు వెంకాయమ్మ, వేంకట సూర్యప్రకాశరావు. చివరకు మిగిలేది నవల మానవ జీవితానికి పరమార్థం ఏమిటి? మానవజీవితాన్ని ఏ సంబంధాలు, అనుబంధాలు ఒక దగ్గర చేరుస్తున్నాయి, శాసిస్తున్నాయి అని విశ్లేషించే మంచి నవల.



# కుందుర్తి ఆంజనేయులు



తన గురువుగారి కవిత్వం 'నాథకథ అయితే తనకవిత్వం 'అనాథకథ' అన్నాడు కుందుర్తి ఆ గురువుగారు విశ్వనాథ ఆ అనాథ ఇరవయ్యో శతాబ్ది సగటు మానవుడు. తన కవిత్వమంతా మానవీయమే. మానవుడికే, మానవునిగురించే. ఈ లోకంలో ఇప్పుడు కన్పిస్తున్న సంఘంలో మానవుడి మనుగడకు సంబంధించినదంతా తన కావ్య వస్తువు. తన 'పలుకుబడి' అందుకు. తన 'నుడిగుడి' అందుకు.

అక్షర లక్షాధికారి, మాటల కోటీశ్వరుడు కుందుర్తి. లోకంలో ప్రతి వృత్తిలోనూ అనితర సాధారణమైన ప్రతిభావంతులు కన్పిస్తారు కవులలో అలాటివాడు కుందుర్తి. ప్రథమశ్రేణి కవి, పాతకాలపు కవి సమయాలు మార్చేశాడు. కవిత్వాన్ని ప్రజల దగ్గరకు తీసుకొనివచ్చాడు. అచ్చమైన 'దేశి' కవి. తిక్కన, పాల్కురికిసోమన, శ్రీనాథుడు, తిరుపతి వేంకటకవులు వీళ్ళ సంప్రదాయానికి చెందిన కవి కుందుర్తి.

ప్రజాస్వామ్యంలో ప్రజలందరికీ బ్రతుకుబాటలో సమానావకాశాలుండాలి. సంక్షేమ రాజ్యం ప్రభుత్వధ్యేయం కావాలి, అటువంటప్పుడు కవిత్వం కూడా ప్రజలందరికీ ప్రకృతిసంపదలాగా చెందాలి అది వెన్నెల కావాలి. సూర్యుడి వెలుతురు కావాలి, కవిత్వం కావాలి

మామూలు మాటల్లోనే చెప్పినా, అతిలోకమైన భావుకతతో విహరించకపోయినా కుందుర్తికవిత ఎంతోరుచ్యంగా ఉంటుంది. దప్పికైన వాడికి చల్లని మంచినీళ్ళలా సేదతీరుస్తుంది. అదీ అతడి బాణి. జాతీయోద్యమంలోని ఉజ్జ్వలఘట్టమైన దండియాత్రను కుందుర్తి గొప్ప కావ్యంగా వ్రాశాడు ''మనదేశం ఒక మహాసాగరం. మనందరి దాస్యదుఃఖసాగరం. అందులో ఊరికేవచ్చే ఉప్పు, అదికూడా మనం తినగూడదట'' అంటాడు. ఆకాశంలోని తెల్ల మబ్బుల్ని తన కావ్యవస్తువుగా ఎంతో గొప్పగా వర్ణించాడు ''ఆకాశంలో కొన్ని తెల్లటిమబ్బులు,. అంతరిక్షవాసులు పోగువేసుకున్న ఉప్పుకుప్పల్లా

వున్నాయి.'' ''దేశంలో జైళ్ళు చాలడంలేదు, సైనికులను అటూ యిటూ తిప్పడానికి రైళ్ళు చాలడం లేదు.'' ఇట్లా వుంటుంది ఆయన కవిత. వేసవికాలపు వేకువలాగా, చలికాలపు ఎండలాగా. తల్లి చనిపోయింది. లోకం ఏమీ ఓదార్పుగా లేదు, శోకవ్యాకులంగా ఉంది. 'నరనరాల్లో జీర్ణించిన నా మార్క్సిస్టు మధురోహలు, భారతీయ వేదాంత భావనకు లొంగిపోతున్నవి' అంటాడు కుందుర్తి. తల్లిని తలుచుకొని 'నాది అనే పామర భావనలోని పరమార్థం విప్పిచెప్పి, నన్ను పెద్దవేదాంతిని చేశావు' అంటాడు.

ఎవరో పరిచయస్తులు ఎదురవుతారు. అలా జరిగిందా అని పలకరిస్తారు. అప్పుడు తాను తల్లిలేని వాడినని మళ్ళీ తల్లడిల్లుతాడు కవి. 'తెల్లని యిస్త్రీ మడతలమీద సిరా ఒలకబోస్తున్నట్లుంటుంది.' పరిచయస్థులు పలుకరిస్తే ఇదీ నిర్వేదం. కాని ఓదార్పు కావాలి సానుభూతి కావాలి. ఈలోకం తనను ఆదుకోవాలి కదా! 'సానుభూతి లేక్షైనారాయిని స్నేహితులు గుర్తొచ్చినప్పుడు, జీవితం గాడిదమీద ఊరేగుతూ జుట్టు విరబోసుకున్నట్లుంటుంది.' అంటాడు కుందుర్తి మాతృగీతంలో ఆయన కవిత్వం హృదయస్పందన కలిగిస్తుంది. మహాకారుణికుడైన కవి ఆయన. అయితే అది తిట్టి కొట్టేదికాదు, తట్టిలేపేది. ఆయన రచించిన తెలంగాణ కావ్యం, దండియాత్రలు ఈ శతాబ్దిలో తెలుగులో ఉత్తమ కావ్యాలుగా నిలుస్తాయి. మానవత్వాన్ని ప్రబుద్ధం చేస్తాయి 'నగరంలో వాన' 'భగవంతుడికి బహిరంగలేఖ' వంటి ఖండకావ్యాలలో ఆయన కవితాసిద్ధి చాలా ముచ్చట గొలుపుతుంది. 'శిక్షఏమిటి?' 'ఆశ' అనేవి ఆయన కవితారూపకాలు. వర్తమాన సాంఘిక పరిస్థితులకు ఆయన కవితలన్నీ అద్దాలు, హృదయా వర్జకమైన భాష్యాలు

కుందుర్తి సంప్రదాయ విరోధి కాడు. లోకంమీద అపనమ్మకాన్ని, విద్రోహాన్ని పెంచుకున్న వాడుకాడు 'ఎన్నో ఉన్నాయి నాకు ఆకలి, దరిద్రం, రోగం, అరచేతి రేఖల మధ్య కనిపించే కత్తెరయోగం, అన్నింటినీ మింగేది అందాల కవితవుంది, ఆ ఒక్క తులసీదళంతో బ్రతుకు త్రాసు నావేపు మొగ్గింది. కాలపుపందెంలో నెగ్గింది' అన్న ఆత్మవిశ్వాసం కలవాడు. తన కవిత్వంద్వారా నిరూపించినవాడు.

కుందుర్తి జననం **1922.** పరమగతి **1982.**

'ఇది నాదారి' అని ఆయన తన సర్వ కవితాసంపుటికి వ్రాసుకొన్న వివరణ చాలా విలువైనది.



# మాస్టర్ ఎక్కిరాల కృష్ణమాచార్య



అడవిలో ఆకుసంపెగ చెట్టు గుమ్మని పరిమళిస్తుంది. పువ్వు కనపడదు. కాని పరిసర ప్రాంతాలన్నీ గుబాళిస్తూనే ఉంటాయి. మానవ సమాజం కూడా ఒక అడవి వంటిదే. ఎంతగా సంస్కరించినా, ఎంతగా నాగరికంగా తీర్చిదిద్దినా! అందులో కొందరు అప్పుడప్పుడు ధీరులు, నిరపేక్షులు, ఆత్మారాములు పుడుతూ వుంటారు. వాళ్ళు సమాజానికి మప్పిన సంస్కారం, వాళ్ళు చేసిన మంచిపనులు ప్రదర్శనం కోసం కాకుండా ఫలితం కోసం వాళ్ళు తాపత్రయ పడతారు. ఆకుసంపెంగ పరిమళానికి ఇదే సామ్యం.

ఈ ప్రపంచంలో మనిషికి ప్రాధమికమైన అవసరాలైనా తీరకుండా వేదాంతం బోధించకూడదన్నాడు వివేకానందస్వామి. కడుపులో నకనకలాడుతుండగా కర్మ సిద్ధాంత ప్రాశస్త్యం బోధపడుతుందా అన్నాడాయన. మనిషిని మనిషిగా కాకుండా క్రూరమృగంగా మార్చే సమాజాన్ని సంస్కరించాలని మహనీయులెందరో అన్ని కాలాలలోనూ తహతహ చెందుతూనే వచ్చారు. అటువంటి వారి కోవకు చెందిన వారు శ్రీ కృష్ణమాచార్యుల వారు. సమాజ హితంకోసం ఒక ఆచార్య కేంద్రాన్ని స్థాపించి సంఘానికి భౌతికరుజలనుంచీ, మానసిక జాడ్యాలనుంచీ రక్షణ కల్పించటానికి కృషి చేశారు. ఖర్చులేని వైద్యం హోమియోపతి. ఆంధ్రదేశంలో ముఖ్య నగరాలలో హోమియో వైద్యకేంద్రాలను నిర్వహింప చేసి, ఉచిత వైద్యసదుపాయాలు కలగచేశారు. తమ దివ్యజీవన సిద్ధాంత శిక్షితులైన అనుచరుల ద్వారా ఇటు ఆరోగ్యమూ, బోధల ద్వారా భారతీయ సమాజ ఆదర్శాలు, ఉత్కృష్టత బోధించేందుకు కృషి చేశారు వారు.

ఈకాలంలో కుంభకోణంలో అవతరించిన మహాయోగి, మాస్టర్ సి.వి.వి.యోగ విజ్ఞాన ప్రవర్తకులలో శ్రీ కృష్ణమాచార్యుల వారొకరు. ఆ యోగాన్ని భృక్తరహిత తారకరాజ యోగమంటారు. మనిషి సాంఘిక జీవనంలో పరిపూర్ణ తృప్తి వహిస్తూనే తోటివారందరినీ తనలాగే చూడగలగటం నేర్పుతుందీ యోగం. యోగానుభూతిని

కూడా సమంగా పంచుకోవాలని కోరుతుంది. అందువల్ల ఈ యె గ ప్రసరణలో బృంద ధ్యానానికి చాలా ప్రాధాన్యం వుంది.

శ్రీ కృష్ణమాచార్యుల వారు పాంచభౌతికాన్ని షష్టిపూర్తి కూడా కాకుండానే వదలి పెట్టినా కొన్ని వందల సంవత్సరాలు ప్రభావితం చేయగల సంప్రదాయ వారసత్వాన్ని దృఢం చేశారు. శ్రీమహాభాగవతానికి శ్రీవారు కావించిన రహస్యార్థ ప్రకాశము అనే వ్యాఖ్య ఉజ్జ్వలమైనది. వేదాలు, వేదాంగాలు, పురాణాలు, ఇతిహాసాలు, ఈ కాలం వారికి అవసరమైన రీతిలో సుబోధకంగా చెప్పే గొప్ప కృషి చేశారు. వాటి పరమార్థాన్ని జిజ్ఞాసువులకు అందించి మహోపకారం చేశారు. శ్రీ కృష్ణతత్త్వాన్ని చక్కగా ఆవిష్కరించారు.

'ది వరల్డ్ టీచర్స్ ట్రస్ట్' అనే పేరుతో ఒక గొప్ప ఆధ్యాత్మిక విద్యాసంస్థను స్థాపించి దేశ విదేశాలలో భారతీయ విజ్ఞానతత్త్వ భూమికలను విస్తరింప చేశారు. దేశ విదేశాలలో వీరి-ఆధ్యాత్మిక దివ్యతత్త్వ విజ్ఞాన ప్రసరణ శాఖలెన్నో వున్నాయి.

ఇంగ్లీషులో, తెలుగు ఇతర భాషలలో చిన్న చిన్న పుస్తకాలు ఎన్నో ప్రచురించారు ఈ సంస్థ తరఫున.

వీరిని కన్న పుణ్య దంపతులు శ్రీ ఎక్కిరాల అనంతాచార్యుల వారు, బుచ్చెమ్మగారు. జన్మస్థలం బాపట్ల. జననం 1926. తండ్రిగారు గొప్ప వేదవేదాంగ, పురాణ, ఇతిహాసవేత్త. ఆయుర్వేద వైద్య విజ్ఞానంలో మహా ప్రతిభాశాలి. శ్రీ కృష్ణమాచార్యులవారు తెనాలి రామకృష్ణుడి పాండురంగ మహత్మ్యం పైన పరిశోధన చేసి డిగ్రీ తీసుకున్నారు. చిన్నతనంలోనే మంచికవి అనిపించుకున్నారు. వాగ్మి మధుర భాషణులు, సమాజహిత తత్పరులు అయిన శ్రీ ఆచార్యులవారు 1984 మార్చిలో పరమపదించారు. కాని వీరు వెలిగించిన జ్యోతులు తరతరాల సమాజ జాగృతికి దోహదం చేస్తూవుంటాయి.





# దాశరథి

దాశరథి బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఈ శతాబ్ది తెలుగు కవులలో చెప్పదగిన వాడు. సరళమైన హృదయం, నిరాడంబరత, స్నేహశీలం, అచ్చమైన భావుకత ఆయనలో ఎప్పుడూ తొణికిసలాడుతూ ఉండేవి. ఎంతో ఆప్యాయంగా పలకరించి ఎదుటి వారిలో ఉల్లాసం కలిగించేవాడు. చిరాకు, కోపం, అసహనం, అసంతృప్తి ఆయన ఎప్పుడూ ప్రకటించేవాడు కాదు. ముఖ్యంగా సాహిత్య సల్లాపాలలో లోకవృత్తం పట్ల కూడా, తనకు ఇంపుగాని విషయాల పట్ల కూడా ఆయనలో వృధాభిమానం, విసుగూ వేసట కనిపించేవి కావు. నిత్య చైతన్య శీలి ఆయన. నిత్యోత్సవంగానే ఉండేవాడు. ముఖ్యంగా యువతరానికి ఆయన ఎంతో స్ఫూర్తి నిచ్చేవారు.

సాహిత్య సభలు, కవి సమ్మేళనాలు ఆయన అధ్యక్షత వహించి నిర్వహించే తీరు ఎంతోవిలక్షణంగా ఉండేది. ప్రతి ఒక్కరూ ఆయన్ను తన వాడిగా భావించేవారు. 'బాలే బాలా విదుషీ విదుషాగాయకే గాయకేవా' గా ఉండేది ఆయన ప్రవృత్తి. స్మిత పూర్వాభి భాషణమే కాదు ఆదర సల్లాప సహితంగా ఉండేది, ఆయన్ను ఎప్పుడైనా పది నిమిషాలు కలుసుకోవాలంటే. కవి సమ్మేళనాలలో ఆయన ఇచ్చే ప్రోత్సాహం పలికే ప్రశంసా వాక్యాలు పాల్గొనే వారిని ఎంతో ఉల్లాసపరిచేవి. హుందాగా మానసోల్లాసంగా ఆయన ఏ సభనైనా నిర్వహించేవారు.

కొన్ని వందల సభలలో ఆయన పాల్గొని ఉంటారు. ఆయన చమత్కార వక్త తనకు తెలిసిందే అయినా ఒక మంచి సూక్తినో, భావాన్నో, భావుకతనో ఎవరైనా ప్రసంగవశాన ప్రదర్శిస్తే ఎంతో పులకరించి పోయేవాడు దాశరథి.

ఏ సృజనాత్మక మహా ప్రతిభావంతుడైనా తాను జీవించి ఉన్న కాలాన్ని ప్రభావితం చేస్తాడు. కాలంచేత కూడా ప్రభావితుడవుతాడు. వ్యుత్పన్నుడు, పండితుడు, కవీ, ఉద్యమశీలి, భవిష్యత్తు పట్ల అచంచల మైన ప్రేమ విశ్వాసాలు, ఆశా ఆరాధనలు

ఉన్న వాడు కాబట్టే ఆయన దైన్యాన్ని, నిరాశను, ఆ కర్మణ్య తను చీకొట్టే దుఃఖితులను, పీడితులను ఆశ్వాసించి భుజం తట్టేవాడు. అది కవితగా పలికేవాడు. సంప్రదాయాన్ని ఆధునికతను సమానంగా గౌరవించేవాడు దాశరథి. ఆయన ఎంత సంస్కృత పండితుడో అంతగా పాశ్చాత్య నవ్య కవితారీతులను అధ్యయనం చేసిన వాడు, మానవతావాది, నాలుగు దశాబ్దాల పాటు ఆయన కవితా వ్యవసాయం చేశాడు. నాలుగు కాలాల పాటు తన జాతిజనులు గుర్తు పెట్టుకునే కవితలు రాశాడు. హృదయవాది కాబట్టే ఆయన వచనం రాసినా, కవిత్వం రాసినా, ఒక తళుకు, ఒక స్పృహణీయత, ఒక తాదాత్మ్యం, ఒక భావుకతా సుభగత్వం ఆయన రచనలలో జాలువారుతూ ఉండేది. పద్యం రాసినా, వచన కవిత్వం లాగానూ, గేయం వ్రాసినా మంచి పద్యపు అందచందాలను చూపగలిగే వాడు దాశరథి.

యౌవనోత్సాహం ఉరకలు వేస్తున్న పరువంలో దాశరథి వేలాదిమంది ప్రజలను

ఉత్తేజితులను చేశాడు. ఆయన కవితా సభలకు ప్రజలు విరగబడి వచ్చేవారు. నిరంకుశ నిజాం చర్యలను ప్రజావేదికలపై నిలిచి నిర్భయంగా ఖండించాడు. తెలంగాణం రైతుదే రైతుదే తెలంగాణము ముసలి నక్కకు రాచరికంబు దక్కునే అనే దాశరథి సింహగర్జన కవితోద్యమమై తెలంగాణా అంతా ఆవరించింది. ''ఆంధ్ర సారస్వత పరిషత్తు వార్షిక సభా సమావేశములందు వేలాది గ్రామీణుల ముందర ఎత్తైన వేదిక మీద కెక్కింపబడి 'నెట్టిక పీలంత' భారీ వ్యక్తియైన ఒక నూనూగు మీసాల కవి రుద్రవీణ పలుకుతూంటే సముద్రపు కరళ్ళలాగ జన సంఘము సంచలించి పోయేది. ఆ నెట్టికపీల దాశరథి'' అన్నారు, ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం గారు అమృతాభిషేకానికి పీఠిక వ్రాస్తూ. దాశరథి కవితలలో అక్షర రమ్యత ఉంది. నాద మాధుర్యం ఉంది. గ్రీష్మ నిదాఘం ఉంది. వసంతకాల లాలిత్యం ఉంది. నవ్యలలో తిమిరంతో సమరం ఇంతగా కొనసాగించిన కవి ఇంకొకడు లేడేమో, చీకటిని, దీపాన్ని సంకేతాలుగా చేసి కమనీయమైన కల్పనలెన్నో చేశాడు దాశరథి. యుగయుగాలుగా జగజగాల చీకటితో చేసే పోరాటమే మానవ అంతశ్చైతన్యంగా ప్రజ్వలితమవుతుందని అతడి భావన, చీకటిని దీపకాంతి పారద్రోలటం కాదు, దీపకాంతిని చీకటే ఎప్పుడూ మింగుతూనే ఉంటుందని గొప్ప తాత్త్విక భావన చేశాడు కవి. శంకరాచార్యుల వారు చెప్పిన మరణమే ప్రకృతి, జీవనమే వికృతి అన్న తాత్త్విక చింతనకు ధీటుగా ఉంది దాశరథి చెప్పిన భావం కూడా. ''దీపము పురువంధకార మొక పాము; పృదాకువు పుర్వుమెక్కునో, కృమియురగమ్ము మ్రింగునో గ్రహింపుమి! అంధ తమో మహోతురంగము ఖుర ఘట్టనమ్ముల వికావికాలైనవి దీపదీధితుల్'' అంటాడు దాశరథి. ప్రకృతితో తాదాత్మ్యం కూడా ఆయన ఆర్ద్ర కవితా భావుకతకు నిరుపమానమైన సోయగం కూరుస్తుంది. వసంతాన్ని గూర్చి మోదుగ పూవులను గూర్చి దాశరథి చెప్పినంత కవిత్వం మరి ఇతర తెలుగు కవి ఎవరూ చెప్పలేదేమో! ప్రాచీనులను పరిగణలోకి తీసుకున్నా యీ

మాట విలుస్తుంది.

మేఘమందు నా కమోఘమ్ము సంప్రీతి
మబ్బు పంచభూతమయము కాదె
అంతెగాక దాన నలరారు కరుణమ్ము
గుండె కంటి నీటికుండగాగ - అంటాడు దాశరథి.

స్వస్థాన వేష భాషాభిమానం గల అందరి భావుకులకు మాదిరిగానే దాశరథి తెలుగును తలుచుకొని మురిసిపోతాడు. మహేంద్రోదయాన్ని ఆయన అభిమానంతో గానం చేశాడు. 'రమ్మ నా రసనానృత్యరంగమందు, నర్తనము సేయవమ్మ ఆంధ్ర సుకుమారి' అని పరవశించి పోతాడు. ఈ విషయంలో రాయప్రోలు. విశ్వనాథలకు ఉద్దీగా పద్యాలు రాశాడు దాశరథి.

లోకంలో కవి బాధ్యత ఎటువంటిది? లోకానికి వినిపించే కవి వాక్కులోని హృద్యత ఎట్లా ఉండాలి? అన్న ప్రశ్నలకు దాశరథి చక్కటి సమాధానాలు చెప్పాడు.

''లంకగా గాకత్తై లావమ్ముగా జగము
రాణించునటు పునారచన చేతమురమ్మ!
ఈ పునారచనలో ఎవ్వనిది పైచేయి
కవిది, లోకజ్ఞునిది, గంభీరునిది, నీది''

అని సమాజాన్ని ప్రబోధిస్తున్నాడాయన. అభినవ దాశరథి శతకం దాశరథి కవితలోని ప్రసన్న లాలిత్యానికి ప్రతి పద్యోదాహరణం. అంత అలవోకగా పద్యం నడపడం గొప్ప ప్రతిభా మూలకం.

''రొట్టెయొకింత లేక కడు రోజెడు కోట్ల జనమ్ములుండరా
కెట్టును సృష్టి చేతురు సుఖించెడు జాతులవారు; దానితో
కొట్టు కొనంగ జూచెదరు కోట్ల జనమ్ము నశింప; నీరివిన్
తట్టుకొనంగ నెట్టులగు దాశరథీ! కరుణాపయోనిధీ''!

వంటి హృద్యమైన పద్యాలు దాశరథీ శతకంలో ఎన్నో ఉన్నాయి.

''తెల్ల కాగితం మీద నల్లక్షరాలు వ్రాస్తుంది సాదాలేఖిని,
నల్లని చీకట్ల మీద నవకాంతి కవితలు వ్రాస్తున్నది జ్వాలాలేఖిని''
అంటాడు దాశరథి.

దాశరథి రుబాయిలను, గజళ్ళను కూడా వశీకరణం చేసుకున్నాడు. ఈ ప్రక్రియలో ఆయన చేసిన అనువాదాలు స్వీయ రచనలూ కమనీయాలు. ఒక గజల్ పలికి మెప్పించడం ఎంత పనితనమో ఇట్లా భావిస్తాడు దాశరథి. ''రవ్వను చెక్కడంలో ఉన్న సొగసు రాతి మేడ కట్టడంలో రాదు''

దాశరథి కవిత్వం ఎంత బాగా ఉంటుందో ఆయన అంత చక్కని వచనం

రాస్తాడని చాలామందికి తెలియదు. జయదేవుడి గీత గోవిందానికి గొప్ప ప్రతిభా పూర్వకమైన ఉపోద్ఘాతం వ్రాయడమే కాక ప్రతి పద మధురంగా అష్టపదులు భావ వ్యాఖ్యానం కూడా చేశాడాయన శ్రీ జయదేవ మహాకవి జీవిత చరిత్ర పేరుతో వ్రాసిన ఉపోద్ఘాతంలో.

సాహిత్య సంగీతాల పరస్పర సంబంధం చెప్పి ప్రపంచ నాగరిక భాషల్లో గీత గోవిందా ప్రాశస్త్యాన్ని ప్రస్తావించడం దాశరధి పాండిత్యానికి నిదర్శనం. జర్మన్, ఫ్రెంచి, లేటిన్ భాషల్లోకి కూడా గీత గోవిందం అనువాదం పొందిందనీ ఎడ్విన్ ఆర్నాల్డు కూడా దీన్ని 'సాంగ్స్ ఆఫ్ సాంగ్స్' అనే పేరుతో ఇంగ్లీషులోకి అనువదించాడనీ దాశరధి పేర్కొన్నాడు. గీత గోవిందంలో ఆధ్యాత్మిక సంకేతాలకన్నా కళా సౌందర్యమే సాక్షాత్కరిస్తుంది అనడం దాశరధి కవితా హృదయానికి నిదర్శనం.

దాశరధి మంచి విమర్శకుడు కూడాను. వ్యాసపీఠం పేరుతో ఆయన సాహిత్య వ్యాసాల సంపుటి వెలువరించారు. అన్నమయ్యను ఉత్తర భారతంలోని సుప్రసిద్ధ వైష్ణవకవి విద్యాపతితో పోలుస్తూ వ్రాసింది మొదటి వ్యాసంగా ఈ సంపుటిలో చేరింది.

మైథిలిలో విద్యాపతి తన గీతాలను రచించగా, అన్నమయ్య తెలుగులో పదాలు రచించాడు. ఇద్దరూ వైష్ణవ కవులు. విద్యాపతి గీతాలను మహా ప్రభువే ఆదరించాడంటే అవి రాధా కృష్ణ ప్రణయత్త్వాన్ని ఎటువంటి పరాంకోటి శిఖరాలకు తీసుకొని వెళ్ళాయో తెలుసుకోవచ్చు. ''తెలుగు తేనే, మైథిలి–మధువు వాని తీయములు రుచి చూడవలెనన్న అన్నమయ్యను, విద్యాపతిని అధ్యయనము చేయవలెను''అని ముగించారీ వ్యాసాన్ని. ఇతర భారతీయ భాషలలో దాశరధికి ఉండే గాఢమైన పరిచితిని ఈ వ్యాసం తెలియజేస్తుంది. తెనాలి రామకృష్ణుడి రచనలపై రెండో వ్యాసం, ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగ మహాత్మ్యం, రెండూ కూడా ఒకే రచయితవేనని చాలా చక్కని ఉపపత్తులు చూపారు దాశరధి. ఈ వ్యాసంలో దాశరధి రామకృష్ణుడి రచనల గూర్చి చాలా కొత్త విషయాలు చెప్పారు. శంకర భగవత్పాదుల వారే చెప్పారని భావిస్తున్న పాండురంగాష్టకం భావాలు రామకృష్ణుడి రచనలో ఏ విధంగా హృద్యంగా భాసించిందీ దాశరధి చూపాడు. పాండురంగ తత్త్వాన్ని వివరిస్తూ హేమచంద్రుడు, ఆర్.జి. భండార్కర్ వంటి విద్వాంసులేమన్నారో పేర్కొన్నారు. ఒక కవి కవిత్వంలోని హృద్యతను సమీక్షించడంలో ప్రజ్ఞ ఈ విధంగా ఉండాలి కాని నాలుగు పరియాచకాలు, ఐదు ఉదాహరణలు చెప్పి రంజించడం కాదని దాశరధి వ్యాసాల వల్ల స్పష్టమవుతుంది. అవతారాల ఆంతర తత్వం, యోగశక్తుల మహిమలు, వైష్ణవ దర్శనం, భగవద్రామానుజులు, నింబార్కులు, వల్లభుల శ్రీ కృష్ణ ప్రపత్తి వంటి గాఢమైన, లోతైన విషయాలను కూడా సమన్వయం చేయడం దాశరధి ప్రతిభావ్యుత్పత్తులకి సాక్ష్యం పలుకుతున్నాయి. పోతనామాత్యుని కవితా శిల్పము, మహాభారతంలోని ఉపాఖ్యానాలు ధర్మ సూక్ష్మాలు అనే వ్యాసాలు దాశరధి పరిశీలనా ప్రజ్ఞకు అద్దం

పడుతున్నాయి. మహాకవి మీర్జాగాలిబ్ అనే వ్యాసం ఉర్దూ, పారసీ సాహిత్యాలలో దాశరధి కున్న పరిచయం వ్యక్తం చేస్తున్నాయి.

ఇక విపులాచ పృథ్వీ, అమెరికా సందర్శనం, మలేషియాలో తెలుగు వెలుగు, మలయ భాషా స్వరూప స్వభావాలు అనే వ్యాసాలలో దాశరధి విదేశ పర్యటనానుభవాలు రమణీయంగా ప్రత్యక్షమవుతాయి. దాశరధి ఏ విషయం చెప్పినా ఒక భావోద్విగ్నత, తాదాత్మ్యమూ ఉంటాయి. అతడి కవితా హృదయం అన్ని చోట్లా సాక్షాత్కరిస్తుంది. ఈ పర్యటనానుభవాలలో ఆయన హృదయం పారవశ్యం ఇలా విన్యసించింది.

''అమెరికా రాజధానిలో ఎంతమంది తెలుగు వారున్నారు! డాక్టర్లు, ఉన్నతాధికారులు, ఇంజనీర్లు, వ్యాపారులు ఎక్కడ ఉన్నా ఎంత దూరాన ఉన్నా 'తెలుగు భాష' మన మాతృభాష. తెలుగు వెలుగు సూర్యగోళంలా కలకాలం వెలుగుతుంది. తెలుగు పలుకు తీయదనం హృదయానికి తెలుస్తుంది'' అనుకుంటారు.

ముఖ్యంగా బోస్టన్ పరిసరాలలో ప్రకృతి, ఆకురాలు కాలంలో అందంగా ఉంటుంది. ప్రతి చెట్టు ముస్తాబైన పెళ్ళికూతురులా కనిపిస్తుంది. ఎన్నెన్ని రంగులు! రాసులు పోసిన ఇంద్ర ధనుశ్శకలాలు.

''ఆ సభలో రమారమి తొంభై నిమిషాలు మాట్లాడాను. వాల్మీకి లేనిది రాముడు లేనట్లు కవి లేనిది దేశ చరిత్ర లేదన్నాను. ఊహాసౌధాలు దిగి ప్రజల మధ్య నిలిచి కవిత వ్రాయవలిసిన యుగమిది అన్నాను. విదేశాల్లో తెలుగువారు తమ పిల్లలు తెలుగు మర్చిపోకుండా చూడాలని కోరాను'' అన్నారు. 'మలయా భాష స్వరూప స్వభావాలు' అనే వ్యాసంలో భాషాశాస్త్రం, తులనాత్మక భాషాధ్యయనం, ఆధునిక భాషా సాంస్కృతిక ఉద్యమాలు దాశరధి ఎంత నిశితంగా పరిశీలించారో తెలుస్తుంది. అమెరికా పర్యటనలో వాషింగ్టన్‌లో 'నేషనల్ ఎయిర్ అండ్ స్పేస్ మ్యూజియం' సందర్శించినప్పుడు ఆ అనుభూతిని వర్ణిస్తూ దాశరధి ఇలా వ్రాశారు. ''అక్కడ 'చంద్రశిల'ను ముట్టుకొని మురిసిపోయారు. చంద్రుణ్ణే ముట్టుకోవటమంటే మాటలా!'' ఈ మాటల్లో శైశవస్వచ్ఛ మౌగ్ధ్యం కనబడుతుంది. ఆధునిక తెలుగు సాహిత్యంలో కవి చంద్రుడు దాశరధి. ఆయన కార్తీక పున్నమినాడు తన ఊహాలోకాల సంచరణార్థం స్వర్గపథంవట్టి ప్రయాణం కట్టాడు. (1987 నవంబర్ 5)(దాశరధి జననం 1926).

''ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్మ
నరుడు నరుడౌట ఎంత దుష్కరము సుమ్మ''
అన్న గాలిబ్ కవితలను క్షుణ్ణంగా అనువదించాడు దాశరధి.



# భద్రిరాజు కృష్ణమూర్తి



'ఇప్పటి కాలానికి విలువిద్య అక్కరకు వస్తుందా. కోర్టులలో వాదించాలంటే వెనకటి కాలపు శ్రుతి స్మృతులు పనికి వస్తాయా. కాశీకి కాలినడకనపోతేనే ఎక్కువ పుణ్యం వస్తుందని ఎవరైనా వెళుతున్నారా?' అని ప్రశ్నించారు గిడుగు రామ మూర్తి పంతులుగారు భాషా విషయకమైన వాద వివాదాలలో అభినివేశం చూపే సనాతన సంప్రదాయ పండితులను.

సాంఘిక పరిణామంతోపాటు లోక వ్యవహారంతోపాటు భాష వినియోగంలో, వినిమయంలో సాధించాల్సిన ప్రయోజనంలో మార్పులు తప్పనిసరి అని అనేక ఉపపత్తులు చూపి రామమూర్తి పంతులుముప్పైఏళ్ళు చెవినిల్లుకట్టుకుని బోధించారు తెలుగువాళ్ళకు.

తెలుగునాట ఈ శతాబ్ది భాషా శాస్త్రవేత్తలలో రామమూర్తితర్వాత ఎన్నవలసింది కృష్ణమూర్తినే. భాషా తత్వం, భాషా ప్రయోజనం, భాషా వికసనం శాస్త్రీయంగా ఈ మూర్తిద్వయానికి అవగాహన అయినంతగా ఈ రంగంలో కృషి చేసినా, అన్యులకు కాలేదని వేత్తలు అంగీకరించారు. ఇక తాము ప్రజ్ఞాధురీణులైన రంగంలో తాము ప్రత్యేకించి కృషి చేసిన శాస్త్ర విజ్ఞాన వ్యాప్తి ద్వారా అంతర్జాతీయమైన గుర్తింపును, గౌరవాన్ని, ఆదాన ప్రదాన అనువర్తిత వినియోగ విజ్ఞాన వితరణనుసాధించినతెలుగువాళ్ళు వేళ్ళ మీద మాత్రమే లెక్కకు వస్తారు. గిడుగు వారిని చిటికెనవేలి మీదికి ఎక్కిస్తే విదేశీ విద్వాంసుల దృష్టినాకర్షించిన వారిలో సర్వేపల్లి రాధాకృష్ణ, యల్లా ప్రగడ సుబ్బారావు, స్వామి జ్ఞానానంద, జిడ్డు కృష్ణమూర్తి మొదలైన పేర్లే కదా వెంటనే స్ఫురించేవి. భాషా శాస్త్రం శుద్ధమైన విజ్ఞాన శాస్త్రం. అంటే అది ఎంత అనుభవిక శాస్త్రమో తెలియడం కష్టం. అతి గహనమైన తత్వశాస్త్రం వంటిది. అటువంటి భాషా శాస్త్రాన్ని గణిత శాస్త్ర ప్రాథమిక అవగాహనాంశాల మాదిరిగా అధ్యయనం చేసి అధ్యాపనం చేయగల సత్తా నిరూపించుకున్న పండితుడు భద్రిరాజు కృష్ణమూర్తి.

భాషాశాస్త్రం చక్కగా ఆకళింపు కావాలంటే ప్రపంచ జాతుల విజ్ఞానం, నృశాస్త్రం పురాతత్వం, భౌగోళిక విజ్ఞానం, సాంస్కృతిక పరిణామాలు బోధపరచుకోగల మేధవుండాలి. అమూర్తం, అనావరణం, అప్రతర్క్యం, అనువిదితం అయిన విజ్ఞానానికి సూత్రీకరణాధ్యయనం చేయాలి. నిరుపాధికతకు ఒక శాస్త్రీయ సోపాధిక ప్రతిపత్తిని కల్పించాలి. లోక, శాస్త్ర అవేక్షణ బాగాకావాలి.

భద్రిరాజు కృష్ణమూర్తి స్వావలంబనతో స్వయం కృషితో అత్యుత్తమమైన విద్యాయోగ్యతలను సాధించుకున్నారు. అమెరికాలో సుమారు పది విశ్వవిద్యాలయాలలో ఆయన భాషాశాస్త్ర విజ్ఞాన శాఖలో గౌరవాచార్యులుగా నియతకాలిక గౌరవాహూత బోధన నిపుణులుగా భాషాశాస్త్ర అధ్యయన అధ్యాపనాలలో ఉద్యోగించారు. వర్తమానంలో భారతదేశంలో భాషాశాస్త్రయోజన ఎక్కడ ఏ విశ్వవిద్యాలయంలో జరిగినా, అనువర్తిత కృషి ఎక్కడ రూపుదిద్దుకొన్నా, భాషా విషయికమైన నిర్ధారణలు మూర్తం కావాలన్నా అక్కడ కృష్ణమూర్తి సలహా సంప్రందింపులు, ఆలోచనలు, నిర్ణయాలు కావలసిరావడం తన విజ్ఞాన శాస్త్ర కృషిలో ఆయన స్థానం నిరూపిస్తున్నాయి. వైయాకరణులకు శాస్త్ర పండితులకు సాహిత్య సంవేదన తక్కువని పెద్దలంటారు. కాని కృష్ణమూర్తి విషయంలో ఇది కచ్చితంగా ఐచ్ఛికంగా అపవాదం. తిక్కన భారతం ఆయన హృత్కవిలి. ఆధునిక రచనలను కూడా ఆయన సాహిత్యార్ద్రతతో రసాస్వాదనం చేయగలరు. కవీ, పండితుడున్నూ.

భాషాశాస్త్ర విజ్ఞానిగా ఆయన రష్యా, ఆసియా, జపాన్ దేశాల పండిత పరిషత్తుల, ప్రభుత్వాల గుర్తింపు పొందారు. ప్రపంచదేశాలు భాషాశాస్త్ర విషయంగా భారతదేశంవైపు చూస్తే భద్రిరాజు కృష్ణమూర్తినే మొదట ఎంచుకుంటారు. అమెరికన్ భాషా విజ్ఞాన సంస్థ ఆజీవ సభ్యులాయన. నిరంతరాధ్యయన ప్రవృత్తి, విజ్ఞాన తృష్ణ ఆయన శాస్త్రీయ ప్రజ్ఞను విశాలం చేస్తున్నాయి. సంప్రదాయ బద్ధతలో స్వచ్ఛంద చారిత, ప్రయోగశీలంలో సంప్రదాయ ప్రవృత్తి భాషాశాస్త్రంలో తమ అభిమాన విషయమంటారాయన. ద్రావిడ భాషాతత్వాన్ని గురించి, తెలుగు ధాతువుల ప్రాతిపదిక స్వరూప స్వభావాల గురించీ తెలుగుభాష నవీకరణ గ్గూర్చీ ఎన్నో గ్రంథాలు, వ్యాసాలు రచించారు.

గిడుగురామమూర్తిగారిని గురించి చెబుతూ ఆయనచే కవిత్రయ మహాభారతాన్ని పరిష్కరించుకోలేక పోయామని, ఒక మహా నిఘంటువును నిర్మింప జేసుకోలేకపోయాయనీ విశ్వనాథ బాధపడ్డారు. ఆధునిక తెలుగుకు వర్ణనాత్మక వ్యాకరణం, సర్వసమగ్రమైన నిఘంటువు భద్రిరాజు ఆధ్వర్యంలో వాటికి ప్రామాణికత సిద్ధిస్తాయి. ఒంగోలు దగ్గరలో 1928లో సామాన్య మధ్య కుటుంబంలో జన్మించిన కృష్ణమూర్తి తన ప్రతిభతో విద్యావేత్తగా ఎన్నోయోగ్యతలు సముపార్జించి హైద్రాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులై సమర్థులైన పరిపాలకులనిపించుకున్నారు. తల్లిదండ్రులు భారతమ్మ, సుబ్రహ్మణ్యంగారలు.

# సి. నారాయణరెడ్డి



ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యంలో విలసిల్లిన వైవిధ్యం అపూర్వం. వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో ఇది ఒక సాహితీ పరిపూర్ణ యుగం. కందుకూరి , గురజాడ, గిడుగుల కృషివల్ల కొత్తగా సాహిత్యపు మాగాణులెన్నో ఫలప్రదమైనాయి. సమాజానికీ సాహిత్యానికీ బింబ ప్రతిబింబత మునుపెన్నడూ లేనంత బలంగా వ్యవస్థితమైంది. సాహిత్యంతో పాటే కళాత్మక విలువలు కూడా ఆదృతమైనాయి. వస్తువుతో పాటే కవితా మాధ్యమూ, శిల్పమూ , ఛందమూ సరికొత్త అందాలు సంతరించుకున్నాయి. కదిలేదీ కదిలించేది పరిపూర్ణపు బ్రతుకిచ్చేదిగా కవిత తన జాతి జనులను ఉత్తేజితం చేయాలని, ఆ కవిత పాడేదీ పాడించేదిగా కూడా ఉండాలనీ అభియుక్తులు తలపోశారు.

రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దం కవిత్వమని పూర్వ లాక్షణికులు ముచ్చటపడగా కమనీయా కృతికమైన శబ్దం అర్థ సౌందర్యాన్ని ఉద్దీపింప చేస్తుందని నవ కవులు అభిప్రాయపడ్డారు. పాతకాలపు వృత్తాల స్థానంలో మాత్రాఛందస్సులు, గీతికలు, గేయాలు అభినవ కవితలో హృద్యమైనాయి.

ఇరవయ్యో శతాబ్దం సగభాగం గడిచేసరికి అంతకు పూర్వపు సాహిత్య సంవాదాలు ముగిసాయి. ఉద్యమాల ఉధృతి తగ్గింది. దేశస్వాతంత్ర్యం స్వీయ వ్యక్తిత్వా భిరతికి కొంతవరకు దోహదం చేసింది. తమ చరిత్రవైపు, సంస్కృతి వైపు, వారసత్వం వైపు గవేషణ ప్రారంభమైంది.

కవిత్వం హృదయ స్పృక్కుగా ఉండటానికి ఆంతరమైన శబ్దార్థలయ ఎంతగానో తోడ్పడుతుంది. పాటల్లో ఉండే అందమిదే. గీత గోవిందంలోనూ, పోతన భాగవతంలోనూ, మునిపల్లె సుబ్రహ్మణ్య కవి ఆధ్యాత్మరామాయణ కీర్తనలలోనూ అర్థహృద్యతనట్లా ఉంచి శబ్దాల పోహళింపుకు కూడా ఎంతో ప్రాధాన్యముంది.

ప్రధానంగా నారాయణ రెడ్డి నాదకవి. గీతి సౌష్ఠవ్యం సమృద్ధిగా తన రచనలలో సాధించిన వాడు 'దివ్వెల మువ్వలు' వంటి ముక్తకాల నుంచి నాగార్జున సాగరం,

కర్పూర వసంతరాయలు వంటి కథాకావ్యాల వరకూ 'నవ్వని పువ్వు' రామప్ప, విశ్వదీపం వంటి సంగీత రూపకాలదాకా ఆయన కవితారచనలో నాదం తరంగిత మవుతూ ఉంటుంది.

నాలుగు దశాబ్దాల పాటు ఆయన కొన్ని వందల గేయాలు, గీతాలు రచించాడు వెండితెర పాటలకు కూడా సాహిత్య సుగంధాన్ని అందించాడు.

పరిశోధన పట్టభద్రతార్థం శ్రీ నారాయణ రెడ్డి రచించిన ఆధునికాంధ్ర కవిత్వంలో సంప్రదాయం – ప్రయోగం అనే గ్రంథం ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థపు ప్రామాణికమైన సాహిత్య చరిత్ర అనవచ్చు. ఏక దేశమైన కవిత్వాన్నే ఆయన ఎన్నుకొన్నా ఆయా నవీన కవితారీతులు విశ్లేషించడంలో ఆధునిక సాహిత్య నేపథ్యాన్ని సమన్వయించి చూపారు.

అలనాడు నాగార్జున సాగరం నుంచి ఇటీవలి విశ్వంభర వరకు, సౌందర్య గవేషణంనుంచి తాత్త్విక చింతనం వరకు ఆయన పథయాత్ర సాగించాడు. నిరంతర సుధీపథీనంలో 'సౌందర్యమె మాదుకళామందిర మూలస్తంభము' అనే భావ భూమిక నుంచి 'హృదయ కంపనలలోనే ఉదయించును చిత్రమ్ములు మధుర కల్పనలలోనే మలచబడును శిల్పమ్ములు' అనే నాగార్జున సాగర కావ్యరచనా కాలం నుంచి నలభై సంవత్సరాలు నవనవోన్మేషంగా ఆయన కవితాప్రతిభ వికసించి నలభై కవితా సంకలనాలకు తావలమైంది.

శ్రీ నారాయణ రెడ్డి ఆధునిక సాహిత్యంలో గేయకావ్యానికొక ప్రక్రియాస్థాయిని చేకూర్చాడు. వల్లకీస్వనంగా మాటలను మీటాడు. సాహిత్యానికి సంగీతాన్ని దగ్గరచేసి సౌందర్య సమ్మేళనం చేశాడు. అనాదిగా మానవజీవితం విశ్వలయలో ఏ విధంగా ప్రతిస్పందిస్తున్నదీ ఉభయ సంధ్యల రంగుల వాకిళ్ళ గుండా విశ్వాంతరాళ ప్రకృతిలో మానవ మహితాత్మ ఏ విధంగా నిరంతర నిత్యయాత్ర సాగిస్తున్నదీ విశ్వంభర కావ్యంలో ఆయన ప్రతిపాదించారు.

ఆధునిక భారతదేశ సాహిత్య చరిత్రలో జ్ఞానపీఠ పురస్కారం పొందడం ఆకవి సాధించిన ఉన్నత స్థానానికి గుర్తు. అఖిలభారత స్థాయిలో ప్రథమశ్రేణి గౌరవం పొందడం – బహుమతిని స్వీకరించడం – అంటే తెలుగులో ఇరవై సంవత్సరాల తర్వాత మళ్ళీ నారాయణ రెడ్డి గారికి లభించింది. విశ్వనాథ వారికి ఇరవైఏళ్ళ కిందట ఎప్పుడో లభించిన ఈ సన్మానం ఇప్పటివరకు అద్వితీయంగానే ఉండిపోయింది. ఇవాళ అఖిల భారత స్థాయిలో తెలుగువారు గొప్పకవిగా చెప్పుకొని గర్వించే స్థాయిని శ్రీ నారాయణ రెడ్డి చేకూర్చారు.

ఈ శతాబ్ది సాహిత్యమూర్తులలో విలక్షణమైన వ్యక్తిత్వం శ్రీ నారాయణ రెడ్డిది. కవితా తాత్త్వికుడిగా, కళావేత్తగా పేరు తెచ్చుకోవడమే కాక ఆయన పరిపాలనా దక్షుడిగా విశ్వవిద్యాలయోపాధ్యక్షుడిగా, వాగ్మిగా రాణించడమే ఆయన విశిష్టత.



# డా. అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ) ఇతర రచనలు

## 1 సృజనాత్మక సాహిత్యం, నవలలు - నవలికలు:

1. జారుదు మెట్లు, 2. జీవితవలయాలు, 3. ఋణానుబంధం, 4. కొత్తబాట, 5. పరాజితులు, 6. మనుషులు - మమతలు, 7. స్వర్గారోహణ, 8. ప్రపంచ మార్గం, 9. నూరుశరత్తులు, 10. దూరతీరాలు; కథాసంపుటాలు, 11. మైథిలి 12. మంచుకురిసిన రాత్రి, 13. జీవిత దృశ్యాలు, 14. మంజుశ్రీ కథలు

## 2 సాహిత్యం - జీవిత చరిత్ర - పరిశోధన.

15. వీరేశలింగం పంతులు - సమగ్రపరిశీలన (పి హెచ్.డి.థీసిస్)
16. వ్యవహారిక భాషావికాసం - చరిత్ర. (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహూకృతం)
17. వీరేశలింగం (జీవిత చరిత్ర) - ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌరసంబంధశాఖ ప్రచురణం
18. కొమర్రాజు వెంకట లక్ష్మణరావు - విశాలాంధ్ర ప్రచురణ
19. గిడుగు రామమూర్తి జీవితం - ఉద్యమం - తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ
20. వీరేశలింగం - తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ
21. తెలుగు నవల - ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ
22. వీరసావర్కార్ - నవభారతి ప్రచురణ
23. ఆంధ్ర కేసరి ప్రకాశం - ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ ప్రచురణ (9వ తరగతి ఉపవాచకం)
24. కోలవెన్ను వారి జీవితానుభవాలు
25. తెలుగులో స్వీయ చరిత్రలు- యువ భారతి ప్రచురణ.

## 3 అనువాదాలు

26. నానాలాల్ - కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురణ
27. విప్లవభావుకుడు, మానవతా వాది శరచ్చంద్రుడు - నేషనల్ బుక్ట్రస్ట్ ప్రచురణ
28. శ్రీ నారాయణగురు - నేషనల్ బుక్ట్రస్ట్
29. వెన్నెల కంటి సుబ్బారావు జీవయాత్రాచరిత్ర - శ్రీ భారతి ప్రచురణ
30. భారతీయ సంస్కృతి - వారసత్వం - తెలుగు అకాడమీ ప్రచురణ

31. కంచిమీదుగా అరుణాచల యాత్ర - పాల్‌బ్రంటన్ రచనకు అనువాదం

**4** సంపాదకత్వం - సంకలనం - సంవాదం

32. మాండలిక పదకోశం - తెలుగు అకాడమీ ప్రచురణ
33. గ్రాంధిక వ్యావహారిక శైలీవాద సూచిక - తెలుగు అకాడమీ ప్రచురణం
34. యుగకర్త వీరేశలింగంపై నీలాపనిందలు జయంతిపబ్లికేషన్స్
35. వీరేశలింగంపై అభియోగాలు - అపవాదాలు - శ్రీ చైతన్య మండలి
36. కొమర్రాజువారి వ్యాసావళి - వి.ఎస్.ఆర్. ట్రస్ట్ ప్రచురణ
37. పలనాటి వీర చరిత్ర (కోడిపోరు, బాలచంద్ర యుద్ధం)
38. వీరేశలింగ గ్రంధావళి స్వీయ చరిత్ర ప్రధమభాగం - విశాలాంధ్ర ప్రచురణ
39. స్వీయ చరిత్ర ద్వితీయ భాగం - విశాలాంధ్ర ప్రచురణ
40. వీరేశలింగం నవలలు - విశాలాంధ్ర ప్రచురణ
41. వ్యాసాలు - ఉపన్యాసాలు - జీవిత చరిత్రలు - విశాలాంధ్ర ప్రచురణ
42. డైరీలు - లేఖలు - జీవిత చరిత్రలు- విశాలాంధ్ర ప్రచురణ
43. వీరేశలింగం ప్రహసనాలు - విశాలాంధ్ర ప్రచురణ
44. స్వామి జ్ఞానానంద చరితామృతం - శ్రీరామజ్ఞాన మందిర పబ్లికేషన్స్ లీగ్, గొరగనమూడి
45. స్వామి జ్ఞానానంద సంస్మరణోపన్యాసాలు - శ్రీరామజ్ఞాన మందిర్ పబ్లికేషన్స్ లీగ్, గొరగనమూడి
46. శ్రీమన్నారాయణ కవచం (పోతన మహాభాగవతం) శ్రీరామజ్ఞాన మందిర పబ్లికేషన్స్ లీగ్, గొరగనమూడి
47. తెలుగు సామెతలు - సాంఘిక జీవితం
48. రాజశేఖర చరిత్ర (కందుకూరి వీరేశలింగం పంతులు) - ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్

**5** కూర్పు - వ్యాఖ్య - వివృతి

49. అద్భుత వాస్తవాలు (ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక 150 వారాలు ప్రచురితం)
50. శృంగారవీధి (సంప్రదాయి సాహిత్యంలో మూడో పురుషార్థం - (ఉదయం వారపత్రికలో 60 వారాలు ప్రచురితం)
51. సాధువుల కథలు (ఆంధ్రభూమి వార పత్రికలో బాలభూమి శీర్షికలో 100 వారాలు ప్రచురితం)
52. లీలాశుకుడి కృష్ణ కర్ణామృతం
53. పునర్దర్శనం (జాతీయ సాహిత్య పరిషత్తువారి సాధన మాసపత్రిలో సాహిత్యం సంస్కృతి సంబంధ వ్యాసాలు
54. సాహితీ సంపద - (ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో 108 వారాలు వచ్చిన శీర్షిక).

ఇవికాక వివిధ పత్రికలలో నూటికిపైగా వ్యాసాలు, సమీక్షలు ఆకాశవాణి నుంచి నూరుకుపైగా ప్రసారాలు.